# కొత్త ముందుమాట

"కూలినగోడలు" — రాసి ఇప్పటికి పదేళ్ళు దాటింది. రాసిం
...త నా పుస్తకాలు మళ్ళీ చదువుకోవాలని నా కెప్పుడూ ఆసక్తి కలగ
... ఈ పదేళ్ళలో "కూలినగోడలు" మళ్ళీ చదవలేదు.

"సాహిత్యం ప్రజల్ని శాస్త్రీయమైన మార్గంలో నడిపించాలి." —
అభిప్రాయం నాకు బలపడిం తర్వాత నేను ఇప్పటి వరకూ రాసిన
...కాలు ఎలా వున్నాయో చూడాలనే అభిప్రాయం కలిగింది. ఈ అభి
...యంతోనే ఈ మధ్య రీ ప్రింటు అయిన "బలిపీఠానికీ" "గులాబీ
..." కీ కొత్తగా ముందుమాటలు రాశాను.

... పుస్తకం ఇప్పుడు చదివితే "కథా వస్తువు" విషయంలో ఈనా
...ను భేదించే దేమీ లేదు. ఇది సమాజానికి దూరమైన ...

...కు కొంచెం అసంతృప్తి కలిగించేది. శైలి విషయం, ...
...యం - ముఖ్యంగా సమాజ ప్రభావాన్ని మాత్రమే చూపి...
...ల విషయం — శైలి విషయాలు చూస్తే ఏదో గంభీ...
...త్యం అనగానే అది నిత్య జీవితంలో ఆలోచించే విధానానికన్నా
...గా వుండాలనే తాపత్రయంతో రాసినట్టు కనబడుతోంది.

"ఆమె శరీర సోయగాన్ని ఇనుమడింపజేస్తోన్న గులాబి...
...రచెంగు, గాలిలో తేలిపోబోతే సున్నితంగా భుజంమీద సర్దుకో...

"ఆతృతతో, అలసటతో పేగిపోయిన ఆమె కన్నుల్లో, వదన
...జ్యోతి వెలిగింది."

"ఇక రూపనిర్ణయంలో అతను అందగాడే. ...
...ంచిన లీపీ, ఆకర్షణా ఏదో అతనిలో లీనమై వున్నాయి. సదా ...
అతని కన్నుల్లోని చురుకుదనం ఎదుటివారిని స్నేహం చేయని...
...వేకపూరితమైన అతని మాటల్లో కరుకుదనం! విధేయతగా వుండనీస...
... ఎల్లప్పుడూ ధరించేదుస్తుల తెల్లదనం అతన్ని ప్రేమించని...

ఈ రకంగా చాలాచోట్ల "కవిత్వం" రాయాలనే...
చాలా స్పష్టంగా కనబడుతుంది. "కథానాయకుని...

టీపీ, ఆకర్షణా వుంటాయి. చురుకైన చూపులూ, గంభీరమైన కంఠధ్వ
ఇంకా అలాంటి గొప్ప లక్షణాలు చాలా ఉంటాయి.

సాహిత్యంలో పాత్రల్ని ఈ రకంగా వర్ణించడం పాత పురాణా
ప్రబంధాల సాంప్రదాయమే. ఈ రకం పాత్ర చిత్రణ సహజ జీవితా
చాలా దూరం. కేవలం శరీరావయవాల్ని వర్ణించడం, కట్టుకున్న బట్ట
వర్ణించడం ప్రతీదీ "గంభీరంగా" కవిత్వధోరణిలో చెప్పాలనే ఆరా
హాస్యాస్పదంగా బొత్తిగా ప్రయోజనం లేకుండా అయిపోతాయి.

స్త్రీ పాత్రల గురించి, ఏక వచనంలోనూ. పురుషపాత్రల్ని
వచనంలోనూ "రాజయ్యగారు, జగన్నాధం గారు" అంటూ
ద్ధం — రచయిత్రి కేవలం సమాజ ప్రభావంలో వుండ
త్రమే.

"ఆ తల్లి లేని పిల్లల్ని చూసి విధి మరోసారి
ది."

"విధి వెక్కిరించింది."

"భగవంతుడి లీలలు చిత్రమైనవి."

ఈ రకమైన భావాన్ని ఆసరా చేసుకుని రచయితలు తమ అస
కప్పిపుచ్చుకుంటారు. ఆ ఘట్టాన్ని ఇంకో రకంగా చెప్పే సామర్థ్య
దరూ సాంప్రదాయంగా చెప్పే ధోరణిలోకి దించుతారు — ఈ
ఈ రచనలో చాలా చోట్ల కనబడుతుంది.

పురాణాల్ని నీతినియమాలు నేర్పే గ్రంథాలుగానూ, గాంధీగార్ని
వుల్ని వుద్ధరించగల ఆదర్శాలు బోధించిన మార్గదర్శకుడిగానూ, ఎంచే
వుంటారు. ఈ కథానాయకుడు — "మధు."

జ్ఞానం వేపు ప్రయాణించే దశల్లో ఈ దశ వొకటి.

మధు ఒకపోట కేశవరావుతో — "స్వార్థం లేకపోతే జీవి
త్యాగమే వుండి స్వార్థం లేనినాడు మనిషి కష్టా
అంటూ అరిందా మాటలు మాట్లాడతాడు. ఈ

త్యాగం అనే మాటలు ఏవో యధాలాపంగా వుపయోగించినవేగానీ - వాటి గురించి ఇక్కడ ఏమీ స్పష్టతలేదు.

"భర్తే విస్మరించిన నాడు భార్యకి విలువేలేదు." "క్షణ క్షణానికీ వూగిసలాడే భార్య స్థానాన్ని నిలుపుకోడానికి స్త్రీకి వివేకం కావాలి." — ఇవి రచయిత్రి అభిప్రాయాలు —

ఈ అభిప్రాయాలు వెలిబుచ్చిన రచయిత్రి సిగ్గుపడవలసినంత హీన స్థితిలో వుంది. ఇంతకన్న దీనిగురించి వివరంగా చెప్పనవసరంలేదు.

ఈ "కథలో"——మధు, కేశవరావూ, అతని భార్యా——సుధా, ఆమె భర్తా (రెండు జంటలూ విడిపోయినప్పుడు) – మళ్ళీ కలపటానికి సాక్షి అవుతాడు.

సాధారణంగా ముసలమ్మలు ఏ రకంగా మాట్లాడుతారో— "ఒకరి లోటుపాట్లు ఒకరు సర్దుకోవద్దా? దిద్దుకోవద్దా?" — అనే తర్కాన్ని మధు కూడా ప్రదర్శిస్తాడు. "భార్యా భర్తలు విడిపోకూడదు" — సాంప్రదాయ సిద్ధమైన అభిప్రాయాలు మాత్రమే అతనివి. అసలు సమస్యల్ని ఏమంత సీరియస్‌గా పట్టించుకోడు.

సుధని భర్త దగ్గరికి వెళ్ళమనీ, కేశవరావు తిరిగి భార్యను తీసుకు రావాలనీ, అతను చూపించిన పరిష్కారాలు చాలా తాత్కాలికమైనవిగా అయిపోవొచ్చు.

"జీవితంలో ప్రతీ వొక్కరికీ వొక్కో సమస్య. దాని పరిష్కారాలు తప్ప అన్నీ తెలుస్తాయి." పరిష్కారాలు కూడా తెలుస్తాయి — జీవిత సమస్యల్ని అర్థం చేసుకోవడంలో శాస్త్రీయ దృక్పథం వుంటే

# పాఠకులతో 6

"ఈ నవలకు "కూలిన గోడలు" అన్న పేరు ఎలా సార్థకమైంది ?" అంటూ కొంతమంది పాఠకులు అడిగారు. చివరికి వ్రాతమూలకంగా జవాబు చెప్పుకోవలసి వచ్చింది నాకు- "కూలినగోడలు కూలినట్లే వుండవు. ఎప్పటికైనా లేస్తాయి." అన్న సామెత ఏ ఆంధ్రుడికీ కొత్తకాదు. ఈ నవలలో ఏ పాత్రల్ని వుద్దేశించి ఈ శీర్షిక నిర్ణయించటం జరిగిందో ఇక పాఠకులు తెలుసుకోవచ్చు —

కాని మన పాఠకుల ఊహాశక్తిని ఎన్నటికీ నేను తేలికగా అంచనా వెయ్యలేను. అయితే "కూలినగోడలు" మీద వెలువడ్డ అభిప్రాయాలను బట్టి ఆలోచిస్తే మన పాఠకులు అందమైన ఊహా జగత్తులో విహరించ టానికి మాత్రమే యిష్టపడతారన్న నిజం కొంతవరకూ తెలిసివచ్చింది.

ఈ నవలలో ప్రేమలేదు. అదే పాఠకుడు కోరుకున్నాడు. ఉద్రే కంతో ఉయ్యాల లూగించి, మత్తుతో మైమరపింపే సంఘటనలు లేవు - ...టినే పాఠకుడు ఇష్టపడుతున్నాడు. అసహజంగా — అందమైన ...ప్నంగా కల్పించిన కట్టుకథ లేదు - దానినే పాఠకుడు ఆరాధిస్తున్నాడు.

ఇలాంటి పాఠకుడు సానుభూతి చూపించాల్సిన దుస్థితిలో మునిగి ...కని నా వుద్దేశ్యం!

సాహిత్యం అంటే నూటికి నూరుపాళ్ళు నిజమైన జీవితం. నిండు ...తంలో కామం, ప్రేమ అన్నవి రెండే గాకుండా ఇంకా ఎన్ని అను భూతులు నిండివుంటాయో - అవి అన్నీ సాహిత్యంలో అదే విధంగా ప్రతిబింబిస్తాయి.

జీవితంలోని బాధ్యతలు, సమస్యలు సుఖం దుఃఖం సమస్తం — సాహిత్యంలో చోటు చేసుకుంటాయి. సాహిత్యాన్ని వివిధ కోణాలనుంచి చూసి వివిధ అనుభూతులు చెందగలిగే పాఠకుడు వివేకవంతుడు.

సాహిత్యం ద్వారా ఏమైనా నేర్చుకోగోరే పాఠకుడు సాహిత్యాన్ని పోల్చుకుంటాడు. అలాంటి పోలిక కుదిరినప్పుడే సాహిత్యపు ...ను చూచుకుంటూ తీర్చిదిద్దుకోవడానికి అంగీకరిస్తాడు. ...ం ఊహా విహారానికీ కాలక్షేపానికీ కాదన్న నిజాన్ని

అనుభవపూర్వకంగా గ్రహిస్తాడు.

ఈ నవలలో "మధు" పాత్రని ప్రత్యేకాభిమానంతో సృష్టించటం జరిగింది.

ఏ రచయితైనా ఏ పాత్రనైనా అభిమానంతోనే సృష్టిస్తాడు. అంత మాత్రాన ప్రతి పాత్రా రచయిత వ్యక్తిత్వాన్నే ప్రతిఫలింప చేస్తోందనీ - ప్రతీ పాత్రనీ రచయిత సమర్థిస్తున్నాడని అనుకోవటం ఏమంత నిజంకాదు. ఒక్కో సందర్భంలో నూటికి నూటపాళ్ళు విరుద్ధంకూడా.

నా రచనను నేనే సమీక్షించుకోవటం అపహాస్యంగా వుండచ్చు. కాని మధు పాత్రని పాఠకుడు నా దృష్టితో చూడలేదన్న విషయం నేను గ్రహించిన మీద ఒక విషయాన్ని ఒప్పుకోక తప్పదు - అది నా చిత్రీకరణ లోపం కావాలిగానీ ఆ పాత్ర సహజత్వపు లోపంకాదు.

మధు ఆవేశపూరితమైనతత్వం కలిగిన వివేకవంతుడు. తరతరాలుగా ప్రబలమౌతూ వస్తోన్న మూర్ఖపు ఆచారాలను బలమైన ఆత్మ విశ్వాసంతో విమర్శించగలిగే అభ్యుదయవాది. ప్రతీయువకుడూ మధు వ్యక్తిత్వాన్ని సమర్థించగలడనే విశ్వాసంతో ఈ పాత్ర చిత్రించటం జరిగింది - కానీ - మధు పాత్ర యథాతథంగా పాఠకుడి ముందు వుంచబడలేదు.

రచయిత కలంనుంచి బయల్పడ్డ రాతలు పాఠకుడి కళ్ళముందుకు ప్రత్యక్షమయ్యేలోపున తదితరుల దయాదాక్షిణ్యాలూ - యిష్టాయిష్టాలూ - తమ ప్రభావం చూపిస్తూనే వుంటాయి.

ఒక పాత్రతాలూకు మన స్తత్వం చిత్రీకరణ ఏ విధంగా జరిగినా అది రచయితకుగానీ - సంపాదకుడికిగాని - ఎంతమాత్రం అంటదు. పాత్ర తాలూకు వ్యక్తిత్వం క్రిందికే వస్తుంది.

మధూ వ్యక్తిత్వాన్ని ప్రశ్నిస్తే జవాబు చెప్పాల్సిన అవసర సంపాదకుడికి ఎంతమాత్రం లేదు, సరికదా నాకు కూడా లేదు. శ్యాలు అతనివి - అతని అభిరుచులు అతనివి - అతని ఆలోచ అతని వ్యక్తిత్వం అతనిది-కేవలం అతన్ని పాఠకుడికి పరిచయ నా విధి. కానీ - అతనంటే నాకెంతో యిష్టం. అందుకే అ

సమర్థించాను - ఇష్టంలేని పాత్రని నేనూ విమర్శిస్తాను. ఈ ఇష్టాయిష్టాలు నా మనస్తత్వానికి సంబంధించినవేగానీ పాత్ర ధోరణిని మార్చేవికావు.

రచయిత తన యిష్టప్రకారం పాత్రల్ని నడిపించడు. పాత్రల ఇష్ట ప్రకారమే వాటి వెనక నడుస్తాడు.

మధూపాత్ర యధాతధంగా పాఠకుడికి అందక పోవటంతో ఈ నవలకు చాలవరకు అన్యాయం జరిగింది. మధూ "విలన్ హీరో" అయ్యాడు. మధూ వ్యక్తిత్వానికి గీటురాళ్ళయిన భాగాలు ఆలోచనా రహితంగా ఎడిట్ చేయబడ్డాయి. ఎడిటర్‌కే కాదు. ఎడిటర్‌ల మీది ఎడిటర్‌కయినా రచయితతో సంప్రదించకుండా ఒక రచనను తమ ఇష్టానుసారం ముక్కలు ముక్కలుచేసే హక్కు ఎన్నడూలేదు. ఒక రచన విషయంలో ఆ రచయిత కన్న సంపాదకుడు ఏ విధంగానూ ఎక్కువ తెలిసినవాడు కాలేడు. కుదించటంగు అతని బాధ్యతే అయితే దానికోసం రచయిత పర్మిషన్ తీసుకోవాల్సిన బాధ్యతకూడ వెనువెంటనే వుంటుంది. ఇటువంటి అపకతవకలు ఎదురుచున్నా చూసి ఓర్చుకోగలిగే సహనశక్తి ప్రతీరచయితకూ వుండదు. ఉండకపోతే ఇక అతని రచనలు ఆ పత్రికలో కన్పించకపోవచ్చు. తెలుగు పాఠకుడిని చూసి సానుభూతి చెందాల్సిన దుస్థితి రచయితకు పడుతోంటే మరోవేపు తెలుగు రచయితను చూసి నిట్టూర్చాల్సిన దీనస్థితి పాఠకుడికి కూడావుంది.

ఇది కేవలం వ్యక్తిగత కావేషాలతో రాసుకున్న విషయంగా అపార్థం చేసుకోని సహృదయులకు మరో మాట. పాఠకుడు లేనిదే రచయిత లేడు. రచయిత లేనిదే పత్రిక లేదు. పత్రిక లేనిదే పాఠకుడూ లేడు. ఈ అవినాభావ సంబంధం అతి విచిత్రంగా నిత్య నూతనంగా వుంటుంది - ప్రతి పాఠకుడూ విమర్శకుడు కాగలిగిననాడు ఉత్తమ సాహిత్యాన్ని ఆదరిస్తాడు. ప్రతీ పత్రికా ఉత్తమ సాహిత్యాన్ని అందిస్తుంది. రచయితా ఉత్తమ సాహిత్యాన్ని సృష్టిస్తాడు.

— రచయిత్రి.

౧

# కూలిన గోడలు

యమునా తీరంలో సంధ్యా సమయాన వేయి కన్నులతో రాధ ఎదురు చూసిందట. ఎందుకో ?

యుగ యుగాలనాటి రాధ మాదిరే - శారదాదేవి ఆ ప్రశాంతమైన సాంధ్యవేళ సువిశాలమైన సముద్రపుటంచున క్షణ మొక యుగంగా ని క్షిస్తూ నిలబడి వుంది. సుందరమైన ఆమె వదనంలో ఎంతకీ ఉ గోచరించలేదు. గాలి విసురికి చెదురుతూన్న చీర కుచ్చెళ్ళు మాటి మాటికీ సవరించుకోలేక మెత్తని ఇసుకలో కొంచెం దూరం నడిచి సం చోట కూర్చుని చీర సర్దుకొంది. చేతిలో పుస్తకం తెరిచి కాని ఆమె మనస్సు చదువుమీద లగ్నం కాలేదు. క్షణ తిప్పి సముద్రపు ఒడ్డున దారి పొడుగుకూ దృష్టి సారించి పుస్తకం మూసివేసి విసుగ్గా నుదుటిమీద పడిన వెంట్రుక నెట్టుకొంది.

ఆ విసుగుదలతో — ఆ నిరీక్షణలో - ఆమె —— శా హరంగా కన్పించింది. ఆమె శరీర సోయగాన్ని ఇనుమడింప గులాబీ రంగుచీర చెంగు గాలిలో తేలిపోబోతే సున్నితంగా భుజాల సర్దుకొంది. నుదురు పిట్లింపుల్లో ముంగురుల రాపిడికి కుంకుమ సంగతి ఆమెకు తెలిసి ఉంటే సరిదిద్దుకోవటానికి ఎంతైనా తాప ందేది.

మరొకసారి చేతి వాచీ చూసుకొని తిరిగీ విరిగిపడే కెరటాలలోకి చూడసాగింది. అనంతమైన ఆ జలరాశి విసిగిన ఆమె మనస్సును అప్రయత్నంగా ఆకర్షించింది. కెరటాలను మించిన భావాలు ఆ మనసు లో అల్లకల్లోలంగా చెలరేగాయి. ప్రకృతిమాత సౌందర్యం అంతులేనిది। అపురూపమైనది। అనంతమైన ఈ నీటి రాశిని ఎవరు ప్రోగుచేశారు? సదా చంచలించే ఈ కెరటాలను ఎవరు సృష్టించారు? నీటి రాశికి నెల రాజుతో చిత్రమైన అనుబంధాన్ని ఎవరు ఏర్పరిచారు? .... మహోన్నతమైన ఈ సౌందర్యమంతా ఎవరు చిత్రించారు? సమాధానాలు రాని సందేహాలు కలిగినప్పుడైనా మానవుడు భగవంతుడిని విశ్వసించక తప్పదేమో।

శారద వంటి రచయిత్రి క్షణకాలం తన్నుతాను మరిచి భావనా తరంగాలలో మునిగిపోవటం విశేషమేమీ కాదు.

అనంతమైన సముద్రం అణువులైన మానవులను చూస్తూ గర్వంతో ఉల్లాసంగా నవ్వింది. ఆకాశాన్ని అంటుకోవటానికి కెరటాలు ఉవ్వెత్తుగా లేచి పోటీ పడ్డాయి.

పాదాలు తడిపి పారిపోతూన్న నురగరాసుల్ని చూస్తూ శారద నవ్వు... కెరటాలు తనతో సరసమాడు తున్నాయి. ఒంటరిగా ఉన్న... స్త్రీ సముద్రుడు కూడా తపించి పోతాడు కాబోలు। చిరు... గర్భంలోకి చూస్తూ ఉండి పోయిన శారద చటుక్కున ...ంది. ఆతృతతో, అలసటతో వేగి పోయిన ఆమె కన్నుల్లో — ...తి వెలిగింది. ఆమె నిరీక్షణ అంతమై పోయింది. సంతో... లేని కళ్ళు విశాలమైతే, విడిల్చిన పెదవుల మీద హాస్యరేఖలు ...యి.

...తను - మధుసూదన్ — చాల దగ్గరికి వచ్చేశాడు. శారదాదేవి ...ల్లో బందీ అయినట్లు వచ్చి పక్కనే కూర్చున్నాడు. అలిసి పోయిన ...రూమాలుతో నుదురు ఒత్తుకుంటూ అన్నాడు —

...ఆలస్యం చేశాను కదూ?"

...మాట్లాడలేదు శారద.

"మిమ్మల్ని అడగటం ఏమిటి? ఆలస్యమే అయింది. మా వదినకు జాబు రాస్తూ కూర్చుంటే టైం మించి పోయింది" మధుసూదన్ నొచ్చుకుంటూన్నట్లు అన్నాడు.

శారద చిన్నగా నవ్వి అంది — "నేను మిమ్మల్ని సంజాయిషీ లేమీ అడగలేదే!"

"కాదులెండి, నన్ను మీరు అపార్థం చేసుకోకుండా ఉండాలని నేనే సంజాయిషీ చెప్పుకుంటున్నాను."

"మీరు చెప్పింది నిజమేనని ఎలా నమ్మటం?" మధుసూదన్ మొహంలోకి చూస్తూ చిలిపిగా ప్రశ్నించింది శారద.

క్షణం ఆగి మధుసూదన్ కూడా స్వగతంలా అనుకున్నాడు — "నిజమే. ఎలా నమ్మటం"

శారద గర్వంగా బుగ్గకు వేలు ఆనించుకు కూర్చుంది.

మధుసూదన్ దూరంగా చూస్తూ అన్నాడు — "అలా గర్భంలోకి చూస్తూ కూర్చుంటే ఎన్నిగంటలైనా తెలీకుండా పోతాయి కదూ? ముఖ్యంగా మీ వంటివారికి."

"అందరి సంగతీ ఏమోగాని భగవంతుడిన్ని గురించి ఆలోచిస్తూ నా మట్టుకు నేను అలాగే గడిపాను."

శారద సూటిగా మధుసూదన్ కళ్ళలోకి చూసింది.

"దానికేముంది? ఎవరిపిచ్చి వాళ్ళ కానందం."

"అంతేనా? వాదన్న చేయకుండానే వూరుకుంటారా?"

"ఇద్దరు పిచ్చివాళ్ళు వాదించుకోకూడదు"

నవ్వింది శారద. మధుసూదన్‌కి భగవంతుడి ఉనికిలో విశ్వాసం ను. — కళ్ళకి కనిపించే సైన్సు మాత్రమే అతను నమ్మగలిగేది. ముఖ్యంగా దైవప్రార్థనా - విగ్రహారాధనా - ఎన్నటికీ ఆమోదించ లేనివాడు మధుసూదన్.

"శాస్త్రానికి అతీతమైన ప్రకృతి ధర్మాలను మీ రెలా విశ్వసిస్తారు?"

"మానవుడికీ — శాస్త్రానికీ అతీతమైన శక్తి ఏదో తప్పకుండా ఉండి ఉంటుందని నేనూ అనుకుంటాను. కాని పిచ్చి పిచ్చిగా ఆ నమ్మ కాన్ని అర్థంలేని పనులద్వారా వెల్లడించటమే నాకు నచ్చదు" అంటాడు. అందుకే దేవుడి గురించి ఆలోచిస్తూ గడిపానని శారద మధుసూదన్‌కి గుచ్చి చెప్పింది.

"దానికేం గాని మీరు వచ్చి చాలా సేపైందా?" మధుసూదన్ ప్రశ్నకు శారద కళ్ళు విశాలం చేస్తూ అంది —

"మీ కోసం గంటపైగా ఎదురు చూస్తూ కూర్చున్నాను."

"అలాగా? విసుగేసిందా?"

"వెయ్యదూ!"

"అయితే. కోపం కూడా వస్తుంది. అవునా?"

"రావచ్చు. కోపం మాత్రం కొని తేవాలా ఏమిటి?"

"మరైతే తిట్టుకున్నారా!"

"చాటుగా తిట్టుకోవటం ఏం ఖర్మ?"

"కాకపోతే మీరు చేయగలిగిం దేముంది?"

"అంటే?" నుదురు చిట్లించింది శారద.

"మీరు వచ్చి గంట అయింది. నా కోసం ఎంతో ఎదురు చూశారు. విసిగిపోయారు. చిరాకు వేసింది. కోపం వచ్చింది. ఇంత ఆలస్యం ఏమిటో నన్ను అడిగేద్దామని ముళ్ళమీద కూర్చున్నారు. —— అయితే శారదాదేవీ! గంటకు ముందే వచ్చారని మీరు చెప్పిందంతా నమ్మటం ఎలా?" మధుసూదన్ చిలిపిగా చూడబోతే శారద ఓడిపోయినట్టు దానిలా కళ్ళు దించుకుంది.

"తెలివి తేటలెంత మీ స్వంతమైనా మీ స్నేహ ధర్మాన్ని మా అంటుకోవంటారా?"

శారద తేలికగా నవ్వేసింది - "మిమ్మల్ని మాటలతో జయించగలిగింది ఎప్పుడు ?"

"ముందు ముందు ఆ రోజుకోసం ఎదురు చూడండి."

శారద చనువుగా అంది — "అయితే మీరు నన్ను మన్నించటం మానలేదు."

మధుసూదన్ నిశ్చయంగా అన్నాడు — "అలా మానటం నాకు ఇష్టంలేదు."

శారద కూడా దృఢంగా అంది — "మీ ఇష్టా ఇష్టాలతో నాకు పనిలేదు. నాకు నచ్చని విధంగా నేను పిలిపించుకోలేను.

మధుసూదన్ క్షణం శారద మొహంలోకి చూసి గుచ్చి అడిగి నట్టు అన్నాడు — "మన మధ్య అంత చనువుగా పిల్చు కోవాల్సిన అనుబంధ మేమిటి శారదా ?"

శారద చలించి పోయింది. సిగ్గు పరుస్తూన్న అతని చిరు నవ్వు తప్పించు కుంటూ — తన భావ కల్లోలం అంతు పట్టనివ్వ కుండా — దృష్టి మళ్ళించి వేసుకొంది.

"అదేమిటి ? అడిగిన దానికి జవాబే చెప్పకుండా మొహం తిప్పు కుంటే ఏమను కోవాలి ?"

మిడిసిపడే కెరటాలలో చిక్కుపడిన శారద దృష్టి ఎటూ తప్పుకో లేదు.

మధుసూదన్ శారదాదేవిని ఆకర్షించ గలిగేది అందుకే. అతను ఏ విషయమైనా నిర్భయంగా, నిర్మొహమాటంగా మాట్లాడుతాడు. సాధ్య మైనంత వరకు ఏ సంశయాన్ని మనస్సులో అణచుకోడు.

ఒకనాడు మధుసూదన్ వర్తమాన రచయిత్రి శారదాదేవి రచనలను తీవ్రంగా విమర్శిస్తూ రాసిన ఉత్తరమే వారి స్నేహలతకు విత్తు నాటింది. వివేకపూరితమైన అతని విమర్శలతో ఆమె రచనా పద్ధతులనూ — మనో వాలమూ కొంత వరకూ మార్చుకోవలసి వచ్చింది. అమూల్యమైన అతని లహాలతోనే ఉత్తమమైన సాహిత్యం సృష్టించగలననే విశ్వాసం

డింది. మధుసూదన్ వ్యక్తిత్వం. అతని స్నేహం విలువైనవిగా తోచాయి శారదకు. అతను — చాల మంది యువకులలాగ ఆమె రచనలను అతిగా పొగడటం - ఆమెతో కాలక్షేపానికి వహావహ లాడటం చేయడు. బలీయమైన ఆత్మ విశ్వాసంతో ఏ విషయమైనా నిర్దిష్టంగా, నిర్భయంగా మాట్లాడగలడు —

ఇక రూప నిర్ణయంలో అతను అందగాడే! అందాన్ని మించిన దేవి — ఆకర్షణా ఏవో అతనిలో లీనమై ఉన్నాయి. సదా చలించే అతని కన్నుల్లోని చురుకుతనం ఎదుటి వారిని స్నేహం చేయనిస్తుంది, వివేకపూరితమైన అతని మాటలలో కరుకుతనం విధేయతగా ఉండనిస్తుంది. అతను ఎల్లప్పుడూ ధరించే దుస్తుల తెల్లదనం అతన్ని ప్రేమించనిస్తుంది

శారదాదేవి - మరే యువకుడి స్నేహాన్నీ లక్ష్యపెట్టని శారదకు — మధుసూదన్ ప్రాణ స్నేహితుడు!

"నా ప్రశ్నకు జవాబే చెప్పకుండా ఎందుకలా మౌనంగా కూర్చున్నావు?" మధుసూదన్ రెట్టింపులతో, శారద దృష్టి మళ్ళించుకొని తల తిప్పి చూసింది. ఆమె హృదయంలో మధుసూదన్ వేసిన ప్రశ్న మరొకసారి ధ్వనించింది- "మన మధ్య అంత చనువుగా పిల్చుకోవాలిన్న అనుబంధ మేమిటి-శారదా?"

నిజమే! అతి చనువుగా వ్యవహరించడానికి ఏదో అనుబంధం ఉండి తీరాలి. సామాన్యమైన ఈ స్నేహం దానికి సరిపోదు. అయితే .. ఈ స్నేహాన్ని మించిన అంతస్తు అతి సన్నిహితమైనది- ఏదో తను సృష్టించాలా? కావచ్చు, ఆ అర్హత ఏమిటనే మధుసూదన్ అడుగుతున్నాడు.

"ఏమిటీ మౌనవ్రతం? చనువుగా పిలవమనటమేగాని ఎందుకు పిలవాలో చెప్పకపోతే ఎలా?" మధుసూదన్ మరొకసారి హెచ్చరికంతో శారద కొంచెం నవ్వుతూ అంది. "నేను అంత దూరం ఆలోచించకుండానే అడిగాను. నిజమే! మన మధ్య అంత చనువుగా పిల్చుకోవాల్సిన అనుబంధ మేముంది?" మధుసూదన్ నవ్వాడు. "ఎంతైనా మీ

లేదేం?" చేతిలో పుస్తకాలకేసి చూస్తూ అన్నాడు. "ముగింపు నేను చెప్పాలా? అయితే నవల నేనే రాసినట్టు పేరు పెట్టుకుంటాను."

శారద నవ్వింది. "ఈ నవలకు మీ పేరు పెట్టుకుంటానంటే అసమంజసమేమీ కాదులెండి. అంతకంటే నాకేమీ అక్కర్లేదు. తొందరగా చదివి మీ అభిప్రాయాలు చెప్తారుగా?"

* * *

"మధూ! నీకు పెళ్ళాం పుట్టిందిరా నాన్నా!" సంతోషంతో కల్యాణి బడినుంచి పరిగెత్తుకు వచ్చిన చిన్నకొడుకుని దగ్గరికి తీసుకొని వాడి లేత బుగ్గలమీద ముద్దులవర్షం కురిపించింది. తల్లి ప్రశ్న అర్థం గాని మధు అయోమయంగా చూస్తూ నిలబడిపోయాడు. కల్యాణి హృదయంనుంచి తెరలు తెరలుగా పొంగి వస్తూన్న ఆనందాన్ని అణచుకోలేక తిరిగి కొడుకుని హృదయానికి హత్తుకొని, చెరిగిన జుట్టు సవరిస్తూ— "అలా చూస్తావేంరా? నీకు పెళ్ళాం పుట్టిందట. పెద్దమామయ్య రాశాడు" అంది. ఏడేళ్ళ మధు అప్పటికేదో అర్థమైనట్టు అమ్మ కుచ్చెళ్ళలో మొహం దాచుకున్నాడు.

మధు వెనకవచ్చిన సూర్యాన్ని పెద్ద కొడుకుని చూస్తూ నవ్వుతూ మరొకసారి అంది కల్యాణి. "చిన్న మామయ్యకు కూతురు పుట్టిందట్రా సూర్యం! తాతగారి ఊరినుంచి ఉత్తరం వచ్చింది. అది తమ్ముడి పెళ్ళాం."

అప్పటికి తేరుకోగలిగిన మధు తెలిసీ తెలియని ఊహతో ఆసక్తిగా అడిగాడు— "మరి అన్నయ్యకో ... ...?" కల్యాణి నవ్వింది — "గడుసు పిడుగా! అన్నయ్యకూ ఉంటుందిరా ఎక్కడో?"

సూర్యం అదేం పట్టించుకునే విధంగా లేడు. ఓరగ్గా అన్నాడు— "వీడు బళ్ళో చాలా అల్లరి చేస్తున్నాడమ్మా? మేష్టారు నీతో చెప్పమన్నారు."

కల్యాణి విస్మయంగా చూసి మధుని అడిగింది—

"మళ్ళా బళ్ళో అల్లరి చేశావా మధూ?"

"లేదమ్మా! నా పలకేమో గోపీగాడు దాచేసుకున్నాడు. అడిగినా ఇవ్వలేదని వాణ్ణి కొట్టి లాక్కున్నాను. అల్లరి చేస్తున్నానని మేష్టారితో చెప్పేరమ్మా!" ఎంతన్యాయమో చూడమ్మా! అన్నట్టు చూశాడు మధు. అన్యాయంగా తనమీద నేరం ఆరోపించారన్న బాధ మధు మాటల్లో స్పష్టంగా ధ్వనించింది.

కల్యాణి అడిగింది— "మరి నీ పలకేమైంది? గోపి ఇచ్చేశాడా?"

"ఇద్దరూ లాక్కుంటుంటే కిందపడి బద్దలయింది. ఆ పగిలిన పలక మేష్టారు వీడికే ఇప్పించేశారు" సూర్యం జవాబు చెప్పాడు.

"మళ్ళా పలక పగిలిందా? అయ్యో రామా! ఈ సంవత్సరంలో ...కి పదకొండు పలకలు. ఇంత చిలిపితనమైతే ఎలాగురా మధూ

...ల్యాణి కోపంగా చూసింది— మధూ బిక్కమొహం వేసు...న్నాడు. పలక సంగతి పట్టించుకోకుండా అన్నాడు— "నన్ను మేష్టారు ...ట్టారమ్మా!"

"మరి నువ్వు గోపీగాణ్ణెందుకు కొట్టావ్?" - అడిగాడు సూర్యం.

"వాడు నా పల కెందుకు తియ్యాలి?" అరిచాడు మధు.

"అయితే మేష్టారికి చెప్పాలిగానీ నువ్వే కొడతావా?" కంఠం పెద్దది చేసింది కల్యాణి. మధూకి కూడా కోపం వచ్చేసింది— "వాడు మేష్టారికి చెప్పే నా పలక తీశాడా ఏమిటి? నా పలక ఎవరు దాచేసుకున్నా నేనేం అనకూడదేం పాపం?" ఇదెక్కడి న్యాయమన్నట్టు చూస్తున్న కొడుక్కి అర్థమయ్యే విధంగా చెప్పాలన్న ఉద్దేశ్యంతో అనునయంగా అంది కల్యాణి—

"గోపీ చేసింది తప్పే అనుకో, బళ్లో ఎవరు తప్పుచేసినా దండించ...టానికి మేష్టారు ఉన్నారుగా మరి. ఒక్కచోట కలిసి చదువుకోవాల్సిన

పిల్లలంతా ఏవో కజ్జాలు పెట్టుకొని దెబ్బలాడుకొంటూంటే నొప్పుండటం ప్రేమో నువ్వే చెప్పు."

మధూ మాట్లాడలేదు.

"చివరికి మేష్టారు నీ పలక నీకు ఇప్పించేశారు కదూ? నువ్వు గోపి దగ్గర లాక్కోకుండా ముందే మేష్టారికి చెప్పి ఉంటే నీ పలక పగిలేది కాదు. బళ్లో ఏం జరిగినా పిల్లలంతా మేష్టారికే చెప్పాలి."

అప్పటికీ మధూ మాట్లాడలేదు. కల్యాణి కొడుకు చేతిని తన చేతిలోకి తీసుకొని నిమురుతూ అడిగింది— "మేష్టారు బాగా కొట్టారా నాన్నా? నొప్పి పెడుతోందా?"

మధూ తల్లి చేతులు విసిరి కొడుతూ — "నాకేం నొప్పి పెట్టలా ఆ గోపిగాణ్ణి బాగా కొట్టారు." అన్నాడు కసిగా.

"అయ్యో పాపం! తెలిసో తెలీకో చేశాడు. మేష్టారు కొట్టారా ఏమిటి?" — కల్యాణి నొచ్చుకుంది సానుభూతిగా.

"లేదమ్మా! భయపెట్టటానికి చిన్న చిన్న దెబ్బలు వేశారంతే. ఎవర్నీ గట్టిగా కొట్టలేదు—" అంటూన్న సూర్యం మీద విరుచుకుపడ్డాడు మధు. "ఊఁ చిన్న చిన్న దెబ్బలేం కాదు. ఘట్టిగానే కొట్టారు. ఎంత నొప్పి పెడుతోందో నీకేం తెలుసునేమిటి పాపం?"

"ఇప్పుడే కాదుట్రా నొప్పేం లేదన్నావ్?"

నవ్వింది కల్యాణి— "చిన్నదో పెద్దదో దెబ్బ తగిలితే నొప్పి పెట్టదూ సూర్యం? కాస్త తమ్ముణ్ణి కనిపెట్టుకు ఉండమని నీకు నేను చెప్పలేదూ!" అంటూ పెద్ద కొడుకుని మందలించింది. సూర్యం నిస్సహాయుడిలా అన్నాడు — "నువ్వు ఇలాగే చెప్తావ్! వీడేమో నా మాట ఎప్పుడూ వినడు."

"అన్నయ్య సరిగ్గా చెప్పడమ్మా!" వెంటనే అనేశాడు మధు — "ఎవరేం చేసినా మనం ఏమీ అనకూడదంటాడు. ఎందుకమ్మా మనం అలా ఊరుకోవాలి?"

మధుని దగ్గరికి తీసుకొని గడ్డంపట్టి చిన్నారి కళ్ళలోకి చూస్తూ అంది కల్యాణి— "అన్నయ్య నీకన్నా పెద్దవాడు. నీలా తొందరపడడు. అందుకే వాడు చెప్పినట్లు నువ్వు వినాలి. బుద్ధిగా చదువుకొని మీరిద్దరూ మంచి పేరు తెచ్చుకోవాలి. తెలిసిందా ?" మధు సిగ్గుపడ్డవాడిలా తల్లిని కావిలించుకున్నాడు.

పేక కట్టలు భోషాణం మీదికి విసిరేసి చావిట్లోంచి నవ్వుతూ వచ్చారు జగన్నాథంగారు.

"కొడుకుల కేమిటి నూరిపోస్తున్నావ్ ?"

నవ్వింది కల్యాణి— "కట్టుకున్న వారికి చెప్పుకోలేకపోయినా కన్నవాళ్ళకైనా, చెప్పలేనంటారా ఏమిటి ?"

"ఎంతమాట ? నీ కొడుకులకేం చెప్పుకుంటావో నీ ఇష్టం. నాదే మధ్య ?"

"మీరు మాత్రం వినరంటారు అంతేనా ?"

జగన్నాథంగారు నవ్వారు. ఆ నవ్వు కల్యాణి కాపురానికి వచ్చిన దగ్గర్నుంచి అనుభవమైనదే. జవాబు ఇవ్వటానికి అవకాశం లేనప్పుడూ ఇష్టం లేనప్పుడూ ఆయన అలా నవ్వి తప్పించుకుంటారు. కచ్చేరి చావిళ్ళో పేకాట్లో, రచ్చబండలమీద ప్రగల్భాలూ-సాటివారితో మాట పట్టింపులూ-ఊరి పొలిమేరల్లో కోడి పందేలూ — భట్రాజులకూ, బైరాగులకూ దాన ధర్మాలూ — ఇత్యాది లక్షణాల నన్నిటినీ కొంతవరకైనా అరికట్టాలని తహతహ లాడిన కల్యాణి-ఒకనాటికి భర్త లౌక్యంగా నవ్వే నవ్వుకు తలదించటం నేర్చుకుంది. ఆయన సరదాలు ఆయనవి. కాదని కష్టపెట్టుకొని తను చేయగలిగింది ఏముంది ? కల్యాణి తనను తాను ఓదార్చుకోక తప్పలేదు. అంతమాత్రాన భర్తపట్ల ఏర్పడిన ప్రేమాభిమానాలు ఏవిధంగానూ సడలి పోలేదు ఆమెలో.

చటుక్కున గుర్తువచ్చినట్టు అంది కల్యాణి.

"అన్నట్టు చెప్పటం మర్చేపోయాను. మీకు కోడలు పుట్టిందట. మా అన్నయ్య ఉత్తరం రాశాడు.

"నిజంగానా?" జగన్నాథం గారికి కూడా సంతోషం కలిగింది — "ఇకనేం? నీ మనస్సు చల్లబడిందిగా! అత్తా కోడళ్ళు కలిస్తే "

"మీకు ఏ బాధా వస్తే! అంతేనా?"

"మాకేం ఖర్మ? అత్తా కోడళ్ళిద్దరూ కీచులాడుకొని ఆ వస్తులేవో మీరే ఉంటారు."

జగన్నాథంగారు చొక్కా విప్పి దండెంమీద వేసి దొడ్లోకి వెళ్ళారు. పిల్లల్ని తీసుకు కల్యాణి వంటింట్లోకి నడిచింది.

పుట్టింటినుంచి ఉత్తరం వచ్చింది మొదలూ కల్యాణి ఆనందానికి అంతులేకుండా పోయింది. ఎంత శుభవార్త అందింది! దానికోసం తను ఎన్ని సంవత్సరాలుగా ఎదురు చూసింది!

కల్యాణి పెద్ద అన్నగారైన విశ్వనాథానికి పిల్లలూ [illegible] పుట్టే ఆశకూడా లేదు. భార్య పార్వతికి గర్భకోశంలో ఏదో వ్యా[illegible] [illegible]చ్చి ప్రాణాలమీదికి వస్తే సంతానంమీద ఆశ వదులుకొని బిడ్డను కాదని విఫలంగా ఆపరేషను చేయించి భార్యను బ్రతికించుకోవలసి వచ్చింది. కల్యాణి చిన్న అన్న సీతాపతికి నలుగురైదుగురు పిల్లలు పోయిన మీదట మధ్య ఈడువాడైన క్రిష్ణుడు బ్రతికి ఉన్నాడు. ఆ తర్వాత ఆడపిల్ల పుట్టుక అందరికీ ఆనందం కల్గించింది ప్రస్తుతం.

స్త్రీకి పుట్టింటి అభిమానం సహజమే! కాని కల్యాణిలో ఆ ఆశాను రాగాలు అత్యధికం. అన్నలతో తను వియ్యం పొందలేక పోతాననీ, క్రమేపీ పిన్నపెద్దల బంధుత్వాలు మర్చిపోతారనీ బాధ పడుతూ ఉండేది. చిన్న అన్నయ్యకు గానీ, తనకు గానీ ఆడపిల్లలు పుట్టకపోతే కాలం గడిచిన కొద్దీ ఏ విధంగానూ ఏ అభిమానాలూ, అనురాగాలూ నిలవవు. పరాయి పిల్లలెవరో తన కోడళ్ళవుతారు. అన్నయ్యా అలాగే ఎవర్నో వాళ్ళతోనో చుట్టరికాలు కలుపుకుంటాడు — ఆ ఊహ కల్యాణిని మరీ బాధిస్తుంది.

చిన్న వదిన సావిత్రి కడుపుతో ఉందని తెలిసినప్పటినుంచీ కల్యాణిలో వాడిపోయిన ఆశాలత తిరిగి చిగిర్చ సాగింది. ఆ లతకు

పూవుకూడా పూసింది. కల్యాణికి కోడలు పుట్టింది. ఎంత సంతోషవార్త! ఆనందంతో వెర్రిదైపోయిన కల్యాణి నిండు నెలలతో ఉన్నా, చిన్న పిల్లలా ఇల్లంతా కలియ దిరిగింది. ఎంతవెంతట ఈ సంతోషవార్త తన వాళ్ళతో చెప్పేద్దామా అని ఆరాటంతో వేగిపోయింది. సాయంత్రం బడి నుంచి రావలసిన పిల్లలకోసం మధ్యాహ్నం నుంచే ఎదురుచూస్తూ విసుక్కుంది. సుఖ దుఃఖాలు పట్టించుకోకుండా వూరుమీద బలాదూరు తిరిగే భర్తమీద కోపగించుకొంది మనసు నిలవని సంతోషవార్తను ఎంతసేపు ఆపి ఉంచుకోగలదు ? చెప్పేద్దామంటే ఎవరు ఉన్నారు ?

సంగెత్తుకు వచ్చిన చిన్న కొడుకుని కౌగలించుకొని — "నీకు పెళ్ళాం పుట్టిందిరా నాన్నా !" అనెయ్యటంతోగాని కల్యాణి హృదయభారం తగ్గలేదు. ఆరా ఆ వార్త కాస్తా భర్తకూ, పిల్లలకూ అందజేసి తన సంతోషం అందరికీ పంచిపెట్టాక మరో చింత పట్టుకొంది కల్యాణిని— చూడాలనే కోరిక చిన్న విత్తనంలా మొలకెత్తి నిముష నిముషానికి పెరిగిపోయి ఇంతై అంతై మహావృక్షమై కూర్చుంది. కాని ప్రస్తుత పరిస్థితిలో తను ప్రయాణం చేస్తానంటే భర్త ఎంతమాత్రం ఒప్పుకోడు. నాలుగు రోజుల క్రితం తోటి ఆడవాళ్ళతో దేవుడి ఉత్సవాలకు వెళతానని సరదా పడితేనే ఆయన ఒప్పుకోలేదు. మరి ?

జగన్నాథంగారు కొడుకులతో హుషారుగా కబుర్లు చెప్తూ అల్పాహారం ఆరగిస్తున్న సమయంలో ధైర్యంచేసి అనేసింది కల్యాణి— "మధు పెళ్ళాన్ని చూచుకుంటాడట వూరు వెళదామంటున్నాడు." భయం భయంగా ఆ రెండు మాటలూ అనేసి ఏవో సర్దటంలో నిమగ్నమైపోయింది.

జగన్నాథంగారు నవ్వుతూ మధూ భుజంమీద చేయివేసి అన్నారు. "ఏం నాన్నా ! మీ అపిణ్ని చూచుకుంటావా ?"

"ఛీ ! నాకేం వద్దు."

"తప్పు తెలుపా ! అలా అనకూడదు. నాన్నను బంపి పట్టించను. చాలగారి పూరు పెళ్ళాం" మందలిస్తూ కొడుకుని ప్రయాణాన్ని ప్రోత్సహించింది కల్యాణి ఆలోచనగా.

"నిజంగా తాతగారి వూరు వెళదామా అమ్మా?" సూర్యానికూడా సరదా వేసింది. తాతగారి వూరు వెళ్తే తోటలో ఎన్ని గంటలైనా ఆడుకోవచ్చు. చక్కగా తాతయ్యా అమ్మమ్మా ఎన్నో వస్తువులవీ ఇస్తారు. అత్తయ్యా, మామయ్యయా చక్కగా మాట్లాడుతారు.

"నాన్నని అడగండి" అన్నట్టు కొడుకులకు సైగచేస్తున్న కల్యాణి జగన్నాథంగారికి పట్టుబడి పోయింది— "నీకేం మతి పోయిందేమిటి?" తీవ్రంగానే అన్నారాయన— "నిండు నెలతో ఉండి ఈ స్థితిలో బండి ప్రయాణమా?" కాస్త ఆశ్చర్యంకూడా వెల్లడించారు. కల్యాణి నవ్వుతూ దబాయించింది— "నిండు నెలలేం కాదు లెండి. నాకన్నా మీకు తెలుసా ఏమిటి?"

"అయితే ఇప్పుడు వెళతానంటావు అవునా?"

"నాకు పాపని చూడాలని ఉంది." నసిగింది.

"మరేం ఫర్వాలేదు. చూసేకాలం చాలా ఉంది."

కల్యాణి మౌనం వహించింది.

"నీకు ఎంత తోస్తే అంతేనా? వెనకా ముందూ ఆలోచించకుండా ప్రయాణానికి సిద్ధమైపోయావ్." కల్యాణికి ఉక్రోషం వచ్చేసింది— "సింగినాదం ఆలోచించాలి. మీ పెళ్ళాం ఒక్కతే కానీ మరే ఆడదీ ప్రయాణాలు చెయ్యటం లేదు పిల్లల్ని కనటంలేదు."

భార్య కోపం చూస్తూ జగన్నాథంగారు నవ్వారు.

"ఇక పురుడువస్తే ఎలా వెళతాను? పసిది మాత్రం చంటిదాన్ని తీసుకుని ఎలావస్తుంది?" కల్యాణి గొంతు తగ్గించి అనునయంగా అంది— "రెండు రోజుల్లో జాగ్రత్తగా తిరిగిరానా ఏమిటి? ఎలాగూ మా అమ్మని కూడా పురిటికి తీసుకు రావాలిగా?" సంవత్సరాల తరబడి కల్యాణి కోరిక ఎరిగి ఉన్న జగన్నాథంగారికి కల్యాణిని పంపించాలనికూడా లేకపోలేదు. కాని నిండు చూలాలు. గతుకుల దారిలో ఎడ్లబండిమీద ప్రయాణం చేయటం ఏమంత సమంజసం?

"నీకు తెలీదులే. నా మాట విను. తర్వాత ఏం జరిగినా మనమే విచారిస్తాం-" జగన్నాథంగారు తమ ఉద్దేశం దృఢం చేసుకొంటూ భార్యకు నచ్చచెప్పబోయారు. భర్త ధోరణి కనిపెట్టిన కల్యాణికి బాగా ధైర్యం వచ్చింది.

"నా మాట మీరూ వినాలిమరి. నేనేం తొలిచూలుదాన్నా ఏమిటి? ఆ బరువు భారాలు నాకు తెలీవూ? జాగ్రత్తగా వెళ్ళి వచ్చేస్తాను. కాక పోతే మీరూ రండి. అందరం చూసి వచ్చేద్దాం."

"సరే చూద్దాంలే." అయిష్టంగానే అన్నారాయన లేస్తూ. "ఇంకా ఎప్పుడు చూసేది? తెల్లారగట్ల బండి కట్టమని వెంకన్నతో చెప్పేస్తాను." అంది కల్యాణి జబర్దస్తీగా. అంత సరదా పడుతూన్న కల్యాణిని వారించటం ఇక ఇష్టంలేకపోయింది జగన్నాథం గారికి.

కల్యాణి చటుక్కున గుర్తువచ్చి అంది — "పాత ధాన్యం ఉంచ కమూ [illegible] బస్తా తీయించండి. వదినకు పథ్యానికి పనికి వస్తుంది."

జగన్నాథంగారు తలుపుమీది రుండుతో చేతులు తుడుచుకుంటూ అన్నారు — "సరి! ఇంకా?"

కల్యాణికి కోపం వచ్చింది — "ఆఁ ఇంకా ఇంకా తీసుకెళతాను. ఏం? ఎక్కడెక్కడి వాళ్ళకూ దానంపొయ్యటం లేదూ మీరు? వాళ్ళంతా మీ చుట్టాలా ఏమిటి?"

జగన్నాథంగారు నవ్వారు — "అబ్బ! తీసికెడదూ? నా సొమ్ము ఎంతమంది తినలేదు గనకా?"

కల్యాణి కస్సుమంది— "అదిగో ఆ మాటే అనొద్దంటాను మీ సొమ్ము మావాళ్ళెప్పుడు తిన్నారు?"

"చేరవేసేవి చేరవేస్తూనే సిగ్గులేక నన్ను దబాయిస్తావు చేనికే? అయినా నేనేం అత్తనా? ఆడబిడ్డనా? నిన్ను నిలదియ్యటానికి?"

"ఆహా! అత్తా-ఆడబిడ్డా మాత్రం ఏవిటడుగుతాహా? మావాళ్ళంతా మీ పెట్టుపోతలమీదే బ్రతుకుతున్నారా ఏం ఖర్మ?"

# కూలిన గోడలు

జగన్నాథంగారికి ఓటమి అంగీకరించక తప్పలేదు. "నీతో దెబ్బలాడలేనే పిల్లా! మీ వాళ్ళు నీకు సారె పెట్టారో లేదో గానీ మాత్రం ఇచ్చారు."

జగన్నాథంగారితోపాటు కల్యాణికూడా నవ్వేసింది. "అలా లోకి వెళదాం, వస్తావురా సూర్యం?" అనటంతో "నేనూ వస్తా" అంటూ మధూ కూడా తయారయ్యాడు తండ్రితో. పిల్లల్ని ఏసుకొని టికి వెళ్ళబోతూ ఆగి భార్యకేసి చూశారాయన "మాటల మధ్య మొగు మర్చిపోయిందట నీలాంటిదే. ప్రయాణం సందట్లో మమ్మల్ని కాస్తా మరి పోకు సుమా!" అంటూ నవ్వారు.

"అయ్యో రామా! మర్చిపోవాలంటే మాత్రం మీరు [illegible] వస్తారా ఏమిటి? మీకూ, మీ కొడుకులకూ భోజనాలు తయారుచేయాలిగా? ఆ పనిమీదే లేస్తున్నాను." కల్యాణి వీధిగుమ్మంలో కాస్సేపు నిలబడి పుట్టింటికి తీసుకు వెళ్ళాల్సిన సరుకులు మూటలు కట్టేందుకు హడావిడిగా లోపలికి వెళ్ళిపోయింది.

* * *

తొలికోడి కూసే వేళకే నిండుగా సామానులతో గూడుబండి తయారయింది. తల్లితోపాటు లేచిపోయిన మధు తను తొడుక్కున్న కొత్త చొక్కా చూపించేందుకు తండ్రి మంచం దగ్గరికి పరుగెత్తాడు. "నాన్నోయ్! నాన్నా! తాతయ్యగారి వూరు వెళ్ళిపోతున్నాం. నేను కొత్త చొక్కా తొడుక్కున్నాను" అంటూ ఆయన చెవిలో ఖయ్యిమన్నాడు

"ఛా! వెర్రి వెధవా! వెళ్ళేవాడివి వెళ్ళక నా నిద్ర పాడుచేస్తావ్!" కసిరికొట్టారాయన. మధు తన పని కాస్తా అయిపోయినట్టు మంచం దూకి బండికేసి పరుగెత్తాడు. కల్యాణి అన్నీ బండిలో సర్దించటం పూర్తిచేసి భర్త దగ్గరకి వచ్చింది.

నెమ్మదిగా ఆయన కప్పుకున్న దుప్పటి తీస్తూ- "తర్వాత కావలసినంత నిద్రపోదురుగాని, కాస్త అలా వూరి బయటికి రాకూడదూ? అన్నీ సర్దేశాను. వెంకన్న బండి కట్టేస్తున్నాడు," అంది.

"చస్! నీ కోడుకూ, నువ్వూ నన్ను నిద్రపోనిచ్చేలా లేరు. శాస్త్రం చెప్పినట్టు నువ్వు పుట్టింటికి దయచేస్తోంటే నేను నిద్రపోకుండా నీ వెనకాల తిరగనా? చాలుగాని వెళ్ళు వెళ్ళు" కోపం నటిస్తూ ముసుగు బిగించాడాయన. కల్యాణి నవ్వుకొంది. "సరే! నేను పోతున్నాను. ఎన్నిరోజులు పడుకుంటారో పడుకోండి."

గదిలోంచి బయటికి వచ్చి పనిమనిషికి చెప్పవలసిన జాగ్రత్తలన్నీ చెప్పి మరోసారి హెచ్చరించి బండి దగ్గిరకి నడిచింది. మధు సూర్యంతో వాకిలి ముందు తొట్టిలో కూర్చున్నాడు. కల్యాణి సూర్యాన్ని వోధార్చి తన దగ్గర కూర్చోబెట్టుకుంది.

బండి పదిబారలు సాగేసరికి కిర్రుచెప్పులు చప్పుడు చేసుకొంటూ జగన్నాథంగారు వచ్చి కలిశారు.

"నిద్రేమైందేమిటి?" నవ్వింది కల్యాణి.

"నువ్వూ తాతగారింటికి వస్తావా నాన్నా?" అరిచాడు సంతోషంగా మధు.

"లేదు నాన్నా! నేను రాను. పడిపోతావ్, జాగ్రత్తగా కూర్చో" కొడుకుని హెచ్చరించారు జగన్నాథంగారు.

"ఇంతమాత్రానికి మీరెందుకొచ్చారు?"

"నిన్ను చూద్దామని."

కల్యాణి సిగ్గుపడింది. మధూ తనకేసి చూస్తోంటే – "అల్లరి వెధవా! అన్నీ నీకే కావాలి. అలా వెనక్కి తిరక్కు – సరిగా కూర్చో" అంటూ మందలించింది కొడుకుని.

భార్యను కసిరికొట్టి దుప్పటి బిగించుకున్నా, ఏరా బండి కదిలి పోతుంటే వాళ్ళని కొంతదూరం సాగనంపి వద్దామనీ, ఒక్కసారి భార్యని చూద్దామనీ జగన్నాథంగారికి నిజంగానే బుద్ధిపుట్టింది. వెంటనే లేచి చెప్పులు తొడుక్కొని నాలుగంగల్లో వచ్చి కలిశాడు. ఆయన బండి నడుస్తూ భార్యను చూశాడు. కల్యాణి నిండునెలలతో బండిలో కూ

వెళుతోంటే ఆయన హృదయం ఏదో శంకించింది. బండిని వెనక్కి మళ్ళించి వేద్దామా అన్నంత ఆరాటం కలిగింది. ఏమైనా ఈ ప్రయాణం మాన్పించివుంటేనే బావుండే దనిపించింది. కాని .... ఏమీ చెయ్యలేనట్టు అలాగే నడుస్తూ - "రెండు రోజుల్లో బయల్దేరి వచ్చెయ్యాలి సుమా! అసలు నిన్ను పంపించటం నాకు ఇష్టమేలేదు చెపితే వినకుండా పెంకి తనంగా బయల్దేరావు-" నొచ్చుకుంటూన్నట్టే అన్నాడు. కల్యాణి కొంచెం నవ్వి అంది .. "బావుంది మీ ధోరణి. ఎల్లుండికి ఈపాటికి రానూ? ఎందుకలా కంగారు పడిపోతారు?" ఆ అనురాగమే కల్యాణిని భర్తలోని లోపాలు ఎంచనివ్వకుండా చేస్తుంది. భర్త ఎన్ని పిచ్చి జబ్బులు సాగించినా తనను ప్రాణాలకన్న మిన్నగా చూసుకుంటాడన్న భావన చాలు కల్యాణికి ఆత్మశాంతికి.

"పోనీ బండైనా తేలిగ్గా నడవకుండా నిండా సామాను ఒకటి వేయించావు. అసలే దారి మంచిది కాదు." కల్యాణి మాట్లాడలేదు. జగన్నాథంగారు బండిలోపాటు చాలాదూరం నడిచారు. ఆయనకు [illegible] మళ్ళాలన్న ధ్యాస వున్నట్టులేదు.

"బావుంది మీరు వచ్చేస్తారా ఏమిటి? పోనీ నడకేం ఖర్మ? బండైనా ఎక్కండి-" అంది నవ్వి కల్యాణి. అప్పటికి జగన్నాథంగారు తేరుకొని పాలేరుని హెచ్చరించారు. "దారి సరిగ్గా లేదు వెంకన్నా, జాగ్రత్త సుమా! నానారేనిచోట క్రిందికి దిగుతూవుండు. ఇక నేను వెళతాను. వెళతానన్రా సూర్యం! మధూ! కొందరిగా వచ్చేయండి." బండి ముందుకు సాగిపోతోంటే ఆగి నిలబడ్డాడు. ఎన్నిసార్లు భార్యని పుట్టింటికి పంపించలేదు? ఎప్పుడు ఇలా అర్థంలేని తపన కలిగింది? ఏ [illegible]మూ చెప్పలేని జోస్యాన్ని మనస్సు చెపుతుంది కాబోలు! ఛా, [illegible] ఉత్త చాదస్తం కాదూ? బండి కనుచూపుమేర దాటేవరకూ చూస్తూ నిల బడి-సూర్యోదయపు లేత వెలుగులో వెనక్కి తిరిగారాయన భారంగా.

ఓ రవికెల గుడ్డకు మించి ఏమీ ఆశించని కల్యాణి పుట్టింటివారికి మా[illegible]ం కల్పతరువు లాంటిదే!

తమ పొలంలో ఏ పంట పండినా అది విధిగా అన్నల ఇంట వుండాలి. తాము ఏ సంతోషం పొందినా అది అన్నలకుకూడా అందిరాలి. కూతురి సంసారం కలిగించే అయినా వెర్రి అభిమానంతో పప్పులో పప్పూ, పుప్పులో పుప్పూ పుట్టింటికి నడపడం తల్లి సుందరమ్మ గారికి ఏమంత సమంజసంగా తోచదు - "అభిమానాలకైనా ఆదరణలకైనా సమయమూ సందర్భమూ ఉండాలి. అన్నిటికీ రాసుకు పూసుకు తిరిగితే లోకువౌతుంది," అంటుండావిడ.

కల్యాణి తండ్రి - రాజయ్యగారు ఇంటా బయటా పేరు ప్రతిష్ఠలు గల వ్యక్తి. స్వకులస్థులైన జమీందారుల సంస్థానంలో ఉద్యోగం చేస్తూ మంచి పలుకుబడి సంపాదించుకున్నారు. రాజుల్ని మించిన రాజసం. జమీందారులను మించిన ఆత్మాభిమానం ఆయనకు పుట్టుకతోనే సిద్ధించాయి. వారి కుటుంబం మహా సంపన్నమైనది కాకపోయినా తిండికీ బట్టకూ సర్వ సామాన్యమైన సుఖాలకూ లోటు కలిగింది మాత్రం కాదు. పెద్దకొడుక్కి ... నే ఓంత రాజయ్యగార్ని బాధించినా కోడళ్ళిద్దరూ అక్కచెల్లెళ్ళలా కలసి మెలసి తిరగటం - చిన్నకొడుకు బిడ్డనే అందరూ కన్న కొడుకులా ప్రేమించటం-కుటుంబాన్ని వేర్లుచెయ్యాల్సిన దుస్థితి సంభవించకపోవటం ఆయనకు చాలావరకు సంతృప్తి కలిగించాయి. పెద్దకొడుకైన విశ్వనాథానికి ఆయన ఆశించినట్టు పెద్ద చదువు లేమీ అబ్బలేదు. అయినా విశ్వనాథం బ్రతక నేర్చినవాడు. తండ్రి సంస్థానానికి వెళ్ళిపోయినప్పుడు ఇంటి పెత్తనం స్వంత వ్యవసాయం బాధ్యతగానే చేయగలడు. ఊరి పెద్దలలో ఒకడుగా చెలామణీ అయ్యే విశ్వనాథయ్య వ్యవహారాల పులి. దృఢమైన అవయవ సౌష్టవంతో తెల్లని పంచకట్టుతో-హుందాగా కన్పిస్తాడు విశ్వనాథయ్య.

ఇక రాజయ్యగారి చిన్నకొడుకు సీతాపతి అన్నగారికి భిన్నమైనవాడు. చదువు సంధ్యలమీది ధ్యాసలో ఇంటి విషయాలు పట్టించుకునే అలవాటు లేనివాడు. వేళపట్టుకు తిండి- బస్తీలో వుద్యోగం - అలసిపోయినప్పుడు నిద్రా తప్పితే మరే బాధ్యతలూ పట్టనివాడు. తండ్రి తర్వాత తండ్రివంటి అన్నగారి మాటమీద పెద్దరికంమీద భయభక్తులు కల...

మిన్ను విరిగి మీదపడ్డా నిశ్చింతగా నిర్భయంగా వుండగలవాడు. ఖద్దరు పైజమాలలో ఎగదువ్విన క్రాఫింగుతో బుద్ధిమంతుడయిన విద్యార్థిలా కన్పించే సీతాపతి తామరాకు మీద నీటిబొట్టు.

పెద్దకోడలు పార్వతి సన్నగా పొడుగ్గా తెల్లగా సోగలా చాలా అందంగా ఉంటుంది. అందుకు తగ్గట్టు నిగనిగలాడే నొక్కుల జుట్టు కూడాను – త్రాచులా బారెడు జడ అల్లుకొంటుంది. తాను వాటమే భర్త విశ్వనాధానికి కూడా సరదాగా ముస్తాబు చేస్తుంది. ఎప్పుడూ నాజూగ్గా వాయిల్ చీరలవంటి మెత్తని బట్టలే కడుతుంది. భార్యంటే విశ్వనాధానికి మితిమీరిన అనురాగం.

చిన్న కోడలు సావిత్రి-చామనచాయగా కొంచెం పొట్టిగా నిండుమనిషిలా కన్పిస్తుంది. రోజుకోసారి తల దువ్వుకోటానికి బద్ధకిస్తుంది. మెత్తని గుడ్డలు ముచ్చటగా 'మూడురోజులైనా మన్నే' నేతచీరలే కడుతుంది. అయినా కళగల ముహంతో ఆకర్షణీయంగా కన్పిస్తుంది.

ఆ కుటుంబ వ్యక్తుల సంతోషాన్ని అప్పుడప్పుడూ మటుమాయం చేసేది అందరికన్నా చిన్నదైన జానకి విషయం – జానకి కల్యాణికన్నా ఏడెనిమిదేళ్ళు చిన్నది. కడసారి కూతురిని అపురూపంగా పెంచి ఎక్కడెక్కడి వరులనూ ఎంచి పెళ్ళిచేస్తే జానకి కాపురం నరకంకన్నా నికృష్టమై పోయింది. హద్దులుమీరిన కోడరికం – అనురాగమేలేని దాంపత్యం- భరించలేని జానకి ఆత్మహత్యకు తలపడి అందునా భంగపడిపోయింది. ఆ ఘోరవార్త విన్న తల్లిదండ్రులు పట్టరాని కోపంతో దుఃఖావేశంతో కంపించిపోయారు. పర్యవసానం – జానకి పుట్టింటికి చేరింది. అది విశ్వనాధానికి నచ్చకపోయినా తండ్రికి ఎదుట చెప్పగల ధైర్యంలేక వూరుకున్నాడు. సుందరమ్మగారు భారమంతా భగవంతుడిమీదవేసి కూతుర్ని కప్పులో దాచుకొంది.

జానకి నిండుకుండ. కళ్యాణిలా బోళా మనిషికాదు. పుట్టింట అన్నా మధ్య తగిన పథంగా మసలగల తెలివితేటలు గలవి. తల్లిదండ్రుల

అభిమానమే జానకి నిలకడకు ప్రత్యేక కారణం. జానకి ... అలవాటైందికూడా.

* * *

అనుకోని విధంగా కల్యాణిరాక పుట్టింట అందరికీ సంతోషం కలిగించింది. అయినా తల్లి మనస్సు ఉండబట్టలేక - "ఈ స్థితిలో నువ్వెం వచ్చావమ్మా? వదిన స్నానం కాగానే నేనే రావాలనుకొంటున్నాను." సుందరమ్మగారు.

"నిజమే వదినా! మీరు ప్రయాసపడి రావటం ఏమిటి? అన్నగా వదలించలేదూ?"

పెద్దకోడలు పార్వతి అత్తగార్ని సమర్థించింది.

"కోడల్ని చూచుకోవాలని ఆయనతో దెబ్బలాడి మరీవస్తే మీకు రా మధ్య?" అంటూ బండిదిగి లోపలికి నడిచింది. కల్యాణి.

బంగారు బొమ్మవంటి చిన్నారిపాపను చూసిన క్షణం కల్యాణి హృదయం ఏదో సంతృప్తితో నిండిపోయింది. తన కలలన్నీ ఫలించి ప్రత్యక్షమైనట్లు అనుభూతి చెందుతూ తనను తను మరచి చిరునవ్వుతో పురిటి మంచం దగ్గరే నిలబడిపోయింది.

"పిల్లకు దృష్టి తగిలితే వూరుకోనుసుమీ?"

బాలెంతరాలు సావిత్రి ఆడబిడ్డతో హాస్య మాడింది. కల్యాణి కోడలి ధ్యాస నుంచి కొంచెం మళ్ళి-"ఏమిటంటావు? నీ కూతురికి దిష్టి తగులు తుందా? పోనీ నా దిష్టే తగిలితే ఓ గొలుసు గిరగిరాతిప్పి నీ కిచ్చేస్తాలే." అంది గర్వంగా.

పార్వతి నవ్వింది-"ఉత్తకబుర్లాడితే గొప్పా ఏమిటి వదినా?"

"కల్యాణి అంటే ఏమిటనుకున్నావు వదినా? మాటలు ... చేతలు ఒకటేనా? మీ హాస్యాలు మరెవరి దగ్గరైనా ఒలకబోయ్ నా కోడలికి ఓ గొలుసు ఇచ్చుకోటానికే వెనకాడుతా ననుకున్నారా?

అప్పుడే గదిలోకి వస్తూ సుందరమ్మగారు కూతురిమాటలు విని సంగతంతా గ్రహించుకోగలిగినా తన అయిష్టత మొహంలో కన్పించనీయకుండా అంది సామాన్యంగా - "తర్వాత మాట్లాడుకోవచ్చు కల్యాణీ! మిట్టమధ్యాహ్నం దాటింది. భోజనాలకు రారాదే!"

"నా మతి మండినట్టే ఉంది. అన్నాలకు పదమని చెప్దామనుకొంటూనే మాటల్లో పడ్డాను, పదమ్మా వదినా! ఉత్త మనిషిని కూడా కావు అంటూ తొందరచేసింది పార్వతి.

"పిల్లలిద్దరూ తినేశారా ?"

"ఆఁ తింటున్నారు. జానకీ పెడుతోంది. నువ్వు లేచిరా?" అనేసి సుందరమ్మగారు వెళ్ళిపోయింది.

భోజనాల తర్వాత ఆడవాళ్ళంతా పురిటి గదిలోచేరారు. సూరి వీధిలోకి పోతే మధూ తల్లి నంటిపెట్టుకొని కూర్చున్నాడు. అసలు చేత కబుర్లు చెప్పించాలని కల్యాణి వాణ్ణి దగ్గిర పెట్టుకు కూర్చుంది.

పాపాయిని చూశావా మధూ? చక్కగా బావుందికదూ?" అంటూ కల్యాణి కొడుకు మొహంలోకి చూసింది.

"బావుంది" అనేశాడు చటుక్కున పాపాయివైపే చూస్తున్న మధు.

"ఆహా! అంత బావుందీ? నీకేం నోరూరుతోందా?" అంది పార్వతి నవ్వుతూ.

"మరి మా పాపని పెళ్ళిచేసుకుంటావటోయ్?" సావిత్రి మధుకేసి చూసింది.

మధూ అంగీకరిస్తున్నట్టు తల వూపుతో - "నేనూ, మా అన్నయ్యా కూడా చేసుకుంటాం."

అంతా ఫక్కుమన్నారు.

"అస్తమానం వాడితో దెబ్బలాడుతూనే ఉంటాడు. మళ్లా వాణ్ణి మరిచి ఒక్క క్షణం వూరుకోడు-" అంది కళ్యాణి. పార్వతి మధుకేసి

చూస్తూ "మా పాప జాతి బొమ్మలా ఉంది. నువ్వూ మీ అన్నయ్యా! మట్టిముద్దల్లా ఉన్నారు. అసలు పాప బొమ్మల్ని పెళ్ళి చేసుకోదుగా మరి" అంటూ నవ్వింది. జానకి కలుగజేసుకొంది. "అలా బింకాలుపోకు వదినా! నిజంగా వాళ్ళు వద్దనేస్తే మీ బొమ్మని బొమ్మలాగే ఉంచుకుంటావు." —

"ఇదేం 'చోద్యమమ్మా? మీరే మగపిల్లల్ని కన్నట్టు, నా కూతురికి మొగుడే రానట్టు మాట్లాడుతున్నారే!" సావిత్రి అందుకొంది.

"నీ కూతురికి మొగుడెందుకు రాడుగానీ, ఎవడువచ్చినా వాడు మేనత్తకొడుకు మాత్రంకాడు" సుందరమ్మగారు కూడా ఓ విసురు విసిరింది.

"అయినా వదినా! ఈడైఉన్న మేనత్తకొడుకులే కాదన్నప్పుడు నీ కూతుర్ని కట్టుకోవటానికి మరెవడు ముందుకొస్తాడు చెప్పు?"

ఆ మాటమీద వదినా మరదళ్ళు మరోకాస్సేపు వాదులాడుకున్నారు.

అంతలో మధూకి ఏదో కోరిక పుట్టుకొచ్చింది. అదికాస్తా తల్లి చెవులో వెల్లడించాడు. కల్యాణి నవ్వుతూ — "ఛ! అప్పుడే ఎత్తుకు వెళ్తానంటే వాళ్ళకి లోకువ కాదుట్రా? మనం ఎంత బింకంగా ఉండాలనీ?" అంది.

మధు మొహం ముడుచుకున్నాడు.

"మంచి అల్లుడివే బాబూ! దాని కాలో - చెయ్యో విరిగిందంటే నువ్వుకూడా తప్పించుకు మరీ వెక్కిరిస్తావు-" చిన్నత్త!

"ఆగవయ్యా! నీకూ చెల్లాయి పుడుతుంది. ఎత్తుకు తిప్పుదువు గాని-" పెద్దత్త!

"అయినా పెళ్లాన్ని ఎత్తుకుంటారుట్రా?"-పిన్ని!

అందరూ ఏకగ్రీవంగా తన కోరికను వెక్కిరించటంతో మధూ సిగ్గుపడి పరిగెత్తుకు వెళ్ళిపోయాడు.

ఉన్నట్లుండి పార్వతి అంది - "పాపని మేము పెంచుకుందా మనుకుంటున్నాం కల్యాణీ! మీ అన్నయ్య అలాగే అంటున్నారు."

"ఇకనేం అందరి ముచ్చటా తీరుతుంది. ఐతే పిల్లనిమ్మని ఎవర్ని అడిగాలంటావు ?"

"ఇద్దరి నీను"

"బావుంది. అందరికీ ఒక్క అత్తగారు గాని నా కొర ఏమిటి ?"

మాటల సందట్లో పాప పేరు విషయం కూడా దొ అత్తగారిదే పెత్తనమన్నారు. కల్యాణి నవ్వింది. — కునే ఉన్నాను లెండి! మధుసూదనుడి పెళ్ళాం సు కలిసి అందంగా ఉంటుంది కదూ ?"

"సుధారాణి! సుధ," అందరికీ నచ్చినట్టే మనస్సు దూదిపింజెకన్నా తేలికపడింది. భర్త మంది కోడల్ని చూడటం — తనకు నచ్చిన పేరు పెట్టటం - అ దంగా ఉంది.

కల్యాణి వచ్చిన మూడో రోజు సావిత్రి పురిటి స్నానం అయి కల్యాణి చిన్నారి సుధని ఒడిలో పడుకోబెట్టుకొని తన మెడలోంచి పది రాళ్ళ జిగినీ గొలుసు తీసి కోడలి మెడలో వేసింది - "చూడు వదినా! నేనేదో ఉత్త కబుర్లు చెప్పటమే అనుకున్నారు కదూ ? ఇది పుట్టిందని తెలిసినప్పుడే అనుకొన్నాను ఈ గొలుసు దీనిదేనని - అమ్మో! నా కోడలు మెరిసిపోతోందమ్మో ?" అంటూ పాప బుగ్గల మీద ముద్దు లాడింది.

పార్వతి, సావిత్రీ విస్తుపోయారు.

"అయ్యో! ఇప్పుడు గొలుసులవి ఎందుకు కల్యాణీ ? పెట్టుకొనే కాలం-లేదా?" అంది కృతజ్ఞతా భావంతో సావిత్రి. కల్యాణి నవ్వి ఊరు కొంది పార్వతి. తేరుకొని - "మీ సంబరాలకేం గాని మా పిల్ల ఆ పేరు మొయ్యలేదమ్మా! తీసి దాచండి" - అంది.

"నీ కూతురు ఎంత సుకుమారి అయితే మాత్రం బంగారాన్ని బరు వనుకొనే ఆడది ఉంటుందామ్మా ?" కల్యాణి అనురాగానికి సావిత్రి కళ్ళ

చెమర్చినట్టే అయ్యాయి - "నీ వంటి అత్తగారు ఉంటే నా కూతురు కన్న తల్లినే మర్చి పోతుంది కల్యాణీ !"

కూతురు చేసిన పని సుందరమ్మగారికి ఎంత మాత్రం నచ్చలేదు. ...ఫం కాచుకున్నట్లు కను చీకట్లో జామ చెట్టు కింద కోత ...కుండా కూతుర్ని సన్నసన్నగా చివాట్లు పెట్టింది. ... "కోత ... చూచుకోవాలిగానీ అంత తొందర పాటేమిటే ! మహా ...చలో గొలుసు తీసి ఇచ్చేస్తావా ? రేపు నీకు ఆడపిల్ల ...ణంగా దాని కిది ఉంచుకోవూ ! నీకు లోకజ్ఞానం

...! ఇవ్వాక మథన పడటం ఏమిటి ? పాప పుట్టాలే ...చు కోలేక పోతామంటావా ?"

...! ఎంత పిచ్చిదానివే !" సుందరమ్మగారు మరేమీ అన ...ంది. ఒక్క కడుపున పుట్టిన బిడ్డలు అన్యోన్యంగా కలిసి ఉంటా ...టే ఏ తల్లి సంతోషపడదు ? కొంచెం సేపు వూరుకొని అంది ఆవిడ - కల్యాణీ ! నేను అసూయగా చెప్పలేదమ్మా ! చీమలు తింటే కొండ ...నా తరుగులాయంటారు ఎంత కలిగిన సంసారమైతే మాత్రం కావల సిన వాళ్ళకి బాధ్యత లేకపోతే కష్టం కదమ్మా ! అల్లుడిగారి సంగతి అంద రికీ తెలిసిందే కదా ? ఆయన ఖర్చులేమిటో, సరదా లేమిటో తప్ప ఓ అర్ధని పొదుపు చేసుకు పెంచుకుందామనే ధ్యాస లేదు. పోనీ ఇంటి ఇల్లాలివి నువ్వయినా తెలివిగా మసలుకొంటావేమో అనుకుంటే నీ దాన ధర్మాలు నీవి — చేతి ఎముకే లేనట్లు దారపోస్తావు. నీకు తెల్లనివన్నీ పాలూ — నల్లనివన్నీ నీళ్ళూనూ — అప్పుడే ముగ్గురు బిడ్డల తల్లివి. ఇంకా కనాలి. పెంచాలి. ఎంత సంపద ఉంటే మాత్రం చేదాయుందా ఏమిటే ?"

వింటూన్న కొద్దీ తల్లి మాటలు కల్యాణికి సమంజసం గానే తోచాయి.

"ఏమిటమ్మా అంటున్నావు ?" అంటూ జానకి వస్తే తమ మధ్య జరిగిన సంభాషణ ఏమంత చెప్పదగ్గది కాదన్నట్టు నవ్వేస్తూ అంది కల్యాణి

— "ఏం బావ రెండు రోజుల్లో రమ్మంటే నాలుగు రోజులు కూర్చు న్నాను. ఆయనకు కోపం వస్తుందో ఏమో, రేపు తెల్లారిగట్ల బయల్దేరుదా మంటే దానికీ ఏదో చెప్తోంది అమ్మ"

"నిజమే వెళితేనే మంచిది. ఇంకా ఆలస్యం దేనికి?" అంది జానకి.

"అమ్మా అమ్మా!" అని అరుస్తూ పరిగెత్తుకు వచ్చాడు మధు ఏదో గొడవ తెచ్చాడని వాడి కంగారే చెప్తోంది.

"అమ్మా!"

"ఏమిట్రా?"

"నీ గొలుసు వాళ్ళ పాప వేసుకుందేం?"

"కల్యాణీ, జానకీ నవ్వారు. జానకి అంది — "వాళ్ళ పాప ఏమిటి? నీ పెళ్ళామేగా?"

"ఊఁ చెప్పమ్మా! నువ్వు ఇచ్చేసావా?"

"పాప మని మన చుట్టాలే కదమ్మా! పాపం చిన్నపాప కదూ? నేనే ఇచ్చాను. పాప వేసుకుంటే ఎంతో బావుంది కదూ? నీకు ముద్దు రాలా?"

"నాకేం ముద్దురాలా?" మధూ కోపంతో విస్మయంగా అడిగాడు "మరి నీకు గొలుసేది?"

"నాకు ఇంకో గొలుసు ఉంది కదూ?"

"మరి పాప గొలుసెక్కడ దాచుకొంటుంది?"

"వాళ్ళమ్మ దగ్గిర దాచుకొంటుంది?"

"వాళ్ళమ్మ కూడా వేసుకొంటుందా గొలుసు?"

"ఉహూ! పాప ఒక్కతే వేసుకొంటుంది."

సందేహాలన్నీ తీర్చుకొని మరీ వెళ్ళాడు మధు.

"ఎంత గడుసువాడు!" అంది జానకి ప్రేమగా.

కల్యాణి ఆయాసంగా లేచి గదిలోకి నడిచింది.

* * *

విధిలీల వూహాతీత మైనది !

ఆయాసంగా వెళ్ళి పడుకున్న కల్యాణికి నొప్పులు రావటం. పురుడు కష్టమై ప్రాణాపాయం సంభవించటం చూస్తూండగానే జరిగి పోయింది. మొదట ఎరుకల సాని మరేమీ ఫర్వాలేదని ఖచ్చితంగా చెప్పింది. గంటలు గడుస్తూన్న కొద్దీ – "అమ్మాయిగార్ని ఆసుపత్రికి తీసుకుపోతేనే బాగుంటుం దమ్మా" అంటూ నసిగింది

"అయ్యయ్యో! ప్రాణాలమీదకు తెచ్చి ఇప్పుడు చెప్తావా ? నీకేం బుద్ధి ఉందా లేదా ?" అంటూ ఇంటిల్లపాదీ దాని మీద విసుకుపడినా గత్యంతరం లేక కల్యాణిని ఆసుపత్రికి తీసుకుపోయే ప్రయత్నాలు చేస్తూ హడావుడి పడ్డారు.

అనుకోని విధంగా వచ్చి పడిన పిడుగు పాటుకు ఇంట్లో అందరి మనస్సులూ కలవర పడి పోయాయి.

తెలివితప్పి పడివున్న కల్యాణి అస్పష్టంగా కలవరించింది – "బాబూ సూర్యం పెద్దవాడివి. తమ్ముడూ .... నాన్న !"

సుందరమ్మగారు కూతురి దగ్గిర కూర్చుని తల నిమురుతూ ధైర్యం చెప్పింది .. "మరేమీ ఫర్వాలేదమ్మా ! బండి కడుతున్నారు. నిన్ను బస్తీ ఆస్పత్రికి తీసుకు వెళతారు. డాక్టరుగారు జాగ్రత్తగా చూస్తారు. నువ్వు ఇలా అధైర్య పడకూడదమ్మా !"

కల్యాణికి పూర్తిగా తెలివి ఉన్నట్టు లేదు. తల్లి మాటలు విన్నట్టు కూడ లేదు. ఆ అయోమయ పరిస్థితులలోనే కల్యాణి హృదయం ఏదో భయాన్ని శంకించ సాగింది. భర్త మందలిస్తూన్నా వినకుండా తను ప్రయాణం కావటం తన నెక్కడికో శాశ్వతంగా పంపివేస్తున్నట్టు ఆయన బాధపడటం — విడిచి వెళ్ళలేక బండి వెనకే నడిచి రావటం — తీరా ఆగి పోయినప్పుడు తెలీని దిగులు కలగటం — అన్నీ కల్యాణికి మరొకసారి అనుభవ మయ్యాయి. భయంతో కంపించిపోతూ కళ్ళు తెరిచింది. ఎదురుగా తల్లి కళ్ళు తుడుచు కోవటం కన్పించింది — "ఎందుకమ్మా ఏడుస్తున్నావు ?" తన పరిస్థితి నిస్సహాయంగా ఉందేమోనన్న అనుమానం పొడ చూపింది కల్యాణిలో

మంచం దగ్గరే నిలబడి వున్న పార్వతి కలుగజేసుకొని అంది -
"మీకేం భయం లేదు వదినా! ఒక్క గంటలో ఆస్పత్రికి వెళ్ళిపోవచ్చు."

కల్యాణి నీరసంగా అంది- "మీకు ..తెలీదు వదినా! ఈసారి—
నా పరిస్థితి మునుపటిలా లేదు— ఏమో ... నేను ..." మాటలు పూర్తి
కాకుండానే చెంపల వెంట కన్నీళ్ళు జారిపోయాయి.

బండి సిద్ధమైంది— కదలబోతుంటే హఠాత్తుగా అడిగింది కల్యాణి
"పిల్లలేరమ్మా?"

"నిద్రపోతున్నారు. వాళ్ళెందుకమ్మా ?"

"ఫర్వాలేదు. లేపి బండి ఎక్కించండి వస్తారు"

"అదేమిటి కల్యాణి ? ఆస్పత్రికి వాళ్ళెందుకు ?"

"వాళ్ళు నా దగ్గరే వుండాలమ్మా! తీసుకురండి" ఎవరెన్ని
విధాల చెప్పినా— చివరికి తండ్రి మందలించినా వినలేదు కల్యాణి. చేసేది
లేక సూర్యాన్నీ, మధునీ నిద్రలేపి బండి ఎక్కించారు.

తల్లి బాధగా మూలుగుతూ పడివుండటం - అమ్మమ్మ మాటి
మాటికీ కళ్ళు తుడుచుకోవడం - అకస్మాత్తుగా బండిలో ఎక్కడికో బయ
లేదటం- అంతా అయోమయమై పోయింది పిల్లలకి సూర్యం భయంగా
తల్లికేసి చూస్తోంటే మధు బిక్కమొహం వేసుకొని అన్నని గట్టిగా కావి
లించుకున్నాడు. కల్యాణి కళ్ళు తెరచి పిల్లలిద్దర్నీ చూసింది. సూర్యం
వెక్కి వెక్కి ఏడవటం ప్రారంభించాడు. కొడుకుచేయి పట్టుకుని ఏడవ
వద్దన్నట్టు వారించింది కల్యాణి. మధు విత్తర చూపులు చూస్తూ అడిగాడు.
"మనం నాన్న దగ్గరికి వెళుతున్నామా అమ్మా?" కల్యాణి కళ్ళలో నీరు
నిండింది. సుందరమ్మగారు మందలిస్తున్నట్టుగా అంది "పిల్లలు భయ
పడుతున్నారమ్మా! వాళ్ళని తీసుకువచ్చే వరకూ ఊరుకున్నావు కాదు.
మొత్తానా చిన్నపిల్లలా ఇలా అధైర్యపడితే ఎలాగమ్మా ?" కల్యాణి
ఏమీ విన్పించలేదు. మరే ధ్యాసా కలగలేదు. మనస్సంతా శూన్యం
మళ్ళిపోయింది. ఆయన్ని తను ఇక చూడలేదేమో! అంటూనే ఆమె
నోటివెంట ఆ మాటలు వచ్చాయి.

"నిన్ను చూద్దామని వచ్చాను" అన్నారు. బండి దగ్గరకు వస్తూ, అదే ఆఖరి చూపు కాదుగదా?

కల్యాణి గుండెలు దడదడలాడాయి. శరీరమంతా చెమటలు పోశాయి.

"కొంచెం మంచినీళ్ళు"

ప్రాణాపాయ స్థితిలో ఫలితాన్ని విధినిర్ణయానికి వదిలేసి డాక్టర్ కల్యాణికి పెద్ద ఆపరేషన్ చేసి బిడ్డని తీశాడు. మత్తు మందుతో స్పృహ తప్పి పడివున్న తల్లినిచూసి భయంగా ఏడవటం ప్రారంభించాడు సూర్యం. తెలివి వచ్చినా కల్యాణి స్థితి ఆశాజనకంగా మారలేదు. విపరీతమైన దాహంతో మంచినీళ్ళకోసం సైగచేసిన కల్యాణికి ఇంజక్షన్ చేశాడు డాక్టర్.

కల్యాణి హృదయంలో మూగగా రోదించింది. కొడుకులకు ఏదో చెప్పాలని ఆరాటపడింది. భర్తని ఒక్కసారి చూసుకోవాలని తపించి పోయింది. పూర్తిగాఅధైర్యపడిపోయిన కల్యాణి ఇక తాను జీవించటంమీద నమ్మకంలేదు. అంతిమదశలో కల్యాణిని సంతోషపెట్టింది కూతురి పుట్టుక-"పాప... పాప పుట్టింది. పాప " అంటూ అస్పష్టంగా ఉచ్చరించు కొంది. డాక్టర్ మరేదో ఇంజక్షన్ ఇవ్వటానికి సిద్ధపడుతూంటే ఇక అవ సరంలేకపోయింది. కల్యాణి శాంతిగా కళ్ళు మూసింది శాశ్వతంగా....

* * *

ఓయి భగవంతుడా! ఎంచి ఎంచి మంచివాళ్ళనే కరువుచేస్తావు. ఇదెక్కడి న్యాయమయ్యా? తల్లీ-బిడ్డలనూ, భార్యా భర్తలనూ నిర్దయగా వేరుచేస్తావు- పచ్చనికాపురాలలో ఆరని చిచ్చు పెడతావు. నవ్వుతూ బ్రతికే వాళ్ళని హఠాత్తుగా ఏడిపిస్తావు. ఈ క్షణాన వున్నదంతా మరుక్షణానికి మాయంచేస్తావు. ఇందుకేనా ప్రభూ నిన్ను కరుణా సముద్రుడని స్తుతి చేస్తారు? ఇదేనా ప్రభూ నీ నిరంకుశ సృష్టి విలాసం?

ప్రేమ స్వరూపిణియైన కల్యాణిని కరువు చేశావే! కన్నకూతురి కోసం అహోరాత్రులూ అలమటించే ఆ తల్లిదండ్రుల గర్భశోకం అర్థం చేసుకోగలవా? తల్లిలేక దీనాతి దీనంగా విలపించే పసిబిడ్డల్ని నీవు మరి

పించగలవా? అర్ధాంగి మరణంతో కుప్పకూలి జీవచ్ఛవమై పడివున్న భర్త మనోవ్యధ వూహించనైనా వూహించగలవా? ఏ ఒక్కటి చేయగలిగినా నీవు కల్యాణిని కసువుచేయవే! భగవాన్! నీ బిడ్డలనే బొమ్మలు చేసుకొని ఆడుకుంటావా? నీ సృష్టిలోనే వేదన చూచుచు ఆనందిస్తావా? కరుణించవలసిన నీవే దారుణంగా పాలిస్తావా?

కంటికి కనిపించని భగవంతుణ్ణి నిందించటం, జవాబు చెప్పని విధిని ఆరోపించటం తప్పితే చేయగలిగింది ఏముంది?

కల్యాణి మరణంతో ఆ కుటుంబంలో భయంకర పరిస్థితులు సంభవించాయి. జగన్నాథంగారు మతిభ్రమించిన వ్యక్తిలా పిచ్చిగా మారిపోయారు. ఎవరెన్ని విధాల సముదాయించినా ఆయన శూన్యదృష్టిలో కళాకాంతులు ప్రవేశించలేదు. మంచంలో పడివుండే ఆ వ్యక్తి ఒకనాటి అర్ధరాత్రి హఠాత్తుగా మాయమయ్యాడు. ఎటుపోయారో? ఏమయ్యారో? ఎవరికీ అంతుచిక్కలేదు. కూతురి మరణం! అల్లుడి పరారీ: తీరని దుఃఖాన్ని దిగమింగి రెక్కలురాని మనుమలకోసం గుండె రాయిచేసుకొని అల్లుడి సంసారాన్ని ఆదుకోబోయిన రాజయ్యగారికే విద్యుద్ఘాతం తగిలింది.

జగన్నాథంగారి ఆస్తి చాలవరకు అప్పులలోనే మునిగి వుంది. ఆయన అంతర్ధానంతో అప్పులవాళ్ళంతా ఒక్కసారి బయటపడ్డారు. మూడో మనిషికైనా తెలియని ఈ నిజాన్ని గురించి పన్నెత్తి మాట్లాడకుండా ఆస్తి అప్పులక్రింద కట్టబెట్టవలసి వచ్చింది. ధైర్యానికి ప్రతిరూపం వంటి రాజయ్యగారు పసివాళ్ళను కాపలించుకొని దాపున మన్నారు. చెడు మార్గాలుపట్టి తిరిగే అల్లుణ్ని మందలించుకోలేకపోయిన ఆయన పెద్దరికం మంటగలిసింది. లోకుల మాటలతో అభిమానధనుడైన రాజయ్యగారు కుంచించుకుపోయారు.

అల్లుడు జల్సారాయుడని తెలిసికూడా ఖండించుకోకపోవటం ఆయనకు చాలా అపరాధంగా తోచింది. ఆదిలోనే అల్లుణ్ని మందలించి అనునయంగా నచ్చజెప్పి ఈనాడీ గడ్డుస్థితి సంభవించకుండా చేయలేకపోయిన తన మూర్ఖతకు అమితంగా పశ్చాత్తాప పడ్డారు.

ఒకప్పుడు రాజయ్యగారు అల్లుడు ఆస్తిపరుడని గర్వించారు. కూతురు సంసారం దివాణంలాగే వుంటుందని తృప్తిగా నవ్వుకున్నారు. ఆ పల్లెటూరి పిచ్చివాళ్ళకు మొట్ట మొదట తమ అల్లుడే రేడియో తెచ్చి చూపించాడనీ, మునసబుగారి మనవడి పెళ్ళిలో తమ అల్లుడు మాత్రమే భోగంసానితో పంతం పట్టగలిగాడనీ— ఊళ్ళో జరగాల్సిన విశేషాలన్నిటికీ అల్లుడిమాటే ఆయువుపట్టనీ—చేయిచాచి యాచించేవాడి చేతికందినంతా గిరవాటు వేయగలడనీ, అల్లుడి బ్రతుకే ఒక జమీందారు తరహా అనీ, అల్లుడు చేసేదంతా ఆస్థిపరుడు చేయాల్సిందేనని విశ్వసించిన రాజయ్యగారు భవిష్యత్ నిర్ణయాలను లీలామాత్రమైనా శంకించలేక పోయారు.

గుమ్మడిపండు కుళ్ళి భళ్ళున బద్దలైంది. కల్యాణి కాపురం విచ్చిపోయింది. ఇల్లాలు మరణించింది. యజమాని పరారీ అయ్యాడు. అప్పుల వాళ్ళు ఆస్తి కట్టుకున్నారు. పరువు బజారుపాలైంది. పసివాళ్ళు అనాథలయ్యారు.

ఆ ఇంటి తలుపులు మూసుకున్నాయి.

* * *

తల్లి మరణానికి ఓహ్మంగా మిగిలిపోయిన పసిపాప ఇంట్లో ఎవరి అనురాగం పొందలేకపోయింది.

"అక్కయ్యే వుంటే కూతుర్ని పువ్వుల్లో పెట్టి పెంచుకోదా ? దాని ఆత్మశాంతికైనా పాపని పెంచి పెద్దచేయాలికదా?" అనుకున్న పినతల్లి జానకిమాత్రం పాప బాధ్యత స్వీకరించింది.

"అమ్మకావాలి అమ్మ ! అమ్మ!" అంటూ రాత్రింబవళ్ళు ఏడ్చే మధు ఒక సమస్యే అయ్యాడు.. "అమ్మదగ్గరికి తీసుకెళ్ళు అన్నయ్యా! అమ్మ ఎక్కడకు వెళ్ళింది?" అంటూ మధు అడుగుతుంటే తమ్ముణ్ణి ఓదార్చటంమాని తనూ ఏడ్చేవాడు సూర్యం. పదేళ్ళ సూర్యం ఏమంత కష్టసుఖాలు తెలిసినవాడు కాకపోయినా, పరిస్థితులు అర్థం చేసుకో గలిగినట్టు ఏడవకుండా మౌనంగా ఆలోచించుకోవటానికి అలవాటుపడ్డాడు.

అమ్మ చచ్చిపోయింది. నాన్న ఎక్కడికో వెళ్ళిపోయాడు. అన్నీ ఎవరో తీసేసుకున్నారు. పాపం, నాన్న వాళ్ళదగ్గిర చాలా ...కున్నాడట.

...ందుకని తాతయ్య మరీ ఏడుస్తున్నాడు. అమ్మమ్మ మంచం మీద నుం ...టమే లేదు — ఇప్పుడు మనం ఏడిస్తే ఎవరు చూస్తారు? పిన్ని కేమె ...గాయితోనే సరిపోతుంది —" తనను తను ఓదార్చుకోగలిగిన సూర్య అమ్మకోసం ఏడ్చే తమ్ముణ్ని కూడా ఓదార్చటానికి ఎన్నోవిధాల ప్రయత్నించే వాడు.

"అస్తమానూ ఏడవటం ఎందుకురా? తాతయ్యా అమ్మమ్మా పిన్నీ అత్తయ్యలూ మామయ్యలూ అందరూ వున్నారుగా?"

"మరి అమ్మా నాన్నా లేరేం?"

"అమ్మ చచ్చిపోయిందిగా. నాన్న ఎక్కడికో వెళ్ళిపోయాడు."

"నాన్న ఇంక రాడా అన్నయ్యా?"

"ఏమో మరి."

"మనల్ని తీసుకు వెళ్ళకుండా నాన్న ఒక్కడే వెళ్ళిపోయాడు కదూ?"

"మనం చిన్నవాళ్ళం కదా! అందుకే తాతయ్య దగ్గిర వుంచేశాడు."

"నీకు ఏడుపు రావటంలేదూ అన్నయ్యా!"

"నాకేం రావటంలేదు. అసలు ఏడవటం ఎందుకేమిటి? తాతయ్య ఏడవకూడదని చెప్పలా?"

"తాతయ్యే ఏడుస్తాడేం మరి?"

సూర్యం బుర్ర గోక్కున్నాడు. ఇద్దరూ మౌనంగా కూర్చున్నారు చాలాసేపు. కృష్ణుడు - సీతాపతి కొడుకు. వాళ్ళిద్దర్నీ వెతుక్కుంటూ వచ్చాడు — "ఇక్కడ కూర్చున్నారా మీరు? తాతయ్య మీ కోసం వెదుకుతున్నాడు మన ముగ్గుర్నీ ఆడుకోవటానికి వెళ్ళమన్నాడు."

6]

సూర్యం లేస్తోంటే మధు లేచాడు.... ముగ్గురూ కలిసి
జానకి పిలిచింది – "పాప ఏడుస్తోంది సూర్యం! కొం
కూర్చుంటావా? నాకు ఇంట్లో పని వుంది" అంది బ్రతిమ

సూర్యం ఆగిపోయాడు — "మీరు వెళ్ళి ఆడుకో
చెల్లాయిని ఎత్తుకుంటాను."

"ఉహూ! నేనూ నీ దగ్గరే కూర్చుంటాను. చెల్లా ద్దాం. నువ్వు వెళ్ళిపోరా బావా!" క్రిష్ణకి చెప్పేసి వచ్చాడు మ క్రిష్ణుడు కూడా వచ్చేస్తూ — "నేనూ వెళ్ళను. మా చెల్లిని ఆడిస్తాను" అన్నాడు.

"సరే! అందరూ జాగ్రత్తగా మన అరుగులమీదే ఆడుకోండి." అంటూ జానకి లోపలికి వెళ్ళింది.

"తల్లిదండ్రుల ధ్యాసనుంచి మధు మనస్సు మళ్ళించటానికి ఎన్నోరే ప్రయత్నాలు చేసినా బూడిదలో పోసిన పన్నీరయ్యింది. అప్పటికప్పుడు మధు ఆ విషయాన్ని మర్చి పోయినా కొంత సేపటికి మళ్ళీ పూర్వస్థితి ప్రారంభ మయ్యేది. మధు తిండి తినటం — నిద్ర పోవటం మానేశాడు! ఏడ్చే వాడిని జాలిపడి పెద్దత్త పార్వతి ఎత్తుకోబోయింది.

"నన్ను నువ్వేం ఎత్తుకోవద్దు —" అంటూ హఠాయించాడు.

"ఒరేయ్! దొంగ లొస్తారు. పడుకో. లేకపోతే ఎత్తుకు పోతారు." భయ పెట్టాడు మేనమామ విశ్వనాధయ్య.

ఎదురు తిరిగాడు మధు — "నన్నేం ఎత్తుకుపోరు. మా అన్నయ్య లేడా? నిన్నే ఎత్తుకు పోతారు."

విశ్వనాధం — కొంచెం కోపంగానే మందలించాడు అల్లుణ్ని — "వేలెడంత లేవు. వెధవ పెంక జవాబులూ నువ్వూను. నోరు మూసుకుని పడుకుంటావా లేదా?"

మధు భయంతో బావురు మన్నాడు. రాజయ్యగారు మనవణ్ని గుండెలకు జేర్చుకుంటూ — "చిన్నవాడితో నీకేమిటి విశ్వం? తల్లిదండ్రులు కన్పించక పసివాళ్ళు కుళ్ళిపోతోంటే వోదార్చవలసింది పోయి కసురుకుంటావా? పిల్లలు బెంగటిల్లిపోరూ?" అంటూ మందలించారు కొడుకుని. విశ్వనాధం మారు మాట్లాడకుండా గది తలుపులు మూసు

కున్నాడు. మధు తాత గుండెలమీద పడి వెక్కి వెక్కి ఏడుస్తూ నిద్రపో యాడు. రాజయ్యగారు నిశ్శబ్దంగా కళ్ళు ఒత్తుకున్నాడు పసివాళ్ళు ఏడిస్తే వినటానికి తనైనా వున్నాడు. తనే ఏడిస్తే ఎవరు వింటారు? దీర్ఘంగా నిట్టూర్పు విడిచారు. చేతుల్లో నిద్రపోయిన మనవణ్ణి పక్కమీద పడుకోబెట్టి వీపు నిమురుతూ తృళ్ళికిద్దారు. మధు చాలా నీరసించి పోయాడు. ఎముకలు బయటపడి అస్థిపంజరంకన్నా ఒక్క చూపు మెరుగ్గా వున్నాడు. ఇలా నిర్లక్ష్యంచేస్తే పసివాడుకూడా దక్కక పోవచ్చు. మరి చేయగలిగిం దేముంది ?

రాజయ్యగారి ఆలోచనలు పరిపరి విధాల పరుగులెత్తాయి ... చివరి కో ఆలోచన ... ఊరు పరిసరాలు మారిస్తే మధు కొంత తేరుకో లేడూ ? కొత్త ప్రాంతంలో పిల్లలు మారవచ్చునన్న ఆలోచన సుంద రమ్మగారికి కూడా సమంజసంగానే తోచింది.

సంస్థానపు ఉద్యోగం విరమించి కొని పిల్లల్ని చూచుకొంటూ ఇంటి దగ్గర పడివుండామని నిశ్చయించుకున్న రాజయ్యగారు తిరిగి సంస్థా నానికి వెళ్ళటానికే తయారయ్యారు.

* * *

మధూ విషయంలో రాజయ్యగారి అంచనా ఏమంత నిజంకాలేదు. ఇళ్ళు మారినా మధూ లేత మనస్సులోని ముద్రలు తల్లిదండ్రుల జ్ఞాప కాలు మాసిపోలేదు. ఆటపాటలు మాని దిగులుతో కృశించి పోతున్న మధూని చూస్తూన్న కొద్దీ సుందరమ్మగారి గుండెలు తరుక్కు పోయాయి. సూర్యం పరిస్థితిమాత్రం ఏమంత విచారించ నవసరం లేకపోయింది. తిరిగి బడిలో చేరి చదువుకోటానికి అలవాటుపడ్డాడు.

వీధిలో చింతచెట్టుక్రింద పిల్లలందరూ ఆడుకొంటూండే వాళ్ళని చూస్తూ అరుగుమీదే కూర్చున్నాడు మధు. సూర్యంగూడా ఆడుకోవటం యిష్టంలేక పుస్తకం తెరచుకొని తమ్ముడికి పక్కనే కూర్చున్నాడు.

వీధి చివరనుంచి ఏదో మేనా వస్తూన్నట్టు కన్పించింది. చూస్తుండ గానే దగ్గిరికి వచ్చి మధూ వాళ్ళ ఎదురుగానే ఆగింది. ఆడుకొంటూన్న

పిల్లలందరూ బిలబిల్లాడుతూ వచ్చి మేనాని చుట్టేశారు. సూర్యం సంభ్రమంగా లేచి నిలబడ్డాడు. మధూ లోపలికి పరిగెత్తాడు.

"అమ్మమ్మా! అమ్మమ్మోయ్! మేనా వచ్చేసింది. నిజంగానే మనం వెళ్తామా? ఎక్కడికో వెళ్తామని పొద్దున్న నుంచీ సుందరమ్మగారు చెప్తోంటే మధూ నమ్మలేదు. తను ఏడిచినప్పుడల్లా ఉత్తుత్తి అబద్ధాలేవో అలా చెప్తూనే ఉంటారు. కాని మేనా రావటం స్వయంగా చూసిన మధు నమ్మక తప్పలేదు. మేనాలో వెళ్తామనుకొంటే చాలా సరదా వేసింది.

సంస్థానంలో రాజయ్యగారి ఉద్యోగపు హోదా చిన్నదే అయినా జమీందారుల దృష్టిలో వారికి ప్రత్యేక స్థానముంది. రాజయ్యగారి పనితనం నిజాయితీ, జమీందారులకు స్వకులస్థులపై ఉన్న అభిమానం ఆయన పలుకుబడికి కారణమయ్యాయి. మగవారి స్నేహభావాలను అర్థం చేసుకునే జమీందారిణి శ్యామసుందరీదేవి రాజయ్యగారి కుటుంబంతో బాంధవ్యం ఉంచటానికి ప్రయత్నిస్తుంది. జమీందారిణి పుట్టినరోజు వేడుకకు సుందరమ్మగారికి ప్రత్యేక ఆహ్వానం వచ్చింది.

కూతురి మరణానంతరం కంటి తడైనా ఆరకుండా వీధి మొహం చూడటానికి ఇష్టంలేని సుందరమ్మగారు నిగర్వి, దయామయి అయిన జమీందారిణి అభిమానంతో పంపిన ఆహ్వానం తిరస్కరించలేక ప్రయాణానికి సిద్ధపడక తప్పలేదు.

మధు హుషారుగా కొత్త చొక్కా తొడుక్కుంటూ "నువ్వు కూడా తొడుక్కోవేంరా అన్నయ్యా?" అన్నాడు "వాడు వద్దు నాయనా! నిన్ను తీసుకు వెళ్తాను. అందరూ వెళ్తే బావుంటుందా?" అంది సుందరమ్మగారు.

"అదేమిటి? పాపం అన్నయ్య చూడద్దూ?" పొద్దున్న అమ్మమ్మ చెప్పినమాటలు జ్ఞాపకం ఉండనే వున్నాయి సూర్యానికి: "నేను రానురా తమ్ముడూ! బోలెడు పాఠాలు చదువుకోవాలి. లేకపోతే మేష్టారు కొడతారు. అమ్మో, దెబ్బలు తినమా?" అన్నాడు తనకు రావటమే ఇష్టంలేనట్టు. నడివీధిలో పిల్లలందరిమధ్యా తను ఒక్కడే మేనాలో ఎక్కి కూర్చోవటంతో మధుకి చాలా గర్వం కలిగింది. నవ్వుతూ మేనా అద్దా

లోంచి పిల్లలందరికేసి చూశాడు. ఇన్ని రోజులకి మనవడి మొహం మీద నవ్వు కన్పించటంతో సుందరమ్మగారు మధుని దగ్గిరికి తీసుకొంది.

"మనం ఎక్కడికి వెళ్తున్నాం అమ్మమ్మా? ఎందుకూ? మరి ఈ మేనా వాళ్ళదేగదూ? వాళ్ళ ఇల్లు ఎలా వుంటుంది?" అంటూ చాలా ప్రశ్నలు వేశాడు మధు అన్నింటికీ సుందరమ్మగారు సమాధానాలు చెప్పి— "అక్కడ నువ్వు అల్లరి చెయ్యకూడదు సుమా! అమ్మ గుర్తు వచ్చినా ఏడవ కూడదు. బుద్ధిగా వుంటావు కదూ?" అంది. మధు అంగీకరిస్తున్నట్టు తలవూపాడు.

"అమ్మమ్మా! మరి మనం ..." మనవడు మాటిమాటికీ పలకరిస్తోంటే సుందరమ్మగారు ముక్కుమీద వేలు ఉంచుకొని. "ష్! మనం బజారులోంచి వెళ్తున్నాం. ఇలా మాట్లాడుకొంటూంటే అందరూ వినరూ? తప్పు మాట్లాడకూడదు." అంటూ మందలించింది. మధు అమ్మమ్మని ప్రశ్నలు వేయటం మాని మేనా అద్దాల్లోంచి బయటికి చూస్తూ కూర్చున్నాడు. మేనా దివాణాన్ని సమీపిస్తోంటే సుందరమ్మగారు నెమ్మదిగా అంది — "మనం వారి మేడ దగ్గిరికి వచ్చేస్తున్నాం." అద్దాల్లోంచి సింహద్వారం కన్పించింది.

ద్వారం పైన ఆర్చిమీద రెండు నల్లని పోత సింహాలు నిగనిగలాడు తున్నాయి. ద్వారానికి రెండువైపులా ఖాకీబట్టలు కట్టుకున్న ఇద్దరు సిపాయిలు బళ్ళేలు పుచ్చుకొని నిలబడి వున్నారు.

"అమ్మమ్మోయ్!" గట్టిగా అరవబోయిన మధు నోరు చటుక్కున మూస్తూ మందలించింది సుందరమ్మగారు — "తప్పు కదూ? అంత గట్టిగా అరుస్తారా? మనం జమీందారు గారింటికి వెళ్ళిపోతున్నాం. అక్కడ అసలే మాట్లాడ కూడదు."

మేనా సింహద్వారం దాటి అందమైన చెట్లలోంచి వెళుతోంటే ఆశ్చర్యంగా చూస్తూ కూర్చున్నాడు మధు. మధ్యగా దారి ఇస్తూ కరివేపాకు చెట్లూ, గన్నేరుచెట్లూ పచ్చగా ఎర్రగా విరగబూసి ఉన్నాయి. వాటి మధ్య మధ్య కొబ్బరి చెట్లూ, జీలుగు చెట్లూ ఠీవిగా నిలబడ్డాయి.

"అమ్మమ్మా! ఎన్ని చెట్లో! ఎన్ని పువ్వులో!" హితబోధ మర్చిపోయిన మధు సంభ్రమంగా అరిచాడు. సుందరమ్మగారు కళ్ళెర్రజేసి నిశ్శబ్దంగా కోప్పడింది. మధుకి చిరాకు వేసింది. గట్టిగా అరచుకొని మాటాలాడు కోకుండా ఈ నిర్బంధం ఏమిటి? ఇబ్బందిగా మొహం పెట్టుకు కూర్చున్నాడు.

మేనా కోట గుమ్మం వరకూ వెళ్ళి అతవారి లోగిళ్ళ కేసి మళ్ళింది దారిలో అక్కడక్కడా నీళ్ళు చిమ్ముతున్న గొట్టాలు కన్పించినా చూడటం తప్ప మధు మాట్లాడలేదు. మనవడి ఉదాసీనత గ్రహించిన సుందరమ్మగారు ప్రేమగా మధు వీపు నిమిరి వోదార్చింది.

పక్కని మేడ ముందు మేనా ఆగటంతో ఒక దాసి మేనా తలుపులు తెరిచి సుందరమ్మగారికి నమస్కరించి మెట్ల వైపుకు దారి చూపించింది.

అందమైన ఆ మేడలో ఏది చూసినా మధుకి ఆశ్చర్యమే కలిగింది. మేడ మీద విశాలమైన గదులున్నాయి. గుమ్మాలకూ కిటికీలకూ కట్టిన తెల్లని తెరలు గాలి విసుర్లకి ఎగిరెగిరి పడుతున్నాయి. నేల కనిపించకుండా గదులన్నిటిలోనూ రంగు రంగుల తివాచీలు పరిచి ఉన్నాయి. విశాలమైన గోడలమీద పెద్ద పెద్ద చిత్రాలు - బల్లల మీద పూలకూజాలూ ఎంతో మనోహరంగా ఉన్నాయి. కథలో రాకుమారుడు దేవ లోకంలో ప్రవేశించినట్టు మధు సంభ్రమ ముగ్ధుడై కళ్ళు విశాలం చేసుకుని ఇల్లంతా పరికిస్తూ అమ్మమ్మ చెయ్యి గట్టిగా పట్టుకొని నడవసాగాడు.

"పాపం అన్నయ్య కూడా వస్తే ఎంత బావుండును!" మధుకి దిగులు వేసింది

జమిందారిణి శ్యామసుందరీదేవి చిరునవ్వుతో ఎదురు వచ్చి సుందరమ్మ గారికి నమస్కరించింది.

"నమస్కారం తల్లీ!" సుందరమ్మగారు తిరిగి చేతులు జోడిస్తూ, "అమ్మగారికి నమస్కారం పెట్టు బాబు!" అంటూ మనవడితో కూడా దణ్ణం పెట్టించింది. మధు సిగ్గుగా చేతులు జోడిస్తూంటే శ్యామసుందరీదేవి నవ్వింది. మధుకి ఆవిడిన్ని చూస్తోంటే మతి పోయింది.

జమిందారిణి శరీరం నిండా నక్షత్రాల రాశి పోసుకున్నట్టు దగ దగ మెరిసిపోయే రాళ్ళ నగలే అలంకరించు కొంది. చేతులకు నిండుగా రాళ్ళ గాజులూ - మెడలో రాళ్ళ గొలుసులూ - నడుంచుట్టూ నక్షత్రాల వడ్డాణం - కాళ్ళకుకూడా రాళ్ళ పాంజేబులు - వేళ్ళకి ఉంగరాలు - ఆడవాళ్లకు అన్ని నగలు ఉంటవచ్చునని కూడా తెలియదు మధుకి. ఆవిడ జానెడు జల్తారు అంచు గల ఎర్రని పట్టుచీర కట్టుకొంది. చీర మీద జల్తారు పువ్వులు అక్కడక్కడా మిడిసి పడుతున్నాయి. ఆవిడ వెంట్రుకలముడి పెద్దదిగా అందంగా ఉంది. ముడి చుట్టూ ఒకే మాదిరి తెల్ల గులాబీలు వికసించి ఉన్నాయి — దేవతల్లాగా అత్యంత సుందరంగా ఉన్న శ్యామసుందరీ దేవిని అలా ఎన్ని గంటలైనా చూడగలడు మధు.

రావలసిన పేరంటాళ్ళంతా ఎప్పుడో వచ్చి వెళ్ళిపోయిన గుర్తులు కన్పించాయి. తివాచీమీద ఒలికిన అక్షింతలూ, పూరేకులూ ఒక దాసి నెమ్మదిగా ఎత్తుతోంది. శ్యామసుందరీదేవి మేజామీది వెండి పళ్ళెంలోంచి బంగారు కుంకుమ భరిణె అందుకొని సుందరమ్మగారికి స్వయంగా బొట్టు పెట్టింది.

"మేము రావటం బాగా ఆలస్యమైందమ్మా!" అంది సుందరమ్మ గారు నొచ్చుకుంటున్నట్టు.

"లేదు పిన్నిగారూ! మేనా ఆలస్యంగానే పంపించాము. నిలబడే ఉన్నారు. అలా కూర్చోండి." అంటూ కుర్చీలు చూపించింది శ్యామ సుందరీదేవి.

"ఫర్వాలేదు. తల్లీ! అంటూ సుందరమ్మగారు మనవణ్ని దగ్గిర పెట్టుకొని తివాచీమీదే కూర్చుంది. కుంకుమ భరిణె యథాస్థానంలో సర్ది వెను దిరిగి శ్యామసుందరీదేవి .. "అదేమమ్మా క్రింద కూర్చున్నారు? మీ పట్టింపులు మీరు మానరుకదా?" అంటూ తానుకూడా సుందరమ్మగారికి ఎదురుగా కూర్చుంది. వచ్చిన మొదలు కన్నార్పకుండా తననే చూస్తున్న మధుని నవ్వుతూ పలకరించింది. —

"ఏమిటయ్యా అలా చూస్తున్నావు? కొత్తగా ఉందా?"

మధు సిగ్గుపడి తల దించేసుకున్నాడు.

"నీ పేరేమిటయ్యా ?"

మధు కొంచెం ధైర్యం తెచ్చుకున్నాడు. "మధుసూదనరావు."

"తల దించుకునే మాట్లాడుతున్నావేం ?" నవ్వింది శ్యామసుందరీ దేవి.. "నీ పేరు ఎంతో చక్కగా ఉంది. మరి ఏం చదువుకొంటున్నావు."

మధు కొంచెం తల ఎత్తాడు — రెండో తరగతి."

"అబ్బా! అప్పుడే రెండో తరగతి చదివేస్తున్నావా ? బావుంది. నీకేమైనా పాటలవీ వచ్చునా ?"

"నాకు బాగా రావు. మా అన్నయ్యకైతే ఎన్నో వచ్చు."

"పోనీ నువ్వు కూడా నేర్చుకో."

"ఏం నేర్చుకోవటం తల్లీ! దిగులుతో ఆడుకోవటం కూడా మానేశాడు. ఎప్పుడూ అమ్మా అమ్మా అంటూ ఒకటే ఏడుపు" అంది సుందరమ్మగారు.

"అవునట పిన్నిగారూ! మేమూ విన్నాము. ఈ వయస్సులో ఓటు తీరని కష్టం వచ్చింది. పిన్నవాడికే విచారం కలుగుతోంది కదా ?" శ్యామసుందరీదేవి సానుభూతితో సుందరమ్మగారి కళ్ళలో నీళ్ళు తిరిగాయి — "తల్లి పోతే మాత్రం లక్షణంగా బ్రతికేవాళ్లు ఎంతమంది లేరు తల్లీ ? తండ్రి పరారీ కావటం — ఆ ఆస్తిపాస్తులు అమ్ముడు పోవటం చూస్తూండగానే పసివాళ్ళు అనాథలై పోయారమ్మా !"

"విచారించకండి పిన్నిగారూ! మీరు ఉండగా పిల్లలు అనాథలెందుకవుతారు ? భగవంతుడి నిర్ణయాలను మనం మార్చలేము కదండీ ? మీరిద్దరూ పది కాలాలపాటు చల్లగా ఉండి పిల్లల్ని పెంచి పెద్దచేస్తే మంచి చదువులు చదువుకొని ఉద్యోగాలు చేసుకుంటారు. ఆస్తిపాస్తులకేముంది ఉండనూ ఉంటాయి — పోనూ పోతాయి."

"అలాగే ఆలోచించి కాస్త గుండె నిబ్బరం చేసుకున్నాను తల్లీ! వీళ్ళ తాతగారు మాత్రం లోలోపల కృశించి పోతున్నారు"

చిన్నమ్మాయి నెమ్మదిగ తల్లి నేదో అడిగింది. శ్యామసుందరీదేవి నవ్వుతూ — "నేను చెప్పటం దేనికీ? నువ్వే అడగరాదూ?" అంది. ఆ పిల్ల సిగ్గుపడకుండా మధుకేసి చూస్తూ— "నాపేరు రాగిణీరాణి, నీపేరే మిటి?" అంది.

మధూ సిగ్గుతో తల తిప్పేసుకున్నాడు. శ్యామసుందరీదేవి మధు తలమీద చెయ్యివేస్తూ అంది - "ఆడపిల్ల సిగ్గులేకుండా మాట్లాడితే నీకు సిగ్గెందుకు బాబూ? నువ్వు మగపిల్లవాడివికదూ? ధైర్యంగా చక్కగా మాట్లాడాలి. మరి నీపేరు చెప్పు!"

మధు రాగిణివైపు చూస్తూ అన్నాడు — "నాపేరు మధుసూదన, మా అన్నయ్యపేరు సూర్యారావు."

శ్యామసుందరీదేవి నవ్వింది — "అబ్బో! బాగా ధైర్యం తెచ్చుకున్నావే! ఇదిగో! పెద్ద అమ్మాయి పేరు పద్మావతీదేవి. నువ్వు మీ తాత గారితో కలిసి రోజూ ఇక్కడికి వస్తే మీరు ముగ్గురూ కలిసి ఆడుకోవచ్చు. వస్తావ్కదూ?"

మధుకి ఏమీ అర్థంకాలేదు. అంత గొప్పగా ఉన్న ఆ అమ్మాయిలతో తను ఎలా ఆడుకుంటాడు? సంతోషంమాత్రం మితిమీరింది. "అంత అందమైన అమ్మాయిలిద్దరూ తనని ఆడుకోటానికి రానిస్తే ....! ఎంత బావుంటుందనీ!"

"ఎందుకమ్మా మీకు శ్రమ? వీ డసలే దుడుకువాడు. నానా అల్లరీ చేస్తాడు-" సుందరమ్మగారు అన్నదానికి "అయ్యో! అదేమిటి పిన్నిగారూ! అల్లరి పిల్లలు చేయకపోతే మనం చేస్తామా?" అంటూ నవ్వింది శ్యామ సుందరీదేవి. అంతలో దాసీ క్కొన్ని పళ్ళేలతో రకరకాల మిఠాయిలు తెచ్చి అమర్చింది. లడ్డూలూ, జిలేబీలూ చూస్తోంటే మధూ హృదయంలో తండ్రి మెదిలాడు. తండ్రి బస్తీనుంచి తెచ్చే మిఠాయిలు సంచుల్లో వేసుకొని బళ్ళోకి తీసుకువెళ్ళి గొప్పగా స్నేహితులందరికీ పంచటం గుర్తువచ్చింది. ఒకసారి మేష్టారికికూడా లడ్డూలు ఇచ్చాడు మధు.

"తినవేమోయ్? సిగ్గుపడుతున్నావా?" శ్యామసుందరీదేవి ఎంత అనునయించినా మధూ ఎక్కువ తినలేకపోయాడు. తిన్నాననిపించిం'ది

సుందరమ్మగారు- తిరిగి వెళ్ళటానికి సిద్ధమైతే మేడదిగి వచ్చింది జమీం దారిణి. ఏవేవో తినుబండారాలూ, పళ్ళూ పసుపు, కుంకుమలూ అన్నీ పెద్ద బుట్టతో మేనాలో పెట్టించింది.

ఎన్నిరోజులైనా అక్కడే ఉండిపోతే బావుండు ననిపించింది మధుకి. తిరిగి వచ్చేస్తుంటే — "అమ్మమ్మా! నేను రోజూ వచ్చి ఆడు కుంటానే." అన్నాడు ఆశగా. "అలాగే" అంది సుందరమ్మగారు. జమీందారిణిని చూచినప్పటినుంచి మధూ మనసులో ఎన్నో ఆలోచనలు చెలరేగుతున్నాయి. "అమ్మమ్మా! ఆ అమ్మగారికి అన్ని బంగారం నగలు ఎక్కడివి ?"

"ఆవిడకే ఉన్నాయమ్మా !"

"మరి నీకు లేవేం ?"

"వారు చాలా ధనవంతులు, డబ్బు చాలా ఉంది? అందుకే న చేయించుకున్నారు. మనకు అంత డబ్బు ఎక్కడిది?"

"మరి వాళ్ళకుమాత్రం ఎక్కడిది ?"

"మొదటనుంచీ జమిందారుగారి నాన్నగారూ, తాతగారూ అంతా సంపాదించి ఇచ్చారు."

"మనకు ఎవరూ ఇవ్వలేదా ?"

సుందరమ్మగారు జవాబు చెప్పలేకపోయింది. మాట మారుస్తూ— "ఇక్కడ ఆడుకోవటానికి వస్తే అల్లరి చెయ్యకూడదు సుమా! బుద్ధిగా ఉంటే రోజూ రానిస్తారు" అనటంతో ఉత్సాహంగా తలవూపాడు మధు.

* * *

పద్మావతి, రాగిణిలతో కలసి మధు తోటలోకి వచ్చాడు. జమీందా రుల తోటను చూస్తోంటే మధుకి విస్మయం కలిగింది. తాతగారి వూళ్ళో కూడా తోట వుందిగాని యిన్నిరకాల చెట్లతో యింత పెద్దదిగా లేదు. క్కడి తోటనిండా మామిడి - పనస .. నారింజ - బత్తాయి - నిమ్మ - మ్మ - జామ - సపోటా అన్నిరకాల పళ్ళచెట్లూ ఏపిమిడిగా ఉన్నాయి.

చెట్లక్రింద నడుస్తూ తెలీనిదల్లా అడగటం ప్రారంభించాడు మధు. "ఈ చెట్టు పేరేమిటి? అక్కడదటన్న స్తంభం అదేమిటి? ఈకొమ్మ ఎందుకు విరిగింది?" — మధు అడిగేదానికి అక్కచెల్లెళ్ళిద్దరూ పోటీపడ్డట్టు సంశయాలు తీర్చసాగారు. ఒక్కోసారి మధు అడగకుండానే — ఇదిగో ఇది బంబూ ముబగ, అది అనూరం. దానిపక్కనే చూశావా గులాబ్ బామ్ .. ఎంతో బావుంటుందిలే" అంటూ వివరించారు.

స్తంభాలనిండా అల్లుకున్న ద్రాక్షతీగలదగ్గర ఆగిపోతూ పద్మావతి అంది — "ఎప్పుడైనా ఈ పళ్ళు చూశావా మధు బాబూ ?"

మధు అడ్డంగా తల వూపాడు. ద్రాక్షపళ్ళు తిన్నాడుగాని ఇంతింత గుత్తులుగా వ్రేళ్ళాడటం చూసి ఉండలేదు. విస్మయంగా ద్రాక్ష గుత్తుల వేసి చూస్తూ అన్నాడు— "నేను ద్రాక్షపళ్ళు చాలాసార్లు తిన్నాను."

"మీ ఇంట్లో ఉన్నాయా ?" రాగిణి అడిగింది.

"లేకపోతేనేం ? మా నాన్న బస్తీనుంచి తెచ్చేవాడు కదా !"

"మీ నాన్నగారు ఇప్పుడు లేరు కదూ ?"

"పోనీ ! మా తాతయ్య లేడా ఏమిటి ?"

"పాపం మీ అమ్మగారు చచ్చిపోయారట కదూ ?"

మధు అదోమాదిరిగా మారిపోయాడు. పద్మావతి చెల్లెల్ని మందలించింది. "తప్పుకదూ ? అటువంటి మాటలేవీ అడగవద్దని అమ్మ చెప్పలేదూ ? రా మధుబాబూ ! ఒకటి చూపిస్తాను" అంటూ మధు చెయ్యి పట్టుకొంది. రాగిణి మాటలతో కుంచించుకు పోయిన మధు కొంత సేపు గాని పద్మావతితోపాటు నడిచాడు. రంధ్రాలలోంచి చుట్టూ నీరు చిమ్ముతున్న జలయంత్రాన్ని చూస్తూ చిగులు మర్చి సంతోషంగా నీళ్ళ ధారల లోకి చేతులు జాపాడు.

"దీన్ని పౌంటెన్ అంటారు. మీ ఇంట్లో లేదుకదూ ?" రాగిణి పసితనపు అతిశయంతో.

"పౌంటెన్" మధు మననం చేసుకున్నాడు.

"కాస్సేపు కూర్చుందామా మధుబాబూ ?" అడిగింది పద్మావతి. ఒక దాసిని పిలిచి ద్రాక్షగుత్తులు కోయించింది. తోటలో చెట్లకి ఏవో పళ్ళు ఉంటనే ఉన్నాయి. ద్రాక్షపళ్ళు అందిస్తూ ఇంకేం కావాలో తరచి తరిచి అడిగి మధు కోరినవన్నీ కోయించింది. అన్ని పళ్ళచెట్లు తనముట్టూ ఉండి కావాలన్న పళ్లన్నీ కోసుకు తినేస్తూంటే — "మాంత్రికుడూ — మామిడిచెట్టూ" కథలా చిత్రంగా ఉంది మధుకి.

"ఇక పూలతోట వైపు వెళదామా ?"

"ఎక్కడ ?"

"అదిగో, అటువైపు, నీకు పువ్వులంటే ఇష్టమేనా ?"

"నేను పెట్టుకోనుగా ?"

"పోనీ ఊరికినే చూద్దాం." రాగిణి ముందే పరిగెత్తింది. ఆ తోట మధ్య నడుస్తోంటే మధూ కళ్ళు చెదిరి విభ్రాంతిపడ్డాడు- "అబ్బ! ఎన్ని పువ్వులో! ఎన్ని రంగులో!" అంటూ సంభ్రమంగా చూశాడు రాగిణి కేసి.

"నువ్వు ఎప్పుడూ చూడలా ?"

రంగురంగుల గులాబీలూ- చేమంతులు- మందారాలు ఒక్కో రకం పువ్వులే అనేక రంగుల్లో మెరిసిపోతున్నాయి. మధు ఎన్నడూ చూడని పువ్వులే ఎక్కువగా ఉన్నాయి. "ఈ మందారం ఏమిటి ? ఇంత పెద్దదిగా ఉంది ?"

"ఆ నీలం పువ్వుల పేరేమిటి ?"

"చేమంతిపూలు మరీ ఇంత బుర్రిగా ఉన్నాయేం ?" మధుబాబుకి చాలా సందేహాలు వచ్చాయి.

"తొందరగా నడు మధుబాబూ ! ఇంకా కొత్త పువ్వులు చూపిస్తాను. పారిజాతం పువ్వులు చూశావు కదూ అక్కడ ?"

నడుస్తూ నడుస్తూ తెల్లగులాబీల దగ్గర ఆగిపోయాడు మధు. ఆ పువ్వులు శ్యామసుందరీదేవి పెట్టుకున్నప్పుడు మధుకి ఎంతో నచ్చాయి.

"ఒక గులాబీ నేను కోసుకోనా ?" పద్మావతిని చూస్తూ సంకోచంగా అడిగాడు.

"నువ్వు పువ్వులు పెట్టుకోవుగా ?" ఆశ్చర్యంగా చూసింది రాగిణి.

"ఊరికే చేతిలో పట్టుకుంటాను" ఆశగా అన్నాడు మధు.

"కోసుకో మధుబాబూ ! జాగ్రత్త ముళ్ళు ఉంటాయి." – పద్మావతి అనుమతి ఇవ్వగానే మధు మొహం సంతోషంతో వికసించింది. ఒక పెద్ద పువ్వు కోసుకున్నాడు.

"ఇంకా కావాలా ?"

"వద్దు, ఈ ఒక్కటీ చాలు."

తోటంతా చాలాసేపు తిరిగాక విసుగ్గా అంది రాగిణి. "ఏదేనా ఆడుకుందామే అక్కా !"

పద్మావతికీ ఆడుకోవాలనిపించింది. "మధుబాబూ ! నీ కేవేనా ఆటలు వచ్చునా ?"

"ఓ బోలెడు వచ్చు. బొంగరాలూ, గోళీకాయలూ, గూటీబిళ్ళలూ, గాలి పటగలూ ...."

"ముందు బొంగరాలాట ఆడు. చూద్దాం –" కుతూహలంగా అంది రాగిణి.

"చెక్క బొంగరాలా ? మట్టి బొంగరాలా ?" ఠీవిగా ప్రశ్నించాడు మధు.

"మట్టివికూడా ఉంటాయేమిటి ? భలేగా ఉందే ! అవి ఎలా ఆడటం ?"

తనుకూడా వాళ్ళకు ఓ విషయం చెప్పగలడన్నమాట. మధుకి గర్వం కలిగింది– "మట్టి బొంగరాలే తెలీవా ? అవి నేను ఎంతో చక్కగా చెయ్యగలను. బాగా తిప్పగలను కూడా. అదిగో, ఆ గులాబీ మొక్క కింద మట్టి – బొంగరాలకు బాగా ఉంటుంది" – రివ్వున పరిగెత్తుకు వెళ్ళి దోసెడు మట్టి తీసుకువస్తూ అరిచాడు, "నీళ్ళు కావాలి–నీళ్ళు."

"అయితే ఫౌంటెన్ దగ్గరే కూర్చుందాం"

"సరే! పదండి."

"ఇంకా ఏం కావాలి?"

"గట్టి చీపురు పుల్లలూ — రంగు కాయితాలూ — కాకి బంగారం రేకులూ .... మరి ఎక్కడున్నాయి?"

"ఇప్పుడే తెప్పిస్తాను -" రాగిణి పరిగెత్తుకువెళ్ళి అన్నిటికి ఆజ్ఞాపించి వచ్చింది. మధు మట్టిని నీళ్ళతో తడిపి మెత్తగా ముద్ద చేశాడు.

"దీన్ని చిన్న చిన్న ఉండలు చెయ్యాలి."

"దాసీని పిలవనా? చేస్తుంది."

"వద్దు. మనమే చేసుకోవాలి. దాసీది ఆడుకోంటుందా ఏమిటి? ఇదిగో, ఇలా గోళీకాయల్లా చేయండి-" పద్మావతీ, రాగిణీరాణీ ఉత్సాహంగానే మట్టిఉండలు చేశారు.

"సరేనా? ఇప్పుడు చూడండి."

మధు ఉండలన్నీ రూపాయి బిళ్ళల్లా వత్తాడు. వాటి మధ్యనుంచి పొడుగ్గా చీపురు పుల్లలు గుచ్చాడు. మట్టి కన్పించకుండా అడుగున రంగు కాయితాలూ, పైన కాకిబంగారం రేకులూ అంటించాడు. పావుగంటకల్లా డజను బొంగరాలు తయారయ్యాయి. తళతళలాడుతూ ముచ్చటగా మెరిసిపోయాయి.

"ఇప్పుడు ఎవరి బొంగరం ఎక్కువ సేపు తిరుగుతుందో పోటీ వేసుకోవాలి." ఒక బొంగరం తీసి గిర్రున త్రిప్పి ఫౌంటెన్ గట్టుమీద వదిలాడు. అది గిర్రున తిరుగుతూ చాలాసేపు పడకుండా ఉండిపోయింది. రాగిణీకూడా హుషారుగా బొంగరం తిప్పింది. వదిలింది వదిలినట్టే పడి పోయింది. "నాకు సరిగ్గా నేర్పవు మధుబాబూ!" అంటూ ప్రాధేయపడింది.

...రం తెచ్చుకుని పద్మావతి వదిలిన బొంగరం దొర్లి వెళ్ళి ఫౌంటెన్ ... పడిపోయింది. ఇంకోటి తీసిస్తూ - "ఇదిగో ఇలా పట్టుకొని ఇలా ..." అంటూ మెళకువలు బోధించాడు మధు. పద్మావతి - రాగిణీ ...ఖు మళ్ళీ మళ్ళీ తిప్పారు. తప్పటం వచ్చేంతవరకూ ఆడారు.

రాగిణి పొంగరాలు నాలుగూ, పద్మావతివి రెండూ విరిగిపోయాయి. మధు తన దగ్గిర ఉన్నవి ఇద్దరికీ ఇచ్చేశాడు. అంతలో దాసి వచ్చి... "అమ్మగారు వచ్చెయ్యమంటున్నారమ్మా!" అంది.

"అబ్బాయిగార్నికూడా లోపలికి తీసుకు రమ్మన్నారమ్మా! ఫలహారం చేసి వెళ్తాడు," అంది మళ్లీ.

"ఇంట్లోకి రా మధుబాబూ! దాసితో జాగ్రత్తగా పంపిస్తాము." అంది పద్మావతి. మధు ఆటలాడిన దర్జా మర్చిపోయి సిగ్గుగా వాళ్ల వెనకే నడిచాడు.

* * *

మధుకి తరచూ జమిందారుగారి అమ్మాయిలతో తోటలో ఆడుకోవటం బాగా అలవాటైంది.

"అమ్మగారూ!" అంటూ శ్యామసుందరీదేవితో నిర్భయంగా కబుర్లు చెప్పటం, "అక్కయ్యా" అని చనువుగా పద్మావతిని పిలవటం చేతనైంది. జమిందారిణి ఆదరణ మధుకి పుట్టెడు బలం ఇచ్చింది.

మధుతో ఆడుకోవటం పద్మావతికీ, రాగిణికీ చాలా ఇష్టం. మధు ఎప్పుడూ క్రొత్త క్రొత్త ఆటలు నేర్చుకువచ్చి అక్కచెల్లెళ్ళిద్దరికీ నేర్పుతుంటాడు. తెల్ల కాగితాలలో గాలి పడగలుచేసి ఆకాశంలో ఎగరవేస్తాడు. పడవలూ, ఓడలూ చేసి నీటిలో వదులుతూంటాడు. ఇక గట్టి అట్టలతో—గుడ్డముక్కలలో — గాజుపూసలతో — దూది వుండలతో ఎన్నెన్ని రకాల పిట్టల్నీ, బొమ్మల్నీ చేయగలడో లెక్కలేదు. కొన్ని పిట్టలచేత కీచుకీచుమంటూ అరిపించగలడుకూడా! కర్రముక్కలతో మధు తయారుచేసే బళ్లు దబడబమని మోతచేసుకుంటూ నడుస్తాయి. ఇక దాగుడు మూతలలో మధు ఎప్పుడూ దొంగేకాడు. లేడీగలా ఎగిరిపోయే రాగిణికూడా మధుని అందుకోలేదు. పట్టుదల ఎక్కువై ఆయాసం వస్తూవున్నా పరిగెత్తుతూ "మధుబాబూ దొరికిపోవూ?" అంటూ ప్రాధేయ పడుతుంది. వచ్చిన ఆటలన్నీ పద్మావతికీ, రాగిణికీకూడా వచ్చు. ఆ ముగ్గురూ తోటలలో ఆడుకొంటూంటే ఎన్ని గంటలైనా గడిచిపోతాయి.

ఊళ్ళోకి ఏ గారడి వాడు వచ్చినా, ఏ ఆటగాళ్ళు వచ్చినా ఆ కబురు క్షణాలమీద పద్మావతికి చేరవేస్తాడు మధు. పద్మావతి వెళ్ళి తల్లిని అడిగితే ఆవిడ నౌకర్లను పంపించి ఆటగాళ్ళను రప్పిస్తుంది. వాళ్ళ విద్యలన్నీ చూసి తగిన విధంగా సత్కరించి పంపించి వేస్తారు.

సంస్థానం లోని విశేషాలన్నీ మధుకి చాల వరకు తెలుసు. జమీందారుగారికి కోతుల పెంపకం మహా సరదా. సంస్థానంలో ఆటలాడే కోతులు కూడా వున్నాయి. మధు అడిగిందే ఆలస్యంగా పద్మావతి నౌకర్లను ఆజ్ఞాపించి కోతులను తెప్పిస్తుంది. కోతుల ఆటలు చూడటం మధుకి మహా ఇష్టం.

వీధి పిల్లల్లో మధు పలుకుబడి బాగా పెరిగి పోయింది. ఆ పిల్లల వూహలకు కూడా అందని విషయాలు మధు గర్వంగా చెప్తోంటే వాడి చుట్టూ గుంపు పోగవుతుంది .. "జమీందారుగారి తోటలో ఎన్ని చెట్లు వున్నాయో మీకు తెలుసా? నాలుగువందలో, తొమ్మిదివందలో వుంటాయి. ఓహో! తెల్ల గులాబీలు ఎంత బావుంటాయనీ! అమ్మగారు ఎప్పుడూ అవే పెట్టుకుంటారు. పళ్ళూ, పువ్వులూ నా ఇష్టం వచ్చినట్టే కోసేసుకుంటాను. పద్మావతిదేవికీ, రాగిణీరాణికీ నేనే ఆటలన్నీ నేర్పాను. వాళ్ళిద్దరూ "మధుబాబూ! మధుబాబూ!" అని నా వెంటవెంటే తిరుగుతుంటారు. అక్కడ ఎప్పుడూ కొత్త కొత్త ఫలహారాలు తింటాను. ఎంత కమ్మగా వుంటాయనీ! నీళ్ళుకూడా చల్లగా సువాసన వస్తూ వుంటాయి. కోతులు గమ్మత్తుగా ఆడతాయి. భలే నవ్వు వస్తుంది నాకు. ఏనుగు దగ్గరికి వెళ్ళి నించోగలను. తొండంకూడా ముట్టుకుంటాను. అబ్బో మెత్తగా వుంటుంది. అస్సలు నాకు భయమే వెయ్యదు. అమ్మగారికి నేనంటే ఎంతో యిష్టం. అయ్యగారు కూడ అప్పుడప్పుడూ నాతో మాట్లాడుతారు. మొన్న నాకు కొత్త చొక్కాలుకూడా ఇచ్చారు. నేను వెళ్ళక పోతే నా కోసం దాసి వచ్చేస్తుందిగా." —

అలా గంటల తరబడి చెప్పగలిగే మధు చిన్న హీరో అయిపొయ్యాన్నాడు. వాడిస్నేహం అపురూపమై పోయింది. మధు కబుర్లలోని ఉత్సా

యోస్తలు పిల్ల లందర్ని నోళ్ళు తెరుచుకునేలా చేస్తాయి. ఒకసారి రాముా అన్నాడు.

"నువ్వు చూసినవన్నీ మాకు చూడాలని వుందిరా మధూ! మమ్మల్ని ఒకసారి తీసుకు వెళ్ళకూడదూ!"

"మిమ్మల్నా ?" మధుకి ఆశ్చర్యం వేసింది.

"మేమంతా నీ స్నేహితులంకామా ఏమిటి ? అమ్మగారు నీ మాట వింటారుగా ?"

పాపం మధుకి వాళ్ళమీద చాలా జాలి వేసింది. "అమ్మగార్ని అడిగి తీసుకు వెళ్తానురా !"

"నిజంగా ?"

"నిజంగానే అడుగులానుగా ?"

స్నేహితులకు మాట ఇచ్చాడే గాని మధు ధైర్యం చేసి పద్మావతిని మాటా అడగలేక పోయాడు.

జమీందారుగారు వేటకి వెళ్ళి పెద్దపులిని చంపి తీసుకు వచ్చారు. దాన్ని అందరూ చూడటానికి సింహ ద్వారం దగ్గిర పడుకో పెట్టారు. ఆ రోజు మధు స్నేహితులంతా తప్పకుండా తమని కోటలోకి తీసుకు వెళ్ళాల్సిందేనని పట్టు బట్టారు. మధు ధైర్యంగా అమ్మగారి దగ్గరకి బయల్దేరాడు. భయం భయంగా అడిగేశాడు — "అమ్మగారూ! మరండీ! మా స్నేహితులు .... ఒకసారి .... మన తోట చూపించమంటున్నారండీ! ఒకసారి .... చాలంటున్నారండీ !"

శ్యామసుందరీదేవి నవ్వింది — వివరంగా విషయమంతా అడిగి తెలుసుకొంది — "దానికేముందయ్యా! సాయంత్రం తీసుకువచ్చి అంతా చూపించు. నేను నౌకర్లకి చెప్తాలే."

"అక్కయ్యగారు కూడా ...."

"అలాగే అమ్మాయిలుకూడా వస్తారు. వెళ్ళే ముందు వాళ్ళనందర్నీ ఇక్కడికి తీసుకురా. ఫలహారం చేసి మరీ వెళ్తారు."

మధుకి పట్టరాని సంతోషం కలిగింది. వాడలా వీధిలోకి పరిగెత్తాడు.

మరొకరోజు జమీందారుగారికి ఎవరో స్నేహితులు చిన్ని ఏనుగు పిల్లని బహుమతిగా పంపించారు. దానిని చూట్టానికి కూడా మధు స్నేహితుల్ని తీసుకు వెళ్ళాడు.

శ్యామసుందరీదేవి ఊహించిన విధంగా మధు తల్లిదండ్రుల ధ్యాస మర్చి దిగులు మాని ఆరోగ్యంగా చురుకుగా మారిపోయాడు. బంతి ఆడుకొంటూన్న మనవణ్ని చూస్తే రాజయ్యగారి వేదనంతా పోయిన పించింది. కాని కొత్త చిక్కొకటి వచ్చి పడింది. ఆటలకు అలవాటై చదువుకి పూర్తిగా ఎగనామం పెట్టేశాడు మధు. బడికి వెళ్ళమని కేకలేస్తే తనం నేర్చుకున్నాడు. సూర్యం బ్రతిమలాడి తీసుకువెత్తే అక్కడ అల్లరి చేసి పక్కవాణ్ని వెంటేసుకొని ఇంటికి పరుగెత్తుకు రావటం ప్రారంభించాడు. పరిస్థితులు విషమించటంతో ఒకనాడు రాజయ్యగారు శ్యామసుందరీదేవి దర్శనం చేసుకొని మనవణ్ని గురించి వివరించి చెప్పారు — "వాడికి బొత్తిగా భయం లేకుండా పోయింది తల్లీ! పెద్దవాడు బుద్ధిగా చదువుకొంటున్నాడు గానీ వీడు ఎంత చెప్పినా వినటం లేదమ్మా! కాస్త తమరు మందలిస్తే ...."

"దానికేముంది బాబాయిగారూ! మధుబాబుకి బళ్ళోకెళ్ళటం యిష్టం లేకపోతే పోనివ్వండి."

రాజయ్యగారు అయోమయంగా చూశారు. శ్యామసుందరీదేవికి మగపిల్లలంటే కుతూహలం ఎక్కువ అది ఆవిడకు కొడుకులు లేకపోవటం చేతనే అవచ్చు. తెలివిగా చురుకుగా వుండే మధు పట్ల ఆవిడకు పుత్ర వాత్సల్యమే.

"అది కాదు తల్లీ! .." ఏదో అనబోయాడు రాజయ్యగారు.

"మధు బాబుని ఉదయం కూడా పంపిస్తూ వుండండి బాబాయిగారూ! ఇక్కడే చదువు కుంటాడు. అమ్మాయిలకు చెప్పటానికి మాస్టారు వస్తున్నారు కదా?"

రాజయ్యగారికి అమితాశ్చర్యంతో కొంత సేపు మాట రాలేదు.

"మరేమీ సంశయించకండి బాబాయిగారూ! ఇక్కడైతే శ్రద్ధగా చదువు కుంటాడు. చదువు పట్ల ఆసక్తి పుడితే ఎక్కడైనా ఫర్వా లేదు."

"అంతా తమ దయ తల్లీ!" రాజయ్యగారు లేచి నిలబడ్డారు. "వెళ్ళివస్తానమ్మా!"

శ్యామసుందరీదేవి వాత్సల్యంతో అంది — "చూడండి బాబాయి గారూ! మీకన్నా చిన్నవాళ్ళమైనా మీ పరిస్థితి చూస్తోంటే చెప్పక తప్పటం దు. మీరు చాలా నీరసించి పోయినట్టు కనిపిస్తున్నారు. అన్నీ అనుభ న పెద్దలు మీరే కష్టాలు సహించకపోతే ఎలా చెప్పండి. మీ మనుమ డా చక్కగా చదువుకొని పెద్దవాళ్ళవుతాడు. వాళ్ళ భవిష్యత్తు కేమీ ం లేదు. ముందు మీరు ధైర్యంగా వుండి పిల్లల్ని పెంచితే కదా? క బెంగ పెట్టుకోకండి బాబాయిగారూ!"

శ్యామసుందరీదేవి మందలింపుతో రాజయ్యగారు పసి పిల్లవాడిలా కన్నుల్లో బాధ వెళ్ళగక్కు కున్నట్టు. "ఏం చెయ్యను తల్లీ! మర్చి పోదా మంటే మరుపు రావటం లేదు. చెట్టంత కూతురు గంగలో కలిసి పోయింది. ఇంకా ఎంత కాలం నేను బ్రతికి వుంటాను తల్లీ! తర్వాత పసివాళ్ళు ఏమైపోవాలి? ఎంత మేనమామలైనా ఒక పేగు ఎడమే కదమ్మా! పోనీ చిన్నదాని బ్రతుకు చూద్దునా! లక్షణంగా కాపరం చేసుకోవాల్సిన వయసులో నవ్వులపాలై పోయింది. నేను బ్రతికి వుండగా చక్క బడుతుందో లేదో తెలియటం లేదమ్మా!"

శ్యామసుందరీదేవి ఏమీ మాట్లాడలేక పోయింది.

"పులిమీద పుట్రలా పసిదాని చింత ఒకటి వచ్చి పడింది తల్లీ! అందరిలాగే అదీ పెరిగితే లక్షణంగా వుండును. మూగదై పోయింది.

"ఎవరు బాబాయిగారు!"

"తల్లి పోగా బ్రతికిన చిన్నదమ్మా! రెండో ఏడు నడుస్తున్నా మాటా పలుకూ లేదు. మన మూగపిల్లల బడిలో వాళ్ళని చూస్తోంటే నా మనవరాలూ అలాగే అవుతుందే కాబోలని కడుపు తరుక్కు పోతోం దమ్మా!"

"బాబాయిగారూ! సుశీల మూగదా?" విస్తుపోయింది శ్యామసుందరీదేవి — "నిజంగా మూగదే అవుతుందంటారా?" అంది బాధగా

"అమ్మో తల్లీ! భగవంతుడికి దయలేదమ్మా!" నిట్టూర్చాడు రాజయ్యగారు

సుశీల మూగది కావటం శ్యామసుందరీదేవికి చాలా బాధ కల్గింది. సుందరమ్మగారి కోరికమీద "సుశీల" అన్న పేరు ఆవిడే పెట్టింది.

"ఇదంతా మా దౌర్భాగ్యమమ్మా! వాళ్ళ ఖర్మ ఎలా వుంటే అలా జరుగుతుంది. వెళ్ళి వస్తానమ్మా!" రాజయ్యగారు భుజాలు వంగిపోయి భారంగా నడిచి వెళ్తోంటే జాలిగా చూస్తూ నిలబడింది శ్యామసుందరీదేవి.

జమీందారుగారి ఇంట చదువు ప్రారంభించి మూడు నెలలు పైస్టు కాకపోయినా మూడవ తరగతి పూర్తి చేశాడు మధు. మధు తె తేటలు మాష్టారిని ఆశ్చర్యపరిచాయి. అతి వుత్సాహంగా చదివి గారి మెప్పు పొందటమే మధు వుద్దేశ్యమైపోయింది. మధు దినచర్య ఒక క్రమంలో పడ్డాయి.

* * *

సుధా, సుశీలా ఒకే వయస్సులో ఒక్క ఇంట్లోనే పెరుగుతున్నా ఇద్దరికీ ఏ విధంగానూ పొత్తు కుదరలేదు.

చూపులకు చందనపు బొమ్మవంటి సుశీల నోరు తెరిచి మాట్లాడ లేని మూగ జీవి. పెద్దపెద్ద కళ్ళతో సంతోషంగా విచారంగా బాధగా ఆశగా చూస్తూ వుంటుంది. ఆ చిన్నారి మనస్సులో ఏ అనుభూతి కల్గినా అది విస్పష్టంగా కన్నుల్లో ప్రత్యక్షమౌతుంది. సుశీలను ప్రేమించేవారికి ఆ పిల్ల మనోభావాలు సులభంగానే అర్థమౌతాయి.

నాలుగైదు నెలల స్థితిలో నవ్వించితే నవ్వటంగానీ, పలకరించితే చూపులు మరల్చటంగానీ చేసేదికాదు సుశీల. ఏదైనా శబ్దానికి వులిక్కి పడ్డట్టు — జోలపాటను వినగలుగు తున్నట్టూ తోచలేదు. ఒకసారి దీపావళి రాత్రి — టపాకాయల మోతకి వుండి వుండి వులిక్కిపడుతూ కేరు కేరు మంటూ సుధ ఏడుస్తోంటే సుశీల కమ్మగా నిద్రపోయింది. మరొకసారి జానకి పనిమీద నూతి దగ్గరకు వెళుతూ సుశీలను వుయ్యాలకి దూరంగా

కూర్చో పెట్టింది. జానకి వచ్చేసరికి సుశీల పొయ్యిలో మండుతున్న కర్రలు లాగటానికి సిద్ధంగావుంది పాకుతూ.

"సుశీ!" గావుకేక పెట్టింది జానకి.

సుశీల మండే కర్ర లాగనేలాగింది. జానకి కేకను విన్నట్టు కూడా లేదు. జానకి ఒక్కసారిగా సుశీలను గుండెకు హత్తుకుంటే అనుమానం వచ్చింది —

"సుశీకి మాటలు విన్పించటం లేదా?" — సుశీ మొహంలోకి తేరి పార చూసింది. సుశీల బోసిగా నవ్వింది.

అదే అనుమానంతో జానకి సుశీనీ, సుధనీ అనేక విధాల పోల్చి చూసింది. సుశీలకన్నా కొన్ని రోజులు మాత్రమే పెద్దదైన సుధ మనిషి [illegible] కళ్ళుతిప్పి చూస్తుంది. పలకరిస్తే కేరింతలు కొడుతూ నవ్వుతుంది. అస్పష్టంగా ఊసులు చెప్తూ మీదికి పాకుతుంది. కోపంగా కసిరితే చిన్నబోయిన మొహం వేసి ఏడుపు కుపక్రమిస్తుంది.

సుశీల పెరుగుదలలో మానసికంగా ఏ విధమైన చలనమూ లేదన్న సంగతి చూసేవాళ్ళకి స్పష్టంగా తెలిసిపోయింది. ఏడాది నిండేసరికి సుధ చిన్న చిన్న మాటలు మాట్లాడుతూ నడక నేర్చుకొంటే సుశీల ఏ విధం గానూ సుధ పెరుగుదలను అందుకోలేదు ... కాని ... పాలకోసం ఆతృత పడటం – ఎత్తుకోమని ప్రాధేయ పడటం.... సుశీల చూపులు వ్యక్తంచేసే భావాన్ని జానకి తేలికగా తెలుసుకోగలదు.

రెండో సంవత్సరంలో సుశీల శబ్దాలు వినగలుగుతున్నట్లు అర్థమైంది. పిలిస్తే చిత్రంగా చూసి నవ్వటం చేతనైంది. కాని . ఇక మాటలు రావనీ, సుశీ మూగదనీ నిర్ధారణ చేసుకొన్న జానకి [illegible] హృదయానికి గాఢంగా హత్తుకొంది —

"తల్లిదండ్రులకీ — సిరి సంపదలకీ దూరమైనా, సంపూర్ణమైన ఆరోగ్య భాగ్యమైనా లేకపోయిందా తల్లీ?" అంటూ ఏడ్చింది. సుశీలను ఒడిలో పడుకోబెట్టుకొని కళ్ళలోకి చూస్తూ గంటల కొద్దీ గడిపేది.

అత్తలు సుశీలను పలకరి
గానీ ఎన్నడూ లేదు.

కొంచెం పెద్దవాళ్ళయి ఆడుకోగ
కలిసి తిరగటం ప్రారంభించారు. సుధ అ
కంతటికి మహారాణిలాగ దర్జాగా తిరుగుతుం
వాళ్ళను అడ్డంపడి ఎత్తుకోమని మారాం చేస్తుంది
ముద్దుముద్దుగా కబుర్లుచెప్తూ గారాం చేస్తుంది.

సుశీలకు సుధ ఒక ప్రశ్నగా నిలిచింది. సుధ ఎందుకలా గంతుల
వేస్తూ తిరుగుతుంది? మావయ్యలను ఎందుకలా పలకరిస్తుంది? తనుకూడా
సుధలా లేదేం? తనకు గబ గబా మాటలు రావేం? మావయ్యలు తనని
ఎత్తుకోరేం?

సుశీల వేదన గ్రహించగలిగిన జానకి కూతుర్ని సంతోష పెట్ట
టానికి ఎన్నోవిధాల ప్రయత్నిస్తుంది. సుశీలకు సైగలద్వారా భావాలు వెల్ల
డించటం అతి సున్నితంగా పట్టుబడింది.

పండుగనాడు - కొత్త గౌను తొడుక్కున్న సంబరంతో సుధ ఇల్లంతా
పరుగులెత్తుతోంటే సుశీల సుధ వెనక వెనకే తిరిగి చివరికి తనూ గౌను
వేళ్ళలో చూపించింది — "నేనూ కొత్త గౌను తొడుక్కున్నాను చూడు"
అన్నట్టు.

సుధ నిర్లక్ష్యంగా నవ్వేసింది — "నీ గౌను ఏమీ బాగాలేదు. నాది
సిల్కు గౌను తెలుసా?" తన గౌను రెపరెపలాడించింది గర్వంగా.

తన గౌను సుధకు నచ్చలేదని అర్థమైపోయింది సుశీలకు. దీనం
చూస్తూ అలాగే నిలబడింది.

"మీ అమ్మని అడుగు, వెళ్ళు" అంది సుధ.

సుశీల కళ్లు తుడుచుకొంటూ మొహం చిట్లించుకొంది.
త్తిన కేసి చూపిస్తూ సంబరపడింది. జానకికి అంతా అర్థమై
దగ్గరకు తీసుకొని తల నిమురుతూ — "మనకు ఇంకా
లేదమ్మా! సుధ గౌనుకన్నా నీ గౌనే నాకు బావుం
అంది లాలనగా.

... ఆశగా చూసింది అమ్మకేసి—

...డవటం ప్రారంభించింది. కొంతసేపు
...సింది! సుశీల ఏడుపు మానలేదు. ఇంకా
...క కోపం వచ్చింది. — చెప్తే వినవు కదూ?"

...త్తె

"అమ్మా!" కెవ్వుమంది సుశీల.

"అమ్మా!" నిర్ఘాంతపోయింది జానకి. కోపం మరిచి మననం చేసుకొంది --- "అమ్మ . అమ్మా."

"ఎన్నాళ్ళకు పిలిచావే అమ్మా!" అంటూ కూతుర్ని గాఢంగా హత్తుకుంది హృదయానికి "సుశీల నన్ను అమ్మా అని పిలిచిందమ్మా!" అని తల్లికి ఉత్తరం కూడా రాసింది జానకి సంతోషంతో.

చిన్నపిల్లల మధ్య ఏర్పడే చెలిమి సుశీలా - సుధల మధ్య కూడా ఏర్పడక పోలేదు. సుశీలతో మాట్లాడటానికి దానికి అర్థమయ్యే విధంగా కాళ్ళు - చేతులూ తిప్పటంలో అనుకోని విధంగా సుధ కూడా కొన్ని సైగలు పట్టుబడిపోయాయి. ఒకసారి అన్నం తింటూ మంచినీళ్ళకోసం సైగ చేసింది. మరొకసారి తల దువ్వబోతే రెండు జడలు కావాలని వేళ్ళు పెట్టి అడిగింది. అలా నాలుగైదుసార్లు జరగటంతో ఇంట్లో అలజడి బయ లుదేరింది- "ఆ మూగపిల్లతో తిరిగి, ఇదికూడా మూగదైపోయేలా వుంది అమ్మ!" అంటూ కలవరపడి పోయింది సావిత్రి.

"అయితే కానూవచ్చు." తోటికోడలి అనుమానం నిజమే కావచ్చు ...గా చేసింది పార్వతి. కొన్నాళ్ళపాటు సుధని సుశీల దగ్గరికి ...న్నోవిధాల పోనపరిస్తేనే గాని వారి భయం తీరలేదు. సుధకి ...దో అసహ్యమైన భావం ఏర్పడిపోయింది సుశీల పైగివి. ...మాటలు రావు. దాని జట్టు పడితే తనుకూడా మాట్లాడటం ...పోతుంది. అందుకని దానితో కలిసి ఆడుకోకూడదు. ...కనా! చులకనా! "ఏయ్ మూగదానా!" అని ...టం సుధకి మహా సరదా! సుశీల దీనంగా ఏడు

స్తోంటే చప్పట్లు చరుస్తూ నవ్వటం ఎంతో ఇష్టం. జా మందలించినా సుధ చిలిపితనం తగ్గలేదు. ఒకసారి సుధ స రించటం జానకి చూసింది. కోపం పట్టలేక గట్టిగా ఒకటి అంటిం సుధ గావుకేకలు పెడుతోంటే — "అయ్యో! ఏమైందే? ఏమైంది?" అంటూ పరిగెత్తుకు వచ్చింది సావిత్రి. సంగతంతా తెలుసుకుని జాని మీద విరుచుకు పడింది — "వున్న మాటంటే వులుకేమరి. 'ఉన్నదాన్ని కాబట్టి తన్నగలిగావు. కూతురి మూగతనం ఎన్నాళ్ళు కప్పెట్టుకుంటావు?" అంది హేళనగా. జానకి మాట్లాడలేదు.

"ఆ పిల్లతో ఇది ఆడటం లేదనే వుక్రోషం కాకపోతే ఏమిటి? పిచ్చివాళ్ళతో మంచివాళ్ళెలా ఆడగలరూ?" అంటూ సాగదీసుకొంది మళ్ళీ. జానకి మరి ఊరుకోలేకపోయింది. "నీ కూతురితో ఆడుకోక పోతే ఇదేం చచ్చిపోదు. అస్తమానూ దాన్నలా వెక్కిరించి ఏడిపిస్తూంటే దాని మనస్సు బాధపడుతుందనే నేను చెప్పేది."

"అయ్యో విడ్డూరం! ఇంతోటి తెలివిగల పిల్లకీ మనస్సు నొ పడటం ఒకటీ!"

జానకి అక్కడ నిలబడలేక పోయింది. సుశీలను తీసుకొని జా చెట్టు క్రిందకు వెళ్ళి కూర్చుంది. న్నరా?

కొన్ని కొన్ని సామాన్య విషయాలు అందరికీ తెలిసే వుంటాయి. కాని వాటిని పాటించటంలోనే నీ-నా భేద భావాలు పైకి లేస్తాయి!

అంగవైకల్యాలతోగానీ-అవలక్షణాలతోగానీ పుట్టిన బిడ్డల్ని ప్రత్యేక శ్రద్ధతో, సానుభూతితో చూడాలి. ఎదుటివారి అదృష్టాన్ని చూసి అసూయ పడకుండా - తమని తామే అసహ్యించుకునే అవసరం రాకుండా పెంచి పెద్దచేయాలి — "నేను అందరిలా లేనంతమాత్రాన ఎందుకూ కొరగా కుండా పోను. నన్నుకూడా భగవంతుడే సృష్టించాడు. నాలో లోపాన్ని చూసుకొని నేను విచారించను. నావంటి వాళ్ళు సంతోషంగా సుఖంగా బ్రతకటానికి మార్గాలు వున్నాయి. ఈ విశాల ప్రపంచంలో నా పుట్టుక

...దు. భగవంతుని సృష్టిలో ఎండిపోయిన గడ్డిపోచకు ...మైన విలువ వుంది." అన్నంత ఆత్మ విశ్వాసం కల్గించాలి.

కాని దౌర్భాగ్యురాలైన సుశీలకు ఆ అనురాగమే లోపించింది. ఏదో విధమైన అవమానాలకు గురి అవుతూ ఆ పసిమనసు బండబారి పోయింది. ...మ్మ చీకటిని చెదరించే సూర్యకిరణంలా జానకి వాత్సల్యం ఒక్కటే ఆ మూగ మనసుని సంతోషపెట్టగలిగేది.

*                *                *

ఆ తల్లిలేని పిల్లల్ని చూసి విధి మరొకసారి వికటంగా నవ్వింది — రాజయ్యగారి మరణం హఠాత్తుగానే సంభవించినా, అది విన్నవారికి మాత్రం ఏమంత ఆశ్చర్యాన్ని కల్గించలేదు. కొద్దికాలంగా రాజయ్యగారిని చూస్తున్నవారు ఆ వార్త తొందరలోనే వినవలసి వస్తుందని అనుకోక పోలేదు. మనోవ్యధా పిశాచి రాజయ్యగారిని పూర్తిగా వశం చేసుకొని కొంతకాలంపాటు ఆయన బడుగు దేహంలో కాపురంజేసి, ఆయన్ని తన ...క్కి కొల్లి... ...గి కృశింపజేసి చివరికి తానే జయించింది — భోజనానికి ...టి ని మత్తు సోకినట్లు పక్కకు ఒరిగి పోయిన రాజయ్య ...రి కోరికలు చెల్లించుకున్న తృప్తికూడా మిగలలేదు.

సుందరమ్మగారి శోకం శత్రువునయినా కన్నీరు కార్పించగలిగేది. ...కి మంటికీ ఏకధారగా రోదిస్తూన్న ఆవిడను వోదార్చాలనే అభిమా...తో జమీందారిణి శ్యామసుందరీదేవి అంతస్థులు దిగి స్వయంగా ...చ్చింది. సుందరమ్మగారి దుఃఖం చూసి నోరువిప్పి మాట్లాడలేక ...విడ్ని పరామర్శించటానికి కూడా మనసు ఒప్పక మౌనంగా వుండి పోయింది.

మధుపట్ల అత్యంత అనురాగంతో తోచిన నిర్ణయం చేసుకొన్న శ్యామసుందరీదేవి దానిని సమయోచితంగా సుందరమ్మగారి ఎదుట వెల్ల డించింది. "చూడండి పిన్నిగారూ! ఎవరు వోదార్చినా తీరే దుఃఖం కాదు ఇది. మిమ్మల్ని విచారించవద్దని చెప్పటానికికూడా నాకు నోరు రావటంలేదు — మీరు అన్యథా భావించకపోతే ఒకమాట. మధుబాబు

గురించి మాత్రం ఏమీ దిగులు పడకండి." క్షణం ఆగింది శ్యామసుందరీ దేవి — "మధుబాబుని మా దగ్గిర విడిచి వెళ్ళండి. పెద్దవాడై మీ దగ్గరకే వస్తాడు. మీ బిడ్డ మీకు భారం కాదనుకోండి. మరేమీ అనుకోరనే నమ్మకంతోనే అడగగలిగాను."

సుందరమ్మగారు విభ్రాంతిగా చూసి తిరిగి కుమిలి కుమిలి ఏడవ సాగింది.

"ఇప్పుడు మీరేమీ చెప్పవద్దు పిన్నిగారూ! ఆలోచించి కబురు పంపించండి."

సుందరమ్మగారి కళ్ళనుంచి జలజలా కన్నీళ్ళు రా... చెత్తి జోడిస్తూ కంపిస్తున్న కంఠస్వరంతో అంది — "న... తల్లీ! మీకు నేనేమి చెప్పగలను?"

శ్యామసుందరీదేవి అర్థంకాక చూసింది - "ఫర్వా... మీ మనసులో మాట చెప్పండి. నా దగ్గిర మీరు జంకుతు...

"పిల్లవాడు మీ ఒద్దికలో మీ బిడ్డలాగే పెరుగుతాడు... తల్లీ! కాని .... మన్నించమ్మా! ఆ పసివాడిని విడిచి... లేను." కడుపులోమాట కాస్తా జారవిడిచి నిట్టూర్చింది సు... — "ఎన్ని జన్మలెత్తినా మీ ఋణం తీర్చుకోలేము తల్లీ! దర్శనం చేసుకొంటూనే వుంటాడు."

శ్యామసుందరీదేవి కించిత్తు ఆశ్చర్యపడింది. హృదయం చెదర గలిగి మారు మాట్లాడక మౌనంగా వుం... చురుగ్గా, తెలివిగా వుండే మధుని చదివించి పెంచి పెద్దచెయ్... శ్యామసుందరీదేవిని అంతవరకూ ప్రయత్నించేసింది. కాని... ధోరణి ఆమెను మరి అడగనివ్వలేదు — "నన్ను... అంటూ సుందరమ్మగారు దీనంగా ప్రాధేయపడుతోంటే ఆ... ...ర్తిగా వారించింది — "అయ్యో! మన్నించటానికేముంది... బిడ్డల్ని విడిచి వుండటం ... సాధ్యమా? అపార్థం చేసుకోకుండా ... మీ కోరుతున్నాను...

మనమణ్ని విడిచి వుండలేనని సుందరమ్మగారు చెప్పిన విషయం ఏమంత నిజమైంది మాత్రం కాదు. ఈనాడెంత దిక్కులేనివాడయినా మధు ఒకనాడు అపురూపంగా చూచుకునే తల్లిదండ్రుల అనురాగాలమధ్య అల్లారు ముద్దుగా పెరిగినవాడే శ్యామసుందరీదేవి దయార్ద్ర హృదయంతో చేర దీయవచ్చుగానీ, ఆ సంస్థానంలో వాడు అనాథుడే కదా? - అంతేకాదు స్వర్గీయులైన రాజయ్యగారు అభిమానధనులు. పిల్లవాడిని పరాయి వ్యక్తుల ...యా ధర్మాలకు విడవటం ఆయన ఎన్నటికీ అంగీకరించలేరు - "కలి ...తారు. లేదా పస్తులుంటారు. కంఠంలో ప్రాణం వుండగా పసి ...డిచిపెట్టను." - సుందరమ్మగారు దృఢంగా నిశ్చయించుకుని ...ంది.

* * *

...ంత విచిత్రంగానైనా మారిపోతుందనేది అనుభవించితే ... విషయం. ఈనాడు .... కీర్తిశేషులైన రాజయ్యగారి ... ఒక్కసారి పరిస్తే క్షణం విస్మయం కలగక మానదు. ...హయాంలో చల్లగా గడిచినకాలం చూస్తుండగానే మారి ...లంతోపాటు మనుష్యులూ మారారు మనుష్యుల విలువలూ

...డు సర్వస్వతంత్రురాలై గృహయాజమాన్యాన్ని స్వీకరించిన ...ు ఈనాడు కొడుకులనూ, కోడళ్ళనూ పనికిరాని పరాయి ...టుచేసినా తల్లిదండ్రుల ఆదరాభిమానాలతో తగిన గౌరవం ...డబిడ్డ జానకి ఈనాడు అన్నా వదినెలముందు ఒదిగి ...మాన్యురాలు!

...టికి జరిగిన సత్కారాలు ఆవిడతోనే అంతరించిపోగా ఈనాడు ... పరాయిపంచ చేరిన బిచ్చగాళ్ళు! తల్లిదండ్రులు లేని ...స్తిపాస్తుల్లేని దౌరా... ...తరం గడిపివేసుకున్న ...ర్భాగ్యవశాత్తూ ... ...వుకుగానీ - పరిస్థితు

"మధు తటపటాయిస్తూనే అన్నాడు — "కాదు అమ్మమ్మా! మన చెల్లి వుందిగా ..."

సుందరమ్మగారు మధు మొహంలోకి చూస్తూ అన్నారు — "ఆ జ్ఞానం మీ అమ్మకే లేకపోయింది నాయనా? ఇప్పు డేమనుకొంటే ఏం ప్రయోజనం?"

ఇక ఆ గొలుసుకోసం తను ఎంత ప్రయత్నించినా వీల్లేదు కాబోలు — మధు కొంతసేపు మాట్లాడకుండా నించుని వెళ్ళి పోయాడు.

మరొకసారి ....

లెక్కలు చేసుకుంటూన్న సూర్యాన్ని తొట్టినిండా నీళ్ళు తోడమం సావిత్రి. సూర్యం పుస్తకాలు సర్దుకో బోతూంటే — "నేను తోడతాన్లే అన్నయ్యా! నువ్వు రాసుకో." అన్నాడు మధు.

"వద్దు. నీకు చేతగాదు." సూర్యం పుస్తకాలన్నీ సంచిలోకి పెడ్తూంటే మధు నూతి దగ్గిరికి పరుగెత్తాడు. జామచెట్టు క్రింద సుశీల ఒక్కతే కూర్చుని గులకరాళ్ళతో బువ్వాలాట ఆడుకొంటూంది. మధు హుషారుగా చేద నూతిలో వేశాడు. ఎక్కడినుంచో బాంబులా పరుగెత్తుకు వచ్చిన సుధ గట్టిగా అరిచింది. — "ఏయ్ మూగదానా! ఇటు ఇటు."

మధు చటుక్కున తల తిప్పి చూశాడు. సుధ సుశీలను పడి పోయేలా ముందుకు తోసి వెక్కిరిస్తూ, సపోటా చెట్లకేసి పరుగెత్తింది — మధు గిలక మీది తాడు వదిలేశాడు. బోర్లాపడి ఏడుస్తూన్న చెల్లెల్ని లేప దియ్యలేదు. శరవేగంతో సుధ వెనకే పరుగెత్తాడు.

నీళ్ళతో నిండి పైకి వస్తూన్న చేద జర్రున జారి ఢాం మంటూ నీళ్ళలో పడి మునిగి పోయింది. ఆ శబ్దానికి బయటికి వచ్చిన సావిత్రి తన కళ్ళను తను నమ్మలేక పోయింది. మధు సుధ జడ గట్టిగా పట్టుకు నిల దీశాడు — "ఈ సారి మా చెల్లిని వెక్కిరిస్తావా? దానికి మాటలు రాక పోతే నీకేం? నీకు బాగా వచ్చుగా? ఇంకో సారి దాన్ని వెక్కిరిస్తే ఏం

చేస్తానో తెలుసా?" అంటూ జడ కాస్తా వూడి వచ్చేలా పైకీ కిందికీ వూపు తున్నాడు.

"ఏడ్! ఏమిటదీ? దాన్నెందుకు కొట్టున్నావ్?" సావిత్రి రెండం గల్లో వెళ్ళి పడింది. మధు అప్పటికీ సుధ జుట్టు వదల్లేదు. మరోసారి కసిగా వూపాడు.

"ఇంకోసారి వెక్కిరిస్తావా? చెప్పూ ?"

"అమ్మా!" అంటూ బావురుమంది సుధ. సావిత్రికి తగని కోపం వచ్చేసింది — "చాల్లే! వూరుకో."

విసురుగా మధుని తోసి హస్తుస్ని దగ్గిరికి తీసుకొంది. భయంతో బిక్కచిగిసిపోయిన సుధ తల్లిని కావులించుకొని ఏడ్చేసింది. సుధ జడ వూడి పోయి వెంట్రుకలన్నీ చిందర వందరగా చెదిరి పోయాయి. బంతి పూలు నలిగి కింద రాలిపోయాయి. సావిత్రి మధుకేసి చూస్తూ కోపంగా అడి గింది — "ఏమిటి నీ పెంకితనం? వూరుకొంటూన్న కొద్దీ మితిమీరి పోతు న్నావే! ఎందుకలా పిల్లని పుత్తపుణ్యానికి ...."

"అది మా చెల్లిని వెక్కిరించి తోసేసి పరిగుత్తుతోంది తెలుసా ?" ముసుసుగా అన్నాడు మధు

"ఓహో! ఇంతోటి అందకత్తెనీ వెక్కిరిస్తే ఏం నష్టం వచ్చిందీ ?" అంది సావిత్రి వెటకారంగా.

మధుకి మండి పోయింది — "మీ అమ్మాయిని రెండు తంతే ఏం నష్టం వచ్చిందీ ?"

సావిత్రికి ఉక్రోషం వచ్చేసింది — "గొప్పగా తయారవుతున్నా వులే. పులకమ్మ కడుపున దురదకాడ పుట్టిందట. ఆ మహాతల్లి కడుపున నువ్వేలా బయల్దేరావు బాబూ!" అంది శాసడింపుగా. గల్లంకునిని సుంద రమ్మగారు బయటికి వచ్చింది. సుధని మధు కొట్టి వుంటాడనీ, అందుకే కోడలు ఆర్భాటం చేస్తోందని పస్తానే గ్రహించింది. అయినా ఏమీ తెలీని దానిలా అడిగింది — "ఏమైందర్రా ?"

సావిత్రి రుసరుస లాడుతూ కూతురి జుట్టు సరిదిద్దుతూ - మాట్లాడ లేదు.

సుందరమ్మగారు మనవణ్ని అడిగింది — "నువ్వుగాని సుధని కొట్టావా ?"

"ఆఁ కొట్టాను. ఏం? వూరికే కొట్టానా? ముందు అదేకదా సుశీలని తోసి పరిగెత్తింది ?"

సావిత్రి కోపంగా చూసింది .. "చిన్నపిల్లలు ఏవో ఆడుకుంటారు. ఆటల్లో ఏడ్చుకుంటారు. అంత మాత్రానికి పిల్ల జుట్టంతా పీకి నిలదీస్తావా?"

"అసలు సుశి సుధతో ఆడనేలేదు. నీకు తెలుసా !"

"ఛీ? నీతో నాకు వాగుడేమిటి?" చీదరించుకొంది సావిత్రి .. "రావే వెధవముండా ! ఇంకా ఏడుపెందుకు ? ఆ పిల్లతో ఆడుకోపోలేనేం ? ఈ సారి వెళ్ళు. కాళ్ళు విరగ్గొడ్తాను." అంటూ కూతుర్ని విసురుగా లాక్కు పోయింది. సుందరమ్మగార్ని చూసి మధు కొంచెం జడిసినట్లు నిల బడ్డాడు.

"ఇలాంటి గొడవలు తేవద్దని నీకు ఎన్ని సార్లు చెప్పాను ? ఒక్క ఇంట్లో పిల్లలు అస్తమానూ దెబ్బలాడుకో వచ్చునా ?"

మధు నిర్దోషిలా అన్నాడు — "అదికాదు అమ్మమ్మా ! సుధ సుశీలని .."

"పోనీలే. సుధ మాత్రం చిన్నది కాదూ ? పాపం దానికి ఏం తెలుసు ? అత్తకి చెబితే మందలించేదిగా ?"

మధు తప్పు చేసిన వాడిలా తల దించుకున్నాడు.

"ఇంకెప్పుడూ సుధని కొట్టకమ్మా! అనవసరంగా నిన్ను చెడ్డవాడం టారు."

మధు మాట్లాడ లేదు.

ఇంట్లో వాడకానికి నీళ్ళులేవు. చేద పెళ్ళి మాతిలో కూచుంది. ఆ రోజు వంట వంతు పార్వతిది. నీళ్ళులేవు వంట ఆలస్య మవుతోందని

విసుక్కుంది. పక్కింటి వాళ్ల దగ్గిర చేదతెచ్చి నీళ్ళు తోడుకొని వంట చేస్తున్నంతసేపూ "పాడు పేళం — వెధవసౌద" అంటూ విసుక్కుం టూనే ఉంది. సుధ పెంకీగా విశ్వనాథయ్య భోజనానికి వచ్చే వరకూ ఏడుస్తూ కూర్చుంది.

"ఎందుకు తల్లీ ఏడుస్తున్నావు!" అంటూ విశ్వనాథం సుధను ఎత్తుకొని బుజ్జగిస్తోంటే పార్వతి సావిత్రి ద్వారా విన్న సమాచార మంతా ఏకరువు పెట్టింది. అసలు జరిగిన దానికి విశ్వనాథయ్యకు తెలిసిన దానికీ పోలికే లేకుండా పోయింది. మధ్య మధ్య బావ గారికి వినిపించేలా తలుపు చాటున నిలబడి సావిత్రి కూడా అందించింది. "సూర్యాన్ని నీళ్ళుతోడ నివ్వలేదు సరిగదా తను ఒక్క చేదడైనా తోడలేదు. అంతలోనే నూతిలో ఎత్తేసి పరిగెత్తాడు." సారాంశము — మధు బాగా పెంకితనం చేస్తూ పెద్ద వాళ్ళందర్నీ ధిక్కరిస్తున్నాడు. ప్రొద్దున సుధ ఏదో చేసిందని వంక పెట్టి దాన్ని బాదగొట్టి చెవులు మూశాడు. కేకలేస్తే ఎదురు తిరుగు తున్నాడు. నువ్వెంత అంటే నువ్వెంత అంటున్నాడు. కాబట్టి ఆ పిల్లవాడికి కాస్త మొగవాళ్ళ భయం ఉంటేనేగాని బావుండదు.

— విశ్వనాథానికి చాలా కోపం వచ్చింది. మధు గురించి చెప్పింది స్వయంగా తన భార్యే. పార్వతి ఎప్పుడూ అబద్దం చెప్పదు. — ఆ కోపంతో అరుగు మీద సుశీలకు కబుర్లు చెపుతూ కూర్చున్న మధు వెకగాన కగా వెళ్ళి చెవి పట్టుకు లేవదీశాడు. చెంప మీద ఛెళ్ళున చరిచాడు. నిర్ఘాంత పోయిన మధు బాధతో బావురుమన్నాడు.

"నోర్మూయ్! అల్లరి వెధవా? పెద్ద వాళ్లందర్నీ ధిక్కరించేంత మొనగాడివై పోయావేం? జాగ్రత్త! కాస్త కడుపులో భయం పెట్టుకు తిరుగు." విశ్వనాథం — మళ్ళీ చెయ్యి ఎత్తబోతే కెవ్వుమంది సుశీల. మధుని మరోసారి హెచ్చరించి లోపలికి వెళ్ళి పోయాడు విశ్వనాథం — వెక్కి వెక్కి ఏడుస్తూ నిలబడ్డాడు మధు. సుశీల దగ్గిరగా వెళ్ళి మధు చెయ్యి పట్టుకుంది. — ఏడవకన్నయ్యా!" సుశీల నేత్రాలు జాలిగా ప్రాథేయ పడుతున్నాయి.

మధు చొక్కాతో కళ్ళు ఒత్తుకుంటూంటే సూర్యం వచ్చాడు —
"ఏమైంది మధూ? ఏమైంది? ఏడుస్తున్నావా? ఎందుకురా?"

సుశీల చెంపమీద కొట్టుకొని చూపించింది.

"కొట్టారా? ఎవరు?"

చెయ్యి ఎత్తుగా పెట్టి చూపించింది.

"పెద్ద మామయ్యా? ఎందుకు?"

దానికేమీ జవాబు చెప్పలేక పోయింది సుశీల.

సూర్యం, మధు చెయ్యి పట్టుకొంటూ అడిగాడు — "మామయ్య నిన్నెందుకు కొట్టాడురా? ఏంచేశావ్?" మధు ఒక్కసారిగా సూర్యాన్ని కావిలించేసుకున్నాడు. "అన్నయ్యా? నేనేమీ చెయ్యలేదు. మామయ్య వూరికే కొట్టాడు —" అంటూ ఏడ్చాడు.

సూర్యం చాలా సేపు ఏమీ మాట్లాడలేక పోయాడు. మధు తలమీద చెయ్యివేస్తూ — "ఏడవకు తమ్ముడూ! అమ్మమ్మకి చెప్తాంగా?" అన్నాడు. ఆ సంగతి తెలిసినా సుందరమ్మగారు నిట్టూర్పటం తప్ప ఏమీ చెయ్యలేక పోయింది. జానకి మాత్రం కొంచెంసేపు బాధగా ఏడ్చుకొంది.

"ఆ సంఘటనతో సుధ మీద మధుకి చాలా కోపం పేరుకొంది. ఎప్పుడు కసి తీర్చుకుంటానా అన్నట్టు సుధకేసి ఎర్రగా చూశాడు.

* * *

ఆ రోజు పిల్లలంతా వీధిలో చింతచెట్టు కింద ఆడుకొంటూంటే మధు సుధని ఉద్దేశించి పరోక్షంగా వెక్కిరించాడు — "ఒరేయ్! హరీ! ఒక అమ్మాయిని చూశాను. అది ఉత్త అబద్ధాలకోరు. ఛీ! ఎన్ని అబద్ధాలు చెపుతుందో తెలుసా?"

"ఎవర్రా అది?"

సుధకేసి సైగచేశాడు మధు — "నీకు తెలీదురా? ఉందే. అచ్చం పండుకోతిలా ఉంటుంది. వెధవ పిలకజుట్టూ అదీనూ."

సుధ విసురుగా లేచి నిలబడింది పిలకజడ ఎగిరి పడేలా.

"తెలిసిపోయిందిరోయ్! నాకూ తెలిసిపోయిందిరోయ్!" ఉత్సాహంగా అరిచాడు హరి.

"దానిది ఉత్త కుళ్ళుబోతు గుణంరా."

"ఏయ్ బావా! నువ్వు నిన్నే అంటున్నావూకదూ!" ఉక్రోషంగా అడిగింది సుధ.

"నిన్నేంకాదు లేవోయ్? నువ్వే ఎర్రగా ఉన్నావా ఏమిటి" — మధు.

"నీకే పిలక జడ ఉందా ఏమిటి?" — హరి.

"అయినా ఒరే హరీ! ఆ పిల్లది మరీ చెడ్డ గుణంరా?"

"అవున్రోయ్! చాలా చెడ్డ గుణం."

"దానికి తొస్సి పన్నుకూడా ఉందిరోయ్."

సుధ పళ్ళు కెలుక్కుంది. నిజంగా మొన్న పన్నొకటి వూడిపోయిందిగా!

"ఆ పిల్ల అందంగానే ఉంటుంది కదరా?" — హరి అడిగిన దానికి ఒప్పేసుకోలేదు మధు — "ఆ పోదూ! సింగినాదం. అదిగో — ఆ చెపువ్వగట్టున ఏస్తోంది గాడిదపిల్ల - అందంగా లేదా ఏమిటి?"

"మధూ - హరీ అరచుకొంటూంటే "ఏమిట్రా?" అంటూ మరి నలుగురు పిల్లలు చేరారు.

"మధుగాడితో ఓ పిల్ల దెబ్బలాడిందిరా! అది అస్సలు మంచిది కాదు ...." వివరించాడు హరి సుధకేసి సైగ చేస్తూ. పిల్లలంతా "హో" మన్నారు.

"అలాగే. అలాగే. మా అమ్మతో చెప్తాను ఉండండి" — అంటూ పరిగెత్తింది సుధ. హరికి కొంచెం భయం వేసింది — "ఒరేయ్ మధూ మీ అత్త తిట్టదుట్రా!"

"ఓస్! ఎందుకు తిడుతుందేమిటి!"

"మరి మీ మామయ్య కొట్టడుట్రా!"

కొంచెం ఆలోచనలో పడ్డాడు మధు. సుధ వెళ్ళిందో లేదోనని చూశాడు.

సుధ పరుగెత్తుకు వెళుతోంటే సుందరమ్మగారు యెదురుపడింది. "ఏమిటే ఆ పరుగు? ఏమైంది?"

"చూడు నాయనమ్మా! బావ నన్ను వెక్కిరిస్తున్నాడు. నేను ఎర్రగా కోతిలా ఉన్నానట. నా జడ వెధవ పిలకలా వుందట. నేను అన్నీ అబద్దాలే చెపుతున్నానట."

సుందరమ్మగారు నవ్వింది — "అంతమాట అన్నాడూ? రానీ! నేను అడుగుతాను" — నాయనమ్మ వోదార్పు సుధకి చాలలేదు — "ఊహూ! నేను అమ్మకే చెప్తాను. అస్తమానూ నన్నెందుకు వెక్కిరించాలేమిటి?"

అంతలోనే మధు పరిగెత్తుకొచ్చాడు —

"ఉత్తనే అమ్మమ్మా! నేను సుధని అనలా. కావాలంటే హరిని అడుగు."

సుధ ఎగిరి పడింది. "నువ్వు నన్ను అనలా? ఎర్ర కోతిలా ఉన్నావనలా?"

"నువ్వు ఎర్రగా ఉన్నావుగానీ కోతిలా ఉన్నావా ఏమిటి? అందంగా ఉన్నావుగా?"

"నా జడ వెధవ పిలకలా ఉందన్నావుగా?"

"నీ జడ పిలకలా ఏం లేదు. ఎంచక్కా పొడుగ్గా ఉంది."

"నేను అన్నీ అబద్దాలే చెప్తాననలేదూ?"

"నిన్ను కాదే సుధా! మా క్లాసులో ఒక పిల్ల వుంది — అది అన్నీ అలాగే చెప్తుంది — అస్సలు నువ్వు అబద్దాలు చెప్పవుగా?" సుధని నమ్మించేసరికి మధుకి మంచి పోయింది ఒళ్లు.

"ఏమో! నేను మా అమ్మకే చెప్తాను." విసురుగా వెళ్ళిపోయింది సుధ. సుందరమ్మగారు సుధ చెయ్యి పట్టుకొని దగ్గరకు తీసి చూస్తూ— "నువ్వు ఎవరి నన్నావో నాకు తెలుసు. కానీ పాపం సుధ నీ పెళ్ళామేకదా,

పెళ్ళాన్ని అలా వెక్కిరించవచ్చునా? మొగుడూ — పెళ్ళాలు ఎక్కడేనా పెబ్బలాడుకుంటారా ?"

అప్పుడే వస్తూ సావిత్రి అత్తగారి మాటలు విని మొహం చిట్లించింది. — "గొప్ప మొగుడే దొరకాడు." సుందరమ్మగారు కోడలికేసి చూడబోతే సావిత్రి మొహం తిప్పేసుకుంది. సుధ వాళ్ళమ్మ వెనకే వెళ్ళింది. — ఎవరో మందలించినట్లు మధు అరుగు చివరి కెళ్ళి కూర్చున్నాడు — "సుధ నీ పెళ్ళాం కాదుట్రా ?" అని అమ్మమ్మ చాలాసార్లు అంటూ వుంటుంది. పెళ్ళాం అంటే పెద్ద మామయ్యకి పెద్ద త్తలాగ — చిన్న మామయ్యకి చిన్న త్తలాగానే కాబోలు. అసలు సుధ పుట్టి నప్పుడు అమ్మ "ఇది మా మధూ పెళ్ళామే" అందట. అందుకే దానికి గొలుసు కూట ఇచ్చేసిందట. పెళ్ళాం అయితే పోట్లాడుకోకూడదు కాబోలు. అవును. అత్తయ్యలూ, మామయ్యలూ ఎప్పుడూ పోట్లాడుకోరు. మరి సుధ ఎప్పుడూ తనతో జట్టు కట్టకుండా వెధవ అల్లరి పనులు చేస్తుందేం ? పక్కగా మాట్లాడితే తనుమాత్రం ఎందుకు వెక్కిరిస్తాడు ?"

* * *

"సుధా! మాట." మధు అనునయంగా పిలిచాడు. "నాకేం మాట పక్కర్లా!" చేతులు తిప్పేసింది సుధ. "ఆడుకుందాం వస్తావా ? నిన్ను ఎప్పుడూ వెక్కిరించనుగా ?"

"నేనేం రాను. నీతో నే నసలు ఆడనే ఆడను."

"అది కాదు సుధా !"

"ఛీ! పో!" పరుగెత్తింది వీధిలోకి.

మధుకి కోపం వచ్చేసింది. కాస్సేపు అలాగే నిలబడ్డాడు. మధు కూడా వీధిలోకి వెళ్ళేసరికి సుధని వెక్కిరిస్తూ రాముా కన్పించాడు. సుధ భయంగా చూస్తూ నిలబడివుంది.

"ఏయ్! ఎందుకురా మా సుధని వెక్కిరిస్తావ్ ?" మధూ కేకతో పరిగెత్తాడు రాము. వాడిని వీధి చివరి వరకూ తరిమి వచ్చాడు మధు.

మధూ పసి హృదయంలో సుధ పట్ల ప్రత్యేక అభిమానం- సుధకో చిత్రమైన స్థానం లేకపోలేదు. ఒగర్చుకొంటూ తిరిగి వస్తే, సుధ మధు

కేసి చూడనైనా లేదు. వాణితో కబుర్లు చెప్తూ ఇసుకతో గూళ్ళు కడ్తూ కూర్చుంది. మధూకి చిర్రెత్తుకొచ్చింది. కసిగా సుధ కట్టిన గూళ్ళన్నీ తన్నుకొంటూ నడిచాడు. సుధ దిగ్గున లేచి నిలబడింది— "నా గూళ్ళెందుకు పడగొట్టావు ?" అంటూ అరిచింది.

"ఈ గూళ్ళు నాకేం బాగాలేవు"

"నా గూళ్ళు బాగాలేకపోతే నీకేం?"

"ఛీ ! అందంగా లేకపోతే వుంచుకోటం ఎందుకు ? నేను అందంగా కట్టిపెట్టనా ?"

"నాకేం అక్కరలేదు."

"అయితే నువ్వే అందంగా కట్టుకో."

"అందంగా కట్టుకోనే కట్టుకోను."

"మళ్లా పడగొట్టేస్తాను."

"మా అమ్మతో చెప్తాను."

"చెప్పుకో."

"నిజంగా చెప్పేస్తాను."

"చెప్పుకోవోయ్ మహా ! ఎవడికి భయం ? మీ అమ్మతో కాదు, మీ నాన్నతో చెప్పుకో."

"చెప్పుకో—చెప్పుకో—చెవులెక్కదీసుకో!"

"మందారాకు తెస్తా— మందు వేసుకో!" అంటూ పాటకూడా సాగించాడు.

"ఉండు, పెదనాన్నతో చెప్తాను" సుధ పరిగెత్తింది. టక్కున పాట ఆపేశాడు మధు. "సుధా ! సుధా ! మాట,"— ఎంత అరచినా సుధ లెక్కించలేదు. మధూ భయంగా హరీవాళ్ళ ఇంటికేసి పరుగెత్తాడు.

విశ్వనాథం అంటేమాత్రం మధూకి చాలా భయం— కారణం అతను మధు పెంకితనాన్ని అణగదొక్కాలని కంకణం కట్టుకుని చీటికీ మాటికీ మధు వీపు దారుణంగా చితగ్గొట్టటమే.

"ఇప్పటి నుంచి యింత రౌడీ వెధవ్వి అయితే ఇక పుద్ధేం పనికి వస్తావురా?" అంటాడు విశ్వనాథం. మరీ కోపం వస్తే – "దిక్కులేని వెధవ్వి వేలెడులేవు. ఇంత తలతిరుగుడా నీకు ? కాస్త గుణం, గుట్టూ వంటపట్టించుకొని నాలుగు ముక్కలు నేర్చుకోకపోతే ఇక బాగుపడ్డట్టే" అంటూ హుంకరిస్తాడు. సుందరమ్మగారు ఆ మాటలు వినటం తటస్థిస్తే ఆవిడ మనస్సు విలవిల్లాడిపోయింది – "వాడిదీ కాస్త చురుకుపాలు ఎక్కువ. చిన్నవాణ్ణి పట్టుకొని ఎందుకునాయనా అటువంటి మాటలు ?" అన్నదానికి విశ్వనాథం ఒక్కసారి ఉగ్రుడైపోయాడు — "చిన్నవాణ్ణి చిన్నవాడిలా వదిలేస్తే ఎల్లకాలం చిన్నవాడుగానే వుంటాడా ఏమిటమ్మా ? నీ అండ చూచుకునే వాడు కోతిలా తయారవుతున్నాడు. భయానికి కూడా పుందలించనివ్వవు. ఇలాగే పెరిగి పెద్దవాడైతే ఇక చిప్పా, కర్రా చేతికి రిసుకోవలసిందే. మరేం లేదు."

సుందరమ్మగారు తిరిగి మాట్లాడలేకపోయింది. పోనీ మనపడికే నచ్చచెబుదామంటే మధు ఎన్ని బోధించినా దురుసుతనం, ఆ పెంకితనా ఋలూ మానుకోడు. ఒళ్ళు అప్పగించి దెబ్బలు పోచ్చుకుంటాడుగాని ఒక మాటపడి నోరుమూసుకోడు.

మధూ అన్నానికి రాలేదని సుందరమ్మగారు కంగారుపడింది. మిట్టమధ్యాన్నం వేళ సూర్యాన్ని వీధిలోకి పంపించింది. ఎంతమంది స్నేహితుల ఇళ్లు గాలించినా మధు కన్పించలేదు. అన్నీ వెదకిన తర్వాత తోటలోకి వెళ్లాడు సూర్యం— మధు సపోటా చెట్టుకింద పండుటాకుల్లో పడి నిద్రపోతున్నాడు. సూర్యం తట్టిలేపితే ఉలిక్కిపడి లేచాడు— "సుధ ... సుధ.... చెప్పేసిందా! మామయ్య ఏం చేస్తున్నాడు ?" కంగారు కంగా రుగా అడిగాడు. సూర్యం మధు చెయ్యిపట్టుకొని లేపదీస్తూ అన్నాడు– "మామయ్య అసలు వూళ్ళో లేడులే. రెండు రోజులవరకూ రాడట. అమ్మమ్మ చెప్పమంది. లేచిరా!"— మధు కళ్లు నులుముకున్నాడు. "సుధ చిన్నత్తకి చెప్పలేదూ?"

"ఎందుకు చెప్పలేదు? అమ్మమ్మకూడా నిన్ను తిడుతోంది. అయినా నువ్వు దాని గూర్చెందుకు పడగొట్టావ్? ఇలాంటి పనులు చేస్తే కొట్టరా ఏమిటి?"

మధు బిక్క మొహం వేశాడు.

"రావేం?"

"నేను రాను నాకేం ఆకలిగాలేదు." సూర్యానికి జాలి వేసింది. "పర్వాలేదులే. మామయ్య లేడుగా? ఇంకెవరు కొడతారు?"

మధు, సూర్యం మొహంలోకి ఆశగా చూస్తూ అన్నాడు. "అయినా అన్నయ్యా! మనం జమీందారుగారింటికి వెళ్ళిపోకూడదూ? అమ్మగారు వచ్చెయ్యమన్నారుగా?"

మధు పొద్దుటి నుంచీ వీధులన్నీ తిరిగి తిరిగి ఆకలి దప్పులతో సంగా తోటలోకి వచ్చి సపోటా చెట్టుకింద కూర్చున్నాడు. అన్నం టానికి ఇంట్లోకి వెళ్దామా అంటే మామయ్య చితగ్గొడతాడనే భయం అక్కడనుంచి కదలనివ్వలేదు—నిశ్శబ్దంగా కూర్చుంటే మధు ఊహాలు శ్యామసుందరీదేవి సన్నిధికి వెళ్ళిపోయాయి.

"అమ్మగారే అయితే దగ్గిర నిలబడి మరీ ఎన్నో ఫలహారాలు తిని పించేవారు కదా? పద్మాపతి అయినా కావలసినవి పెట్టేది" మధు కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి— తను వచ్చేస్తోంటే— "వెళ్ళిపోతావా మధుబాబూ మళ్ళా ఎప్పుడొస్తావు?" అంటూ రాగిణి కూడా ఏడ్చింది. అమ్మగారు వచ్చెయ్యమన్నారు కదా? అక్కడికి వెళ్ళిపోతే? మధుకి అప్పుడప్పుడూ జమీందారుగారి సంస్థానంలోని విషయాలన్నీ జ్ఞాపకం వస్తూనే వుంటాయి. ఆ రాజసపు దినాలు తలచుకుని అంతలో ఏ పిల్లవాడో పిలిస్తే అంతా మర్చిపోయి పరిగెత్తుతాడు.

"ఏమిటంరా?" అన్నాడు సూర్యం విసుగ్గా.

మధు దీనంగా చూశాడు— "నేను అమ్మగారి దగ్గరికి వెళ్ళిపోతా నన్నయ్యా!"

"అమ్మమ్మ పంపకుండేమిటి?"

"అమ్మమ్మ కేమీ తెలీదు. ఇక్కడసలు ఏం బావుండనీ! అస్తమానూ అత్తలు తిట్టటం, మామయ్య కొట్టటమూనూ. కృష్ణుడు, సుధా మాట్లాడనే మాట్లాడరు. ఛీ! ఇక్కడసలు ఏం బావుండనీ!" మధుకి విరక్తి కలిగింది. సూర్యం మాట్లాడలేదు. మధుకి అందరిమీద కోపం వచ్చింది. ఇంట్లోకి వెళ్ళేసరికి కృష్ణుడూ, సుధా, సుశీలా మధ్యాన్నం అన్నాలు తింటున్నారు.

"చిన్నత్త అన్నాలు పెడుతోంది. నువ్వూ వెళ్ళి కూర్చో" అంది సుందరమ్మగారు పొడిగా. అన్నం తింటేగాని వాణ్ణి ఏం మందలించ కూడదని ఆవిడ వుద్దేశ్యం. మధు ఒప్పుకోలేదు- "అత్తయ్య నాకు సరిగ్గా పెట్టదు. నువ్వేరా అమ్మమ్మా!"

"ఛా! తప్పుకు వెధవా! అత్త ఎందుకు పెట్టదు?"

"నీకేం తెలీదు అమ్మమ్మా! మొన్న కృష్ణుడికి నెయ్యి వేసి నాకు దసేసింది చిన్నత్త. వాడికెప్పుడూ పెరుగు వేస్తుంది. నాకూ అన్నయ్యకూ నీళ్ళ మజ్జిగ పోస్తుంది."

"చాల్లే నోరుమూసుకో" కసిరింది సుందరమ్మగారు.

అంతా వింటూనే వుంది సావిత్రి— "ఆ పిల్లాడెందుకూ నోరు మూసుకోవటం? మేమే నోళ్ళు మూసుకోవాల్సిన రోజు వచ్చింది. మీ మనవడేం వెర్రివాడుకాడు! మీరు సమర్థించడానికి. వేలెడువేడు ఎన్ని అబద్ధాలో చూడండి."

మధు సిసింద్రీలా లేచాడు - పెద్దమామయ్య ఇంట్లో లేడన్న సంగతి అంతర్గతంగా మరీ ధైర్యాన్నిచ్చింది. "అబద్ధాలా? నేనా? ముందు నువ్వు మజ్జిగ పొయ్యబోతే నేను వద్దనలేదూ? అప్పుడు పెద్దత్త జడవేసుకుంటూ వచ్చి— 'పోనీ కొంచెం పెరుగువేద్దూ!' అంటే కదూ వేశావు?" అంతటితో వూరుకోక గది గుమ్మంలో కూర్చుని ఏదో కుట్టుకుంటూన్న పార్వతిని చూస్తూ అన్నాడు -- "ఏం పెద్దత్తా? నువ్వే చెప్పు నేను అబద్ధమాడానా?"

"అబ్బ! ఏదో అయిందిగాని వూరుకుందూ - నేను సాక్ష్యమా ఏమిటి నీకు?" అంది విసుగ్గా పార్వతి. సావిత్రికి తల కొట్టేసినట్టయింది

— "సూర్యానికి ఎన్నిసార్లు అన్నం పెట్టలేదు? ఎప్పుడైనా ఇలా కల్పించి చెప్పాడా?" అంది వుండబట్టలేక. మధు అతి తేలిగ్గా నవ్వేశాడు. — "హా అన్నయ్యకైతే ఏం చేస్తున్నా తెలీదులే."

మధు ధోరణికి సుందరమ్మగారు భయపడింది. దిక్కులేక చేరిన చోట దెబ్బలాడి తినాలంటే ఒప్పుతుందా? పరిస్థితి వీడి కెప్పుడు అర్థమౌతుంది? దిగాలుపడి కూర్చున్న సుందరమ్మగారికి ఒకనాటి వైభవం కళ్ళ ముందు కదులాడింది — ఆ మహాత్ముడు వున్న రోజుల్లో ఇంట్లో దేనికీ కొరత వుండేది కాదు. అంతా తన అధికారం! — తన పెత్తనం! కోడ ళ్ళిద్దరూ కూతుళ్ళలాగే మసులుకునే వారు. కల్యాణి వచ్చినప్పుడల్లా అంతు లేనన్ని మర్యాదలు జరిగేవి. "నేను పరాయిదాన్నా ఏమిట్రా," అని మొత్తుకుంటూన్నా వినకుండా వదిన లిద్దరూ కలిసి ఏవో వంటలూ వార్పులూ చేస్తూనే వుండేవారు. ఆ నాటి అనురాగాలన్నీ చచ్చినవాళ్ళతోనే అంతరించి పోయాయి — ఈ నాడు కల్యాణి బిడ్డలకు కడుపునిండా కూడే లేదు. "అమ్మమ్మా! అన్నం పెట్టవా?" బిక్కమొహం వేసుకు నించు న్నాడు మధు.

సుందరమ్మగారు తీక్షణంగా మనవడి మొహంలోకి చూసింది. ప్రొద్దున్న చద్దన్నం కూడా తినని మధు, నీరసంగా వడలిన తోటకూర కాడలా వాడి దిగజారి పోయాడు. ఆకలి బాధ వాడి మొహంలో కొట్టవచ్చినట్టు కన్పిస్తోంది. సుందరమ్మగారికి గుండె తరుక్కు పోయింది. — అయినా తెచ్చి పెట్టుకున్న కాఠిన్యంతో — "నేను పెట్టను. ఎక్కడికి పోతావో పో! నా మాట నీకెంత లెక్క లేనప్పుడు నీ గురించి నే నెందుకు బాధ పడాలి! ఏమీ చెయ్యను. వెళ్ళు, వెళ్ళవేం?" అంటూ అరిచింది.

"నిన్ను నేనేం చేశానేమిటి!" మధు గొంతు ఏడుపులో పూడి పోయింది.

"ఇంకా ఏం చెయ్యాలి? ఎవరేం చేసినా అడక్కుండా, తిరిగి జవాబు లివ్వకుండా నోరు మూసుకు వూరుకోవాలని చెప్పానా? నా మాట నువ్వు ఎప్పుడైనా ఖాతరు చేశావా?"

"మరి నేనే అబద్ధాలాడుతున్నాన .... ని ...."

"మరి లేదు. గిరీ లేదు. — వెళ్ళు"

"నేనేం వెళ్ళను. ఆకలి వేస్తోంది. అన్నం పెట్టు."

"నేను పెట్టనని చెప్పానుగా? వెళ్ళవేం?"

"ఎక్కడికి వెళ్ళనేమిటి ?"

"ఎక్కడికో పో! ఈ వూళ్ళోలేకుండా పో!"

మధు గిరుక్కున వెనక్కి తిరిగాడు — "అయితే వెళతానులే." ఒకటే పరుగు తీశాడు.

"ఒరేయ్! మధూ! మధూ! రారా! అన్నం పెడతాను రారా!" సుందరమ్మగారు పొలికేకలు పెడుతూ వీధి గుమ్మం వరకూ వెళ్ళింది. అప్పటికే మధు మాయమయ్యాడు. నిర్ఘాంతపోయి నిలబడింది. ఆవిడ గుండెలు దడదడ కొట్టుకున్నాయి. "అసలే దుడుకు వెధవ. నిజంగానే పోతాడా ఏం ఖర్మ ?"

"అయ్యో! వాడెందుకు బెదర గొట్టావమ్మా?" జానకి కూడా నొచ్చుకుంది. వీధి వెంట మాటిమాటికీ గాలిస్తూ గుమ్మంలో నిలబడింది.

ఇళ్ళన్నీ దాటి, వీధులన్నీ దాటి ఎక్కడికో పిచ్చివాడిలా నడిచి పోతున్న మధు — ఎదురుగా వస్తూన్న వ్యక్తిని చూశాడు — అకస్మాత్తుగా భయం భయంగా నిలబడ్డాడు.

"ఎందుకురా ఇలా వచ్చావ్ ?"

"ఎ .... ఎ ... ఎవరు ?"

"ఎవరేమిటి? నువ్వే. ఇక్కడ తిరుగుతున్నావెందుకు ?"

"షికారికనే మా .... మయ్యా!"

"షికారికనే ఏమిటి? నిజం చెప్తావా? తగలనీమన్నావా ? కోతి వెధవా! నీకు తోక ఒక్కటే తక్కువ."

మధు మాట్లాడలేదు.

"నేను ఊళ్ళో లేనని వీధులట్టుకు తిరుగుతున్నావ్ కదూ అంతేనా? మాట్లాడవేం ?"

"కాదు మామయ్యా! అమ్మమ్మ తిట్టిందని."

"నీ ఎత్తులు నాకు తెలుసులేరా! నడు ఇంటికి."

ఆ గర్జనతో పిల్లిలా విశ్వనాథాన్ని అనుసరించాడు మధు — మధుకి ఆపుకోలేనంత దుఃఖం వచ్చింది.

ఆకలి బాధలో ఒళ్ళు తూలిపోతోంటే చొక్కాతో కళ్ళు ఒత్తుకుంటూ నడిచాడు. విశ్వనాథం దారిలో మరేమీ పలకరించలేదు. — ఇంటికి వస్తూనే "అమ్మా సుధా!" అంటూ కేక పెట్టాడు. అనుకోని విధంగా ఊరునుంచి వచ్చేసిన విశ్వనాథం రాకకు దాదాపు ఇంట్లో వాళ్ళంతా చావిట్లో కొచ్చారు. స్తంభం చాటున నిలబడి ఉన్న మధుని చూసింది జానకి. - "అమ్మా! అదుగోనే మధు. ఏంరా? అక్కడే నిలబడ్డావ్. రావేం?" అంది సంభ్రమంగా.

సుందరమ్మగారు గబగబా మధు దగ్గిరకి వెళుతూ — "మావాడికి ఏదో అన్నానని అలా అన్నం తినకుండా వెళ్ళిపోవటమేనట్రా?" అంది మందలింపుగా.

మధు స్తంభాన్ని అనుకొని మాట్లాడకుండా నించున్నాడు "ఓహో! అందుకే నేమిటి అలా పిచ్చిపట్టినట్టు తిరుగుతున్నాడు? ఏం ఇలారా!" కటువుగా పిలిచాడు విశ్వనాథం. మధు కదల్లేదు.

"పెదనాన్నా! పాప పొద్దున నా గోళ్ళన్నీ పాడు చేశాడు .... మరేమో ఇందాకా అమ్మనికూడా తిట్టాడు" ముద్దుగా పెదనాన్న చెంపలు చేతులతో రాస్తూ చెప్పింది సుధ.

"ఆ! ఏదో అయింది లేద్దూ! ఎన్ని అనుభవించటం లేదూ? అందులో ఇదొకటి. ఈ మాత్రానికి మగవాళ్ళదాకా దేనికి?" గొడవలేమీ తనకు నచ్చని దానిలా, సహనవంతురాలిలా .... అంది సావిత్రి, తలుపు దగ్గిర నుంచి.

"నువ్వే కదమ్మా పెదనాన్న రాగానే చెప్పమన్నావు మాటలతో, తుపాకి చూసిన పక్షిలా తప్పుకుపోయింది

ఏగా సుందరమ్మగారి వెనక్కి నడుస్తున్న మధుని చూస్తూ గర్జించాడు విశ్వనాథం — "ఒరేయ్! ఆగు. చిన్నత్తని తిట్టావా?" — బిత్తరపోయిన మధు తల అడ్డంగా వూపాడు.

"సుధ గూళ్ళు పాడు చేశావా? నిజం చెప్పు" — మధు మాట్లాడ లేక పోయాడు.

"చిన్నవాణ్ని అంతగా నిలవెయ్యటం ఏమిటి? పిల్లలు అల్లరి పనులు చెయ్యరా?" తనలో తను సణుక్కొంది జానకి. వెధవ గొడవంతా నా కెందుకన్నట్టు తన గదిలోకి వెళ్ళిపోయింది పార్వతి.

"ఏంరా మాట్లాడవ్?" సుధని దించి దగ్గరగా వస్తోంటే - మధు భయంగా సుందరమ్మగార్ని చుట్టపెట్టేసుకున్నాడు — "అమ్మమ్మోయ్! అమ్మమ్మా!"

"ఇక నుంచి అలాంటి పనులు చెయ్యకుండా నేను చూసుకుంటాను నాని - ఈ సారికి వూరుకో నాయనా!" ప్రాధేయపడింది సుందరమ్మగారు.

"అబ్బే! అలాక్కాదు. వాడికి భయం వుండి తీరాలి." సరిగ్గా దేవుడు పంపినట్టే వచ్చాడు సీతాపతి. సంగతంతా గ్రహించి సమర్థింపుగా …డు — "పోనీ చిన్నవాడితో ఏమిటిలే అన్నయ్యా! నాలుగేళ్ళుపోతే బుద్ధి వస్తుంది."

విశ్వనాథం కస్సుమన్నాడు — "మొక్కై వంగందే మానై వంగుతావట్రా? వీడి అల్లరి ఎంతకనీ భరించటం?"

"భరించక ఏం చేస్తాం?" అన్నాడు సీతాపతి.

"సరే! భరించండి" అని గదిలోకి వెళ్ళి పోయాడు విశ్వనాథం. మధుకి సీతాపతి దేవుడిలా కనపడ్డాడు.

* * *

మధుని ఎదుర్కొంటోన్న ప్రశ్న ఒక్కటే — "సూర్యం నీలాగే …న్నాడా?" అంటారు అంతా. నిజమే, అన్నయ్య తనలాగ ఎవ్వరి…లాడడు. మామయ్యచేత దెబ్బలు తినడు. ఎవరేం చేస్తున్నా …ంటాడు. సూర్యం అలా ఎందుకు వుంటాడో మధుకి

కూలిన గోడలు

సహన—సౌశీల్యాలకు సూర్యానికి సూర్యమే సా. అన్యాయాన్నీ విమర్శించడు. ఇంట్లో ఎన్ని పనులు చె. మాట్లాడకుండా చేసేస్తాడు. చెల్లెల్ని దగ్గిర కూర్చోబెట్టుకొని చ సూర్యం దినచర్యల్లో ఒకటి. తమ్ముడు దెబ్బలు తింటూంటే పోతాడు. మధుని దూరంగా తీసుకుపోయి ఓదారుస్తూ తనుకూడా వటం కన్నా ఏమీ చెయ్యలేడు. తాతగారు వున్న రోజులలో ఫస్టుఫారం. చేరిన సూర్యం శ్రద్ధగా చదువుతూ థర్డు ఫారంలోకి వచ్చాడు. ఎక్కడ వుంటాడో తెలీని సూర్యానికి—ఎక్కడ పడితే అక్కడే వుండే మధుకీ పోలికెక్కడ?

*  *  *

పార్వతి తరఫు చుట్టాల పిల్లలిద్దరు చదువుల నిమిత్తం ఆ యింట్లో ప్రవేశించటంతో మరికొన్ని చికాకులు తల ఎత్తాయి. ఆ పిల్లలలో ఒకడు పార్వతికి స్వయంగా అక్క కొడుకు. పేరు వీర వెంకట వరప్రసాద సత్య సాయి నారాయణరావో, ఏదో ఒక మైలున్నర పొడగు వుంటుంది! చూడటానికి సన్నగా, తెల్లగా సోగలాగి ముద్దువస్తూ వుంటాడు. వయస్సుకు తగ్గట్టుగా లేక కొంత నాసిగానే కన్పిస్తాడు. చదువు సంధ్యలలో మాత్రం మంచి తెలివితేటలు కలవాడు. వూరునుంచి వచ్చిన సాయంత్రమే సంచిలోంచి పుస్తకాలన్నీ బయట వేసుకు కూర్చున్నాడు. "నేను చదువుకోటానికి వచ్చాను సుమా!"— అన్నట్టు.

ఇక రెండోవాడు పార్వతికి వదినగారి చెల్లెలి ఆడబిడ్డ తోటికోడలు బొమ్మరిది. మొత్తానికి దగ్గరి సంబంధమే మరి. వాడి పేరు మాత్రం చక్కటిది. మదనగోపాల్ — గోపాలుడు గోపాలుడిలాగే చెట్లూ చేమలూ పట్టుకు గెంతుతున్నాడనీ, వాడికి బొత్తిగా చదువుసంధ్యలు వంట బట్టటం లేదనీ—విశ్వనాథం అల్లరి వెధవల్ని భయభక్తులతో వుంచగల డనే నమ్మకంతో మదన గోపాలుడి బామ్మ వాణ్ణి పార్వతి దగ్గిరకు పంపింది. దృఢంగా, పొడుగ్గా, ఠీవీగా వుండే మదనుడికి వీధులట్టుకు

కూలిన గోడలు

వా సరదా! కొంతవరకూ ఇష్టాలు ఏకమవ్వటంతో
ికీ తొందరగా స్నేహం కలిసిపోయింది.

ు తెలివితేటలు విశిష్టమైనవి. ఏదీ ఎక్కువసేపు చదవనక్క
ష్టాపు పాఠాలు చెపుతోంటే శ్రద్ధగా, కుతూహలంగా వింటాడు.
మనసుకి నచ్చినప్పుడు ఇంటి దగ్గర నూరోసారి చదువుకుంటాడు
తే. పుస్తకాల దుకాణం సర్దేసి వీధిలోకి పరుగు తీస్తాడు — అందుకనే
మధూ - మదనుడూ ఎప్పుడూ ఆడుకొంటూనే కన్పిస్తారు. వాళ్ళని
చూస్తోంటే సత్యన్నారాయణకి ఏడుపొచ్చినంత పని అవుతుంది. బుద్ధిగా
కూర్చుని చదువుకోవాలనీ, అల్లరి పిల్లలతో ఆడితే పాడైపోతారనీ పార్వతి
పిన్ని చేసిన బోధ ధిక్కరించే సాహసం లేదు వాడికి. ఒక్కోసారి వాడి
సరసన కృష్ణుణ్ని కూడా బలవంతంగా రెండు అంటించి మరీ కూర్చోపెడు
తుంది సావిత్రి. అదే సత్యన్నారాయణకి కొండంత తృప్తి.

ఒకసారి .... ....

"సత్యన్నారాయణా! ఆడుకోవటానికి పిల్లలంతా వచ్చేశారు. నువ్వు
కూడా రావూ?" స్నేహంగా పిల్చాడు మధు సత్యన్నారాయణ తల
అడ్డంగా తిప్పుతూ అన్నాడు — "నేను చదువుకోవాలి మా పిన్ని తిడు
తుంది."

"రాత్రికి చదువుకుంటాంగా?"

"ఏమో! అస్తమానూ చదువుకుంటే ఎక్కువే చదువు వస్తుందట."
సర్దాగా ఆటలకి పిలిస్తే సత్యన్నారాయణ ఎప్పుడూ రాడని మధుకి
కోపం వచ్చింది—"ఓహో! చదువుకో, బాగా చదువుకో, ఒరేయ్!
మదనా! సత్తిగాడు చూడరా! బోలెడు చదివేసుకుంటున్నాడు-" పొలి
కేక పెట్టాడు. మదన గోపాలం పరిగెత్తుకు వస్తూ - "రావేంరా మధూ!
అందరిన్నీ పిల్చుకురావాలని నువ్వేగా అన్నావ్? ఎంతకీ రావేం?" —
అన్నాడు.

"సత్తిగాడు రానంటున్నాడురా?"

"వీడెప్పుడూ ఇంతే. ఎంత చదివినా చాలదు" సత్యన్నారాయణకి

ఉక్రోషం వచ్చింది - కోపంగా అన్నాడు - "నాపేరేం సత్తిగాడు కాదు. వీర వెంకట వరప్రసాద సత్యసాయి నారాయణరావు. తెలుసా?"

"నావే శేనాయ్ .. రావు. అందుకనే ఎప్పుడూ ఆడుకోటానికి రావు" ఫక్కుమన్నాడు మధూ. మదనుడికేసి చూస్తూ - "అయినా వీణ్ని సత్తిగాడంటేనే బాగుంది కదరా?" అన్నాడు వెటకారంగా.

"నిజమే చాలా బావుంది" వంత పాడాడు మదన్. "నన్నం అలా పిలవద్దు" ఖచ్చితంగా అన్నాడు సత్యన్నారాయణ.

"మా ఇష్టం. అలాగే పిలుస్తాం. నువ్వేవరివోయ్ సత్తిగా మాకు చెప్పటానికి? కదురా మదనా?" సత్యన్నారాయణకి ఏడుపే వచ్చేసింది. బింకంగా అన్నాడు .. "నేను పలకను."

"నువ్వు పలకవా? ఓహ్! మధు పగలబడి నవ్వాడు — "ఒరేయ్! మదనా! వీడు పలకరా! నీ దగ్గిర బలపం వుంది కదూ? ఎంచక్కా వీడి వీపుమీద రాసుకో. ఎక్కాలవీ చేసుకో. తెల్లగా కూడా వున్నాడ్లే. కలం అయినా రాస్తుంది."

"నిజమేరోయ్! నా దగ్గిర ఎర్రసుద్ద వుంది."

మధూ - మదనుడూ పగలబడి నవ్వుకొంటూంటే. సత్యన్నారాయణ ఏడుస్తూ ఇంట్లోకి వెళ్ళిపోయాడు.

నవ్వటం ఆపుజేసి మదనుడన్నాడు — "ఒరేయ్ మధూ! పార్వతి పెద్దమ్మ వస్తుందేమోరా! పారిపోదాం."

"వస్తే రానీరా! ఇప్పుడు మనమేం చేశాం?" మదనుడు, మధూ చెవి మీదికి ఒంగి గుసగుస లాడుతూన్నట్లు భయంగా అన్నాడు — "వాణ్ని ఏడిపించాం కదరా?"

"ఓస్! వాణ్ని మనమేం ఏడిపించాం?" నిర్భయంగా అన్నాడు మధూ - "వాడే ఏడ్చాడు."

మదన గోపాల్‌కి దేవరహస్యం బోధపడింది. అనుకున్నట్టుగానే పార్వతి సత్యన్నారాయణని వెంటబెట్టుకొని కోపంగా వచ్చింది. మదనుడు కాస్త దూరంగా వెళ్ళి నిలబడ్డాడు. మధు మాత్రం చీడీలమీద కూర్చున్నాడు నిర్భయంగా. వస్తూనే అంది పార్వతి మధూని ఉద్దేశించి - "ఏం

అబ్బాయ్! రోజురోజుకీ పెత్రేగి పోతున్నావే. వీణ్ణి ఏడిపించావుట దేనికి ?"

"అదేమిటత్తా ? నేనెలా ఏడిపిస్తాను వాణ్ణి ? వాడూ నా అంత వున్నాడుగా ?"

"ఆ ఉన్నాడు, తిండికే, నీమీద తిరగబడటానికి కాదు. వాణ్ణి ...కుని హాస్యాలు చేస్తే ఏడవడూ ?"

"నన్ను ఎంతమంది హాస్యం చేసినా నేను ఏడవను."

"అందరూ నీవంటి మొండివాళ్ళే అయితే ఇక అఘోరించినట్టే. అసలు సత్తిగాడని వెక్కిరించావుట దేనికి ?"

"వాడి పేరు అదేగా అత్తా? నువ్వు అలాగే పిలవ్వూ ?"

"నే నేదో ముద్దుగా పిల్చుకొంటుంటే ..."

"పాపం సత్తిగాడంటే ఎంత ముద్దే అత్తా!"

పార్వతికి ఒంటికి కారం రాసుకున్నట్టు అయింది. ఒక వైపున తను మందలిస్తూ వుండగానే మళ్ళా సత్తిగాడని పిలవటం ఎంత అవమానం పార్వతికి! పార్వతికి ఒళ్ళు మండిపోయింది– "బావుంది నాయనా వరస! దిక్కులేని వాడని చేరదీస్తే పెంచిన పేరు నిలబెట్టేలాగే వున్నావ్ .. ఏంరా గోపాలం? నువ్వూ ఆకతాయిగా తిరుగుతున్నావు కదూ ?" పార్వతి కోపం మదన గోపాలం మీదికి మళ్ళింది. "నువ్వు చదువుకోసం వచ్చావా? ఆటలకోసం వచ్చావా? వెధవ గంతులూ నువ్వూనూ."

మదనుడు కొంచెం భయపడ్డాడు .. "కాదు పెద్దమ్మా! అసలు నేను చదువుకొంటూంటే మధూయే నన్ను .. "

"పిలిస్తే పరుగెత్తుకు వెళ్ళిపోవాలా? రానని చెప్పలేవూ ? –" మదనుడు మాట్లాడలేదు.

మధు గర్వంగా అన్నాడు – "రాకపోతే నాకేం భయమా? పెద్ద తోటలో జమీందారుగారి అమ్మాయిలతో ఎన్నో ఆటలు ఆడుకున్నాను. తెలుసా ?"

"అయ్యో! సంబరం! అడుక్కుతినే బ్రతుక్కి కూడా అహంకారమే" చేతులు తిప్పుకుంటూ విసురుగా వెనక్కి తిరిగిన పార్వతి అత్తగార్ని చూసి గతుక్కుమంది.

సుందరమ్మగారు కోడల్ని పన్నెత్తి పల్కరించలేదు. సరాసరి మనవడి దగ్గరికి వెళ్ళి వాణ్ణి జుట్టు పట్టుకు ఒంగదీసి వీపుమీద ఛెళ్ళు ఛెళ్ళున తగలనిచ్చింది— "వెంకి వెధవా! నీకు ఎన్నిసార్లు గడ్డి పెట్టాను? అడుక్కుతినే వెధవ్వి అణిగి మణిగి పడివుండక ఎదురు తిరిగి వాదం పెట్టుకుంటావా? ఎప్పుడుక్కా నీకు బుద్ధి వస్తుంది?" అంటూ ఇంకా ఇంకా అంటించింది. పార్వతి రుసరుస లాడుతూ అంది — "ఇప్పుడు ఎవరే మన్నారని అలా బాదుకుంటారు? ఎవరిమీద కోపం వుంటే వాళ్ళమీదే తీర్చుకోకూడదూ?"

"ఎవరి మీద తీర్చుకుంటే ఎవరు వూరుకుంటారు తల్లీ! ఏటొచ్చి వాడేగా అందరికీ లోకువ? అడగటానికి అమ్మా లేదు అయ్యా లేడు."

ఎప్పుడూ అమ్మమ్మ కోపం ఎరుగని మధు ఆశ్చర్యంతో ఏడవడం కూడా మర్చిపోయాడు. ఏడుపు రాబోయినా సత్తిగాణ్ణీ, పెద్దత్తనీ చూసి దెబ్బల ధాటికి వీపు అప్పగించి శమాయించుకున్నాడు.

సుందరమ్మగారు మనవణ్ణి దూరంగా లాక్కుపోయి దగ్గరికి తీసుకునేసరికి మధు అమ్మమ్మ కడుపులో తలదాచుకుని వెక్కివెక్కి ఏడ్చాడు.

* * *

కూలిన గోడలు కూలినట్టే వుండవంటారు. వక్రించిన జానకి అదృష్టరేఖ తిరిగి బాగుపడే శుభసమయం ఆసన్నమైంది — జానకి భర్త వెంకట్రావు. విశ్వనాధానికి పంపిన కబురు ఆ ఇంట్లో ఎవరికే విధంగా తోస్తేనేం మొత్తానికి అందరికీ సంతోషమే కలిగించింది.

"దాని కష్టాలు గట్టెక్కాయి భగవంతుడా!" అనుకొంది సుంద
గారు. చెమ్మగిల్లిన కళ్ళు ఒత్తుకొంటూ — ఆడపిల్ల కాపురం బాగు
కి అంత బాధ లేదు. మరో నాలుగేళ్ళు ఓర్చుకుంటే మగ
ికో ధూళికో పెరిగి పెద్దవాళ్ళవుతారు — సుందరమ్మ గారికీ

గుండెలమీది కుంపటి దిగి చల్లారిపోయింది — జానకి భర్త వెంకట్రావు విషయంలో ...

పెరుగుట విరుగుట కొరకే కాదా ?

జానకి అత్తగారు చావు బ్రతుకల్లో మంచానపడి గతమంతా తల పోసుకుంది. గుణవంతురాలైన కోడలిపట్ల ఆవిడ అమానుషమైన ప్రవర్తనకు సిగ్గుపడి బాధతో కుమిలిపోయింది. పిల్లల్ని గన్న తల్లయివుండి కూడా ఆవిడ ఘోరంగా కొడుక్కీ కోడలికీ కాకుండా చేసింది. అసలే అంతంత మాత్రంగా వున్న కొడుకు పూర్తిగా వేశ్యాలోలుడై ఇల్లూ వాకిలీ పట్టకుండా తిరిగాడు. ఆస్తిపాస్తు లన్నీ హరించిపోతోంటె కొడుకు అన్నాభాగ్యాలపాలై తిరగటం తల్లికి కనువిప్పు కలిగించింది --- కానీ పరిస్థితి ఆవిడ చెయ్యి జారిపోయింది ఏనాడో.

ఇల్లాలిని ధిక్కరించి తన సర్వస్వం ఒక దేవతకు ధారాదత్తం చేశాడు. కొడుకు పాపం పండిపోయింది. దుఃఖ పూరితమైన జానకి నిట్టూర్పు ఏ ఇలవేల్పుకో సెగలై పొగలై తగిలింది. జామిచెట్టు కింద జానకి కన్నీటిబొట్టు రాలినచోట పచ్చని బంగారుగడ్డి మొలిచింది. వెంకట్రావు ఆరాధించే దేవతకి దారుణమైన షూహ వచ్చింది. ఆదమరచి నిద్రపోతూన్న ప్రియుడి సమీపంలో కమ్మని పాలగ్లాసు వుంచి వెళ్ళిపోయింది -కళ్ళుమూసుకుని పాలు తాగిన పిల్లి ఆ కళ్ళు తెరవకుండానే క్రింద పడింది. పాలగ్లాసు భళ్ళున బద్దలైంది. త్రుళ్ళిపడి లేచిన వెంకట్రావు ఎదురుగా కళ్ళకు కన్పిస్తూన్న దృశ్యానికి విభ్రాంతి పడ్డాడు. దాని అంతరార్థమేదో గ్రహించిన వాడిలా పొలికేకలు పెట్టాడు. తన దేవత నిజస్వరూపం తెలుసుకోగిలిగిన వెంకట్రావు ప్రకలు దుర్మదై లేచాడు. వెంకట్రావుని చంపి అతని ఆస్తిపాస్తులన్నీ వెంటనే స్వాధీనం చేసుకోటానికి ఎత్తుగడవేసిన వుంపుడుగత్తె ప్రాణభయంతో ఆ రాత్రికి రాత్రే పారిపోయింది. వెంకట్రావులో మానవత్వం మిగిలేవుంది — ఆ సంఘటన అతనిపై తీవ్రంగా పనిచేసింది. - ఫలితం జానకి ప్రార్థన ఫలించింది.

నిండు హృదయంతో అత్తవారింటికి ప్రయాణమైంది జానకి. జానకి వెళ్ళేరోజు సుందరమ్మగారికి మహా పర్వదినం. మధు స్నేహితుల ఇళ్ళనుంచి రకరకాల పువ్వులు తెచ్చి పెద్ద దండ కట్టి జానకికి ఇచ్చాడు.

జానకి అతి ఆప్యాయంగా మధు నుదుట ముద్దు పెట్టుకుంది. కంఠం విప్పి మాట్లాడలేక కళ్ళతోనే ఎన్నో బోధలు చేసింది — కొత్తగా బయలుదేరుతూన్న జానకి వెంట సుశీలను పంపటానికి సుందరమ్మగారికి ఇచ్ఛ లేదు. కన్నీళ్ళలో కూతుర్ని గుండెలకు హత్తుకొంది. అన్నలకూ వదినలకూ పేరు పేరునా చెప్పి తల్లికి మనసులోనే నమస్కరించి మేనా ఎక్కింది జానకి. కొన్ని సంవత్సరాల తదనంతరం సిగ్గుల పెళ్ళికూతురై తల దించుకొంది.

* * *

ఇంట్లో అప్పనంగా తిని తిరుగుతూన్న పిల్లలందర్నీ చూస్తూన్న కొద్దీ విశ్వనాథానికి ఏదో వూహ పుట్టుకొచ్చింది. తండ్రి హయాంలో ఒక వెలుగు వెలిగి మోడైపోయిన పెరటి తోటను పునరుద్ధరించమని సీతాపతిని పురమాయించాడు— "కాస్త పొద్దుపేలేచి పిల్లలందర్నీ తీసికెళ్ళి, తోట పని చేయించు. ఆ పెరడంతా అలా అనవసరంగా పోవటం ఎందుకూ?" అన్నాడు.

సీతాపతి మారు మాట్లాడకుండా తలవూపాడు. కీర్తిశేషులైన రాజయ్యగారికి మొక్కల పెంపకంలో విశేషమైన ఆసక్తి ఉండేది. పళ్ళ చెట్లు — కూరపాదులూ — పూల మొక్కలూ అన్నింటినీ సమానాభిమానంతోనూ చూసేవా డాయన. తోట పెంపకానికి కావలసిన మంచి విత్తనాలు — ఆరోగ్యకరమైన ఎరువులూ జమీందారు సంస్థానంలో ఉచితంగా లభిస్తూ ఉండేవి. వూళ్లో కావలసిన సదుపాయాలు మంచి పలుకుబడీ ఉండేది.

రాజయ్యగారి తోటలో నాటిన ఏ విత్తూ మొలకెత్తకుండా మట్టిలో కలిసిపోలేదు. ఫలితం — పదిమందికీ పంచిపెట్టకుండా తమ స్వంతానికే వాడుకోలేదు. కూర పోపుకు కరివేపాకు దగ్గర్నుంచీ ఏనుగు తలకాయ

అంతేసి మామిడికాయల వరకూ బంధువులేకాదు — స్నేహితూలేకాదు వూళ్లో జనమంతా ఏదో విధంగా అనుభవించిన వాళ్లే.

ఖర్మవశాత్తు రాజయ్యగారు మనోవేదనపాలై తోట పెంపకాన్ని నిర్లక్ష్యం చేయటంతో తోట పెత్తనం ప్రత్యక్షంగా కొడుకుల చేతికీ, పరోక్షంగా కోడళ్ళ అధికారంలోకి వచ్చేసింది. కమ్మటి కరేపాకు దూసి కోయటం సావిత్రికి నచ్చలేదు. అపురూపంగా ఎదిగే మామిడికాయలు పంచిపెట్టటం పార్వతికి గిట్టలేదు — తోటలో నుంచి ఏవీ అడగటానికి రావద్దని తోటకోడళ్ళిద్దరూ ఆ వచ్చే వాళ్ళతో ఖచ్చితంగా చెప్పేశారు — "ఇదేం ధర్మసత్రం కాదు నాయనా! మేమూ కొత్త కుటుంబీకులమే. మాకున్నదంతా గొప్పలకు పోయి మీకు పంచిపెట్టుకుంటే రేపు మమ్మల్ని పలకరించే వాడయినా కనిపించడు. వూళ్ళోనుంచి మాకేమయినా వచ్చి పడుతోందా ? ఎందుకలా చీటికీ మాటికీ సిగ్గులేకుండా అడుక్కుంటారు ?" సావిత్రి సణుగుడు పూర్తి అయ్యేసరికి ఆ వ్యక్తి మరి కనిపించేవాడు కాదు.

తల్లిదండ్రుల ధ్యాస మళ్ళించడానికి పిల్లలిద్దర్నీ తీసుకు సంస్థానానికి వెళ్ళిన రాజయ్యగారూ — సుందరమ్మగారూ — స్వగ్రామం నుంచి జానకి వ్రాసిన ఉత్తరం—"సుశీల బొత్తిగా పిచ్చిదానిలా ఉంది. మూగదై పోతుందేమోనని నాకు భయంగా ఉందమ్మా!" అన్న విషయం చదువుకుని మతిపోయిన వాళ్లలా బయల్దేరి వచ్చారు ఒకసారి. అక్కడ ఉన్న నాలుగు రోజుల్లోను అత్తా కోడళ్ల కొత్తగా తోట విషయంలో మాటలనుకోవటం జరిగింది. ఎవరో నిమ్మకాయ కావాలని వచ్చి సుందరమ్మగార్ని అడిగారు. ఆవిడ ఎప్పట్లాగే పాలేర్ని పిలిచి "వాళ్ళకెవరికో నిమ్మకాయలు కావాలట. పండిన చూసి ఒకటి కోసి యిచ్చిరా!" అంది. వాడేదో నసుగుతూంటే — "వెళ్ళవేంరా?" అంటూ కసిరి మరీ పంపించింది. అంతా వింటూన్న పార్వతి వెళ్తూన్న పాలేర్ని వెనక్కి పిలిచి అత్త గారితో అంది "ఇప్పుడు తోటలోని వేవీ ఎవరికీ ఇవ్వటంలేదు. వచ్చిన మనిషి నెవర్నో వెళ్ళమని చెప్పమనండి." సుందరమ్మగారు తెల్లబోయింది — "ఎవరికీ ఇవ్వటంలేదూ? అదేమిటి ?"

"అంత ఆశ్చర్యం దేనికి ? ఇక ఏళ్ళ తరబడి ఇలా దాన ధర్మాలు చేసుకుంటూ కూర్చోటమేనా ?"

సుందరమ్మగారికి ఏమీ అర్థం కాలేదు — "దానధర్మాల కేముంది ? ఎప్పుడూ మీ మామగారు ఇస్తూనే ఉంటారుగా ?"

"అలాగే ఇప్పుడు ఇవ్వటంలేదు మరి."

"చిన్న నిమ్మకాయకే ?"

సావిత్రి అందుకుంది — "ఇవ్వాళ నిమ్మకాయి. రేపు దబ్బ కాయి. ఇక పూళ్ళో ఎవళ్ళ కేవి కావలసినా మనమే మహా రాజులం. అలాగే వుంది చూస్తే ..." కోడళ్ళ గడుసుదనానికి సుందరమ్మగారు నిర్ఘాంత పోయింది. వాళ్ళని ధిక్కరించి మాట్లాడలేని దానిలా ఉండిపో యింది. నిమ్మకాయలకోసం వచ్చిన మనిషి సరాసరి రాజయ్యగారి దగ్గిరికే వెళ్ళి ఫిర్యాదు చేశాడు. "ఏమర్రా ? నిమ్మకాయలు లేవన్నారట?" పాలి కేక పెట్టారాయన.

భార్యామణి బోధతో విశ్వనాథంలేచి వెళ్ళాడు — "నిమ్మకాయలు బజార్లో లేవా?" అన్నాడు తండ్రిని ఉద్దేశించి — రాజయ్యగారు ఆశ్చ ర్యంగా కొడుకు మొహంలోకి చూశారు. "ఏమిటి విశ్వం, కొత్తగా మాట్లాడుతున్నావు ?"

"కాకపోతే ఏమిటి? ఇలా అప్పనంగా ఎన్నాళ్లు పంచి పెడతాం ?"

రాజయ్యగారి కేమీ అంతు పట్టలేదు.

"మీ కేమీ తెలీదు నాన్నా! బజార్లో నిమ్మకాయలు ఉన్నాయి. వీళ్ళకు కొనుక్కోగల శక్తి ఉంది. అయినా ఇక్కడికే వస్తారు. ఏమి టిది ?"

కొడుకు అధికారానికి రాజయ్యగారు నిర్ఘాంత పోయారు. కొడుకుతో సంఘర్షణ పడటం ఆయన కెంత మాత్రం ఇష్టంలేదు. నెమ్మదిగా వీధి గుమ్మం దగ్గరికి నడిచి నిమ్మకాయ కోసం ఎదురు చూస్తూన్న మనిషితో

— "నిమ్మకాయ బజార్లో కొనుక్కో బాబూ! వెళ్లు" అనేసి గిర్రున వెనక్కి తిరిగాడు.

తండ్రి వెనక విశ్వనాధం — "పోనీ ఈ సారి ఇవ్వమంటాను. కాని ... మరెప్పుడూ రావద్దని చెప్పండి" అన్నాడు.

రాజయ్యగారు అడ్డంగా తల తాటించాడు - "వద్దు వద్దు విశ్వం! ఇప్పుడే పొమ్మంటే తప్పకుండా బజార్లో కొనుక్కోవటం నేర్చుకుంటాడు. లేకపోతే నిమ్మకాయ వాడకమైనా మానుకుంటాడు." ఆయన కళ్ళు చెమ్మ రించబోతే అతి కష్టంమీద తమాయించుకొని వాలుకుర్చీలో కూలబడి పోయారు.

కొద్ది రోజులలోనే రాజయ్యగారికి తోట ఉందన్న సంగతి అంతా మర్చిపోయారు. రాజయ్యగారి మరణంతో - అప్పట్లో రాజయ్యగారికి తోట ఉండేదన్న జ్ఞాపకాలుకూడా మాసిపోయాయి.

కాసే పూసే తోట సమ్మె చేసింది. రాజయ్యగారి తదనంతరం తోటలో ఒక్క పిందె వెయ్యలేదు. ఒక్క పువ్వు పుయ్యలేదు. చెట్లన్నీ మోళ్ళయి నిలబడ్డాయి.

తోటను పునరుద్ధరించే భారాన్ని సీతాపతిమీద వేశాడు విశ్వనాధం. ఆరోజు సాయంత్రమే సీతాపతి పిల్లలందర్నీ దగ్గరికి పిల్చాడు - "రేపటి నుంచీ మనం తోటపని ప్రారంభించాలర్రా!" అన్నాడు ప్రశాంతంగా. పిల్లల కేమీ అర్థంకాలేదు - మధు అడిగేశాడు.

"తోటపనేమిటి మామయ్యా?"

సీతాపతి నెమ్మదిగా చెప్పాడు - "మీరు చిన్నపిల్లలప్పుడు మన పెరటితోట కన్నుల పండువుగా ఉండేదిరా? నాన్న పోయాక దాని గొడవే పట్టించుకోలేదు. రేపటినుంచి మళ్ళా బాగుచెయ్యటం మొదలు పెడితే కొన్నాళ్ళకి కాస్త దారిలో పడుతుంది."

"అయితే మనం ఏమేం చెయ్యాలి బాబాయ్!" ఉత్సాహంగా అడిగాడు మదన్.

"మీరంతా రోజూ చీకటితోనే లేస్తారా?"

"ఓ. అర్ధరాత్రయినా లేచిపోతాం నాన్నా ?" కుతూహలపడ్డాడు కృష్ణుడు.

"మీరంతా ప్రతిరోజూ కష్టపడి పనిచేస్తే ఈ వర్షాకాలం వెళ్ళేసరికి చూడండి, మన తోట ఎలా వుంటుందో! — తోటపని మొదలుపెడితే ఎంత సర్దాగా వుంటుందనుకున్నారేమిటి? చెట్ల కన్నిటికీ మొదళ్ళు గుల్ల చెయ్యాలి. మంచి ఎరువు వేసుకోవాలి. చక్కగా ఎరువు మనమే తయారు చేసుకోవాలి."

"ఎలా మామయ్యా ?"

"నే చెప్తాగా! తర్వాత పుల్ల విరిగిపోయిన కొమ్మలన్నీ కొట్టి పారెయ్యాలి - దక్షిణం వేపున నీళ్ళుజల్లి నేల తవ్వాలి. అక్కడ కూర పాదులు పెడదాం."

"రాత్రికి వర్షం వస్తుంది మామయ్యా! బాగా మబ్బులు పట్టాయి?" అన్నాడు సూర్యం.

"వర్షంవస్తే శ్రమలేదు. నేల తేలిగ్గా తెగుతుంది. రాళ్ళన్నీ ఏరి పారేసి విత్తనాలు నాటాలి."

"అవును మామయ్యా! మొక్కలన్నీ పెద్దవైపోతే బోలెడు కూర గాయలు కాస్తాయిగదూ ? నేను జమీందారుగారి తోటలో చూశాను. ఆ తోట ఎంత బావుంటుందనీ !"

"మన తోటనికూడా అంత బాగా తయారుచెయ్యాలి మీరు."

మదన్ అడిగాడు — "ఏం విత్తనాలు నాటుదాం బావాయ్!"

"నీకు ఏం కూరలు యిష్టమో చెప్పు ?"

"వీడు వంకాయకూర తెగ తింటాడు మామయ్యా! సత్యన్నారాయణ కేమో టమేటాలు బాగా యిష్టం. పచ్చివికూడా తినేస్తాడు."

"మరి నీకు ?"

"నాకు అన్నీ యిష్టమే."

"బాగా యిష్టమేదో చెబుదూ !"

"కొబ్బరికాయ. మా అమ్మమ్మ చెప్పదుగానీ నాకు బీరకాయలంటే బాగా యిష్టం."

సీతాపతి నవ్వాడు :- "ఒరేయ్! కొబ్బరిచెట్లు అన్నీ నువ్వే శ్రద్ధగా చూడాలి."

"నాకు చిలకడదుంపలు ఇష్టం నాన్నా!" అడగకుండానే చెప్పాడు కృష్ణుడు.

"అవి ఎలా పండుతాయేమిటి ?"

"మనకి శ్రద్ధ ఉంటే అన్నీ పండించ వచ్చురా! ఈ సంవత్సరానికి దుంపల సంగతి వదిలేద్దాం."

కృష్ణుడు మొహం అర్ధణా కాసులా తయారైంది, మధూకి జాలి వేసింది - "పాపం దావకి ఎలా మామయ్యా ?"

"బజార్లో కొనుక్కుంటాం కదురా! ఏం నీకు కోపం వచ్చిందా?" సీతాపతి కొడుకుని బుజ్జగించాడు.

"మరి పూలమొక్కలన్నీ ఎండిపోయాయి కదూ డాడీ ?"

"పువ్వులెందుకు నాన్నా ? మనం పెట్టుకోంగా ?"

"చిన్నత్తా, పెద్దత్తా, సుధా, సుశీలా వాళ్ళంతా లేరేమిటి ?"

"అసలు అన్నిటికన్నా ముందు పూలమొక్కలవనే చూడాల్రా! గులాబీ చెట్లు ఎండిపోతున్నాయి. మల్లెమొక్కలన్నీ మరుగుజ్జు వాటిలా తయారయ్యాయి."

"ఆకు దూసెయ్యాలి మామయ్యా ? నాకు తెలుసు."

"అవును. ఆకు దూస్తే బాగా ఎదుగుతాయి."

"మామయ్యా! అక్కడి జమీందారుగారి తోటలో తెల్లగులాబీలు ఎంతో చక్కగా ఉంటాయి. అలాంటి మొక్కలు మనమూ వేద్దామా ?"

"తెల్లగులాబీ మనకు ఉండనే ఉందిరా! సపోటా చెట్టకి వెనుక వేపు మడిలో అన్నీ తెల్లగులాబీలే. తోటంతా ఎందుకో పాడైపోయింది. రోజూ ఉదయం, సాయంత్రం మీరంతా ఒక్కవంచి పనిచేశారంటే మనకు కాయలూ, పళ్ళూ, పువ్వులూ కొల్లలేకదా ?" పిల్లలందరూ ఉత్సాహంతో గంతులేశారు. "ఎప్పుడు లేపినా లేచిపోతాం."

"అసలు నాకు నిద్రే పట్టదు."

"నేను గునపంతో బాగా తవ్వగలను."

"బాబాయి ఏపని చెప్పినా చేసిపారేస్తాను."

ఆ క్షణాన వదిలేస్తే తోటంతా తవ్విపారేసేలా ఉన్నారు పిల్లలు. మధూకైతే ఆ రాత్రి నిద్ర పట్టలేదు. పట్టిన కాసేపూ తోటలో చెట్లమధ్య గంతులేస్తూనే వున్నాడు. మధుకి చక్కటి కలకూడా వచ్చింది. తోటంతా అచ్చం పద్మావతివాళ్ళ తోటలాగే ఉంది — తను దర్జాగా పళ్ళు కోసి స్నేహితు లందరికీ పంచిపెట్టేస్తున్నాడు. పువ్వులు కోసికెళ్ళి కనపడిన అందరికీ వాళ్ళందరికీ యిచ్చేస్తున్నాడు. సుధ కూడ తన పక్కనే ఉంది "ఇదిగో సుధా! నీకు ఈ పువ్వు" అంటూ నాగరంవంటి తెల్లి గులాబీ యిచ్చాడు. సుధ నవ్వింది.

మధుకి చల్లటి గాలికొట్టి మెలుకువ వచ్చింది. మందువాలోంచి వర్షం దబదబా పడుతోంది.

"నిజమే వాన వచ్చేసింది!" అనుకుంటూ అమ్మమ్మ పంచె కప్పుకొని చూస్తూ పడుకున్నాడు. మదనగోపాలం గుర్రు కొడుతున్నాడు. సత్తిగాడూ, కిష్టిగాడూ ఇద్దరూ దుప్పట్లో ఉండల్లా చుట్టుకు పడుకున్నారు. మధుకి ఎంత కళ్ళు మూసుకున్నా నిద్రరాలేదు దొడ్లోంచి కోడి కూత వినిపించింది. కప్పుకున్న పంచె విసరి పారేసి లేచి కూర్చున్నాడు. మెల్లిగా చిన్నత్త గదిముందుకు వెళ్ళి నించున్నాడు. "బొత్తిగా చీకటిగా ఉంది. అత్త తిడుతుందేమో!" — పిల్లిలా వెనక్కి తిరిగి అమ్మమ్మ పక్కలో దూరిపోయాడు.

"లేవవేంరా? అసలు నిద్రేపోనన్నావే?" మదనుడు రెక్క పట్టుకు వూపి లేవదీశాడు. మధు కళ్ళు నులుముకొని చూశాడు — తెల తెలవారుతోంది. అమ్మమ్మ మజ్జిగ చేస్తూన్న చప్పుడు వినిపిస్తోంది. సన్న సన్నగా తుంపర్లు పడుతూనే ఉన్నాయి. ఈదురుగాలి వీస్తూ చలి చలిగా ఉంది.

"మరి మామయ్య ఏడి?"

"ఇంకా లేవలేదు. గుమ్మం దగ్గరికివెళ్ళి నువ్వు పిలు. లేస్తాడు."

మధు తలుపులమీద కొడుతూ - "మామయ్యా! తెల్లారిపోతోంది. ఏటపని చేద్దాం అన్నావుగా?" అన్నాడు గట్టిగా.

మెలకువగానే పడుకొనివున్న సీతాపతి బద్ధకంగా ఒత్తిగిల్లాడు — "మీరందరూ లేవండా! నే నెంతసేపు? వచ్చేస్తాను."

మధు హుషారుగా మంచాలకేసి పరిగెత్తాడు.

"ఒరేయ్! లేవరేంరా?" దుప్పటి లాగటంతోనే సత్యనారాయణ లేచిపోయాడు - మధు హడావిడికి సూర్యం లేచి పక్కనర్ది కూచున్నాడు. జారిన దుప్పటి నెమ్మదిగా పైకి లాక్కోబోతూన్న కృష్ణుణ్ని కనిపెట్టి గట్టిగా అరిచాడు మధు — "అమ్మదొంగా! లేవకుండా ఇంకా పడుకొంటున్నావా?"

కృష్ణుడు విన్పించుకోకుండా ముసుగు తన్నాడు. చిలకడదుంపలు వెయ్యటం వీలుకాదన్నప్పుడే వాడిలో ఉత్సాహమంతా చచ్చిపోయింది.

"లేవవేంరా? మళ్ళా పడుకున్నావ్?"

కృష్ణుడు ముసుగులోంచే జవాబిచ్చాడు—

"నేను రాను. నా చిలకడదుంపలు కాస్తాయా ఏమిటి?"

"అయితే? మరి నువ్వు ఇంకేమీ తినవా?"

"నాకేం అక్కర్లేదు."

"నీ మాటలన్నీ ఉత్తదేగాని లేవరా?" మళ్ళా దుప్పటి లాగి పారేశాడు మధు.

కృష్ణుడు ఒక్క పొలికేక వేశాడు - "అమ్మా! వీడు చూడమ్మా! నన్ను పడుకోనివ్వడంలేదు."

గుమ్మంలో నిలబడిన సీతాపతి - "ఇంకా పడుకోవటం ఏమిట్రా? అందరూ లేచారు నువ్వూ లే." అన్నాడు సావిట్లోకొస్తూ.

కొడుకు ఫిర్యాదు విన్న సావిత్రి పొయ్యి దగ్గిర ఉండి అంది - "వాడికసలే రొంపగా ఉంది. మంచులో తడుస్తూ ఏం పని చేస్తాడు? కావాలంటే సాయంత్రం వస్తాడు. ఇప్పుడు వాణ్ని పడుకోనివ్వండి."

దొడ్లోకి వెళుతూ మరదలి మాటలు విన్న విశ్వనాథం వెనక్కి తిరిగి చావిట్లోకి నాలుగడుగులు వేశాడు — "పోనీ వాణ్ణి లేపకండి!"

"ఉత్తది మామయ్యా! వాడికి రొంప లేదు, ఏమీ లేదు. ఊరకేనే పడుకున్నాడు" ధైర్యంగా అనేశాడు మధు.

"నోరు మూసుకొని నువ్వు వెళ్ళవోయ్, వాడే వస్తాడు సాయంత్రం" విశ్వనాథం దొడ్డివేపు వెళ్ళిపోయాడు.

మధు పళ్ళు నూరుకున్నాడు—"కిష్టిగాడెందుకు రాడు? దర్జాగా పడుకుంటాడా? అయితే మనం కూడా వెళ్ళొద్దురా గోపాలం" అన్నాడు కసిగా.

'వాడు సాయంత్రము వస్తాడటగా?'

'మనమూ సాయంత్రం వెళదాములే.'

"పెదనాన్న తిడతాడురా!"

సూర్యం చిన్న చిన్న గునపాలూ, పారలూ మోసుకు వచ్చాడు. వాటిని చూస్తూనే మధుకి సరదా వేసింది.

"పోనీ రండ్రా! మనమే పోదాం — దొంగ కిష్టిగాడు చూడు. ఎత్తు వేసి పడుకున్నాడు."

తీరా బయల్దేరబోతుంటే పార్వతి రానేవచ్చింది.

"—ఒరే! సత్యం నువ్వెక్కడికిరా? అసలే అర్భకం వెధవ్వి. నువ్వేం పని చేస్తావురా?" అంది. పిల్లిలా జారుకోవాలని ప్రయత్నిస్తున్న సత్యన్నారాయణ గతుక్కుమన్నాడు. రాత్రి పార్వతి వాడికి చెప్పనే చెప్పింది-పనీ గినీ ఏమీ ముట్టుకోవద్దని — అది వాడికేం నచ్చలేదు. చక్కగా అందరితో కలిసి, తోటలో మట్టిలో మొక్కలపని చెయ్యాలని మహా సరదాగా ఉంది. అందుకే తను వెళుతున్నట్టు పిన్ని గ్రహించు తుందేమోనని లేచింది మొదలు మౌనవ్రతం సాగిస్తూ నించున్నాడు. తీరా బయల్దేరబోయేముందే పిన్ని ఆటంక పెడితే వాడికి ఏడుపు వచ్చినంత పనైంది.

"ఫర్వాలేదు పిన్నీ! నేనూ వెళతాను" నసిగాడు. పార్వతి ఒప్పుకోలేదు — "ఒద్దు బాబూ! ఏ చెయ్యో కాలో విరగ్గొట్టుకుంటే మీ అమ్మ

నాపటికి దేవుళ్ళాడుతుంది. చదువుకుంటావని పంపించి గాని, మాకు చాకిరీ చెయ్యమనా ఏమిటి?"

సత్యన్నారాయణ కర్రలా బిగిసి నిలబడిపోయాడు.

"సరే! పదండి" అంటూ సూర్యం బయల్దేరటంతో మధు గట్టిగా అన్నాడు —"పదరా గోపాలం! అన్నయ్యా, నువ్వూ, నేనూ చాలమా? ఈ దొంగ వెధవలు అసలు రానేవద్దు."

సత్యన్నారాయణ బాధగా చూశాడు.

కిష్టిగాడు దుప్పటి కదపలేదు.

సీతాపతి చూపించిన చోటల్లా చకచకా తవ్వి పారెయ్యటం—గంపలతో మట్టిరాసులెత్తి మోస్తూ పల్లాలు మెరక చెయ్యటంతో ప్రారంభమైంది తోటపని. చేసింది ముగ్గురే అయినా ఆ పూట చాలా దిబ్బలు పల్లాల్లోకి నడిచాయి. పని బాగా సాగింది.

సూర్యుడు సరదాపడి పైకి లేచి వస్తున్నాడు. "నేను చెప్పినట్టు గొయ్యి తీసి ఇక ఈ పూటకి పని ఆపండిరా!" అన్నాడు సీతాపతి ఇంట్లోకేసి వెళుతూ.

"బాబాయి వెళ్ళిపోయాడురా! మనమూ పోదాం, గొయ్యి రేపు తీద్దాంలెద్దూ! ఆకలేస్తూంది." విసుక్కున్నాడు మదనగోపాలం.

"రేపు ఇంకోపని — గొయ్యి తియ్యటం ఎంతసేపురా? మీరు తవ్వండి. నేను మట్టి తీసేస్తాను." ఉత్సాహం కనపర్చాడు మధు. మధుకి కూడా ఆకలి దహించుకుపోతోందిగానీ...గొయ్యి తీసేస్తే ....

"రేపైనా మనమే చెయ్యాలి. ఇవ్వాళ సెలవు గూడా, రా! మదనా! గునపం తీసుకో" సూర్యం కూడా చెప్పటంలో గోపాలం లొంగక తప్పలేదు.

గొయ్యి తియ్యటమేకాదు, అందులో నాలుగుతట్టల ఎండుటాకులూ —నాలుగు తట్టల పేడా వేస్తేగానీ తృప్తి కలగలేదు. గర్వంగా ఇంటికి బయల్దేరారు ముగ్గురూ.

సత్యన్నారాయణ తెల్లబట్టలు వేసుకొని నున్నగా తల దువ్వుకొని తుంగచాపమీద కూర్చుని ఎక్కాలు చదువుకుంటున్నాడు. తోటలోంచి

వచ్చిన వాళ్ళని చూసీ చూడనట్టు – మొహం చెల్లక కాబోలు కంఠం హెచ్చించి ఏమిష్టులో మునిగిపోయాడు. ఇక కృష్ణుడు ఇంట్లోనే లేడు. కొంప ఎక్కడికి పోయిందోనని వెతుక్కోవటానికి పోయాడు కాబోలు.

మధుకి సత్యన్నారాయణని చూస్తోంటే జాలి వేసింది. పాపం వాడి తప్పేమీ లేదనిపించింది – "ఒరేయ్! నీకు నిజంగా రావాలని లేదూ? పోనీ సాయంత్రం వస్తావా?" అన్నాడు దగ్గిరికి వెళ్ళి.

గదిలోకి వెళుతూన్న పార్వతి మధునిచూసి ఆగిపోయింది – "ఆ మట్టికాళ్ళతో కొత్తచాప తొక్కుతావా ఏమిటి? ఏమిటా మీద నుంచోటం?" అంది. మధు కాళ్ళకేసి చూసుకున్నాడు. కాళ్ళు కడుక్కోనిమాట నిజమే. అయితే మాత్రం? — మాట్లాడకుండా దొడ్లోకి వెళ్ళిపోయాడు — పార్వతి ప్రత్యేకంగా సత్యన్నారాయణ చదువుకోసం కుంచెడు ఒడ్లుపోసి ఆ రంగచాప కొంది. గాదిలోంచి ఒడ్లు తీయిస్తూ స్వగతంలా అనుకొంది కొంచెం గట్టిగా – "మాకేం పిల్లా? జెల్లా? మాకు రావలసిందంతా తీసు కోవటం లేమగా?"

సత్యన్నారాయణ వచ్చిన దగ్గర్నుంచీ పార్వతి ప్రవర్తన సావిత్రి కనిపెడుతూనే ఉంది. సుధనో, కృష్ణుణ్ణో ఆప్యాయంగా దగ్గిర కూర్చో పెట్టుకునేది. వాళ్ళని పిలవటమే మానేసింది. ఏది ఉన్నా సత్తిగాడికి పెట్టటం .. డబ్బులిస్తే వాడికే ఇవ్వటం – ఏది చేసినా సత్యన్నారాయణకే —దొంగకు తేలు కుట్టినట్టు లోలోపల అనుకోవటం తప్పితే ఏమీ చేయ లేక పోయింది సావిత్రి.

గబగబా మొహాలు కడుక్కుని వాన చినుకులు పడి తడిసిన తలలు చొక్కాలతో తుడ్చుకొని ఆపురావురుమంటూ అన్నాలకు వచ్చి కూర్చుండే సావిత్రి నెమ్మదిగా అంది – "పప్పన్నం అయిపోయింది. పిడికెడుంటే సుధకీ, సుమకీ పెట్టేశాను. ఎంతసేపు? ఎసట్లో బియ్యం వెయ్యనే వేశాను కూర్చోండి. వార్చేస్తాను."

పిల్లలకి మండిపోయింది. మళ్ళా చద్దన్నం లేదూ? "మరి చద్దన్నం తినకుండానే కృష్ణుడెలా వెళ్ళిపోయాడు?" అన్నాము గోపాలం మంటగా.

"వాడికేం? ఎంచక్కా గ్లాసెడు పాలు తాగేస్తాడు. నీకు తెలీదే మిటి?"– అన్నాడు మధు కసిగా. "చాల్లే వూరుకో. గ్లాసెడంటావు చెంబె డంటావు! వాడు మాత్రం పాలేందుకు తాగులాడు? ఆకలి కడుపుతోనే ఉండమంటే వినకుండా ఎక్కడికో చదువుకుంటానని పోయాడు." సావిత్రి కసిరింది.

"అస్తమానం చద్దన్నం లేదంటావేం?" అన్నాడు మధు కోపంగా. చద్దన్నం ఉండకపోవటంలో అంతరార్థం సుందరమ్మగారికి చెప్పితే ఎప్పటికీ తెలీదు – సత్యనారాయణను చద్దన్నం తినడం మాన్పిం చేసింది పార్వతి – "అసలే అర్భక వెధవ! ఈ వర్షాకాలం వాడికి చద్దన్నం అరుగుతుందా? చనుందా?" అంటూ ఓ గ్లాసెడు పాలు ఎర్రగా మరగబెట్టి పంచదార కలిపి తాగించటం ప్రారంభించింది. సత్యనారా యణకి మొదట్లో కాస్త సరదా వేసినా రోజూ పాలే తాగటం నచ్చలేదు—— ఒకరోజు పాలగ్లాసు అందుకోకుండా – "నాకు పాలువద్దు పిన్నీ! చద్ద న్నమే తింటాను" అన్నాడు ఆశగా.

"అమ్మో! వద్దు. ఈ వర్షాకాలం ఏ కడుపు నొప్పైనా వస్తే మీ అమ్మ నాకుబడి దేవుళ్ళాడుతుంది."

"మా అమ్మ నాకు చద్దన్నమే పెట్టేది పిన్నీ"

పార్వతి క్షణం తీక్షణంగా చూసింది.– "ఏంరా? నువ్వూ పెంకి తనం నేర్చుకొంటున్నావా? ముద్దు పెట్టుకోబోతే మూతి నాకిందట – వాగానేవుంది! లక్షణంగా పాలు తాగమంటే నచ్చటంలేదూ? ఊఁ గ్లాసు తీసుకోవేం?" ఒక్క కసురు కసిరేసరికి సత్యనారాయణ తలవంచుకునే గ్లాసు అందుకున్నాడు – సత్యనారాయణకి ఇష్టం లేకపోయినా పాలు తాగటం తప్పలేదు – "ఛీ! వెధవ వానలు! ఎప్పుడు పోతాయో! వాన కురవని రోజు కూడా పాలే తాగాలి" మనస్సులో విసుక్కున్నాడు.

సత్యన్నారాయణ చద్దన్నం మానేసి పాలు తాగటం సావిత్రి కేమీ నచ్చలేదు. పైకి ఏమైనా అంటే పార్వతి వూరుకోదు — "నా వాటాకి సగం పాలు వస్తాయి" అంటుంది. ఎటొచ్చీ దానికి పిల్లలు లేరు. తనకు ఉన్నారు. ఖర్చు తనదే మరి. ఈ మధ్య సావిత్రి కొత్త ఆలోచనలు నేర్చింది — కోపం కెలకపేసినప్పుడల్లా తన వంటరోజు మర్నాటికి అన్నం మిగలకుండా తూచినట్టు బియ్యం పోస్తుంది. కృష్ణుడికీ, సుధకీ ఒక్కోసారి సుశీలకి కూడా వాళ్ళతోపాటు పాలు ఇచ్చేస్తుంది. ఎటొచ్చీ అన్నం ఉడికే వరకూ ఆకలి కడుపులతో మాడుతూ కూర్చోవలసింది సూర్యం—మధూ—గోపాలమే. చద్దన్నం ఉండకపోవటంలో అంతరార్థం సుందరమ్మగారు గ్రహించినా ఏమీ చెయ్యలేదు. కోడళ్ళు ఆవిడ మాట వింటారనే భ్రమ ఎన్నడూ లేదు. పార్వతి తలనొప్పిగా ఉందని పడుకుంటే ఆరోజు కూడా సావిత్రి వంట కుపక్రమించింది.

తోటలో పనిచేసి ఆకలితో వస్తూ వస్తే చద్దన్నం లేదనేసరికి మధూకి కోపం వచ్చేసింది—వాడితోపాటు గోపాలం కూడా లేచి వచ్చేశాడు.

సత్యన్నారాయణా, సుధా జీడిపప్పు ఉండలు తింటూ కబుర్లు చెప్పుకొంటున్నారు స్తంభానికి ఆనుకొని. వాళ్ళిద్దర్నీ చూస్తూ నిలబడి ఉంది సుశీల. సుశీలకి కూడా ఆ ఉండ తినాలని ఆశగా ఉంది. సుశీల కళ్ళెత్తి మధుకేసి చూసింది. "అమ్మమ్మ నడిగి మనమూ తెచ్చుకుందాం రా చెల్లీ!" అన్నాడు మధు. సుశీల చేతులు తిప్పుతూ లేవన్నట్టు సైగచేసింది.

"అమ్మమ్మ దగ్గిర లేకేం ! ఉంటాయి. రా ! తెచ్చుకుందాం" సుశీలను వెంటపెట్టుకొని సుందరమ్మగారి దగ్గిరకి వెళ్ళాడు మధు.

"అమ్మమ్మా ! మాకు జీడిపప్పు ఉండలు పెట్టవూ ?"

"ఎక్కడివి ?"

"అవే. సత్యన్నారాయణ, సుధా తింటున్నారు."

"అవా? సత్యన్నారాయణకు వాళ్ళమ్మ చేసి పంపించి వాళ్ళ వూరు నుంచి, మనకెలా వస్తాయి ?"

"మరి సుధ కూడా తింటున్నదిగా ?"

"పెద్దత్త దానికి కూడా పెట్టింది కాబోలు." సుందరమ్మగారు క్షణం మాట్లాడకుండా ఉండి అంది. —"పోనీలే బాబూ! అన్నం లేక పోతే చస్తాంగానీ, ఇలాంటి తిళ్ళు లేకపోతే చస్తామా ? నీకు మాత్రం తెలీదా ? నన్ను అడిగితే నే నెక్కడ తెచ్చిపెట్టగలను చెప్పు ?"

మధు మాట్లాడకుండా వింటున్నాడు. అమ్మమ్మతో తప్పకుండా పెట్టిస్తానని సుశీలక్కి ఆశ పెట్టాడు. పాపం దానికి ఎలాగ పెట్టడం ?

"ఒరే! మధూ! మాట—" నెమ్మదిగా పిల్చాడు గోపాలం. వాడు చెయ్యి చొక్కాక్రింద దాచుకున్నాడు. చేతిలో ఏదో తాయిలం ఉన్నట్టుంది. గోపాలం మధునీ, సుశీలనీ గోడ చాటుకు తీసుకుపోయాడు. సంతోషంగా చొక్కా కిందనుంచి మరమరాల ఉండ పైకి తీశాడు. అది గుండ్రాయిలా చేతికి అబ్బకుండా ఉంది.

"ఇదెక్కడిదిరా, మదనా ?"

"సత్తిగాడి అమ్మ పంపిందట. జీడిపప్పు ఉండలు అయిపోయా యట. పాపిష్టి పెద్దమ్మ ఎవరికీ చూపించకుండా తినెయ్యమని ఇచ్చింది. అందుకే దొంగతనంగా తెచ్చాను. నీకు పెట్టకుండా నేనెలా తినేదిరా ? మొన్న హరిగాడు నీకు జీడీ ఇస్తే ముక్క నాకు ఇవ్వలా నువ్వు ? తీసు కోరా! నీకు కొంచెం, సుశీలకు కొంచెం."

"నాకు వద్దులే. మా చెల్లికి పెట్టు."

"అలాక్కాదు. ముగ్గురం కొంచెం కొంచెం తిందాం. నువ్వు తినక పోతే నేను తింటా నేమిటి ?"

మధూ, సుశీలా చేతులు జాపారు.—"గోపాలం! పెద్దత్త నీకు మాత్రం ఎందుకు పెట్టిందీ?"

"మా అమ్మ పంపించినవన్నీ సత్తిగాడు తినటం లేదా ఏమిటి ? పెద్దనాన్నా, పెద్దమ్మా కూడా తింటారుగా నావి !"

అంతలో సావిత్రి అన్నాలకు పిలిచింది.

* * *

నిత్యం రెండు పూటలా తోటపని జరిగి తీరాల్సిందే. అది విశ్వనాధం ఆజ్ఞ! అన్నగారి ఆజ్ఞ పాటించటం సీతాపతి విధి!

"ఈ పూట నారింజ చెట్ల మొదళ్ళు తవ్వండి."

"గులాబీచెట్లు పొగల్లా ఎదిగి గాలికి వాలిపోతున్నాయి. కొత్త గడలు నాటుపెడితే బాగా ఉంటాయి. దొడ్డి వెనక తుప్పలవెంట కాసిన్ని గడలు నరుక్కురండి."

"పొట్లపాదుకి పందిరి వెయ్యాలి తొందరగా. అది మరీ ఏపుగా పాకిపోతుంది."

"మల్లి మొక్కల ఆకు దూసెయ్యండి. గుబుర్లుగా ఆకంతా ముదిరిపోయింది."

సీతాపతి ప్రతిపూట కొన్ని పనులు పురమాయిస్తాడు. అవి మరో పూటకల్లా చేసి చూపించాలి – విశ్వనాధం ఆగ్రహానికి గురి అయ్యే సాహసం ఎవ్వరికీ లేదుమరి.

కిష్టిగాడు తోటపనికి ఎప్పుడూ దొంగే. నాలుగైదు రోజులకు ఒక్కసారివచ్చి ఏదో చేసినట్టు నటించి పోతాడు. అయినా వాళ్ళేమీ అనరు. ఇక సత్తిగాడు పాపం అర్భకుడు. పనులేమీ చెయ్యలేడు. మదన గోపాలాన్ని ఎవ్వడూ నిర్బంధించకపోయినా వాడు అందరికన్నా ముందుగానే తయారవుతాడు. చదువుకోవటం తప్పిపోతుందిగా మరి? సూర్యానికి ఏ ఆలోచనా లేదు. పెద్దవాళ్ళు చెప్పారు. చేసితీరాల్సిందే. ఇక సమస్యంతా మధులోనే. అందరూ చేస్తే తేలిగ్గా అవుతుంది కదా! కిష్టిగాడు ఊరు పట్టుకు తిరుగుతాడుగానీ పని ముట్టుకోడేం? సత్తిగాడు కొమ్మలమీద పాకుతూ కోతిలా ఆడుకోగలడు. కానీ పని చెయ్యలేడేం? మదనుడికేముంది? చేస్తే చేస్తాడు, లేకపోతే లేదు. ఇక తనూ, సూర్యా, తనూ పని మనుషుల్లా చేసితీరాల్సిందే.

ఒకసారి టమాటా నారుకి మళ్ళు కట్టటంలో కిష్టిగాడికీ మదనుడికీ తగూ వచ్చింది. మదనుడికి బాగా కోపం వచ్చేసింది. చేతులు దులుపుకొని లేచిపోయాడు. "నే నసలు ఏ పనీ చెయ్యను" అనేసి తోటలోంచి

వెళ్ళి పోయాడు. మదనుడి అపరాధానికి ఆ రాత్రికి విశ్వనాధం ముందు విచారణ !

"నన్ను తిట్టాడు పెదనాన్న" ఏడవబోయాడు కిష్టిగాడు.

"ఉత్తదే. నేనేమీ అనలా. పని చెయ్యనని వచ్చేశానంతే —" భయం భయంగా చెప్పుకున్నాడు మదనుడు. "కావాలంటే మధుని అడుగు"

"పిల్లికి ఎలక సాక్ష్యం బాగానే ఉంటుందిలే. అయినా నువ్వు పని చెయ్యనని బెదిరించటం ఏమిటి ? ఎవడికోసం చేస్తావురా ? అప్పనంగా ఇక్కడ పడి తినటం అనుకున్నావేమిటి ?"

మదన గోపాలం తల దించేసుకున్నాడు. "మాట్లాడవేం ? మధుగాణ్ని చూసి నేర్చుకుంటున్నావా ?" మీది మీదికి వచ్చాడు విశ్వనాధం — "ఈ సారి పని మానేశావో వీపు చీరేస్తాను. మీ బామ్మ నిన్ను నా ఇష్టం వచ్చినట్లు చేసుకోమని అప్పగించింది, తెలుసా ? ఈ సారికి వదిలేస్తున్నా."

గోపాలం ఎన్నడూ ఎరగని ఆ బెదిరింపులకు వణికిపోయాడు. వాడి వూహ తెలిశాక ఒక్క దెబ్బ కూడా పడి ఎరుగడు. విశ్వనాధం మాటలలో వాడికి ఏడుపు వచ్చినంత పనైంది — అనుకోకుండా ఆ రోజే గోపాలం వాళ్ళ అన్నయ్య వచ్చాడు - తముణ్ని చూడటానికి. గోపాలాన్ని వీధిలోకి తీసుకెళ్ళి ఏదో అడగబోతే బావురుమన్నాడు గోపాలం — "నన్ను పెదనాన్న కొడతానని తిట్టాడు అన్నయ్యా ! ఎప్పుడో నిజంగా కొట్టేస్తాడు కూడా. అస్తమానూ మధూని అలాగే కొడుతూ ఉంటాడు" అంటూ గోల పెట్టాడు. గోపాలం అన్నయ్య సావకాశంగా అంతా తెలుసుకుని తమ్ముణ్ని ఓదార్చాడు. "ఛ ! ఏదో బెదిరించాడు గానీ ఎందుకు కొడతాడు ?"

"ఏమో ! నేను ఇక్కడ ఉండను."

"చాల్లే. ఈ మాత్రానికే అక్కడికి వచ్చావంటే బామ్మ అసలే తంతుంది."

చిక్కమొహం వేశాడు గోపాలం. "నీ కెందుకు నువ్వూరుకో. నీ ఒంటిమీద చీమ పాకకుండా నేను చూస్తానుగా."

గోపాలం అన్నయ్య వెళ్ళిన నాలుగో నాటికే విశ్వనాధానికి ఉత్తరం వచ్చింది. అది గోపాలం బామ్మ విశ్వనాధాన్ని పుత్ర పౌత్రాభి వృద్ధిగా దీవించి వ్రాయించింది. సమాచారం ఏమిటంటే "మదన గోపాలం అంటే ఆవిడకు బహిఃప్రాణం. దానికి కారణ మేమిటంటే వాడికి ఆవిడ పేరూ, భర్తగారిపేరూ రెండూ కలిపి మరీ పెట్టారు. ఆవిడ పేరు గోపాల రత్నం. ఆయన పేరు మదన కామయ్య — అందుకే మదనుడి పేరు — మదన గోపాలం. అదీ ఉపోద్ఘాతం — తర్వాత ....

గోపాలుడిది "వెన్నలాంటి మనస్సు. కసిరినంత మాత్రానే గుడ్ల నీరు తిప్పుకుంటాడు. తెల్లనివన్నీ పాలూ, నల్లనివన్నీ నీళ్ళని నమ్మే స్తాడు. వెర్రి నాగన్న. పిచ్చి వెంకన్న. కుర్ర సన్యాసి — అదీ గోపా లుడి వ్యక్తిత్వం. అటు వెనుక ....

వాడిని తమ చేతులతో దండించలేకనే పొరుగు వాళ్ళ ఇంటికి పంపించింది. కాని అహర్నిశం ఆవిడ ధ్యాసంతా వాడి మీదనే. కుర్ర సన్నాసి ఏమైపోతున్నాడో — ఎలా తింటున్నాడో, ఎలా ఉంటున్నాడో అలా — అలా పరాయివాళ్ళు పిచ్చి నాగన్న నేమైనా చేస్తారనుకుంటే ఆవిడ వూపిరి బిగబట్టుకు పోతుంది. గర్భకోశం దహించుకు పోతుంది. నవనాడులూ కృంగిపోతాయి. గుండె దడదడ లాడుతుంది. చివరికి కళ్ళల్లో నీళ్లు తిరుగుతాయి. అదీ ఆవిడ అనురాగం.

ఇక బహిరంగం: మొన్న పెద్దాణ్ని చూసి కుర్రసన్యాసి వాపుపు మన్నాడట. భయపడ్డాడో ఏమో। పెద్దవాళ్ళు బెదిరించినా ఏపాటి తప్పు లేదు గాని ... అయినా .... పరాయివాళ్ళ ఇంట్లో వుంచి బాధ కలిగించ కుండా తీసుకువెళ్ళిపోతే బావుండునేమోనన్న ఆలోచనగా ఉంది వాళ్ళి. అప్పనంగా తిండికి పెట్టాలన్న ఉద్దేశ్యం ఎన్నడూ లేదు. పండుగ వెళ్ళాక కొత్త ధాన్యాలు వచ్చాక వాడి ఖర్చులన్నీ పంపించాలని అనుకుంటూనే మము గాబట్టి ...."

ఆ ఉత్తరం విశ్వనాథాన్ని ఒక్క కుదుపు కుదిపింది. అతి సామాన్య మైన విషయంలా తీసి పారెయ్యటానికి ప్రయత్నించి ఆ ఉత్తరం చించి పారేశాడు. గోపాలాన్ని పల్కరించటమే తగ్గించేశాడు.

* * *

ఎంత ఉత్సాహంగా చేస్తున్నా — చేసింది తక్కువా, చెయ్యాల్సింది ఎక్కువా ఉంటోంది తోటపని. ఒకరోజు సీతాపతి అన్నాడు — "ఒరేయ్ మధూ! నీకు చాలా బలగం ఉందట కదూ? అప్పుడప్పుడూ సెలవు రోజుల్లో తెసుకొస్తూ ఉండరాదూ? కాస్త తోటపని తొందరగా అవుతుంది."

ముందు అర్థం కాకపోయినా తొందరగా గ్రహించు కున్నాడు మధు. పట్టరాని సంతోషం వేసింది — తన స్నేహితుల నందర్నీ తీసుకు వచ్చి తోటపని చేయించమంటే ఇంకేం? చిటికెల్లో చేయించగలడు.

"ఆ పేటలో చాలమంది పిల్లలకన్నా మధు చిన్నవాడే అయినా ఆటల్లో నాయకత్వం మధూకి దక్కింది. మధు ముఠాలో డజను మంది పైగా సభ్యులున్నారు. అందరూ మధు మాట వేదవాక్కులా పాటించి తీర్తారు. ఏ ఆట ఆడాలంటే అదే! ఎలా జట్లు విడమంటే అలాగే! ఎవర్ని పీడప్లిగా ఉంచమంటే వాళ్ళే! ఎవరింటి దగ్గరంటే అక్కడే! మధు స్నేహితులందరికీ ప్రాణం. స్నేహితుల్లు మధుకి దేహం!

మధు ముఠా విశ్వనాథం తోటపనిలో జొరబడింది. మధు అందర్నీ జట్లు జట్లుగా విడదీశాడు. అన్ని జట్లకీ తలకోపని పురమాయించాడు. మళ్ళు కట్టి విత్తనాలు నాటటం — మొక్కలకు నీళ్ళు పొయ్యటం — పాదులకు పందిళ్ళు వేయటం — పిడపురుగుల్ని ఏరి పారెయ్యటం — దిష్టి బొమ్మలు కట్టి ప్రేళ్ళాడ దియ్యటం ఇత్యాది పనులన్నీ అతి సునాయా సంగా జోరుగా సాగి పోయాయి. రోజు రోజుకీ తోట కన్నుల పండువుగా తయారు కాసాగింది.

వేసంగి సెలవులకు సత్యన్నారాయణా, మదన గోపాలం ఇళ్ళకు వెళ్లలేదు. వాళ్ళిద్దరికీ ప్రయివేట్లు చెప్పించి బళ్ళు తియ్యగానే హైస్కూల్లో చేర్పిస్తారట. ఆ ప్రయివేటేదో సీతాపతే చెప్పటానికి మాట్లాడుకున

సీతాపతికి అంత తెలివితేటలు పుట్టటం అన్నగారి సలహామీద మాత్రమే. కృష్ణుడ్నికూడా హైస్కూల్లో చేర్పించాలంది సావిత్రి – ఆ రాత్రి సీతాపతి కొడుకుని దగ్గర కూర్చోబెట్టుకుని వాడి చదువు సంధ్యల పరిశీలన కుపక్రమించాడు – "పదమూడో ఎక్కం అప్పజెప్పరా!"

తెలకన్ను వేశాడు కృష్ణుడు.
"అదేం? అలా చూస్తావ్? రావా?"
అడ్డంగా తలవూపాడు వాడు.
"నువ్వురా గోపాలం?"

ఐదారు తప్పులతో నట్టుతూ నట్టుతూ అప్పగించాడు గోపాలం. సత్యన్నారాయణకి బాగానే వచ్చింది. మధు మాత్రం జలపాతపు ప్రవాహంలా ఎక్కడా తడుముకోకుండా ఒప్పేస్తున్నట్టే అప్పగించాడు.

కొడుకుకి పదమూడో ఎక్కం రాకపోతే సీతాపతికే సిగ్గువేసింది — "అసలు నీకు ఎన్ని ఎక్కాలు వచ్చురా?"

కృష్ణుడు మాట్లాడలేదు.

"వాడికి ఐదు వరకే వచ్చు మామయ్యా! నాకు ఇరవై కూడా వచ్చు" మధు అతిశయంగా అన్నాడు.

"నిన్నా నేను అడిగాను?" తీక్షణంగా చూశాడు సీతాపతి. "ఎవర్ని అడిగితే వాళ్ళే చెప్పాలి" – కొడుకువేపు చూస్తూ — "చెప్పవేంరా! నీకు ఎన్ని ఎక్కాలు వచ్చని అడుగుతున్నాను."

భయం భయంగా కృష్ణుడు – "ఐదే."

"ఏం? అంతకన్నా ఎక్కువైతే అజీర్ణం చేస్తుందనుకున్నావా? పిల్లట్టుకు తిరగమంటే బాగానే ఉంటుంది కదూ? – సరేలే? పలకలు తీసుకోండి, డిక్టేషన్ చెప్తాను."

పావుగంటకల్లా అది ముగిసింది. మధు పూర్తిగా రైటు — సత్యన్నారాయణకి రెండు తప్పులు – గోపాలునికి ఐదు తప్పులు – కృష్ణుడికి పదకొండు తప్పులు. మొత్తం చెప్పినవి పన్నెండు మాటలు.

"లెక్కలు వేసుకోండి."

కూడికలూ, తీసివేతలూ మాత్రం చెయ్యగలిగాడు కృష్ణుడు — ఎక్కాలు రాందే గుణకారాలు అవీ ఎలా చేస్తాడు? మధు ఫస్టుగా ఉన్నా సత్యన్నారాయణ ఇంచుమించు వాడిని అందుతున్నాడు. గోపాలం సరాసరిగా ఉన్నాడు —కృష్ణుడు మాత్రం బాగా దివాలాగా ఉన్నాడు

మధుని చూస్తే సీతాపతికి ఎంతో ముచ్చట వేసింది తన కొడుకు అలా ఎప్పుడు తయారవుతాడు? కృష్ణుడిమీద కోపం వచ్చింది – "అల్లరి వెధవా! నీకు సిగ్గు వెయ్యటం లేదూ? మధు చూడు ఎంత తెలివిగా ఉన్నాడో!" అన్నాడు.

కృష్ణుడికి అసలే ఉక్రోషంగా ఉంది. పైగా మధుగాణ్ని చూపించి తిట్టటంతో ఏడుపే వచ్చింది. సీతాపతి లేవగానే కృష్ణుడు ఏడుస్తూ సావిత్రి దగ్గరికి వెళ్ళాడు– "అప్పుడే వీణ్ని ఫస్టుఫారంలో ఎలా చేర్పించటం? మరీ దారుణంగా ఉన్నాడు" అన్నాడు సీతాపతి పెళ్ళాంతో.

సావిత్రి కొడుకు తల నిమురుతూ, "మరేం ఫర్వాలేదు. ఇంకా నెలరోజులున్నాయిగా? వాడికే వస్తాయి" అంది. కొడుకు చదువుమీద నమ్మకం లేకపోయినా శిక్షణ ప్రారంభించాడు సీతాపతి.

హైస్కూల్లో చేరాలనే సంబరంలో మదనగోపాలం శ్రద్ధగానే చదువు సాగించాడు. కృష్ణుడు మాత్రం ఒక్క అంగుళం జరిగినట్టు సీతాపతికి తోచలేదు.

* * *

హైస్కూలు తెరిచేసరికి ఇల్లంతా హడావుడిగా తయారయింది. పిల్లల్ని ఫస్టుఫారంలో చేర్చటానికి సత్యన్నారాయణ నాన్న — మదనగోపాలం అన్న వచ్చారు. కృష్ణుణ్ని కూడా ఫస్టులోకి గెంటాలని అందరికీ కోరికైతే ఉందిగానీ, వాడి చదువు పొత్తిగా చాలకుండా పోయింది.

మర్నాడు పరీక్షలకు వెళ్ళాల్సిన ఆ సాయంత్రం మదన గోపాలం సత్యన్నారాయణ హుషారుగా హైస్కూలు కబుర్లు చెప్పుకొంటూంటే మధు దిగాలుపడి సూర్యంకోసం ఎదురుచూస్తూ కూచున్నాడు.

"ఒరేయ్ గోపాలం! పెద్ద బళ్ళో బోలెడుమంది మేష్టార్లుంటారట. గంటకో మేష్టారొస్తారట! అంతమంది ఏం చెప్తారు?"

"అక్కడ పెద్దపెద్ద పాఠాలు అవీ ఉంటాయి కదా?"

"అందుకే కాబోలు లెక్కలకో మేష్టారు - పాఠాలకో మేష్టారూ - బొమ్మలకో మేష్టారు"

"ఆటలకి కూడా ఓ మేష్టారు ఉంటారట్రా!"

"నాకు తెలుసు, మా అన్నయ్య ఎప్పుడో చెప్పాడు."

ఉన్నట్టుండి కబుర్లలోంచి బయటపడి మధుని చూస్తూ అన్నాడు గోపాలం, "ఒరేయ్! నువ్వూ పెద్ద బళ్ళో చేరవూ?"

మధు ఒక్కసారి తిరిగి చూసి మొహం తిప్పేసుకున్నాడు. వాడికెందుకో కోపంగా ఉందని గోపాలానికి అర్థమైపోయింది - హైస్కూల్లో చేరటం గొడవ బయల్దేరిన దగ్గర్నుంచి గోపాలానికి సత్యన్నారాయణదగ్గరే కాస్త స్నేహమైంది. తామిద్దరూ హైస్కూల్లో చేరేవాళ్ళు కాబట్టి కలిసి ఉండాలనే ఉద్దేశ్యం ఇద్దరికీ ఏర్పడింది. మధుని గురించి ఎటువంటి ప్రయత్నాలూ జరుగుతున్నట్లు లేదు.

సూర్యం రాగానే మధు అడిగాడు పెద్ద బడి మాట.

"ఏం అన్నయ్యా! మామయ్యని అడుగుతానన్నావు కదూ? రేపే సత్యన్నారాయణ మరి గోపాలం హైస్కూలుకి వెళ్ళిపోతారట. నేను మాత్రం వెళ్ళొద్దేమిటి?"

సూర్యం మధు గురించి పెద్దమామయ్యని అడుగుదామని ప్రతిరోజూ అనుకుంటూనే ఉన్నాడు — "నిన్ను మాత్రం ఎందుకు చేర్పించరు?" అని తమ్ముడికి ధైర్యంకూడా చెప్పాడు. ఇక అడగకపోతే సమయం మించిపోతుందని "సరేలే. రాత్రికి నిజంగా అడుగుతానుగా?" అని మధుని వూరడించాడు.

రాత్రి భోజనాల తర్వాత విశ్వనాథం సీతాపతితో మాట్లాడుతూ అరుగుమీద కూర్చున్నప్పుడు సూర్యం నెమ్మదిగా దగ్గిరికి వెళ్ళి నిలబడ్డాడు.

"మామయ్యా! ..."

మాటలు ఆపి విశ్వనాథం మేనల్లుడికేసి చూశాడు. సూర్యం అంటే కొంచెం అభిమానం ఉన్నట్టే ఉంది.

"ఏమిట్రా ?"

సూర్యం గొంతు పెగల్చుకొని ధైర్యంగా అనేశాడు.

"మధుకూడా హైస్కూల్లో చేరతానంటున్నాడు."

ఆశ్చర్యంగా చూశాడు విశ్వనాథం - "మధుగాడు హైస్కూల్లో చేరతాడా ?"

"అవును మామయ్యా ?"

"అంత ప్రయోజకుడయ్యాడూ? కృష్ణుడికన్నా చిన్నవాడేగా ?"

సీతాపతి అన్నాడు — "మధు బాగానే చదువుతాడు అన్నయ్యా !"

"ఎంత బాగా చదువుతాడేమిటి ? అ స్తమానూ వెధవ తిరుగుడు— ఆటలు - గంతులేగా వాడి ఉద్యోగం ? ఫస్టుఫారంలో చేరటం అంటే మాటలేం కాదే! అందుకేకాదూ కృష్ణుడి ఆశ వదిలేసుకున్నాను "

"మధు ... అలాకాదు మామయ్యా!"

"ఇంకేం? వూడబొడుస్తాడేవిట్రా?"

సీతాపతి తనకు పట్టనట్టు వూరుకున్నాడు. సూర్యం కూడా మాట్లాడ లేదు. దూరంగా గుమ్మం దగ్గర నిలబడి అంతా వింటున్న మధు ఏం చెయ్యాలో అర్థంకానివాడిలా అలాగే చూస్తూ నిలబడ్డాడు.

విశ్వనాథం సూర్యాన్ని చూస్తూ తాపీగా అన్నాడు -

"ఈ ఏడాదిలా పోనివ్వరా! వచ్చే సంవత్సరం చూద్దాం."

ఇష్టంలేనివాడిలా చూశాడు సూర్యం.

"వచ్చేసారి కృష్ణుడూ వాడూ కలిసి చేరతారులే."

మధుకి కోపం ముంచుకు వచ్చేసింది. మరి మాట్లాడకుండా నిల బడ్డేకపోయాడు. నాలుగడుగులు ముందుకు వచ్చేశాడు — "అదేమిటి ? వాడికోసం నేను ఆగుతానా ?"

విశ్వనాథం తలతిప్పి చూశాడు - "ఓహో ! తమరు వింటూనే ఉన్నారా?" వెటకారంగా అన్నాడు. మధు తెగించినవాడిలా అడిగాడు.

"సత్యన్నారాయణా, మదనగోపాలం వాళ్ళంతా ఇక్కడే చేస్తుంటే నేను మళ్ళా సంవత్సరం వరకూ ఉండాలేమిటే? కిష్టిగాడి కోసం వాళ్ళేప కైనా ఆగుతున్నారా ?".

విశ్వనాధం కాస్త కంఠం ఖంగుమనిపించాడు—

"ఎందుకురా ఆ మిడిసిపాటు ? ఇప్పుడేమంతగా కంగారువచ్చింది ? వస్తుఫారంలో చేర్చుకుంటారేం నిన్ను ?"

మధు సీతాపతిని సాక్ష్యం వేసుకున్నాడు — "చిన మామయ్యా ! నువ్వు అందర్నీ ప్రశ్నలు వేస్తే నాకే ఎక్కువ మార్కులు రాలేదూ ? కిష్టిగాడూ-నేనూ ఒకటా ? గోపాలాన్ని చేర్చుకుంటే నన్ను చేర్చుకోరూ? నువ్వు చెప్పవేం మామయ్యా ?"

తనమీద కొచ్చి పడిందేమిటా అన్నట్టు సీతాపతి నోటి నికి ఓ గంట చేశాడు. చివరికి ఏదో అనబోతే విశ్వనాధం చెప్పేశాడు

"వాడెంత ఎగిరిపడినా ఈ ఏడాదికి పీలుకాదు. పెద్దవాడికి జీతా కడుతున్నాం. ఇక వీడికీ ఎక్కడ తేవటం ? వచ్చే ఏడు చూద్దాంలే."

"కాదన్నయ్యా .. "

"ఏమిట్రా కాదు ? అసలు వాణ్ని హైస్కూల్లో చేర్చుకుంటారా?"

"పోనీ చేర్చుకోకపోతే వాడే మానేస్తాడుగా ?"

"చాల్లే మనకు సిగ్గుచేటు."

సీతాపతి మాట్లాడలేదు. సూర్యం కూడా మాట్లాడలేకపోయాడు. మధుకి కోపం, దుఃఖం ముంచుకు వచ్చాయి. — హైస్కూలులో తనని చేర్చుకోరూ ? తనకి చదువు బాగా రాదూ? —కసితో వెర్రివాడిలా అరిచే శాడు—"వెధవ కిష్టిగాడితో నాకు జీతా ? వాడికసలు ఏమీ రాదు. ఆటలు కూడా రావు. పది సంవత్సరాలకూడా వాణ్ని చేర్చుకోరు. నన్నెందుకు చేర్చుకోరేమిటీ ?" మధుకి ఏడుపు కూడా వచ్చేసింది.

"ఏమిట్రా ఆ వాగుడు ? వూరుకుంటున్నాననా ?"

మధు చెంప చెళ్ళుమంది. చెయ్యి తీసేసరికి ఎర్రగా పొంగి పోయింది--- "పో ! వెధవా ! నీకీ తల తిరుగుడే వద్దని లక్షసార్లు

చెప్పాను. పెద్ద చిన్నా ఏం లేదేం నీకు ? మహా పండితుడిలాగ బయల్దే రాడు" విశ్వనాథం చీదరించుకున్నాడు.

సూర్యం నెమ్మదిగా మధు చెయ్యి పట్టుకోబోతే విసిరి కొట్టాడు——

విశ్వనాథం కిళ్ళ్ళ్ చేశాడు.—"ఏంరా ? ఒళ్ళు ఓటపట లాడు తుందా !"

పెద్ద మామయ్యని అలా గుప్పిట్లో పెట్టి నలిపెయ్యాలన్న కసి మితి మీరిపోయింది మధులో.

"ఒరేయ్ మధూ ! అన్నానికి రావేం? అందరూ తింటే నువ్వెందు కలా బిర్రబిగిసి కూర్చున్నావ్ ?" సుందరమ్మగారికి దొడ్లో పనులు తెము ల్చుకు బయటపడేవరకు సంగతేమీ తేలలేదు——మామయ్య ఏం చేస్తాడో, ...తుందో — మధుకి అన్నం తినబుద్ధికాక అంతవరకూ ఉండి ... సుందరమ్మగారు రావటంతో విశ్వనాథం లేచి గదిలోకి వెళ్ళి

"నాతో తింటానన్నావుగా ? రావేంరా ?"

మధు మాట్లాడలేదు.

"ఏంరా సూర్యం ? వాడలా నించున్నాడు ?"

"వాడు కూడా హైస్కూలులో చేరతానంటే మామయ్య వద్దంటు న్నాడు——"

సుందరమ్మగారు సూర్యాన్ని నెమ్మదిగా అడిగి, సంగతంతా తెలుసు కొంది——మధు వెళ్ళి ఏడుస్తూ పడుకున్నాడు. ఎంత బుజ్జగించినా అన్నా నికి రానని భీష్మించాడు. ఏమీ చెయ్యలేక సుందరమ్మగారు వూరుకుంది.

ఆ రాత్రి సుందరమ్మగారికీ—మధుకి నిద్ర రాలేదు. వెక్కి వెక్కి ఏడుస్తున్న మనవణ్ని ఓదార్చడానికి ఆవిడ ఎన్నో ప్రయత్నాలు చేసింది- "నా మాట విను నాయనా ? నేను తెల్లవారాక మామయ్యని అడుగుతాను కదూ !" అంది.

"ఉత్తదే ! మీరెవ్వరూ దాగా అడగరు" నిస్సహాయంగా అన్నాడు మధు——"అంతా పిరికివాళ్ళే. మామయ్య ముందు ఎవ్వరూ మాట్లాడరు.

"జాగా అడిగితే ఎందుకు ఒప్పుకోడు ?" — తను అడిగితే చాపనౌడతాడు. అమ్మమ్మో, అన్నయ్యో వచ్చి అయ్యని నిలదీసి అడగాలని మధు కోరిక.

"నేను బాగానే అడుగుతానుగా ? నువ్వు చదువుకోవటం నాకు ఇష్టంలేదా ? ఆ సిపాస్తులు లేకపోగా నాలుగు అక్షరం ముక్కలయినా నేర్చుకోనివ్వకపోతే నీ గతేం కావాలి ?"

అమ్మమ్మ నిజంగా అడుగుతుందేమోనని మధుకి అనుమానం వచ్చింది. "నిజంగానా అమ్మమ్మా ?"

"నీ కెందుకు నువ్వు నిద్రపో."

ఆ సంతోషంతో మధుకి నిద్రపోబుద్ధి కాలేదు. గోపాలం వాళ్ళ తొందరగా లేచి వెళ్ళిపోతే .... ? శాయశక్తులా నిద్రను వెనక్కి నెట్టి కళ్ళు తెరుచుకుని పడుకున్నాడు.

* * *

తెల్లవారి స్నానం ఫలహారం కానిచ్చి విశ్వనాథం ఎక్కడికో బయలేదు వెళబోతుంటే — "విశ్వం" అంటూ పిలిచి సుందరమ్మగారు మనవడి చదువుమాట అడిగింది — విశ్వనాథం చిరాగ్గా చూశాడు—

"... వాణ్ని ఎప్పుడు పెద్దబడిలో చేర్చాలో కూడా నాకు తెలీదని అనుకుంటున్నావా ?" అన్నాడు విసురుగా.

"అది కాదు అబ్బాయ్ ! వాడు బడిలో చేరతానని ఏడుస్తున్నాడు సత్యన్నారాయణ వాళ్ళు ఎలాగూ ..."

"ఎద్దెదిరించని గింత కాడా ఎగిరిందట. అలాగే వుంది. వీడు లేని వైభవం హైస్కూలు చదువు!" — ఇంత వెధవ చిన్న మాటకు పని పొయ్యకుండా ఇంత పంతంపట్టి సాధించడం విశ్వనాథానికి నచ్చలేదు.

"అక్కడి పంతులుగారు వాడి చదువు సరిపోదంటే వాడే మానేస్తాడు"

విశ్వనాథం మాట్లాడలేదు. చిన్నవాడిని బడిలో చేర్చటానికి కొడుకు కింత అయిష్టత ఎందుకో ? కన్నబిడ్డలకు చదువులు చెప్పించుకోటానికి తల్లిదండ్రులైతే ఇంత రాద్ధాంతం చేస్తారా ? సుందరమ్మగారికి — మీద చాలా రోజులనుంచి కష్టంగా ఉంది. ప్రతి విషయానికి

లాకటం మరీ బాగుంది" — తర్వాత తల్లిమాట లేమీ వినకుండా పుస్త మీదకి కండువా పైన వేసుకొని వీధిలోకి వెళ్ళిపోయాడు.

సత్యన్నారాయణనీ, గోపాలాన్నీ దాటుకుని స్కూలు కేసి పరుగెత్తాడు మధు. పట్టపగ్గాలు లేని సంబరంతో — ముగ్గురూ కలిసే పరీక్ష రాయటానికి కూర్చున్నారు —

పరీక్ష అయ్యాక సీతాపతి ముగ్గుర్నీ కూర్చోబెట్టుకొని ఎలా రాసిందీ ప్రశ్నలు వేశాడు.

"అన్ని లెక్కలూ చేశాను మామయ్యా! తెలుగు పేపర్లో ఒక్క ప్రశ్నే రాయలేదు" —— అంటూ కుతూహలంగా, ధారాళంగా చెప్పుకుపోయాడు మధు. గోపాలానికీ అత్తెసరు మార్కులు రావచ్చని అంచనా వేశాడు సీతాపతి. ఎటొచ్చీ సత్యన్నారాయణ కొస్త అవాధంగం చేశాడు. అన్ని ప్రశ్నలూ వాడికి తెలిసే వున్నా పెద్ద బడిలో డెస్కులమీద రాయటానికి చేతులు వణికి తడబడి పోయాడు. కూర్చున్న తరువాత అరగంట వరకూ వాడికి దడే తగ్గలేదు. నెమ్మదిగా రాత ఉపక్రమిస్తే కలం కదల లేదు. ఉక్రోషంతో ఏడ్చుకొని — ఏడవలేక నవ్వుకొని ఎలాగో అయిందనిపించాడు.

"నాకు భయం వేసింది బావా!" అన్నాడు అమాయకంగా సీతాపతి మొహంలోకి చూస్తూ.

"వట్టి పిరికి వాడు మామయ్యా!" అనేశాడు తన ధోరణిలో మధు. — గుమ్మంలో నిలబడి చూస్తూన్న పార్వతి విరుచుకు పడింది - "నీలా నోరు పెట్టుకు బతకటం వాడికి చేతకాదు. మరి అసలు వాడి వీపుకి దెబ్బే తగిలిందో ఏం పాడో! వాడు స్కూల్లో చేరతాడంటే ఒకటే ఏడుపయ్యో!"

మధు బిత్తరపోయి మాట్లాడలేక పోయాడు.

* * *

పరీక్షలకు కూర్చున్నవాళ్ళు ప్యాసైందీ — ఫేలయిందీ తెలిసే రోజు! ఫస్టుఫారంలో చేర్చుకుంటారో లేదో చెప్పే రోజు! సీతాపతి పిల్లలు ముగ్గుర్నీ తీసుకు బయల్దేరాడు. ఫస్టుఫారంలో చేర్చుకునే వాళ్ళ పేర్లూ, వాళ్ళకి వచ్చిన మార్కులూ రాసి ఉన్నాయి. — మధు పేరు ... పై నుంచి క్రిందికి ఎక్కడా లేదు ... లేదు.

"మామయ్యా !...."

"ఏంరా? బాగా రాశాననన్నావుగా ? నీ పేరేదీ ?" సీతాపతికి మధు పేరు లేక పోవడం బాధే వేసింది.

"నిజంగా రాశాను మామయ్యా !" దిక్కు మొహం వేశాడు మధు. వాడికి కంఠం వరకూ దుఃఖం నిండిపోయింది.

"మరైతే నీ పేరు లేదేం ? గోపాలాన్ని తక్కువ మార్కులు వచ్చినా ప్యాసు చేశారే ! నిన్ను ...."

"మధుసూదనరావు ఎవరండీ ? ఫస్టుఫారం కుర్రాడు వచ్చాడా ?" పిలక మేష్టారు వరండాలోకి వచ్చి గట్టిగా అరుస్తూ వాకబు చేస్తున్నారు.

సీతాపతీ, మధూ కూడా ఆ మాటలు విన్నారు.

"మామయ్యా !"

"నువ్వుండు. నేను చెప్తాను" — సీతాపతి ఎదురుగా ఉన్న పిల్లల్లోంచి ఖాళీ చేసుకుని వెళ్ళాడు —

"ఇక్కడే ఉన్నాడండీ ! మధుసూదనరావు మా వాడే. వాడి పేరు బోర్డుమీద రాయలేదనే చూస్తూన్నామండీ ?"

"ఆ కుర్రాడు మీవాడేనాండీ? ఓహో! వాణ్ని హెడ్ మేష్టారి గారి దగ్గరకి తీసుకు వెళ్ళాలి."

"అయ్యా! అసలు .... వాడు పరీక్ష ప్యాసైనాడాండీ" నసుగుతూ అడిగాడు సీతాపతి.

పిలక మేష్టారు నవ్వి - "మీ వాడు పరీక్ష ప్యాసవ్వక పోవట మేమి టండీ? అన్ని పేపర్లలోనూ నూటికి తొంభైలు దాటి పోయాయండీ

మాడుట్లు? వాడికి ప్రమోషన్ ఇచ్చి సెకండ్ ఫారంలోనే వేసెయ్యాలంటున్నారు హెడ్ మేష్టారు. అందుకే వాడి పేరు బోర్డుమీద వెయ్యలేదు."

సీతాపతి నిర్ఘాంతపోయాడు. మామయ్య వెనకే వచ్చి నిలబడ్డ మధు కేసి అర్థం కాలేదు. అయోమయంగానే పిలక మేష్టారితో పాటు మామయ్య వెనక మేష్టారి దగ్గరకు నడిచాడు.

పండు తమలపాకు లాంటి ఆ హెడ్ మేష్టారు నవ్వుతూ కలం మేజామీద పెట్టి కుర్చీలోంచి లేచాడు — "వీడేనా మధుసూదనరావు?"

"అవునండి! వీడి పేరు బోర్డు మీద లేదని కంగారు పడుతున్నారట."

"అహ!" ఎర్రగా నవ్వారు పండు తమలపాకు మేష్టారు — "ఇలా రా నాయనా!"

మధు నాలుగడుగులు ముందుకువేసి నిలుచున్నాడు చురుగ్గా చూస్తూ.

"నీకు ప్రవేటు అదీ ఏమైనా ఉందేమిట్రా?"

"లేదండి!" తల అడ్డంగా వూపాడు మధు.

"లేదూ?" ఆశ్చర్యంగా చూశాడు హెడ్ మాష్టారు.

"పోనీ అస్తమానూ అదే పనిగా చదువుతూ వుంటావా?"

"చదవనండి!"

"ఎప్పుడు చదువుకుంటావు?"

"తెల్లారకట్ల మా అమ్మమ్మ మజ్జిగ చెయ్యటానికి లేస్తుందండీ — అప్పుడు చదువుకుంటానండీ!"

"అంతేనా? రాత్రుళ్లు చదువుకోవూ?"

"రాత్రులప్పుడు మామయ్యగారింట్లో సత్యనారాయణా, మదనగోపాలం కృష్ణుడూ వాళ్ళంతా చదువుకొంటూ వుంటారండి! అప్పుడు దీపాలు వుండవు. అయినా గోలగా వుంటే నాకు చదవాలనిపించదండీ!"

"ఆహా! ప్రథమ తరగతి విద్యార్థివే నువ్వు!" — హెడ్మాష్టారు సీతాపతి కేసి చూస్తూ అన్నారు.

"మీవాడు చాలా తెలివిగలవాడండి! మంచి మార్కులు వచ్చాయి. వీణ్ని చూసి ప్రమోషన్ ఇవ్వాలని అనుకున్నాము - ఇప్పుడు ప్రత్యేకంగా వీడికి కొన్ని ప్రశ్నలు ఇస్తాను — ఒక గంట పని — ఆ పేపరు చూసి సెకండ్ ఫారంలో వేయించేస్తాను."

సీతాపతికి సంతోషం కలిగింది — "అలాగే మేష్టారూ?" మధు అక్కడే ఒక బల్ల మీద కూర్చున్నాడు.

హెడ్ మేష్టారు మధుకి తెల్ల కాయితం. కలం యిస్తూ అన్నారు -- "నాలుగే ప్రశ్నలు, నీకేం భయంలేదు. తెలిసినంత వరకే రాయి." —

మధు ప్రశ్నలు చదివాడు. ఏమంత బోధ పడినట్టు లేవు. మళ్ళా చదివాడు - మూడో సారి చదివాడు. కాస్త ధైర్యం వచ్చింది — ఏదైనా చెయ్యగలననే ధైర్యం వాడికి మొదటనుంచీ ఉంది —

వరండాలో హెడ్మాష్టరు, సీతాపతితో మాట్లాడుతూ నించున్నారు. సీతాపతి దగ్గిరే సత్యన్నారాయణా, మదన గోపాలం కూర్చున్నారు.

మధు కాయితాలు పట్టుకుని నిలబడ్డాడు.

"రాశాను మేష్టారూ :"

"అయిందా? ఇంకా ఏమన్నా రాస్తావేమో ఆలోచించుకోక పోయావా ?"

"నా కింక రాదండీ!"

నవ్వారు హెడ్ మేష్టారు. "ఎంత ఖచ్చితంగా మాట్లాడుతాడండీ మీ వాడు?" అన్నాడు సీతాపతి నుద్దేశించి — మధు రాసిన కాయితాలు ఆయన పైనుంచి క్రిందికి చదివేశారు — మేష్టారి మొహంలో సంతృప్తి కొట్ట వచ్చినట్లే కనిపించింది అందరికీ.

"శెష్! ఏ స్కూలుకే అలంకారమండీ మీ వాడు! సెకండ్ ఫారంలో చేర్చుకుంటాం. ఆ పుస్తకాలే కొనండి."

"చాలా సంతోషమండీ! వస్తాము" నమస్కారం చేసి వెనక్కి తిరిగాడు సీతాపతి — నిజంగా సీతాపతికి చాలా సంతోషంగా వుంది. మధు పరాయి వాడేం కాదుగా? వాడు అభివృద్ధికి వెళుతోంటే తనకు సంతోషం కాదూ ?

ఇంటి కెళ్ళే సరికి అప్పుడే భోంచేసి చావిట్లోకి వస్తున్నాడు విశ్వ నాథం — గోపాలం అందరికంటే ముందుగా పరుగెత్తుకు వెళ్ళి చెప్పే శాడు — "పెదనాన్నోమ్ మరేమో మధుని సెకండ్ ఫారంలో వేసేశారు." కడుపుబ్బ తిరిపోయి ఒగరుస్తూ నిలబడ్డాడు.

"ఏడిశావ్‌లే. వెర్రి వెధవా! సెకండ్ ఫారంలో వెయ్యటం ఏమిటి" పై తుండుతో చేతులు తుడుచుకుంటూ వీధి గుమ్మం కేసి నడిచాడు విశ్వ నాథం — సీతాపతి ఎదురు పడ్డాడు— "మధుని ప్రమోషన్ ఇచ్చి సెకండ్ ఫారంలో వేశారన్నయ్యా!"

విశ్వనాధ నొసలు చిట్లించాడు.

సవిస్తరంగా చెప్పాడు సీతాపతి.

విశ్వనాథం మొహంలో రంగులు మారుతున్న సంగతి ఎవరూ పట్టించుకోలేదు — అప్పుడే గోపాలం ద్వారా వంటింట్లోనే విసేసిన పార్వతి, సావిత్రి విస్తుపోయారు — "అమ్మా అయ్యా లేని వాడని జాలి పడ్డాదో ఏమిటో పంతులు" — బుగ్గలు నొక్కుకుంది సావిత్రి

"అంత పెద్దపదువు ఎలా వచ్చిందబ్బా?" సత్యం ఎన్నడూ ఒక్క పది విన దాంట్లో సగమైనా చదివాడా! తనకేమి నచ్చనట్టు చూసింది పార్వతి.

సుందరమ్మగారు మాత్రం సంతోషమేమీ కనిపించనీయకుండా తిరిగింది. మధు కేమిటో సిగ్గు సిగ్గుగా ఉంది. అమ్మమ్మని కావలించు కొని మొహం దాచేసుకున్నాడు.

ఎప్పుడూ అల్లరి చిల్లరిగా తిరిగే వెధవకి ఆన్ని తెలివితేట లెలా వచ్చాయని లోలోపల విస్తుపోతూ మధన పడ్డాడు విశ్వనాధం. మధుని సెకండ్ ఫారంలో చేర్చుకోవటం చాలా అవమానకరంగా భావించి బాధ పడ్డాడు.

"నన్ను ఫస్టు ఫారంలో చేర్చుకోరన్నావు. సెకండ్ ఫారంలోనే చేర్చుకున్నావుటగా మామయ్యా?" అని మధు పెంకిగా అడిగేస్తాడేమో నని కొన్ని రోజులు తప్పుకుని తిరిగాడు కూడా. ఒకరోజు తనకై తనే

కలగజేసుకొని అన్నాడు — "ఒరేయ్! ఎక్కువ మార్కులు వచ్చాయని ఎగిరెగిరి పడక చక్కగా చదువుకో."

పెద మామయ్య అంత సామరస్యంగా మాట్లాడటం మధుకి విచిత్రంగా తోచింది.

కృష్ణుణ్ని కూడా ఫస్టుఫారంలో చేర్చటానికి అన్నగారు ప్రయత్నాలు చేస్తున్నాడని తెలుసుకున్న సీతాపతి అన్నాడు — "కృష్ణుడు చాలా తక్కువ స్టాండర్డులో ఉన్నాడన్నయ్యా! వాణ్ని ఫస్టుఫారంలో చేర్పినా తలకు మించిన బరువే అవుతుంది. ఈ ఏడాది జాగ్రత్తగా చదివిస్తే కాస్త నయంగా వుంటాడు. ఇన్నాళ్ళూ మనం నిర్లక్ష్యం చేసాం. ఇప్పుడు తొందరపడితే ....

"నీకు తెలీదు. వూరుకో. అందరితో పాటు కలిసి ఉంచకపోతే బొత్తిగా లకతాయిగా తిరుగుతాడు. వచ్చే ఏడాదికి మధుగాడు థర్డుఫారం లోకి పోతోంటే అప్పుడా వీణ్ని ఫస్టుఫారంలో కూర్చోబెట్టేది!"

విశ్వనాథం తన ప్రయత్నాలు మానలేదు. లంచం ఇచ్చి కృష్ణుణ్ని ఫస్టుఫారంలో చేర్పించిన విషయం సీతాపతికి తప్పితే ఎవరికీ తెలీదు.

"నువ్వు ఇంకో తరగతిలోకి వెళ్ళిపోతున్నావురా మధూ!" గోపాలం దిగులుగా అన్నాడు.

మధుకి కూడా దిగులుగానే వుంది "నిజంగా నాకూ బాగాలేదురా మదనా! మనందరం ఒక్క తరగతిలోనే చదువుకుంటే చక్కగా ఉంటుంది. మరి నేను ఏం చెయ్యనురా?"

"పోనీలే. నన్ను మర్చిపోకుండా వుంటావా మరి!"

"అదేవిట్రా. గోపాలం! అలా మాట్లాడుతున్నావ్. నేను ఎక్కడ చదువుకున్నా నీ జట్టే ఉంటాను కదూ?"

"నాకు తెలీని పాఠాలు అవీ కూడా నీతో చెప్పించుకుంటాను."

"నాకు తెలిస్తే అలాగే చెప్తాను. మనకి రాకపోతే చిన్న మామయ్య ఉన్నాడు కదా?"

మధూ — మదనుడూ చాలాసేపు మాట్లాడుకున్నారు.

* * *

అందరూ దీపం చుట్టూ చేరి శ్రద్ధగానో, అశ్రద్ధగానో చదువుతుంటున్నారు. సత్యనారాయణ ఇంగ్లీషుపద్యం కంఠతా పడుతున్నాడు. సూర్యం నోట్సేదో రాసుకుంటున్నాడు. గోపాలం శ్రమ అనుకోకుండా పుస్తకాన్ని మంచి చేసుకొని సైన్సు పాఠాలు నక్లె వేస్తున్నాడు. మధు తెలివైనవాడని అందరూ అనుకున్న దగ్గర్నుంచీ కృష్ణుడు చూచా పుస్తకాలు తిరగెయ్యటం నేర్చుకున్నాడు. సుధకూడ పలకమీద పిచ్చి పిచ్చి బొమ్మలు గీస్తూ కూర్చుంది.

మధు మాత్రం అందరికీ దూరంగా సుశీలకు కథలు చెప్పటంలో మునిగి పోయాడు – "మరి చీకటి జీబూతం కథ అయిందిగా? ఇంకేం కథ కావాలి?" అన్నాడు.

సుశీల ఏడు వేళ్ళు చూపించింది.

"ఏడుగురు రాజకుమారుల కథా! అదే నీకు బాగా ఇష్టంకదూ? అయితే బాగా విను."

"అనగా అనగా ఒక రాజుగారు ఉన్నారు. ఎక్కడ? వాళ్ళ వూళ్ళో.. ఆ రాజుగారికి ఎంతమంది కొడుకులు? ఏడుగురు." మాట్లాడే తీరిక లేని చెల్లెలు తరఫు కూడా తనే మాట్లాడుకుంటూ కథ ప్రారంభించాడు. "ఒక రోజు . "

సుధ బొమ్మలు గియ్యటం చాలించి నెమ్మదిగా మధు దగ్గరకు వచ్చి కూర్చుంది. "మరి ఆ రాజుగారికి కూతుళ్ళులేరా బావా?"

"కూతుళ్ళు వుంటే మాత్రం వేటకి వెళ్తారేమిటి!"

"అయితే చెప్పు"

"ఒక రోజున రాణిగారు కొడుకులందర్నీ పిలిచి ... వండుకోటానికి ఏమీలేవు, అబ్బాయిలూ! మీరు తొందర తెచ్చిపెట్టండి, వండుతాను' అని చెప్పింది."

"అవును నాకు తెలుసు బావా! అప
సుధ కుతూహలంగా అంది.

సుశీల, మధు చేతిమీద చెయ్యివేసి ప్రాధేయపూర్వకంగా చూసింది. మధూ, సుధా మాట్లాడుకొంటూ తన ఉనికి మర్చిపోయారేమోనని సుశీల ఆరాటం। మధు సుశీల మొహంలోకి చూస్తూ అన్నాడు "కథ నీకే చెప్తున్నాను సుశీ। సుధకికాదు."

సుధకి కోపం వచ్చింది- బుంగమూతి పెట్టుకొని దూరంగా జరిగింది. "నాకేం చెప్పక్కర్లా।"

"నువ్వేం వినక్కర్లా - అసలు నీకు నేను చెప్తేకదా? మరేమో సుశీ। అప్పుడు ... ఎంతవరకూ వచ్చిందప్పా .. రాజుగారికి కొడుకు లని చెప్పాను కదూ .."

సుధ వుండబట్టలేకపోయింది. "అది చెప్పేశావు. రాణీ గారు కూడ తెమ్మనిలా ?" అనేసింది.

"అవునవును. అప్పుడేమో.... ఏడుగురు రాజకుమారులు..."

పార్వతి హడావిడిగా చావిట్లోకి వచ్చింది.

పిల్లలు రణగొణ ధ్వనిలా అరుచుకుంటున్నారు....

"పదమూడు పద్నాలుగులు నూట ఎనభై రెండు, పద్నాలుగు పద్నాలుగులు నూట తొంభై ఆరు. నూట తొంభై .... ఆరు."

"ట్వింకిల్ ట్వింకిల్ లిటిల్ స్టార్।
హౌ ఐ వండర్ వాట్ యు ఆర్।
ట్వింకిల్ ట్వింకిల్ ...."

"అప్పుడు అశోక చక్రవర్తి బౌద్ధ భిక్షువులను ఆహ్వానించెను. కళింగ యుద్ధానంతరము..."

"విమానము పక్షివలె ఎగురును. విమానము యొక్క రెక్కలు గాలిపోసుకొనుటకు వీలుగా చేయబడి యుండును. విమానము

...రులందరు చాలా కష్టపడ్డారు కదూ - పాపం వాళ్ళకి ...కొరికాయి..."

...ళ్ళీ అందరూ చదువుకుంటున్నారు. పార్వతి ...ణానికి వెళ్ళి శేరు ఉప్పు పనుపరా।

తీరా ఇప్పుడు చూశాను ఉప్పు నిండుకొంది. మీ మావయ్య భోజనానికి వస్తున్నారు." — మధు కథ ఆపేసి పార్వతికేసి చూశాడు.

"ఎవర్నయినా జతపంపు అత్తా! కలిసి వెళ్తాం."

"వాళ్ళంతా చదువుకొంటున్నారు. ఎలా వస్తారు ?"

"ఇప్పుడే వచ్చేస్తాం కదా ?"

"అలా కుదరదుగాని నువ్వు వెళ్ళిరా !"

"నేను వెళ్ళను" — మధుకు కోపం వచ్చింది.

"వెళ్ళవూ !"

"ఎలాగేమిటి ? బాగా చీకటి పడిపోయింది. దుకాణం దూరం. గోపాలాన్ని పంపు."

"తాను చెడ్డ కోతి వనమంతా చెరిపిందట. నువ్వు దర్జాగా కూర్చుని వాళ్ళనికూడా చదువుకోవద్దంటావు కదూ ?"

సూర్యం పుస్తకం మూసేస్తూ అన్నాడు — "నేను వెళ్తానత్తా ! డబ్బులియ్యి."

"నీ తమ్ముడికి పెంకితనం ఏమిటి ? నేను చెప్పానని కూడా లేకుండా భీష్మించుకు కూర్చున్నాడు. వెళ్ళకేం చేస్తాడో నేనూ చూస్తాను."

పార్వతి గిరుక్కున తిరిగి లోపలికి వెళ్ళిపోయింది.

మధు లెక్కలేనట్టు తిరిగి కథలోకి వెళ్ళిపోయాడు — "రాజు బజారు అందరూ నేమో చేపల్ని ఎండవేశారు. అప్పుడు ..."

సుధకో ధర్మ సందేహం వచ్చింది — "రాణీగారు కూర వండదా వావా ?"

సుధకేసి చూశాడు మధు — వాడికేం తోచలేదు. కథలో ప్రశ్నలు వేస్తే ఎలా?— "అంతకుముందే రాజుగారు మంచి వంకాయలు తెచ్చి రాణీ గారికి ఇచ్చేశారు. రాణీగారు కూర కూడా వండేసింది."

"ఒరేయ్ మధూ !"

మధు ఉలిక్కి పడ్డాడు.

"ఆ కబుర్లు కట్టిపెట్టి లేచిరారా!"

విశ్వనాథం స్నానంచేసి వచ్చి ఒళ్ళు తుడుచుకొంటూ నిలబడ్డాడు.
—"ఉప్పు తెమ్మంటే వెళ్ళనన్నావట?" పార్వతి గుమ్మంలో హుందాగా నిలబడి ఉంది.

"వెళ్ళకేం చేస్తాడు? డబ్బులియ్యి, సంచీ ఇలా పడేయ్" విశ్వనాథం గర్జనతో మధు కొంత జంకాడు.

"మధూ!" సుందరమ్మగారు మృదువుగా పిల్చింది.

"నీ కేం భయంలేదురా వెళ్ళిరా. లే మరి" ఆవిడ మాటల్లో రహస్యమైన మందలింపు - సున్నితమైన ఆజ్ఞాపనా ఉన్నాయి. మధు చటుక్కునలేచి నిలబడ్డాడు. మాట్లాడకుండా సంచీ డబ్బులూ తీసుకున్నాడు.

"వెంకి వెధవా! నీకేదైనా పని జెప్పాలంటే పెద్ద తతంగం జరగాలన్నమాట. నిన్నే లొంగదియ్యలేకపోతే నేనెందుకురా?" అహంకారం ప్రదర్శించాడు విశ్వనాథం. మధు కసితో నిశ్చయంగా — "నాకేం భయమా? ఒక ఉటికెలో తెచ్చేస్తాను. సత్తిగాడు, కిష్టిగాడు అయితే పిరికి వెధవలు. వాళ్ళని ఒక్కొక్కళ్ళనీ వెళ్ళి రమ్మను చూద్దాం." అనేసి బాణంలా దూసుకుపోయాడు.

"చూశారా? వెళ్ళేవాడు వెళ్ళకూడదూ? సత్తిగాడు, సత్తిగాడు అంటూ వాణ్ని ఏడిపించని ఘడియ లేదు. ఆ సుధని తన్నినవాడు తన్నినట్టే ఉంటాడు. ఎంత చిన్నతనం అయితే మాత్రం ఏవిటా మొండి బ్రతుకు?" పార్వతి విసరుసు లాడింది.

తన ఎదురుగనే మధు అంత నిర్లక్ష్యంగా మాట్లాడి వడుగెత్తటంతో విశ్వనాథం పెద్దరికం చిన్నబోయింది. మధు ఎప్పటికప్పుడు ఇంట్లో పిల్లల్ని ఏడిపించటం — పెద్దవాళ్ళంటే భయం - భక్తి - లేకుండా ధిక్కరించటం-కిందపడ్డా మీదివాడినే నన్నట్టు కబుర్లు చెప్పటం - విశ్వనాథానికి ఒళ్ళు మండిస్తూనే ఉన్నాయి. అందుకే అల్లుణ్ని ఒంచి మంచి మార్గంలోకి తేవటానికి కంకణం కట్టుకున్నాడు.

"రానీ వెధవని" పళ్ళు నూరుకున్నాడు. అప్పటికిగాని పార్వతి తృప్తి కలగలేదు.

ఇంట్లో వస్తువులేవైనా అయిపోతే వెంటనే తెప్పించటం — ఎక్కడివక్కడ సర్దటంలాంటి పనులు సావిత్రే చేస్తుంది - కాని మళ్ళా సావిత్రి కూతుర్ని కని పురిటిమంచంమీద కూర్చోవటంతో పార్వతే కాస్త శ్రద్ధ చెయ్యాల్సి వచ్చింది. సరిగ్గా వంటచేసేముందు వుల్లిపాయలు లేవనీ —దీపాలు వెలిగించేముందు కిరసనాయిలు లేదనీ — అన్నాలకి వచ్చేస్తోంటే నెయ్యి నిండుకుందనీ — దేనికో ఓ దానికి హడావుడి పడుతూ కనిపించిన వాళ్ళనల్లా దుకాణానికి పంపేస్తుంది. ఆ కంగారులో మధు లాంటివాడు ససేమిరా వెళ్ళనని మొండికేస్తే మొగుడితో ఫిర్యాదుచేసి మరీ సాధిస్తుంది.

మధు వెళ్ళి అరగంట పైనే అయింది. పెరుగులో ఉప్పు వేసుకునే అలవాటు లేని విశ్వనాథం భోజనంకూడా చేసి లేచాడు.

"వెధవ! ఎక్కడ చోద్యం చూస్తూ నిలబడ్డాడో?"

"ఇంతసేపు రాలేదేమిటి వీడు? ఏమైంది చెప్మా?" సుందరమ్మ గారు ఆత్రుతగా వీధి గుమ్మంకేసి వెళ్ళేసరికి మధు సంచి [illegible] కాలు కుంటుతూ బాధపడుతున్న వాడిలా నడిచి రావటం కన్పించింది. సుందరమ్మగారు కంగారుగా చీడీలు దిగి వెళ్ళింది—

—"ఏమైంది బాబూ! కుంటుతున్నావ్. ఏమైందిరా?" మనవడి చేతిలో సంచి అందుకుని వాడి రెక్క పట్టుకొంది—

"చీకట్లో కన్పించలేదు. అమ్మమ్మా! గుర్రబ్బండి వచ్చేస్తోంటే గబుక్కున తప్పుకోబోయి రాతిమీద పడ్డాను."

"అయ్యో! దెబ్బలేవైనా తగిలాయేమిట్రా?"

మధు కుడికాలు చూపించాడు. చీకట్లో అంత బాగా కన్పించక పోయినా సుందరమ్మ చేతికి మధు మోకాలిమీద కొట్టుకుపోయినచోట తడితడిగా తగిలింది— "అమ్మో నెత్తురే! లోపలికి పద చూద్దాం. ఈ చీకట్లో ఎక్కడ పడ్డావురా నాయనా?"

"అమ్మమ్మా!" ఏడుపుగా అన్నాడు మధు — "ఉప్పు ఒలికిపోతే ఎత్తి తీసుకు వచ్చాను. దుమ్ము కలిసిపోయింది అమ్మమ్మా!"

"పోతే పోయిందిలే వెధవ ఉప్పు. అసలా బండి కింద పడితే ఏమైపోదువో కదా? ముందు లోపలికి పద" నెమ్మదిగా మనవణ్ణి పీడీలు ఎక్కించింది సుందరమ్మగారు.

"ఏంరా అప్పుడే వచ్చావ్? ఇంకో గంట ఆడుకోలేకపోయావా ?" విశ్వనాథం కటువుగా అన్నాడు.

మధు బెదిరి సుందరమ్మగారి చెయ్యి పట్టుకున్నాడు. ఆవిడ కోపంగా అంది — "చాల్లే వూరుకో. బండి కింద పడబోయి ప్రాణాలు దక్కించుకొని వస్తే ఆటలాడుతున్నాడా ? మోకాలంతా చెక్కులేచి పోయింది. వరదలా నెత్తురు కారుతూంటే కుంటుకుంటూ వచ్చాడు."

"విశ్వనాథం వెటకారంగా అన్నాడు — నేలమీద కాళ్ళు మోపి నడిస్తేగా, కన్నూ మిన్నూ కానకుండా గంతులేస్తే ఏమవుతుంది మరి ? —బుద్ధిమంతుడిలా నించున్నావుగాని ఆ ఉప్పు ముందు మీ అత్త కిచ్చిరా!"

"ఉప్పు దారిలో ఒలికిపోతే ఎత్తాడట. దుమ్ము కలిసి పోయింది. రేపొద్దున్నే సూర్యం తెస్తాడు."

విశ్వనాథానికి చాలా కోపం వచ్చింది. మధుని దగ్గరికి లాగి జుట్టు గుంజుతూ అడిగాడు... "నిజం చెప్పు నిన్నే పంపానని కోపంతో ఉప్పులో దుమ్ము కలుపుకొచ్చావుకదూ ? అవునా ? మాట్లాడవేం ?"

"కాదు.... మామయ్యా! పడి .... పోయాను."

"ఛీ! అబద్ధాల వెధవా?" విశ్వనాథం గెంటిన గెంటుకి మధు వెల్లకిలాపడి తల నేలకు కొట్టుకున్నాడు. సూర్యం చటుక్కున లేచి తమ్ముణ్ణి లేవదియ్యబోతే మధు కెవ్వుమని అరిచాడు. సూర్యం చెయ్యి మధు మోకాలిమీద రాసుకుంది. అరచేతిమేర చెక్కు వూడిన మోకాలు ఎర్రగా రక్తం చిమ్ముతోంది. మధు బట్టలూ, ఒళ్ళూ దుమ్ముకొట్టుకు పోయాయి.

సుందరమ్మగారు ఇక ఓర్పు చూపించలేక పోయింది - కొడుకు కేసి చూస్తూ తీక్షణంగా అంది :

"ఇలా చీటికి మాటికీ చావగొడుతూంటే వాడు ఉంటాడనుకున్నావా? చస్తాడనుకున్నావా? నీకంత కంటకింపుగా ఉంటే చెప్పకూడదూ? అడుక్కునైనా తింటాడు. పుట్టెడు చీకట్లో పసివాణ్ని పంపింది గాక పైగా కొట్టటం ఒకటా? నేను బ్రతికున్నానన్న బుద్ధి ఏమైనా ఉంటే ఇలా చేస్తావా?"

తీరా మధుని గెంటాక విశ్వనాథం కాస్త కంగారు పడకపోలేదు. ముఖ్యంగా తల్లి గొడవ చేస్తుందనే జడిశాడు — మధుగాడి మోకాలు నిజంగానే చెక్కుపూడి రక్తం కారడం చూశాడు. అయినా తన పొరపాటు కప్పిపుచ్చుకుంటూ నిర్లక్ష్యంగా అన్నాడు.

"—ఎదురు తిరిగి జవాబు చెప్పటానికి లేని పసితనం పనులు చేయటానికే వస్తుందా? చీకటో వెన్నెలో — పని తగిత్తే చేసుకో వద్దంటావా?"

సుందరమ్మగారికి కొడుకుమీద అసహ్యం ముంచుకు వచ్చింది. "ఇంట్లో తింటున్నది వాడొక్కడేనా? దిక్కులేని వాడనా వాణ్ని పంపావు? పోనీ కాస్త పెద్దవాడు సూర్యం వెళతానంటే వాణ్ని వెళ్ళనివ్వకూడదూ? ఉప్పు తేవటమా కావలసింది, పసివెధవమీద పంతం పట్టడమా?—కొడితే కొడుతున్నాడా! తిడితే తిడుతున్నాడా? వాడేం పాపం చేసుకున్నాడని మీ కందరికీ ద్వేషం?"

విశ్వనాధం వ్యంగ్యంగా అన్నాడు — "పుణ్యానికిపోతే పాపం ఎదురయిందట. వాడికి కాస్త భయభక్తులు నేర్పుదామనుకొంటే నీ నిష్ఠూరాలు బాగానే వున్నాయి. అయితే ఇక మనవడు బాగుపడ్డట్టే."

"పోతే పోతాళ్ళే." సుందరమ్మగారికి ఎన్నడూ రాని కోపం వచ్చింది—"నీ చేతుల్లో వాడు ప్రాణాలు వదలకుండా ఉంటే చాలు. నువ్వు పుణ్యానికి పోవద్దు. నేను నిష్ఠూరాలూ ఆనొద్దు.

విశ్వనాధం విసురుగా గది తలుపులు తోసుకొని వెళ్ళిపోయాడు.

సుందరమ్మ కోడళ్ళమీద పేరుకుంటున్న కోపం అసహ్యం మిళితం చేస్తూ అంది — "ఏళ్ళ తరబడి కాపరాలు చేస్తున్నారు. ఏ సరుకు అయిందో—ఏ సరుకు ఉందో వేళపట్టుకు చూసుకోవటం నే

మహారాణీల్లా జరిగిపోతుంటే తంటాలు పడటం ఏం ఖర్మ ? నోరు తెరిస్తే నాది తప్పు. అత్త అరిస్తేగాని కోడలి కొంటెతనం కన్పించదట "

"ఇది మరీ బాగుంది. మధ్య మా మీద విరుచుకు పడటం ఏమిటి ? మీ అంత నేర్పుగా ఓర్పుగా సంసారాలు చక్కదిద్దుకోకపోయినా ఎలాగో ఉడకేసుకు తినకపోము. మీ తతంగం గడిచిపోయిందిగా?" ఎవరెలాపేడిస్తే మీకెందుకు ? మా యిష్టం మాది. అడగటానికి నువ్వెరవి ? అన్నట్టే మాట్లాడింది పార్వతి. చిలికి చిలికి గాలివాన అయింది. అత్తా కోడళ్ళ మధ్య పెద్ద ఘర్షణే జరిగింది. సుందరమ్మగారు అన్నం తినబుద్ధికాక పడుకొంచి.

కాలి దెబ్బతో రెండు రోజులు మధు మంచం దిగిలేకపోయాడు. [illegible] వాచి కొద్దిగా జ్వరంకూడా తగిలింది. ఆ విషయం ఇంట్లో ఎవ్వరూ [illegible]కోనూలేదు — మధు కిలా ఉందని సుందరమ్మగారెవ్వరిదగ్గిరా అనలేను లేదు. నాలుగు రోజులు ఆవిడే గద్బాకు పుచ్చాకు నూరి మనవడి కాలి కట్లు కట్టింది.

* * *

రోజు రోజుకీ తోట కన్నుల పండువుగా తయారవుతూన్న తోటను చూస్తూంటే మధు చిన్నారి హృదయం పారవశ్యంతో నిండిపోయింది. ప్రతి చెట్టూ మొక్కా పచ్చని ఆకులతో నవనవలాడుతున్నాయి? కనకాంబరాలూ. చేమంతులూ బుట్టలకొద్దీ పూస్తున్నాయి. కూరగాయలకు కొదవే లేదు. పళ్ళ చెట్లు చాలవరకు పిందెలు వేశాయి.

తోటను చూస్తున్నకొద్దీ అంతులేని గర్వం కలగసాగింది మధుకి. ఈ తోట ఇంత మనోహరంగా తయారవటానికి తనూ, తన స్నేహితులే కారణమౌతారు. గానీ ఏ కిష్టిగాడూ, ఏ సత్తిగాడూ కాలేరు. నేల తవ్వి, నారు పెంచి, నీరు పోసి, మొక్క నాటి, రెండు కళ్ళనూ వేయికళ్ళుగా చేసుకునీ-ప్రతి మొక్కనూ మాటలురాని చెల్లాయితో సమానంగా కాపెంచి

తృప్తి .... గర్వం.... చాలు—మధుకి.

తెల్లగులాబీ చెట్టు మొగ్గవేసింది. మధు ఆనందానికి అంతు లేకుండా పోయింది. ఆ సంగతి స్నేహితులందరికీ చెప్పేశాడు. ఆ మొగ్గ మాడని వాళ్ళందరికీ చూపించాడు.

"ఈ మొట్టమొదటి పువ్వు నేనే కోస్తాను." అన్నాడు దృఢంగా.

"రైటో!" అంది మతా.

సరే! తనే కోస్తాడు. అది సరాసరి తీసుకెళ్ళి సుధకే ఇస్తాడు. అంతవరకూ నిజం—తోటపని ప్రారంభించబోయే ముందు మధుకి
కల సుధకి తెల్ల గులాబీ యిచ్చినట్లు—ఏనాటికీ మరపురాదు. సు
గులాబీ పెట్టుకుంటే చాలా అందంగా ఉంటుంది. తనతో బాగా
తోంది. పువ్వు ఇస్తే ఒట్టు కూడా ఉంటుంది. తర్వాతపువ్వు పెళ్ళి

మర్నాటికి గులాబీమొక్క కాస్త పెద్దదైంది. తెల్లగులా
కిష్టిగాడు కూడా చూశాడు. మర్నాడు పొద్దుటే
మా తయారయ్యాడు. వెర్రికోపంతో మధు వాడిమీద
నువ్వేనా తోటపని చేశావా? గులాబీ చెట్టుకు నీళ్ళు
ఎరువు వేశావా? చీడ దులిపావా? ఏం చేశావని పువ్వు కోస్తావ్
వెధవా! చెట్టు ముట్టుకో..."

"ఏం చేస్తావురా మధూ? నా యిష్టం. మా తోట. నేనే కోస్తాను."

వాళ్ళిద్దరూ కొట్టుకుంటూంటే పార్వతి నోరు చేసుకొంది—
"అయ్యో! అసలా మొగ్గ విడనే లేదు. ఊరికే తన్నుకోటం దేనికి? దాన్ని బాగా విచ్చుకోనివ్వండి. అంతవరకూ మీరిద్దరూ కోయొద్దు."

ఆ తీర్పు మధుకి నచ్చలేదు. కిష్టిగాడికి నచ్చినట్లులేదు — రాత్రి మధుకి నిద్రే రాలేదు.

తెల్లారే కిష్టిగాడు తోటలోకి పరిగెత్తేసరికి చెట్టున పువ్వు లేదు! బావురుమని ఏడవాలనిపించింది వాడికి. వాళ్ళమ్మ దగ్గిరికి వెళ్ళి అలాగే ఏడ్చేశాడు—"పెద్దమ్మ ఎవర్నీ కొయ్యొద్దంది గదా? చూడు మధుగాడు పువ్వు కోసేసుకున్నాడు." ఇంకా బావురుమంటున్నాడు. తన మాట మధు లెక్క చెయ్యలేదనుకొందే పార్వతికి కోపం వచ్చేసింది. చొక్కా ఎత్తి పట్టుకొని భయంగా వస్తున్న మధుని చూస్తూ హూంకరించింది—

"పువ్వు కోసేశావు కదూ ?"

"అవునత్తా ! ఇదిగో !" సంతోషంగా పువ్వు తీసి మునివేళ్ళతో పట్టుకుని చూపించాడు మధు. గులాబీ పాల నురుగులా తెల్లగా కాంతిగా మెరిసిపోతూ పద్మంలా రేకులు విచ్చి ఉంది.

పార్వతికి కోపం రెట్టింపయింది. కటువుగా అంది.

"నిన్న నేనేం చెప్పాను ? నీకేం బుద్ధిలేదూ ?"

"ఏం ? పువ్వు కోసుకుంటే తప్పా ?"

సావిత్రి అందుకొంది—"తప్పో ఒప్పో చెప్పినట్లు వినకూడదూ ?"

"రేం ? కృష్ణుడు ఊరుకోలేదూ ?"

రి కృష్ణుడు లేస్తూనే చెట్టు దగ్గరికి ఎందుకు వెళ్ళాడు ? పువ్వు ని కాదా ?"

ల్లే, తెలివితేటలు, పెద్దవాళ్ళందర్నీ ధిక్కరించి మాట్లాడు

సావిత్రి వెటకారంగా అంది—"అసలు నీకు పువ్వెందుకు ? ఆ కివ్వాలనేనా ? చెల్లెలు అందరిలా ఉంటే మరీ మిడిసిపడి

పో

మధు కళ్ళెత్తి సావిత్రి మొహంలోకి చూశాడు.

"ఊఁ పువ్వు ఎందుకు కోశాను ?" అనిపించింది ఒక్క క్షణం.

"ఈ పువ్వు కోసే అధికారం నాకే లేకపోతే ఇంకెవరికి ఉంది ?" అనిపించింది మరో క్షణం. చివరికి నిర్భయంగా తెగించి అన్నాడు — "నేను ఆ గులాబీ చెట్టుకు ఎన్నో పనులు చేశాను. అందుకే పువ్వు నేను కోసుకున్నాను."

"బావుంది వరస. ఇంటి వాసాలు లెక్కపెట్టి ఇల్లు నాదే అనేలా ఉన్నావ్—ఏదీ? కోస్తే కోశావులే. ఇలా తే! సుధ తలమువ్వి పెట్టు కొంటుంది.

ఆ పువ్వు సుధకి ఇవ్వాలనిపించలేదు. అడ్డంగా తల ఊపాడు మధు—"నే నసలు సుధ కోసమే తెచ్చాను. ఇప్పుడు మాత్రం ఇవ్వను. మా చెల్లి ఇందాకే తల దువ్వించుకొంది. అదే పెట్టుకొంటుంది."

"ఆ పిల్లకి గులాబీ పువ్వు ఒక్కటే తక్కువగాని ఇలా ఇచ్చి వెళ్ళు" నిశ్చయంగా అంది పార్వతి.

"నేను ఇవ్వను."

పార్వతి లేచి వచ్చింది- "ఇవ్వవూ? నీ పెత్తనమేమిటి మాకు?" బలవంతంగా పువ్వు లాక్కోబోయింది. చటుక్కున మధు చెయ్యి వెనక్కి తీసుకున్నాడు.

గులాబీ విచ్చిపోయింది.
జలజలా రేకులన్నీ రాలి పడ్డాయి.
నేలంతా తెల్లకాగితం ముక్కలు చించి జిమ్మినట్లు.

"వెధవ పెంకితనం? ఏమౌతుంది మరి?" తిరిగి వెళ్ళిపోయింది పార్వతి.

"లక్షణంగా ఇమ్మంటే ఇవ్వకూడదూ? ఎవరికీ కాకుండా నేల పాలు చేశాడు"—సావిత్రి.

మధూ కళ్ళలో గిర్రున నీళ్ళు తిరిగాయి. మాట్లాడాలన్నా మాటలు పెగలలేదు. గులాబీ అంత సున్నితమైన మధు పసి హృదయం ఆ పూరేకు లాగే ముక్క ముక్కలై పోయింది. కన్నీళ్ళు బుగ్గల మీదుగా జారి పోతూంటే ఒంగి గులాబీ రేకులన్నీ చొక్కాలోకి ఏరుకున్నాడు.

* * *

మధు డ్రాయింగు పుస్తకం అయిపోయింది. మేష్టారు మరొకటి కొనుక్కోమని చెప్పారు. మధు సుందరమ్మగార్ని పావలా అడిగాడు. ఎప్పటిలాగే పెద్ద మామయ్య నడగమంది. మామయ్య నడిగితే అత్త నడగమన్నాడు. పార్వతి నడగటానికి మనస్కరించకపోయినా అభిమానం చంపుకొని తప్పనిసరిగా అడిగాడు.

"అత్తా! నాకు డ్రాయింగు పుస్తకానికి పావలా కావాలి. మామయ్య నిన్ను అడిగి తీసుకోమన్నాడు."

పార్వతి ఒక్క క్షణం మధుకేసి చూసి మొహం తిప్పేసుకుంది — "నా దగ్గిఎక్కడివి బాబూ డబ్బులు? నేనేం పోగు పోసుకు కూచ్చున్నానా?" అంది.

మధు మళ్ళా సుందరమ్మగారి దగ్గిరికి వెళ్ళాడు.

"నేను మాత్రం ఏం చెయ్యను? నా దగ్గర ఉన్నాయి కాబట్టి ఇవ్వనా? అస్తమానూ ఎంతకని జగడాలు వేసుకోను?"

"మరి నాకు డ్రాయింగు పుస్తకం ఎలాగ?"

"బళ్ళో మేష్టార్నే అడుక్కో, అంతకన్నా గొప్ప బతుకులు కావులే మనవి"

మధూకి కోపం వచ్చింది - "అదేమిటి? మేష్టార్ని ఎలా అడగను?"

"అయితే వూరుకో. గతిలేని వాడివి నీకా బొమ్మలూ బొడసులూ, ఎందుకు? కొత్త పాఠాలేవో నేర్చుకురా చాలు."

మధూకి ఉక్రోషం వచ్చేసింది. అందర్నీ ఏదో చేసెయ్యాలి - తను ఎవర్నీ ఏమీ చెయ్యలేడు. దొడ్లోకి పోయి ఏడుస్తూ కూచున్నాడు.

అప్పుడే వీధిలోంచి వస్తూన్న మదనగోపాలం అన్నయ్య పలకరించాడు - "ఎందుకోయ్ ఏడుస్తున్నావు?" — అతను వచ్చి రెండు రోజులయింది.

తన బాధ వినటానికి కో మానవుడు దొరికిందే చాలన్నట్టుగా మధు ఏడుస్తూనే చెప్పాడు -- "చూడండీ! నా డ్రాయింగు పుస్తకం అయిపోయింది. మేష్టారు తొందరగా కొనుక్కోవాలని చెప్పారు. ఒక్క పావలా అడిగితే అందరూ లేదనేస్తున్నారు."

"ఓస్! అంతేనా? చిల్లరలేదు కాబోలు!"

"కాదండీ! అసలు డబ్బులే లేవంటున్నారు."

"పోనీలే. నేనిస్తాను. ఇంత మాత్రానికే ఏడుస్తారా మొగవాళ్ళు -గోపాలం అన్నయ్య పర్సులోంచి అర్ధరూపాయి తీసి ఇవ్వబో[illegible]

"నాకు పావలా చాలండీ!"

"ఫర్వాలేదు తీసుకోవోయ్. గోపాలానికీ, నీకూ బాగా పట్టుట కదూ? నేను మీ అన్నయ్యనే అడుకో."

మధు సంతోషంగా అర్ధరూపాయి తీసుకు పరుగెత్తాడు — నెమ్మదిగా పార్వతి వాకిట్లోకి వస్తూ అంది:

"ఆ పిల్లాడికి నువ్వు డబ్బులిస్తూన్నట్టు ఉన్నావు. నిన్ను అడిగాడా అబ్బాయ్?"

"లేదు పిన్నీ? నేనే ఇచ్చాను."

"నన్ను అడిగితే చిల్లర లేదన్నాను. అంతే. ఏడుస్తూ పోతున్నాడు.

సుందరమ్మగారు కలగజేసుకుంటే జరగాల్సిన యుద్ధం ఆవిడ ముభావంగా నిట్టూర్పుటంతో తప్పిపోయింది.

డ్రాయింగు పుస్తకం కొనుక్కోగా మధుకి ఓ పావలా మిగిలింది. పావలా! ఎన్ని కానులో! గోపాలం అన్నయ్య అచ్చంగా ఇచ్చేశాడు. ఇప్పుడు పావలా ఏం చేసుకోవాలి? దాచేసుకుంటే...? ఊహూ పోనీ ఏదైనా కొనుక్కుంటే? ... ఏం కొనుక్కోవాలి? మిటాయి - లడ్డూ - బూంది — ఊహూ! పోనీ జంతికలు — చాలా వస్తాయి కూడాను. వస్తాయి గానీ మెత్తబడిపోయి ఏం బాగుంటాయి? జీళ్ళు చాలానే ఉంటాయి. అయితే మాత్రం పావలావే? అమ్మో!

మధుకి అపురూపంగా దొరికింది పావలా.

దాన్ని అపురూపంగానే వినియోగించాలి.

తటక్కున ఓ ఆలోచన మెరిసింది - భలే - గుర్తుపట్టింది. రిబ్బన్లు! - చెల్లెలికి రిబ్బన్లు - సుధకి ఎన్నో రిబ్బన్లు ఉన్నాయి. పాపం సుశీలకి ఒక్కటీ మంచిదిలేదు. దాని జడల కెప్పుడూ ఏవేవో గుడ్డ ముక్కలు వేస్తుంది అమ్మమ్మ!

ఇంక ఆలోచన వద్దు - "రిబ్బన్నే కొనేస్తాను." దృఢంగా నిశ్చయించుకొని బయల్దేరాడు మధు. ఎలాంటి రిబ్బను కొనాలో? తను ఒక్కడికీ ఏం తెలుస్తుంది? - పోనీ గోపాలాన్ని జత తీసుకు వెళితే!

అదే మంచిదనిపించింది మధుకి – నాలుగడుగులు వేసినవాడు ఆగిపోయి వెనక్కి తిరిగాడు.

"ఒరేయ్ గోపాలం! మాట."
"ఏమిట్రా?"
"చెప్తానుగా, రా!"

గోపాలాన్ని వెంటబెట్టుకు నడుస్తూ అంతా చెప్పాడు మధు. "అందుకే నిన్ను పిల్చానురా! మా చెల్లికి చక్కటి రిబ్బను కొందాం. నీకు బాగా తెలుస్తుంది కదూ?"

"ఆఁ నాకు తెలుసు. మా అక్కయ్యవాళ్ళు వేసుకుంటూ ఉంటారు కదా?"

ఇద్దరూ దుకాణం దగ్గరికి వెళ్ళారు.

"రిబ్బన్లు కావాలి సాయిబుగారూ!" పెద్ద బేరమేదో మాట్లాడుతూన్నట్లు గర్వంగా అన్నాడు మధు.

"మంచి మంచి రిబ్బన్లు చూపించండి." వంతపాడాడు గోపాలం. – వాణ్ని పిలవటం వృధా కాదన్నట్టు.

సాయిబు ఓసారి గడ్డం నిమురుకొని రిబ్బన్లు వేలాడదీసిన దండెం తెచ్చి ముందు నిలబెట్టాడు.

"ఏది కావాలో చూసుకోండి."

మధు కళ్ళు చెదిరిపోయాయి – రంగు రంగుల రిబ్బన్లు గాలికి తోరణాల్లాగ ఎగిరి పడుతున్నాయి. ఎర్రవీ, పచ్చవీ, నల్లవీ, తెల్లవీ.

ఈ నీలం రిబ్బన్లు తీసుకుందాంరా!
"ఉహూ! అది నాకేం బాగాలేదు. ఈ పచ్చది అయితేనో!"
"ఛ! నా కసలు నచ్చలేదు."
ఎన్ని చూపినా యిద్దరి యిష్టాలూ సరిపడలేదు.

"ఈ ఎరుపు రిబ్బన్లు తీసుకోండి బాబూ!" సాయిబే నిర్ణయించి చూపించాడు.

అది గోపాలానికి నచ్చింది. మధుకి మరీ నచ్చింది — "బావుంది కదురా?" అనుకున్నారు ఉమ్మడిగా — "ఇది ఎంత ఖరీదంటే?" ఎంతయినా ఇవ్వగలం సుమా? — అన్నట్లు చూశారు.

"వేడ అవుతుంది బాబూ! ఇంకా తక్కువైతే తొందరగా రంగులు పోతాయి."

"పేడ యిచ్చేద్దాంరా!" అన్నాడు మధు.

"నీకు తెలీదురా! బేరం ఆడాలి. ఉండు." నెమ్మదిగా గుసగుస లాడి గట్టిగా అన్నాడు గోపాలం—

"ఒక్క కానీ అయినా తగ్గించరాండీ?"

"లేదు బాబూ! పేడ అవుతుంది."

"పోనీ యిచ్చెయ్యరా!"

వాపలా యిస్తే తిరిగి రెండణాలిచ్చి రిబ్బన్ పొట్లం కట్టి యిచ్చాడు సాయిబు.

"మరి యిప్పుడేం చేద్దాం?"

"ఓ అణా మా అన్నయ్యకి ఇస్తాను. ఓ అణా పెట్టి మనం ఇద్దరం కొనుక్కుందాం."

నా దగ్గిర కూడా డబ్బులు ఉన్నాయిరా! వెళ్ళేటప్పుడు మా అన్నయ్య ఇచ్చాడు గానీ? నువ్వే కొనుక్కో. సుశీలకూ, సుధకీ తీసుకెళదాం."

ఇద్దరూ చెరో కానీతో బఠాణీలు పోయించుకున్నారు. ఇంకో కానీ పెట్టి రెండేసి చిన్న చిన్న జీడీలు కొనుక్కున్నారు. మధుకి ఇంకా ఓ అర్ధణా మిగిలింది. లాగూ జేబులో దాచుకున్నాడు.

"ఒరేయ్ గోపాలం! నా రెండో లాగుకి జేబు లేదు. అర్ధణా యిస్తే జేబు వేస్తానన్నాడు మిషనువాడు. ఈ డబ్బులిచ్చి జేబు వేయించుకుంటారా!"

"అవును. జేబు ఉంటే ఏది కొనుక్కున్నా దాచుకోవచ్చు."

ఇద్దరూ హుషారుగా ఇంటికి వెళ్ళేసరికి వాతావరణం వేడివేడిగా ఉంది. విశ్వనాథం ఎందుకో అందరిమీదా అరుస్తున్నాడు. కృష్ణుడు బుద్ధిమంతుడిలా ఓ మూల నిలబడ్డాడు.

మధుని చూస్తూనే విశ్వనాధం అరిచాడు.

"నా చొక్కాలో డబ్బులు నువ్వు తీశావుకదూ ? నిజం చెప్పు. లేకపోతే చీరేస్తాను నిన్ను."

అనుకోని ఈ పిడుగుపాటుకి మధూ—గోపాలం బిత్తరపోయారు.- మధు భయంగా అన్నాడు.

"లేదు .. మామయ్యా ! నేను... తియ్యలేదు."

"దొంగ వెధవా ! చేసినవాడు చేసినట్టు ఒప్పుకుంటార్రా ? ఏదీ యిలారా ? జేబు చూపించు." విశ్వనాధం అధికారయుతంగా మధు మీద కలబడి జేబు తడిమాడు — బఠాణీలు, జీడి, ఒక అణా — అర్ధణా చిన్న కాయితం పొట్లాం గబగబా విప్పిచూస్తే ఎర్ర రిబ్బనూ —

విశ్వనాధం వెర్రి కోపంతో మధూ జుట్టు ఒంగదీసి వీపుమీద ఛెళ్ళు ఛెళ్ళున చరుపులేశాడు.

"దొంగ వెధవా ! ఈ పని కూడా నేర్చావ్ ? ఇక అనుమానమేమి అక్కర్లేదు. బాగుపడిపోతావ్-" మధు వీపు మీద చరుపులు తింటూనే అరిచాడు—

"నేనేం నీ డబ్బులు తియ్యలేదు. గోపాలం వాళ్ళన్నయ్య ఇస్తే ఇవన్నీ కొనుక్కున్నాను. నన్ను వూరికే "

"నోరు ముయ్యవేంరా ? దొంగ వెధవ్వి అబద్ధాలాడకపోతే గతే మిటి ?" విశ్వనాధం మళ్ళా చెయ్యి ఎత్తబోయి సుందరమ్మగార్ని చూసి ఆగిపోయాడు.

"చూడు వీడేం చేశాడో ; నా జేబులో డబ్బులు కొట్టేశాడు." తన తప్పేమీ లేదన్నట్టు ఋజూ చేసుకున్నాడు, నేలమీద పడేసిన డబ్బులపీ చూపిస్తూ.

"చాల్లే ! నోరు మూసుకు వెళ్ళు. నీ చేతిలో ఉన్నాడని చావబాదితే ఎంతకాలం సహిస్తారనుకున్నావు? వాడికి గోపాలం అన్నయ్య డబ్బులిచ్చిన సంగతి నీ పెళ్ళానికి తెలుసు. నంగనాచిలా దాన్ని నిలబెట్టి ఎవరి మీదికి గెంటుతుంది దొంగతనం ? వెళ్ళి అడుగు — అంతా బయటపడుతుంది" సుందరమ్మగారు కాళికాదేవిలా మండిపడింది.

పార్వతి విసురుగా వచ్చేసింది చావిట్లోకి —

"సంగనాచిలా కూర్చోవటానికి నాకేం ఖర్మ ? నా పిల్లలు ఏడారని భయపడి మీ మనవడి మీదికి గెంటనా ?—ఆ గోపాలం అన్నయ్య డబ్బిచ్చిన మాట నిజమే కాబోలు. ఇచ్చానని నాతో చెప్పాడు. పావలా ఇచ్చాడో—ఎంతిచ్చాడో నాకేం తెలుసు ?

"పావలా కంటె ఎక్కువెందుకిస్తాడు ? వాడేం దానకర్ణుడా ?"-విశ్వనాథం.

"పావలా యిమ్మని మాత్రం ఆ అబ్బాయికేమయినా నిర్బంధం ఉందా ? ఏమిరా మధూ ? ఎంతిచ్చాడురా ?" సుందరమ్మగారు మనవడి కేసి చూసింది.

మధు కళ్లు ఒత్తుకుంటూ—"అర్ధరూపాయి ఇచ్చాడు. ఓ పావలా పెట్టి డ్రాయింగు పుస్తకం కొనుక్కున్నాను. ఓ బేడ పెట్టి పెన్సిలికి రబ్బరు కొన్నాను. ఓ అణా —"

"సిగ్గులేకపోతే సరి, ఫకీరు వెధవా ? ఇంటికి ఎవరు వస్తే వాళ్ళ అడుక్కుంటావా ?"

"నేను అడగనేలేదు — ఆయనే యిచ్చాడు. పావలా చాలునే అన్నాను. అర్ధరూపాయి తీసేసుకోమన్నాడు."

"అంటే మాత్రం తీసేసుకొంటావా ? కూడూ గుడ్డా లేకుండా — కావలసినవేమీ యివ్వకుండా మిమ్మల్ని బాధ పెడుతున్నట్టు నన్ను యాగీ చెయ్యటం కాదూ ?"

సుందరమ్మగారికి ఒళ్ళు దహించుకు పోయింది.

"అమ్మ పెట్టా, పెట్టదు, అడుక్కుతినా నివ్వదు అన్నట్టే ఉంది— నిన్ను అడుక్కుండే పెళ్ళాం మీద భరోసా పెట్టావు. ఆవిడగారి నడిగితే మొండిచెయ్యి చూపించింది. దేవుళ్ళా వచ్చి ఆ అబ్బాయి ఓ అర్ధరూపాయి డబ్బులిస్తే మధ్య నీకు ఉన్నతనం వచ్చిందా ? ఎందుకు ఏమైనా నాకీ కడుపుకోత ? ఈ గోలంతా నీకు ఇష్టంలేదు. పోనీ చూసినన్నాళ్ళు చూశావు. ఇక తెగ తెంపులు చేసేయ్. వాళ్ళ దారిన వాళ్ళు పోతారు ?"

"చాల్లే ! మాటకు ముందు ఇదొకటి మొదలెట్టావ్. ముష్టి నాలుగెకరాల సంపదలో పీకలదాకా మెక్కటానికీ, చదువు గొప్పలు వెలగబెట్టటానికీ అవుతుందనే కాబోలు నీ ఉద్దేశ్యం ?"

"కాకపోతే అప్పుడే నాలుగిళ్ళు ముష్టెత్తుకుంటారు. ఇష్టం ఉన్న తల్లి ఎవరో వేస్తుంది. అంతేగాని ఈ ఆదర్శాల బ్రతుకెన్నాళ్లు ?"

"నలుగుర్లో నవ్వులపాలైతే గాని...."

"నవ్వనీ ! ....ఎవరో నవ్వుతారనీ ఈ ఏడుపెందుకు ?"

సుందరమ్మగారి సంసారం గుట్టుగా ఉండాలని — తల్లీ బిడ్డలు ఘర్షణ పడకూడదనీ—పిచ్చి పిచ్చిగా ఆలోచించటం మానేసింది. పసివాళ్ళకి అన్యాయం జరక్కుండా చూస్తేనేగాని తన పెద్ద తనానికి అర్థం లేదని --భగవంతుడు కూడా మెచ్చడనీ నిశ్చయించుకుంది.

విశ్వనాథం కిక్కురుమనకుండా వెళ్ళిపోయాడు. మధు బటానీలు ఏరుకోబోతే పట్టుమని పది లేవు. అన్నీ సుధ ఏరుకు తినేసింది.

"అమ్మమ్మా ! ఇదిగోనే. సుశీలకు రిబ్బను తెచ్చాను" - మధు రిబ్బను సుందరమ్మగారి కిచ్చాడు.

ఫెళ ఫెళ ఆర్భాటాలతో వాన కురిసి వెలిసినట్టే అయింది.

* * *

అరిటి పిలకలు పాతటానికి సీతాపతి చూపించిన చోట నేల తవ్వి మట్టిలోంచి రాళ్ళూ, పెంకులూ ఏరి పారేస్తున్నాడు మధు. గోపాలం కొబ్బరిచెట్ల మొదళ్ళు తవ్వుతున్నాడు. సత్తిగాడూ, కిష్టిగాడూ, కొమ్మల మీద తోకల్లేని కోతుల్లా పాకుతున్నారు.

ఉన్నట్టుండి మధు సంభ్రమంగా అరిచాడు. అంతా పరిగెత్తుకు వచ్చి వాడి చుట్టూ మూగారు. తవ్విన మట్టి పైకి కెలుకుతూంటే గొలుసు లాంటి దేదో దొరికింది మధుకి. అది మట్టితో మూసుకుపోయి నల్లగా ఉంది.

"కడిగి చూదాంరా ! బంగారమేమో !" అన్నాడు గోపాలం.

అందరూ నూతి దగ్గరకు పరిగెత్తారు. మట్టి పోయాక ఆ గొలుసు బంగారం లాగే మెరిసింది. దాన్ని తీసుకు సుందరమ్మగారి దగ్గరకు

గెత్తాడు మధు. వాటి వెనక మిగతావాళ్లు— ఆ గొలుసు చూస్తూనే పోల్చేసింది సుందరమ్మగారు ఆవిడ మొహంలో, కళ్లల్లో ఆశ్చర్యం ఆనందం కొట్టవచ్చినట్టు కన్పించాయి. "ఇది బంగారం కాక పోవటమేమిటి? దీన్ని చిన్నప్పుడు సీతాపతి మెడలో వేసేదాన్ని. ఓసారి వాళ్ళ నాన్న గారితో తోటలోకి వెళ్ళి పారేసుకు వచ్చాడు ఎంత వెదికించినా కన్పించింది కాదు. ఇప్పుడెలా దొరికిందిరా?" ఆవిడ మెచ్చుకుంటూన్నట్టు మనవడి మొహంలోకి చూసింది.

మధు హుషారుగా – "అదే అమ్మమ్మా! దక్షిణం వేపు మూలగున్న మామిడి చెట్లు లేవూ? వాటి వెనుక దూరంగా అరటి మొక్కలు నాటుదామన్నాడు మామయ్య– తవ్వుతున్నాను....", పూస గుచ్చినట్టే చెప్పుకొచ్చాడు.

"మంచిపని చేశావ్. ఏమిటో లే అని పారేశావుగాదు" అంది సుందరమ్మగారు.

"ఇది ఎన్ని రూపాయలు వుంటుంది నాయనమ్మా?" అడిగాడు కృష్ణుడు.

"అప్పుడు తులంనర పెట్టి చేయించినట్టు జ్ఞాపకం. ఎంత అరిగిపోయినా తులం వుంటుంది— వందరూపాయల పైనే."

"అమ్మో! వందరూపాయలే!"

మధు వీరుడిలా అందరికేసి చూశాడు. అయినా వాడికి గర్వం చాలలేదు తన భావం వీళ్ళందరికీ అర్థమైందో లేదో!... "భలే! భలే! నాకు బంగారం గొలుసు దొరికిందోయ్! బంగారం గొలుసు! వందరూపాయల గొలుసు!" అంటూ గంతులేశాడు.

"గంతులకేంగాని వెళ్ళి ఆ పనేదో చెయ్యండి. మామయ్య కేకలేస్తాడు" సుందరమ్మగారు మనవణ్ణి మందలించింది.

కృష్ణుడు మాత్రం మళ్ళా తోటలోకి వెళ్లకుండా వాళ్ళమ్మ దగ్గరికి వెళ్ళిపోయాడు.

(15)

మధూవాళ్ళు ఇంటికి వచ్చాక సావిత్రి మధుని పిల్చి అడిగింది. "నీకేదో గొలుసు దొరికిందటగా ?"

"నిజమే చిన్నత్తా! తోటలో దొరికింది. వంద రూపాయలు ఉంటుందట. మా అమ్మమ్మ చెప్పింది." గర్వంగా సంతోషంగా అన్నాడు మధు.

"ఆ గొలుసు మా నాన్నదే అని నాయనమ్మ చెప్పలా ? మా కిచ్చేయ్" ఊపిరి బిగబట్టుకొని అనేశాడు కృష్ణుడు. మధు తెల్ల బోయాడు మొదట- "అయితే నాకు దొరికిందిగా ? మీ నాన్న పారేసు కున్నాడు. నేనేం మీ నాన్నదగ్గర తీసుకున్నానా ?" విసుగ్గా అన్నాడు.

సావిత్రి కాస్త బతిమలాడుతున్నట్టు అంది. "ఎవరి వస్తువనా పోతుందే అనుకో. దొరికినప్పుడు వాళ్ల కిచ్చెయ్యొద్దూ? - కంసాలికి కబురు పంపించాను. వస్తూనే ఉంటాడు- చిన్నదాని చేతులకు ఒత్తులు చేయించాలి. అది తెచ్చి యిచ్చెయ్."

మధుకి మతిపోయింది.

"అదేమిటి అలాచూస్తావ్ ? నీకు దొరికిన గొలుసు సుధా వాళ్ళ నాన్నగారిదేగా? మాది మాకు ఇవ్వటానికేం ?"

మధు తేరుకున్నాడు. ఖచ్చితంగా అన్నాడు—

"ఆ గొలుసు మా అమ్మమ్మదే! మామయ్య మెడలో వేసిందేగాని మామయ్యదేం కాదు!"

"ఇది మరీ బాగుంది."

"కాకపోతే కృష్ణుడి వేలికి ఉన్న ఉంగరం వాడిదేనేమిటి? వాడు దాన్నేం చేసినా నువ్వు వూరుకుంటావేమిటి ?"

"నీ పిడప కబుర్లకేంగాని ముందు అది తెచ్చి యివ్వు."

"నేను యివ్వను. ఆ ఒత్తులేవో మా సునీతే చేయించుకుంటుంది."

"పెద్దవాళ్లు ఒత్తులు చేయించుకోరుగా."

కృష్ణుడికీ ఉపాయం దొరికిపోయింది.

"కాకపోతే సుధ చెప్పులకి ఉన్న జూకాల్లాంటివి చేయించు కొంటుంది."

సావిత్రి కోపంగా చూసింది—"అంతేనా ? మీ పెద్దమామ్మయ్యకు చెప్పమంటావా?"

"ఆ చెప్పుకో గొలుసు దొరికింది నాకా? నీకా?"

"అనవసరంగా దెబ్బలు తినకు." ఓ ఛాన్సు చూద్దామనుకుంది సావిత్రి.

"నాకేం భయంలేదు ..."

అంతలో ఆ గొలుసు రెక్కలు కట్టుకువచ్చి సావిత్రి ఒళ్ళో పడింది. సుందరమ్మగారు కోపంగా గొలుసు కోడలి మీదికి విసిరేసింది.

"అమ్మమ్మా!" శక్తి ఉన్నంతవరకూ అరిచాడు.

"చాలుగాని నోరుమూసుకు బడికివెళ్ళు."

"నా గొలుసు ఎందుకు ఇచ్చేశావ్!"

"ఈ గొలుసే మనల్ని ఉద్ధరిస్తుందా ? అయినా ఆస్తిపాస్తులన్నీ నాశనమైపోతే "

"సుశీలకేమన్నా చేయించుకోమా? రాఘవ చేయిస్తున్నాడుగా ?" మధు కళ్ళల్లో నీళ్ళు తిరిగినంత పనైంది.

"నువ్వు పెరిగి పెద్దవాడివై కష్టపడి సంపాదించి చేయిస్తువుగానిలే, ఎందాకొచ్చినగొడవ? మన రాత బాగాలేదు. కాస్త తగ్గి ఉండటం నేర్చుకో."

మధు ఛీత్కరించుకున్నాడు. వాడికి మితిమీరిన కోపం వచ్చేసింది --"ఛీ! నువ్వు ఎప్పుడూ ఇంతే! నీ కేమీ తెలీదు. అస్తమానూ నన్నే తిడతావు. నిన్ను నాకు ఒక్క పావలా అడిగితే ఎప్పుడూ ఇవ్వలేదు. నాకు దొరికిన గొలుసు మాత్రం అడగ్గానే ఇచ్చేశావు" నిస్సహాయంగా ఏడుస్తూ కేకలేస్తూ వెళ్ళిపోయాడు. సావిత్రి మారు మాట్లాడకుండా గదిలోకి వెళ్ళి తలుపు వేసుకుంది.

ఆ సాయంత్రం... ...సన్నజాజి అంటుకి బోటు పెట్టడానికి గడ ముక్కలు నరుకుతోంటే మధు వేలు తెగింది. బొటబొటా నెత్తురు బొట్లు దారి పొడుగునా కార్చుకొంటూ సుందరమ్మ దగ్గరికి వచ్చాడు. ఆవిడ నెత్తినోరూ బాదుకొని పనవడి వేలికి తడిగుడ్డ చుట్టపెట్టింది.

ఇంట్లో మరెవరూ మధు వేలుతెగిన సంగతి విననుకూడా వినలేదు. కట్టు కట్టుకు తిరుగుతూన్న మధుని రెండోవాడు సీతాపతే అడిగాడు — "ఏమైందిరా? కట్టు కట్టావ్?."

మధు జవాబు యివ్వకముందే విశ్వనాథం అన్నాడు — "వాడు కుదురుగా ఉంటేగా? ఏమైనా అవుతుంది."

మళ్ళీపలకరించని సీతాపతికి మధు ఏమీ చెప్పలేదు.

* * *

వారం రోజులనుంచీ వూరంతా హడావుడిగా వుంది. సినిమాలు చూపించటానికి డేరా హాలు వేస్తున్నారు. అందరి గోడలకూ సినిమా పోస్టర్లు అంటించారు. పిల్లలందరికీ కాయితాలు పంచిపెట్టారు గ్రామ ఫోను ఒంటెద్దు బండిలో పెట్టుకుని పాటలు పాడిస్తూ వూరంతా తిప్పుతున్నారు. వూరంతా ఒకటే సందడిగావుంది. ఆ రోజునుంచే సినిమా చూపించటం మొదలు — "రాక్షసుల రాజ్యం". సినిమా బొమ్మలు గమ్మత్తుగా ఉన్నాయి. రాజకుమారుడు గుర్రంమీద ఎక్కి వెళుతున్నాడు. దారిలో ఒక రాక్షసుడు అడ్డం వచ్చాడు. ఆ రాక్షసుడితో రాజకుమారుడు గొప్పగా యుద్ధం చేస్తున్నాడు — ఓ బొమ్మలో.

రాక్షసుడు తప్పించుకు పారిపోతోంటే రాజకుమారుడు వెనకాలే గుర్రంమీద తరుముతున్నాడు—మరో బొమ్మలో.

దారిలో ఒక అందమైన అమ్మాయి కనిపించింది. రాజకుమారుడు గుర్రం దిగి ఆ అమ్మాయితో ఏదో మాట్లాడుతున్నాడు. ఆ అమ్మాయి కూడా రాజకుమారిలాగే ఉంది.

ఇంకో బొమ్మలో రాక్షసుడు చచ్చి పడి ఉన్నాడు.

"అరె! రాక్షసుడెలా చచ్చిపోయాడ్రా?"

"రాజకుమారుడూ రాజకుమారీ పెళ్ళి చేసుకుంటున్నార్రోయ్!"

"రాజకుమారుడే రాక్షసుణ్ణి చంపేశాడురా!"

పిల్లలంతా గోలగా ఎగబడి బొమ్మలు చూశారు.

"ఒరేయ్ మధూ మనమూ సినిమా కెళ్దాంరా!" గోపాలానికి సినిమా చూడాలని కోరిక పుట్టుకొచ్చింది.

"నాకూ చూడాలనే ఉందిరా గోపాలం! మరి డబ్బులు లేవుగా? పేడ—బేడ కావాలి ఎవరిస్తారు!"

"నా దగ్గర మూడణాలు ఉన్నాయిరా! ఇంకో అణా ఉంటే మనిద్దరికీ సరిపోతుంది కదూ?"

"మరి అణా ఎవర్ని అడుగుదాం?"

"మొన్న నీ గొలుసు తీసేసుకుందిగా! మీ చిన్నత్త నడుగు ఇస్తుంది."

మధుకి నచ్చలేదు—"నే నడగనురా! పోనీ నువ్వు వెళ్ళి చూసిరా నేను ఇలా బయట నించుంటాను"

గోపాలం ఒప్పుకోలేదు—"పోనీ నువ్వు అడగొద్దులే. మీ చిన్నత్తని నే నడగనా!"

కాస్త బాగానే ఉందనిపించింది. ఆ ఉపాయం.

"అయితే అడిగిరా? నేనిక్కడే కూర్చుంటాను."

"గోపాలం పరిగెత్తుకుంటు వెళ్ళాడు కాసేపట్లో తిరిగివస్తూ— "అర్ధణాయే ఇచ్చిందిరా! డబ్బుల్లేవంది–" అంటూ అర్ధణా చూపించాడు.

మధుకి కోపం వచ్చింది— ఆ అర్ధణా పట్టుకొని పరిగెత్తుకువెళ్ళి దొడ్లో పీటమీద బియ్యం ఏరుకుంటూన్న సావిత్రి ముందు గిరవాటు పెట్టాడు. అర్ధణా వచ్చి బియ్యంలో పడితే సావిత్రి తలెత్తి చూసింది.

"నాకేం అర్ధణా అక్కర్లేదు. అణా ఇవ్వలేవేమిటి?" మధు క్షణం నిలబడకుండా పరిగెత్తుకు వెళ్ళిపోయాడు.

"అయితే ఏం చేద్దాం?" మళ్లా అణా ప్రశ్న వచ్చి ఎదురుగా నిలబడింది.

"పెదనాన్న వూళ్ళోలేడు. చూస్తే ఇవ్వాళే చూడాలి" అన్నాడు గోపాలం ఆతృతగా.

మధు కేమీ తోచలేదు — "పోనీ కాస్సేపు వీధిలోకి పోదాం పదరా!" అంటూ లేచాడు.

తీరా వీధిలో కాలు పెట్టేసరికే తెలుగు మేష్టారు ఎవరితోనో మాట్లాడుతూ కన్పించారు.

ఆయన మధునీ గోపాలాన్నీ చూడనే చూశారు.

—"ఒరేయ్! నాకు కాస్త పనివుంది గానీ ఈ కూరల సంచీ మా యింటి దగ్గిర ఇచ్చి రండిరా! జాగ్రత్తరోయ్! రోడ్డుమీద ఎత్తేస్యొకండి"— అంటూ నమ్మకమైన విద్యార్థులకో పని అంటగట్టారు.

వాళ్ళిద్దరూ సంచి తీసుకు వెళ్ళేసరికి మేష్టారి భార్య కూరల కోసమే ఎదురు చూస్తోంది.

"హమ్మయ్య! ఇప్పటికైనా తెచ్చారు. అసలు సినిమా అందదనే అనుకున్నాను. మీ మేష్టారు ఎక్కడ పెత్తనాలు చేస్తున్నా రేమిట్రా?" — ఒకవేపు మాట్లాడుతూనే సంచి దిమ్మరించి చకచకా వంకాయలు తరుక్కోవటం మొదలుపెట్టిందావిడ.

"మధు వినయంగా అడిగాడు— "అమ్మగారూ! మీరు సినిమాకి వెళతారండి?"

"అవున్రా! సినిమా బాగుందట గదూ? మావాడు అప్పుడే రెండుసార్లు చూసి మళ్ళా నాతో వస్తానని గోల చేస్తున్నాడు — మీరు చూశారా?"

"లేదండీ! చూడాలనే ఉందండీ!"

"ఇంకా ఉండటం ఏమిట్రా! వెళ్ళక. మీలాంటి పిల్లలే చూడాలి."

మధు నసుగుతూనే అనేశాడు— "మా దగ్గర మూడణాలే ఉన్నాయండీ! ఇంకో అణా—".

"మీ అమ్మమ్మగార్ని అడక్కూడదూ?"

"మా అమ్మమ్మదగ్గర డబ్బులు ఉండవండీ! మా చిన్నత్త నడిగితే ఇవ్వలేదండీ!"

"అయ్యో! అణా భాగ్యానికేనా? అయినా ఆవిడ దగ్గర ఉన్నాయో లేవో? ఇందర ఈ బేడ తీసుకోండి" ఆవిడ పోపుల పెట్లోంచి బేడ బిళ్ళ తీసింది.

"ఒక్కొ అణా చాలండి!"

"సినిమాకి వెళుతున్నావు కదా చిన్న పిల్లలు ఏమైనా కొనుక్కోరుట్రా?" అంటూ నవ్విందావిడ.

మహా ప్రసాదంలా దోసిలిపట్టి అందుకున్నాడు పేడ బిళ్ళని మధు.

"వెళ్ళిపోతాం అమ్మగారూ?"

"ఆఁ అఁ వెళ్ళండి. నేను కూర వండుకోవాలి" వీధిలోకి వచ్చి కావిలించేసు కున్నారు. అంతులేని సంతోషంతో మధు, గోపాలం మాట్లాడుకోలేక పోయారు.

"పాపం సత్యన్నారాయణని కూడా పిలుద్దాంరా! వాడికి డబ్బు లుంటాయిగా?"

"అప్పను కిష్టిగాడు కూడా. అందరం సరదాగా కలిసి వెళదాం."

గోపాలం గుసగుస లాడుతూ సత్యన్నారాయణకి సినిమా కబురు చెప్పేశాడు. వాడి మొహం విప్పారింది.

"ఇప్పుడే మా పిన్నిని అడుగుతాను." —సత్యన్నారాయణ గది లోకి వెళ్ళాడు. ఏమడిగాడో గానీ పార్వతి మాటలు బయటికి వినిపిస్తాయి:

"అమ్మో! వాళ్ళందరితో నువ్వు సినిమాకే! జనం కొట్టుకులాడు తున్నారట. అసలే అర్భకం వెధవ్వి! నిన్ను తొక్కేసినా తొక్కేస్తారు"

"....... ........."

"ఎందుకురా అలా మొహం దించుకున్నావ్? రేపు నేనూ, సావిత్రి పిన్నీ వెళదామనుకొంటున్నాం — నిన్ను నేను తీసుకెళతాగా? బెంచీలకు వెళితే ఖాళీగా కూర్చోవచ్చు. నేలలో అయితే నుప్పు కూర్చో లేవు."

సత్యన్నారాయణ చిన్నబుచ్చుకున్న మొహంతో బయటకి వచ్చాడు. పాపం వాణ్ని చూస్తే జాలేసింది పలకరిస్తే ఏడ్చేసేలా ఉన్నాడు.

"అసలు నీ దగ్గర డబ్బులున్నాయా? లేవా? చెప్పు?"

"ఒక్కొ అణా ఉన్నచాలు మాదగ్గరో అణా ఉంది-" మధు, గోపాలం బుజ్జగిస్తోంటే సత్యన్నారాయణ నిజంగానే ఏడ్చేశాడు!

"ఏడవటం ఎందుకురా? చెప్పు?"

"డబ్బులెందుకులేవు ? నా సంచీలోనే ఉన్నాయి."

"అయితే మాతో వచ్చేయ్‌రాదూ?"

"మరి మా పిన్ని తిట్టదూ?"

"ఇంకెందుకురా ఏడుస్తావు నోరు మూసుకు కూర్చో" మధుకి చిరాకు వేసింది.

"తిడితే తిడుతుందిలేరా? సత్యన్నారాయణా! మధు అస్తమానూ దెబ్బలు పడటంలేదా ఏమిటి? నిజంగా మాతో వచ్చేయ్ — రేపు పెద్ద వాళ్ళతో వెళితే ఏం సరదాగా ఉంటుందీ ? ఎంచక్కా మనమైతే.... అల్లరి చేసుకుంటూ, అరుచుకొంటూ, నవ్వుకొంటూ...."

"వచ్చేస్తానురా నేను" గమ్మున అనేశాడు సత్యన్నారాయణ.

"నిజంగా?"

"నిజంగానే వచ్చేస్తాను. పెద్దవాళ్ళతో ఎవడెళతాడేమిటి?"

"సత్యన్నారాయణ పిరికివాడు కాదురోయ్!"

సత్యన్నారాయణకి ఏదో ధైర్యం వచ్చేసింది. సంచిలో డబ్బులు తీసి చూపించాడు. సరిగా బేడార్థణావుంది— "చాలవా?"

"ఓ ఇంకో అర్ధణా కొనుక్కోటానికి కూడా మిగులుతుంది...."

ఎప్పటిలాగే పిల్లలు పెందరాడే భోజనాలు చేశారు — "చాప వేసుకు కూర్చుని చదువుకో" మరోసారి హెచ్చరించింది పార్వతి. సత్యన్నారాయణ తల తాటించి ఊరుకున్నాడు.

సినిమా మొదలు పెట్టటం ఎనిమిది గంటలకి. సైగలు చేసుకుంటూ గుర్తులకోసం ఈలలు వేసుకొంటూ వీధిలో పడేసరికి ఏడున్నర దాటింది. సినిమా డేరా దగ్గిర అప్పుడే పాటలు వేసేస్తున్నారు. పిల్లలంతా కాలికొద్దీ పరుగులువేశారు. ఎప్పుడు వచ్చేశాడో కిట్టిగాడు డేరా దగ్గిరే కన్పించాడు.

తెలుగు మేష్టారి పెళ్ళాం కూడా కన్పించింది. గోపాలాన్ని చూస్తూ — "మావా డెటుపోయాడో కన్పించటం లేదు బాబూ ! రెండు కిళ్ళీలు తెచ్చిపెడతావూ" అంటూ అర్ధణా యిచ్చింది.

కృష్ణుడితో సహా నలుగురూ కిళ్ళీకొట్టు దగ్గరికి పరుగెత్తాడు — "మనమూ కిళ్ళీలు వేసుకుందాంరా!" అన్నాడు. కృష్ణుడు మధుసూ. సత్యన్నారాయణ కూడా అంగీకరించాడు. అందరూ తలో కానీ యిచ్చి కిళ్ళీలు కట్టించుకున్నారు.

"బాగా కట్టు అబ్బీ! ఎర్రగా పండాలి."

"పండకపోతే యింకో కిళ్ళీ యివ్వాలి, తెలిసిందా?"

"అర్ధణాకి మూడైనా ఇవ్వవూ!"

అందరూ కొట్టువాడి మీదికి ఎగబడి మరీ బేరంచేసి కిళ్ళీలు కట్టించుకున్నారు.

"ఒరేయ్! నేను వచ్చేదాకా తినకండి. అందరం ఒక్కసారే నోట్లో పెట్టుకుందాం. అమ్మగారికి కిళ్ళీలు యిచ్చి వచ్చేస్తాను"— గోపాలం పరుగెత్తాడు.

ఆవిడ గోపాలంతో అరటిపళ్ళు కూడా తెప్పించుకుంది. ఇంటి పిల్లాడు ఏడుస్తున్నాడని ఓ జంతిక తెమ్మని మళ్ళా పంపింది — వాళ్ళు కిళ్ళీలు నమిలేస్తున్నారో ఏమిటో ఒకటే బాధ గోపాలానికి. అమ్మగారికి అన్నీ యిచ్చి బయటపడ్డాడు చివరికి.

"ఎంతకీ రావేమిట్రా?"

"కిళ్ళీలు తినేశారా?"

"లేదు. ఇదిగో. నీది తీసుకో."

"మరి ఇంక తినేద్దామా?"

"నేను రైట్ అంటాను. అప్పుడు అందరం నోట్లో పెట్టేసుకుందాం — అంటున్నాను, రైట్."

కంగారుతో కిష్టిగాడు కిళ్ళీ కింద పారేసుకున్నాడు. గబగబా నేల మీద తడుంకొని దుమ్ము దులిపి నోట్లో పెట్టేసుకున్నాడు.

"ఇంకో కానీ కానీ ఉందిగా? ఏం కొనుక్కుందాం?"

"సినిమాలోకి బఠాణీలు, జీళ్లు అవీ అమ్మొస్తాయట... అక్కడే కొనుక్కుందాం."

"ముందు టిక్కెట్లు కొనద్దూ!"

"ఒరేయ్! నా నోరు పండిందేమో చూడరా?" కిష్టిగాడు కప్పలా నోరు తెరిచాడు.

"పంతటాలు తర్వాత చూసుకుందాం. ముందు టిక్కెట్లమాట."

"నిజమేరోయ్. ఆ మాటే మరచిపోయాం."

"డబ్బులన్నీ మధు కిచ్చేయండి. వాడు కొంటాడు."

"వాణ్ణలా తోసెయ్యకురా! డబ్బులు పడిపోతాయి."

"నేను తోస్తున్నానా ఏమిటి? వాళ్ళెవరో నన్ను తోసేశారు."

"సరేలే దెబ్బలాడుకోకండి."

"ఇక్కడ నించోండి. అస్సలు కదలద్దు. నేను టిక్కెట్లు కొని వస్తాను. మళ్ళీ కనిపించకపోతే ఎలా?"

"ఒరేయ్! ఒక్కసారి నేను అలా వెళ్ళొస్తానురా."

"ఒద్దని చెప్పలా! ఎక్కడికీ వెళ్లొద్దు."

"నాకు కడుపు ఉబ్బి పోతోందిరా!"

"అయితే మరి తొందరగా వచ్చెయ్."

గోపాలం పరిగెత్తాడు. వాడు వచ్చాకే మధు టిక్కెట్లు తేవడానికి కదిలాడు.

నలుగురూ గేటు దగ్గర మనిషికి ఎవరి టిక్కెట్టు వాళ్ళే స్వయంగా భద్రంగా అప్పగించి డేరాలో జొరబడిపోయారు.

సినిమా హుషారుగా, ఉత్సాహంగా సాగిపోయింది. బిలబిల్లాడుతూ లేచి ఇంటి మొహం పట్టేసరికి ఉత్సాహమంతా చచ్చినట్టయిపోయింది. సత్యన్నారాయణ తప్పుచేసినవాడిలా నీళ్ళుగారిపోయాడు.

"నాకు భయం వేస్తోందిరా!"

"నిజమేరా! మనం తీసుకెళ్ళామని పెద్దమ్మ తిడుతుందేమో!"

"తిడితే తిడుతుందిలే. మాట్లాడకుండా ఎవరి పక్కలమీద వాళ్ళు పడుకోండి."

భయం భయంగానే ఓడీలు ఎక్కారు. పార్వతి నిద్రపోకుండా ఎదురు చూస్తో కూర్చుంది చావిట్లో. పిల్లలు నలుగుర్నీచూసి ఏమీ మాట్లాడ లేకపోయింది – సత్యన్నారాయణ కళ్ళబడేసరికి పొంగిపోయింది. "వెర్రి వెధవా! నాకు చెప్పకుండా వెళ్ళిపోయావుకదూ ? ఏమైపోయావో అని హడలి చచ్చాను. బాగా కూచున్నావా ? ఎవరైనా తొక్కేశారా?"

సత్యన్నారాయణ నోరు పెగల్చుకొని అన్నాడు.

"ఇంకెప్పుడూ వెళ్ళను పిన్నీ!"

"ఏడిశావులే పడుకో. సుఖంగా వచ్చావు. అదే చాలు." — పార్వతి గదిలోకి వెళ్ళిపోయింది. మధు పైకి ఎంత ధైర్యంగా ఉన్నా పెద్దత్త తప్పకుండా తిడుతుందని, మామయ్యతో చెప్తుందని భయపడు తూనే నిర్లక్ష్యంగా తిరిగాడు.

పార్వతి మరేమీ అనకపోవటంతో కిక్కురుమనకుండా పక్క పక్కల్లో వాళ్ళు దూరిపోయారు.

"ఒరేయ్ గోపాలం! అడుగో రాక్షసుడు!" చెప్పకుంటూ కూర్చున్నాడు సత్యన్నారాయణ.

"ఒరేయ్ మధూ! వాళ్ళ పిన్ని నిజంగానే తిడుతుందిరోయ్!" దొంగలా పడుకున్నాడు మధు.

మధు స్నేహబృందం — ముఠాలో సభ్యులంతా ఆ సినిమా చూసే దాకా మొత్తానికి ...

ఓసారి తోటలో పిల్లలంతా కలిసి సినిమా ఆడారు. మధు రాజ కుమారుడు: కృష్ణుడు రాక్షసుడు. రాజకుమార్తెలా సుధని ఉండమంటే ఉండనంది – హరిగాడు వాళ్ళ చెల్లాయి పరికిణీ తెచ్చుకు తయారయ్యాడు. రాక్షసుడు చేతుల్లోంచి రాజకుమార్తెని తప్పించటానికి రాజకుమారుడు పిచ్చిపిలా ప్రయత్నాలు చేస్తున్నాడు. ఎంతకీ రాక్షసుడు గెలుస్తుంటేసరికి ఎదురెదురుగా కొట్లాటకి దిగారు. రాక్షసుడా — పేటలో అంతా మరచిపోయి మధు కృష్ణుణ్ణి బాదపారేశాడు. ఏడిచిపోయింది. కృష్ణుడు శోకాలు పెడుతూ ఇంట్లోకి పరిగెత్తాడు.

– పర్యవసానం – మధు విశ్వనాథం చేత తన్నులు తిని ఏడ్వటానికి మన స్ఫురించక కిక్కురుమనకుండా వెళ్ళిపోయాడు పళ్లు నూరుకుంటూ.

* * *

మామిడిచెట్లనిండా పిండి జిమ్మినట్లు ఉంది పూత — విశ్వనాథం తోట పరిశీలనకు వచ్చాడు. కొమ్మల మీద కోతుల్లా ఎగబాకుతున్న పిల్లల్ని చూసి మండిపడ్డాడు — "ఒరేయ్! ముందు చెట్లు దిగండి. ఏమిటా గంతులు? కొమ్మలు వూపుతుంటే పూత రాలిపోదు?"

ఆకుల చాటున నక్కి కూర్చున్నవాళ్లు ఉండిపోయినా చాలామంది పిల్లలు చెట్లు దిగిపోయారు కొరకొరా చూస్తూ.

విశ్వనాథం సూర్యాన్ని సంబోధిస్తూ అన్నాడు—"ఏంరా సూర్యం!. నీకు కూడా బుద్ధిలేదూ? వాళ్ళలా గంతులేస్తోంటే చూస్తూ కూర్చున్నావా?"

ఓ చెట్టు మొదట్లో కూర్చుని హాయిగా పుస్తకం చదువుకొంటూన్న సూర్యం ఏమీ అర్థంకానట్టు తలయెత్తి చూశాడు.

"ఆడుకోనివ్వకపోతే పనేంటుకు చేస్తారేమిటి?" మధు దూరంగా నిలబడి ధైర్యంగా అన్నాడు.

విశ్వనాథం వాడికేసి తీక్షణంగా చూశాడు. "చెట్లెక్కి గంతు లెయ్యకపోతే ఆటకాదా? రాస్కెల్! ఒకసారి చెట్లెక్కించు చూస్తాను."

చెట్లమీద ఎక్కి కోతికొమ్మచ్చి లాడుకోకపోతే తోటపని చేసిన అలుసటే లేరదు. అయినా విశ్వనాథానికి జడిసి పిల్లల ముఠా కాస్త లొంగక తప్పలేదు.

ఆ ఏడు తోటలో చెట్లన్నీ బాగా కాశాయి. మామిడి కాయలు చాల వరకు చెట్లమీద బేరం పెట్టేశాడు విశ్వనాథం. బేరగాళ్ళు తోటలోకి బళ్ళు తోలుకువచ్చి మామిడికాయలు రకరకాలుగా బుట్టలు కట్టుకుని సంతకు తోలుకుపోయారు. అమ్మినవి అమ్మగా విశ్వనాథం స్వయంగా దగ్గరుండి వెయ్యి కాయ వరకూ అటకలమీద వేయించాడు. — ఆ రోజు పిల్ల లకీ కాస్త పండినవాటిలో తలో రెండు కాయలూ దొరికాయి.

మర్నాడు — మరోనాడు — మూడోనాడు — వారం గడిచినా మామిడిపళ్ళ సంగతి ఎవ్వరూ ఎత్తనేలేదు.

"అమ్మమ్మా! మామిడిపళ్ళు ఇవ్వవే-" అంటూ మధు సుంద రమ్మగార్ని ఎన్నిసార్లు అడిగినా—"ఇంకా పండలేదట— నేనేంచూశానా? చచ్చానా?" అంది.

"ఏరా మధూ! ఇంకా కాయలు పండనేలేదూ?"

"అసలు దింగినవల్లి కాయలు పండనే అక్కర్లేదురా!"

"మనం కష్టపడి పనిచేశాం కదా? మనకెందుకు పెట్టదేమిటి?" —స్నేహితులంతా మధు చుట్టూజేరి ప్రశ్నల వర్షం కురిపించారు. "అయితే నే నివ్వాళ అడిగేస్తాను" అన్నాడు మధు దృఢంగా.

మధు ఇంటికి వచ్చేసరికి పార్వతి పిలిచి రెండు కాయలు ఇవ్వబోయింది. మధు సంతోషంగా అన్నాడు -"రాము —హరి—గోపి వాళ్ళం దర్నీ పిల్చుకురానా అత్తా!"

పార్వతి ఆశ్చర్యంగా చూసింది—"వాళ్ళందరికీ మొన్నిచ్చాంగా? ఇంకెక్కడివి."

మధు అయోమయంగా చూశాడు. "అదేమిటి? అలా చూస్తావ్— అందరికీ కాయలు దింపిననాడు రెండేసి ఇవ్వలేదూ?"

"అవేనా?" ఆశ్చర్యంగా—కోపంగా — రోషంగా — పంపు పట్టని విధంగా అడిగాడు మధు.

"ఇది మరీ బాగుంది కొబ్బరికాయలంతేసి కాయలు రెండేసి ఇస్తే ఇంకా చాలవూ? చాలకపోతే మాత్రం నేనేం చెయ్యను? అటకమీద పండేశాకన్న మాటే గానీ ఎవరు తిన్నారనీ? మెచ్చులకీ, మొహమ్మాటాలకీ ఎవరెవరికో ఇచ్చేసుకొన్నారు."

"అంతా ఉత్తది. ఎవరికీ యివ్వలేదు. నాకు తెలీదా?"

"ఇదిగో అబ్బాయ్! నీతో నేను వాగలేను. నీకిష్టమైతే ఆ రెండు పళ్ళు తీసుకువెళ్ళు, లేకపోతే లేదు."

"నాకేంవద్దు. అన్నీ మీరు తినేసి, వెధవ రెండుపళ్ళు .... ...."

"మాట్లాడకుండా వెళ్ళమన్నానా? మీ మావయ్యతో చెప్పేవరకూ ఆగు, ఆ అడిగేదేదో ఆయన్నే అడుగుదువుగాని ......"

పార్వతి పీటమీద పెట్టిన పళ్ళకేసి ఒక్క చూపుచూసివెళ్ళిపోనాడు మధు.

మిట్టమధ్యాహ్నంవేళ పార్వతీ, సావిత్రి గదుల్లో పడుకున్న సమయంలో పిల్లిలా అటక ఎక్కిచూశాడు మధు. — ఎక్కడో వెనగ్గా ఓ గంపెడుకన్నా ఎక్కువలేవు పళ్ళు. అవీ నల్లనల్లగా డాగులుపడి కుళ్ళిపోతూ వున్నాయి—మరుక్షణం రాయిలా వుండిపోయాడు. ఈ అటకనీ —పళ్ళనీ—ఇంటినీ అందర్నీ ఏదో చేసెయ్యాలనిపించింది. కసిగా పళ్ళు నూరుకున్నాడు.

ఆ వార్త మధు స్నేహితుల్ని కోతుల్ని చేసింది.— "మనకు పెట్టకుండానే వాళ్ళు తినేశారు"—ఆ విషయం వాళ్ళందర్నీ దహించి వేసింది.

"మనమేనా అంత చేతకాని వాళ్ళం?" ఆ ప్రశ్న వాళ్ళని వూపి వేసింది.

"చూస్కో! రేపొద్దున్నకి ... తోట....సఫా!"

"భలే ఐడియా! అంతే! తోట మసి!"

"పువ్వూ-పిందే-కాయ-చెట్టూ-అన్నీ"—ఆవేశంతో వూగిపోయారు పిల్లలంతా.

"ఉహూ!" అడ్డంగా తలవూపాడు మధు.

"ఏమిటీ?

"ఒద్దు. తోట నేమీ చెయ్యవద్దు."

"అయితే మనం నోరుమూసుకుని వూరుకుందామా!"

"కష్టపడి పనిచేసిన వాళ్ళకీ పెట్టకుండా తినేశారే! వాళ్ళకి బుద్ధి ఎలా వస్తుంది?"

ప్రశ్న పరంపర మధుని చుట్టివేసింది.

మధు అందరికీ సమాధానంగా అన్నాడు—"తోట మనం కష్టపడి బాగుచేశాం. ప్రతి మొక్కనీ, ప్రతీ చెట్టునీ ఎంతో అభిమానంతో చూసుకున్నాం. స్వయంగా మన చేతులతో విత్తనాలు పాతి మొక్కలు పెంచాం. తోట ఎవరిదో కాదు. మనది! ఇప్పుడు కోపంవచ్చి తోటని మనమే నాశనం చేద్దామా? మనం నాటిన మొక్కలన్నీ ప

పీకి పారేద్దామా ?" —మధు అందరికేసీ చూశాడు. ఎవ్వరూ మాట్లాడ లేదు. అందరికీ మధు ఉద్దేశ్యం సమంజసంగానే తోచింది.

"నిజంగా ఇప్పుడు మనందరికీ చాలకోపం ఉంది. మనం పెట్టు కుండానే వాళ్ళు అన్నీ తినేశారు. వాళ్ళమీద కసి తీర్చుకోటానికి నాకో ఆలోచన వచ్చింది."

పిల్లలంతా సంభ్రమంగా చూశారు.

"చెప్తానుగా! అంతేగాని మనం పెంచిన తోటని మనం ఎప్పుడూ చంపుకోకూడదు. అవునా ?"

"నిజమే. మరి మేము కోపంలో అలా అనేశాం—" పిల్లలు సంజాయిషీ చెప్పుకున్నారు.

"మన కసి అంతా తీరిపోయే ఉపాయం నేను చెప్తాగా?"

"రైటో! రైటో!"

మధు చెప్పబోయే ఉపాయం బ్రహ్మాండంగా ఉంటుందని విశ్వాసం వాళ్ళని సంతోషంతో వెర్రివాళ్ళని చేసింది.

* * *

ఆ సాయంత్రం విశ్వనాథం తోటంతా తిరిగివచ్చి సీతాపతితో అన్నాడు— "కొబ్బరిబొండాలన్నీ పండి పోతున్నాయి. ఇంకా ఎందుకు ఉంచటం? రేపొద్దుట అవి కోయించు ముందు."

"అలాగే" అన్నాడు సీతాపతి.

ఎప్పటిలా పిల్లల్ని తీసుక పొద్దుటే తోటలోకి కొబ్బరిచెట్ల దగ్గిరకి వెళ్ళిన సీతాపతి - సూర్యం కొయ్యబారిపోయాడు-ఒకరి ముఖా లొకరు చూసుకున్నారు—

"అయ్యో! బొండాలేవి మామయ్యా ?" మధు ఆశ్చర్యపోయాడు.

దేమిటి ? ఇప్పుడేకదూ మనం కొయ్యాలని వచ్చాం ?" తను ం వెలిబుచ్చాడు గోపాలం.

దొంగ వెధవలు! ఎప్పుడూ లేదే:" సీతాపతి గబగబా

బయటకు వెళ్ళటానికి సిద్ధమవుతున్న విశ్వనాథం సీతాపతి చెప్పింది విని నిర్ఘాంతపోయాడు.

"బొండాలన్నీ తెంపుక పోయారా ? ఏమిట్రా నువ్వనేది ? ఎవర్రా తెంపుక పోయింది ?"

"అదేమో ! మేము వెళ్ళేసరికి చెట్లన్నీ బోసిగా ఉన్నాయి. నీతో చెప్పాలని నేను వచ్చాను."

"పద నేనూ చూస్తాను" విశ్వనాథం తోటలోకి వెళ్ళాడు. బోసి కొబ్బరిచెట్లు విశ్వనాథాన్ని వెక్కిరించాయి.

"దొంగ వెధవలు ! ఎవరో మరి రాత్రి గేటు సరిగ్గా కట్టలేదూ ?"

"ఎలా ఉండేవి అలాగే ఉన్నాయి."

"సరే ! చూద్దాం. ఈ రాత్రినుంచి తాళాలు కొనుక్కువచ్చి మరీ వేయిస్తాను. ఎలావెళతారో చూద్దాం ?"

రెండువారాలు గడిచిపోయాయి.

"చూశావా ? తాళాలు వెయ్యటంతో చచ్చి వూరుకున్నారు. లేక పోతే సపోటాపళ్ళన్నీ అలా పలకబారి ఉన్నాయి. కోసుకుపోకుండా ఉంచే వాళ్ళనా!"

"ఎందుకైనా మంచిది. రేపు సపోటా కాయలు కోయించేస్తాను"

"ఇంకా ఎవడికీరా అన్ని దమ్ములు ? మొన్న వెన్నెల రాత్రుళ్ళు కాబట్టి అంతపని చేశారు. అమావాస్య రోజుల్లో ఈ కటిక చీకట్లో ఆ కాయ లైనా కనిపడాలా ?" -- విశ్వనాధం గర్వం పీగిపోయింది. ఆ రాత్రి సపోటా కాయలన్నీ మాయమయ్యాయి. ఆ దొంగ వెధవ లెవరో దక్షిణం వైపు గేటు తాళంకూడా తీసుకుపోయారు.

విశ్వనాధానికి మాట పెగల్లేదు. అన్ని కోణాల్లోనూ ఆలోచించాడు. బుర్రకేమీ అంతు చిక్కలేదు. సీతాపతి, సూర్యం, ఏమైనా ఆనవాళ్ళు దొరుకుతాయేమోనని తోటంతా గాలిస్తూండే మధూ, గోపాలం వాళ్ళకి చాలా సాయం చేశారు.

"ఇదిగో మామయ్యా ! ఇక్కడెవరో పరిగెత్తి దభీమని : పోయినట్టుఉంది చూడు"--అరిచాడు మధు.

"నిజమే బాబాయ్, నువ్వు గమ్మని ఇక్కడికి రావాలి!" — కేక వేశాడు గోపాలం.

"ఛ ! వెధవల్లారా! చెట్లూ, గిట్లూ అన్నీ ఇటువుంటే, అటు ఆనవాళ్ళెందుకు దొరుకుతాయిరా ? ఇలా వచ్చి ఇటు చూడండి" — సీతాపతి కాస్త చిరాకులో ఉన్నాడు.

మధూ, గోపాలం నిజంగానే సపోటాచెట్ల పరిసరాల్లో కళ్ళుఇంతంత చేసుకుని వెదకటం ప్రారంభించారు — ఒకచోట గోపాలం ... .... ఆగిపోయాడు.

మధుకేసి భావగర్భితంగా చూశాడు. మధు చూపులు గోపాలం చూపుల వెనకే ప్రయాణంచేసి .. నిల్చిపోయి .. ఈల : అవి రాముగాడి పంట్లాం జేబులో ఉండే ఈల ! తెల్లగా కొట్టవచ్చినట్లు కన్పిస్తోంది —"తీసెయ్" అన్నట్లు చూశాడు మధు.

గోపాలానికి ధైర్యం చాలలేదు—అటే వస్తూన్న సీతాపతికి చూపించాడు.

"ఎందుకురా అలా నిలబడిపోయారు ? ఏమైనా దొరికిందా ?"— సీతాపతి దూరంనుంచి అడిగి దగ్గరకు రాసాగాడు. గోపాలం అసలు పది లేసుకుని వచేసిపోయాడు. "ఇక్కడేదో ముల్లు గుచ్చుకుంది మామయ్యా ! ఆ దొంగలెవరో ముళ్ళు పోసినట్లున్నారు."—మధు ఒంగి కుంటు కుంటూ రెండు బారల దూరం పరిగి ఈలమీద కాలువేసి మట్టిలోకి నొక్కాడు.

"నిజమేరా ! నాకు కూడా ఓ ముల్లు గుచ్చుకుంది. తోటలో ఎన్నడూ ముళ్ళు కనపళ్ళేదు కదా ?"

"మనం పరిగెత్తి రాకుండా ఉంటామని ముళ్లు జిమ్ముకుంటూ పోయారేమో మామయ్యా !"

"ఓ, దొంగ వెధవలకు తెలివి తేటలేం తక్కువ?" ఎంత వెదికినా ఆరోజు ఆనవాలన్నది దొరకలేదు.— టమాటాలు కోసి పోసిన రోజు—

చేపంపులు మాయమైన రోజు — మరో రోజు మరో రోజు — మధు మాత్రం అందరి యెదుట చావిట్లోనే నిద్రపోయాడు.

ఇక దొంగతనాలు ఆగిపోతాయనుకున్న రోజే దొంగతనం జరగటం—దొంగలు పట్టుబడకుండా కామరూపుల్లా మాయమవటం ఐదారు సార్లు జరిగింది— విశ్వనాధం ప్రయత్నాలేమీ చెల్లలేదు — చివరికి ఎవర్నయినా చూసి తోటకి తెల్లవార్లు కాపలా పెట్టటం ఒక్కటే మార్గమనుకున్నాడు.

పంచాయితీ ఎన్నికలు దగ్గరికి రావటంతో ఇంటి వ్యవహారాలు అంతగా పట్టించుకోటానికి వీలుగాకుండా పోయింది. విశ్వనాధం ప్రెసిడెంటుగా నిలబడాలని కోరికతో వున్నాడు. తనకు ప్రత్యర్థిగా నిలబడబోతున్న నారాయణరాజుని చిత్తుగా వోడించి పారెయ్యాలని కుతూహలపడుతున్నాడు. ఎన్నికల కబుర్లు రహస్యంగా రామ్మూర్తితో గుసగుసలాడుతున్న విశ్వనాధానికి పోష్టు బంట్రోతు ఒక ఉత్తరం ఇచ్చి వెళ్ళిపోయాడు. అది పెలవులకు ఇంటికి వెళ్ళిన మదనగోపాలం మధుకి రాసిన ఉత్తరం. రామ్మూర్తి వెళ్ళాక విశ్వనాధం నిస్సంకోచంగా కవరు చించేసి చదవటాని కుపక్రమించాడు. ఊసరవెల్లి రంగుల్లా విశ్వనాధం మొహంలో రంగులు మారి-చివరికి కోపం తారస్థాయిన నిలిచిపోయింది. ఉగ్రుడై లేచి నిలబడ్డాడు "ఒరేయ్ ! మధూ !" దాదాపు గర్జించాడు.

"లేడు. ఎక్కడికో వెళ్ళినట్టున్నాడు. ఎందుకు ?" సుందరమ్మగారు జవాబు చెప్పింది.

"ఎందుకేమిటి ? ఎక్కడ చచ్చాడు ?"

"మళ్ళా ఏ మొచ్చి పడింది ?" విసుక్కుందావిడ.

అంతలోనే మధు ఖర్మ తోసుకు వచ్చినట్లు పరిగెత్తుకు వచ్చాడు.. "అమ్మమ్మా ! రాముం ఊరెళ్ళుతున్నాడే ! వాడూ నేనూ పెన్సిళ్ళుమార్చుకున్నాం."

విశ్వనాధం పూనకం మనిషిలా మధుమీద విరుచుకుపడ్డాడు. జుట్టు వంగదీసి బాదటం మొదలు పెట్టాడు—"దొంగ వెధవా ! గతిలేని వాడివని ఇంట్లో చేరదీస్తే ఇదా నువ్వు చూపించే మంచితనం? మాట్లాడవేం?"

"ఏమైంది? అసలేమైందిరా ? ఎందుకు వాడినలా గొడ్డుని బాది నట్టు బాదుతావ్ ?" సంగతేమిటో చెప్పమని దేవుళ్ళాడుతూ సుందరమ్మ గారు అడ్డు వెళ్ళబోతే గెంటి పారేశాడు.

"నేను చెప్పటంకాదు. నీ మనవడితోనే చెప్పిస్తాను. చెప్ప వేంరా ? తోట దొంగతనాలన్నీ ఎవరు చేశారు ? మాట్లాడు—" గర్జిం చాడు.

"అదేమిటి ? వాడికెలా తెలుస్తుంది ?"

"నువ్వు నోరు మూసుకో. వీడికి కాకపోతే ఇంకెవడికి తెలు స్తుంది ? రౌడీ వెధవా ? ఇంత తెగించావేం ? సిగ్గులేమట్రా?"

మధు దడదడలాడే గుండెలతో నిలబడి పోయాడు.
ఇంట్లో వాళ్ళంతా చావిట్లో మూగారు.

"ఇంటి దొంగని ఈశ్వరుడు పట్టగలడా ? ఈ దొంగ వెధవ నా కిత్వం వహించి మరీ చేయించాడన్నమాట." మళ్లా ఒక దెబ్బ పెట్టా పెట్టాడు విశ్వనాథం. మధు తూలిపడి లేచి నిలబడ్డాడు.

"ఆ సంగతి మీ కెవరు చెప్పారూ ?" సాగదీసుకొంటూ అడిగింది పార్వతి.

విశ్వనాథం ఉత్తరం గిరవాటు పెట్టాడు.

"ఇదిగో చదువుకోండి. ఆ వెధవ ఈ వెధవకి రాశాడు ఇక్కడి గమ్మత్తులన్నీ చెప్పుకు నవ్వుకున్నారట. ఈ రౌడీ వెధవ తెలివితేటలకు వాళ్ళంతా మురిసిపోయారట. అడ్డమైన వెధవల్నీ జేరిస్తే ఇలాగే ఉంటుంది—ఏంరా ? అసలు నీకింత సాహసం ఎలా వచ్చిందిరా ?" విశ్వనాథం మధు చొక్కా పట్టుకు గుంజి వెనక్కి తోశాడు. స్తంభం కొట్టుకున్న మధు—"అమ్మా!" అంటూ కిందపడిపోయాడు. తలమీద చిట్లి బొటబొటా నెత్తురుకారి చూస్తుండగానే చొక్కా తడిసిపోసాగింది. సుందరమ్మగారు గుండెలు బాదుకుంటూ మనవడి దగ్గిరికి పరిగెత్తింది.—పచ్చిరక్తం కళ్ళజూశాక విశ్వనాథం కాస్త శాంతించాడు.

"చావనివ్వండి. ఇలాంటి వెధవ ఉన్నాడంటే నాకు సిగ్గుచేటు." అంటూ గదిలోకి వెళ్ళిపోయాడు.

సుందరమ్మగారు కళ్ళు తుడుచుకుంటూ మంచం వాల్చి పక్కవేసి మనవణ్ణి పడుకోబెట్టింది. పిడికెడు ముగ్గుతెచ్చి వాడి నెత్తిమీద పోసి అదిమి పెట్టింది—మధు తెలివి తప్పిన వాడిలా పడుకుండిపోయాడు. సూర్యం రాగానే సుందరమ్మగారు ధర్మాసుపత్రికి పంపించింది.

కొత్తగా బదిలీ అయి వచ్చిన డాక్టరు కేశవరావు సూర్యాన్ని వివరాలన్నీ అడిగి తెలుసుకున్నాడు.

"సువ్వారా! మిమ్మల్నెప్పుడో చిన్నప్పుడు చూశాను. సరే, నేను వస్తాను. తర్వాత మాట్లాడుకుందాం" — కాంపౌండర్‌ని పురమాయించాడు.

* * *

కేశవరావు విశ్వనాథానికి తమ్ముడు వరుస. చచ్చిపోయిన రాజయ్యగారి రోజుల్లో కేశవరావు తండ్రి, కొడుకుని రాజయ్యగారి దగ్గర చదువుకోటానికి పంపించాడు. కేశవరావు కొన్ని సంవత్సరాలపాటు చిన్నాన్నగారి ఇంటే ఉండి చదువుకున్నాడు. చిన్నతనములోనే విశ్వనాథానికి కేశవరావుకి ఎంతమాత్రం పొత్తు కుదరలేదు. "విశ్వం అన్నయ్యా!" అంటూ కేశవరావు దగ్గరగా ఉండటానికి ప్రయత్నించినా "నన్నంటుకోకు నా మాల కాకీ!" అన్నట్లు విశ్వనాథం దూరం దూరంగా పోయేవాడు. ఆ ఇద్దరిమధ్యా నలగటం ఇష్టంలేక సీతాపతి ముభావంగా ఉండటం అలవాటు చేసుకున్నాడేమో అనిపిస్తుంది.

కేశవరావు మంచి తెలివి తేటలు కలవాడు. బంధువులకూ, స్నేహితులకూ నిండు హృదయంతో ఆదరాభిమానాలు చూపించగలవాడు.

తన ఉద్దేశాలు ఆమోదించి, అంటూ తనని అనుసరించి తిరగాలనే విశ్వనాథం వాంఛని చిన్నతనమైనా కేశవరావు హర్షించలేకపోయేవాడు.

స్నేహంగా ఉండే పిల్లల్ని లేనిపోని మాటలు కల్పించి విడదియ్యటానికి ప్రయత్నించే విశ్వనాథంపట్ల కేశవరావు మంచి అభిప్రాయం ఏర్పరచుకోలేకపోయాడు. విశ్వం అన్నయ్యని మార్చాలని కేశవరావు చేసిన ప్రయత్నాలు విఫలమైపోగా, వారి మధ్య ఏర్పడిన భేదాభిప్రాయాలు—మనస్పర్థలూ మాత్రం చెక్కుచెదరకుండా పెద్దతనం వరకూ నిలిచే ఉన్నాయి.

కేశవరావు ఒక డాక్టరుగా, బాధ్యతగల ఉద్యోగిగా ఆ ఊరు రావటం విశ్వనాథానికి చాలా కంటగింపు కల్గించింది—అయినా ఓసారి బజార్లో కనిపిస్తే పలకరించి మాట్లాడాడు.

కేశవరావు మృదువుగా మధు తలకి కట్టు కట్టి పడుకోబెట్టాడు.

"చాలా కాలానికి చూశాను పిన్నీ! మిమ్మల్ని" అన్నాడు సుందరమ్మ గారితో సంతోషంగా.

విశ్వనాథం, కేశవరావుతో మనసువిప్పి మాట్లాడలేక పోయాడు—మధుని తనే కొట్టినట్టు సూర్యం చెప్పేసి ఉంటాడన్న భావంతో ఎక్కువగా మాట్లాడకుండా ముభావంగా ఊరుకున్నాడు.

"ఇల్లంతా మారినట్టుంది కొత్తగా ఏమైనా కట్టారేమిటన్నయ్యా?" అడిగాడు కేశవరావు ఏవో మాటలు దొర్లిస్తూ.

"ఆఁ ఊఁ రెండు గదులూ కొత్తగా కట్టినవే. అప్పుడే ఇల్లు సిమ్మెంటు చేయించాం."

"మీ ఆవిణ్ణి ఓసారి తీసుకురా నాయనా! చూసి చాలాకాలమైంది." అంది సుందరమ్మగారు అభిమానంతో.

"దానికేం పిన్నీ! ఎలాగూ ఊళ్ళోకే వచ్చాం కదా? రాకపోకల కేముంది? మీరంతా ఓసారి మా యింటికి కూడా రండి — అసలు రుక్మిణి నిన్ననే ఇక్కడికి వద్దామంది. నాకు ఖాళీ అవక ఆపుకున్నాను. ఇవ్వాళ హాస్పిటల్నుంచి ఇంటికి వెళ్ళగానే బయల్దేరదామనుకొంటూంటే ఇంతలో ఇలా రావలసి వచ్చింది మరేం ఫర్వాలేదులే. అబ్బాయికి కొంచెం జ్వరం తగిలినట్టుంది. రాత్రికి అన్నం పెట్టకు. బ్రెడ్ జావగాని, కాసిన్ని పాలుగాని అయితే ఫర్వాలేదు."

"దెబ్బ మానిపోతుంది కదూ బాబూ ?"

"అదేమిటి పిన్నీ ! అంత భయపడతావ్. చిన్నవాళ్ళకి దెబ్బ తగి లితే విశేషమేముంది ? తగలకపోతేగాని.... ...." నవ్వాడు కేశవరావు.

"ఏవో ఆటలాడుకుంటూ వెనక్కి వెనక్కి నడిచి స్తంభంమీద పడ్డాడు బాబూ!"

"నువ్వేం భయపడకు పిన్నీ ! నేను ఉన్నాగా ?— తపించిపోయే సుందరమ్మగారి హృదయాన్ని చల్లని చిరుగాలి తాకినట్టయింది.

కేశవరావు తనకు మామయ్య అవుతాడనీ, చాలా మంచివాడనీ అమ్మమ్మద్వారా తెలుసుకున్న రఘు కేశవరావు మామయ్యమీద పూజ్య భావం ఏర్పరచుకున్నాడు—తరచూ హాస్పిటల్‌కెళ్ళి కాసేపు కూర్చుని రావటం కూడా అలవాటయింది.

విశ్వనాథం పంచాయితీ ఎన్నికలకు పరోక్షంగా సీతాపతి కూడా పరోక్షంగా చాలడబ్బు ఖర్చుచేశాడు. ప్రెసిడెంటు పదవి తనని వరించి తీరుతుందని గాఢంగా నమ్మాడు.

తీరా నారాయణరాజే ఎక్కువ వోట్లతో ఎన్నికయ్యాడనీ — దానికి చాలావరకు కేశవరావు పడ్డతే కారణమనీ తెలుసుకున్న నిముషం నిప్పులు తొక్కాడు. మండిపడ్డాడు—మరేదో అయ్యాడు. రాజు, కేశవ రావుకి బాల్య స్నేహితుడు. అదీగాక రాజుమీద ఉన్న విశ్వాసం కేశవ రావుకి విశ్వనాథం మీద లేదు. అందుకే కేశవరావు రాజు తరఫున పని చేసి ఫలితం పొందాడు.

* * *

సూర్యం స్కూలుఫైనల్ ప్యాసయ్యాడు. పై చదువుల ఆశ పెట్టు కోక ఊళ్లోనే కొత్తగా తెరిచిన పంచదార మిల్లులో ఉద్యోగం సంపా దించుకున్నాడు. అంత తొందరగా సూర్యానికి ఉద్యోగం దొరకటంలో డాక్టర్ కేశవరావు సహాయం లేకపోలేదు. కాని అది విశ్వనాథం వంటి వాళ్ళకు కొంత రహస్యమైన విషయం.

సూర్యం సంపాదనపరుడు కావటంతో పరిస్థితులు కొంతవరకు మంచిగానే మార్పు చెందాయనక తప్పదు. సుశీల విషయమై సూర్యం మనస్సులో ఉన్న ఆలోచన ఆచరణలో పెట్టదలిచాడు. కీర్తిశేషులైన తాత గారు పనిజేసిన జమీందారుల ఆస్థానంలో జమీందారిణి శ్యామసుందరీదేవి పేరిట మూగపిల్లల పాఠశాల ఒకటి నడుస్తోంది. అక్కడ ప్రత్యేక నేర్పరులైన ఉపాధ్యాయులు మూగపిల్లలకి చదువు నేర్పి ప్రయోజకులను చేస్తారు. జమీందారులు పిల్లల్ని ఉచితంగా పోషిస్తారు.

ఆసంగతి అందరికీ తెలిసినా, సుశీల విషయం అంతవరకూ ఎవ్వరూ పట్టించుకోలేదు. సూర్యం తన అభిప్రాయం చెపితే—"మూగదానికి చదువేమిట్రా!" అన్నాడు. విశ్వనాథం వెటకారంగా.

"సుశీలవంటి వాళ్ళకే ముఖ్యంగా చదువుండాలి సూర్యం. అప్పుడే వాళ్ళు తమ లోపాన్ని తేలికగా తీసుకోగలరు." అన్నాడు శేషగిరి సానుభూతిగా. సుందరమ్మగారు, మధు కూడా సూర్యాన్ని సమర్థించారు. రెండు సంవత్సరాలుగా సుశీలను జానకి తన దగ్గిరే ఉంచుకుంటోంది. సూర్యం అందర్నీ ఒప్పించి సుశీలను తీసుకుని ప్రయాణమయ్యాడు.

అమాయకంగా కళ్ళతో మాటలుచెప్పే సుశీలను శ్యామసుందరీదేవి ప్రత్యేక అభిమానంతో ఆదరించి బడిలో చేర్పించింది— సూర్యం ఆమెకు వెయ్యి నమస్కారాలుచేసి ఇంటికి తిరిగివచ్చాడు.

సుధ మూడో తరగతిలోకి వచ్చింది.

కృష్ణుడు ఫిఫ్త్‌ఫారంలో తంటాలు పడుతున్నాడు.

మధు పిఫ్త్‌ఫారంలోకి వచ్చినప్పటినుండీ కాస్త అకతాయి పనులు తగ్గించాడు.

రాధ — సుధచెల్లెలు — అందరిమధ్యా గిలక్కాయిలా ఆడుతూ తిరుగుతుంది.

రుక్మిణి అత్తయ్యా! చేసిన మాతృత్వం వాత్సల్యంతో ఎన్నడూ చూడని అనురాగమేదో చిప్పిస్తుంది మధుకి. అత్తయ్య పను లెప్పుడు చేసుకుంటుందోగానీ ఎప్పుడూ మాతయ్యకే ఐట్టించుకుంటుందో — ఫలాపం

పెడుతూనో—తల దువ్వుతూనో—జోళ్ళు తుడుస్తూనో—ఏదోవిధంగా మామయ్య పనులుచేస్తూ దగ్గిరే తిరుగుతూ ఉంటుంది.

మామయ్యకూడా అంతే. ప్రతి చిన్న పనికీ అత్తయ్యనే పిలుస్తాడు. కూజాలో నీళ్లు ఒంచటానికి అత్తయ్య రావాలి చొక్కాకి గుండీ పెట్టటానికి అత్తయ్య రావాలి. చివరికి పెన్ను తీసి చేతికందించటానికి కూడా అత్తయ్య రావాలి. అత్తయ్య అన్నిటికీ నవ్వుతుండేదప్ప ఏనాడూ విసుక్కోవటం కన్పించదు—ఒక్కోసారి అత్తయ్య ఒక్కతే ఇంటిపనులు చేసుకుంటుంటే మామయ్య వంటింట్లోకెళ్ళి కూర్చుంటాడు. అత్తయ్య వారిస్తున్నా ఏదో విధంగా చేతనైన సహాయం చెయ్యాలని తంటాలు పడలాడు.

కేశవ్ మామయ్యకి ఒక కొడుకు — కూతురు. కొడుకు మురళీ హాస్టలులో చదువుకొంటున్నాడు. కూతురు- సరళ ఎక్కువగా అమ్మమ్మ గారి ఇంట్లో ఉంటుంది—కేశవ్ మామయ్యతోనూ—రుక్మిణి అత్తయ్యతోనూ కబుర్లు చెప్పుతూ కూర్చుంటే ఎన్ని గంటలైనా సునాయాసంగా గడిచిపోతాయి. ఆ యింట్లో ఉన్నంతసేపూ ఏదో శాంతి అనుభవిస్తాడు మధు. ఒక రోజు కేశవరావు అన్నాడు నవ్వుతూ—

"నువ్వు పెద్ద డాక్టర్ కావాలిరా మధూ!"

మధూకూడా నవ్వాడు. "డాక్టర్ అంటే మాటలా మామయ్యా?"

"ఏంరా? పిల్లనిచ్చే మామ ఆమాత్రం చెయ్యలేడా?"

"మహా చేస్తాడులే. నేను హైస్కూల్లో చేరేముందు నానాగొడవ చేశాడు."

కేశవరావు ఆశ్చర్యంగా చూశాడు — "అయితే ఇప్పటికీ వాడేం మారలేదన్నమాట! మిమ్మల్ని అంతగా లక్ష్యపెట్టటం లేదా ఏమిట్రా!"

మధుకి ఎందుకో ఆ విషయాలన్నీ చెప్పాలనిపించలేదు—"అబ్బే అదేం లేదే!" అన్నాడు పొడిగా.

కేశవరావు క్షణం మధు మొహంలోకి చూశాడు.

"నువ్వు ఎంత దాచినా మీ యింటి విషయాలు నాకు తెలీవనుకుంటు న్నావా మధూ? మా ఇంటికి రావద్దని మీ పెద్ద మామయ్య కట్టడి చేస్తు న్నాడు కదూ?"

"ఛ! అదెవరు చెప్పారు?" మధు దొరికిపోకుండా అన్నాడు.

"అదిగో, నాగ్గరేసా అబద్ధం?" కేశవరావు కొంచెం సేపు ఆగాడు. "నువ్వు ఎప్పుడు పుట్టావో, ఎలా పెరిగావో నాకేం తెలీదు. ఎప్పుడో చిన్నప్పుడు నువ్వు తప్పటడుగులు వేస్తూ ఉండే వయస్సులో ఒక్కసారి చూశాను - మీ మీద నాకేమైనా అభిమానమంటూ ఉంటే మీ అమ్మ నుంచే మధూ! కల్యాణిని నేను ఎప్పటికీ మర్చిపోలేను. చిన్న ప్పుడు మీ తాతగారి ఇంట్లో ఉండి చదువుకునే రోజుల్లో కల్యాణి మీ మామయ్యల దగ్గరకన్నా నా దగ్గరే ఎక్కువ చేరికగా ఉండేది. కల్యాణి తోనే నాకు చెల్లెళ్ళు లేని కొరత తీరిపోయింది. — ఎవరి దారిన వాళ్ళు పోయాక కూడా కల్యాణి నాకు అప్పుడప్పుడూ ఉత్తరాలు రాస్తూ ఉండేది — మీ అమ్మ పోయిన కబురు సుమారు సంవత్సరానికి తెలిసింది నాకు. వచ్చి అందర్నీ చూసి వెళ్ళాను. నీకు గుర్తు ఉండి ఉండదు — నన్ను నువ్వు పరాయి వ్యక్తిగా భావించటం నాకు కష్టంగానే వుంది మధూ! నీకు సాధ్యమైనంత వరకూ దగ్గిరే ఉన్నాను కాబట్టి మీ మంచి చెడ్డలు చూస్తాను."

మధు నొచ్చుకుంటూన్నట్లు అన్నాడు — "నీ గురించి చెడ్డగా నే నెప్పుడూ అనుకోలేదు మామయ్యా! నిన్ను పరాయిగా భావించటానికి మాకు సన్నిహితులంటూ ఎవరైనా ఉంటేకదా? ఏదో ఇలాగే గాలికి పెరిగి పెద్దవాళ్ళమౌతున్నాం."

"మీ విషయాలన్నీ నాకు తెలుసురా! ఇంటా బయటా తనే అధి కారం చెయ్యాలనీ - అంతా తన పెద్దరికమే ఆమోదించాలనీ — ఏ విష యంలో గానీ తన సలహాలే పాటించాలనీ అనుకుంటాడు మీ మామయ్య.

దానికి ఎదురు తిరిగింది ఆనాడు నేనూ! ఈనాడు నువ్వూ! అందుకే మన ఇంటే వాటికి మంట."

"ఎప్పటికప్పుడు నేను జరిగిన సంగతులు మర్చిపోతూనే ఉంటాను మామయ్యా! అయినా ఎందుకో నేనంటే కోపంగా ప్రవర్తిస్తాడు. అయితే ఏం చెయ్యను?"

"ఎవ్వరూ ఏం చెయ్యలేరు. మరికొన్నాళ్ళు ఓర్చుకుంటే సీదారిన ... పోవచ్చు."

మధు కొంతసేపు మౌనంగా కూర్చున్నాడు పుస్తకం తిరగేస్తూ — ...న తల ఎత్తి — "నేను డాక్టర్ కావాలంటున్నావు గానీ - నాకు ...ర్ కావాలని ఉంది మామయ్యా!"

కేశవరావు నవ్వాడు — "దానికేముంది? నీకు దేనిలో ఆసక్తి ... అదే చదువు. కోరికలేని చదువు మాత్రం ఏం వస్తుంది?"

రుక్మిణి జడ వేసుకుంటూ హాల్లోకి వచ్చింది.

-"మీ అల్లుడు చురుకైనవాడిలా ఉన్నాడు. బాగా చదివించి మన ...చ్చి పెళ్ళి చేద్దాం-" అంది హాస్యంగా.

'మేనల్లుడైనా కాస్త లోకువ. వేలు గుమ్మరించ నక్కరలేదు. ...నే ఉంటుంది-కానీ విశ్వనాధం ఊరుకోడే! సుధ పీణ్ణి తన్ని ... చేసుకుంటుంది."

కేశవరావూ - రుక్మిణీ నవ్వుతోంటే మధు సిగ్గుపడ్డాడు.

కేశవరావు చటుక్కున నవ్వు ఆపి అడిగాడు—

"అయితే మధూ! రామ్మూర్తి మీ మామయ్య దగ్గిరికి రోజూ ...న్దేమిట్రా?"

"రామ్మూర్తా?, అం...స్తూనే ఉంటాడు. ఏవో కోర్టు గొడవలు ...లు మాట్లాడుకుంటారు అస్తమానూ."

"తనే అప్పు ఇచ్చి రామ్మూర్తితో కేసు పెట్టిస్తున్నాడట ...మయ్య."

"ఎవరిమీద?"

"రామ్మూర్తి వదినగారిమీద, ఆవిడకి ఒక్కతే ఆడపిల్ల. అ...
గారికి కొడుకులు లేరుకాబట్టి ఆ ఆస్తి తనకు రావాలని రామ్మూర్తి వాద...
— రామ్మూర్తితో కేసు పెట్టిస్తున్నది మాత్రం మీ మామయ్యే!"

"అయితే తనకు అసలే పిల్లలు లేరుగదా తన వాటా అంతా చిన్న...
మామయ్యకు ఇచ్చేస్తాడా?"

"ఇదే అడిగిందట రామ్మూర్తి వదినగారు. మొగదిక్కు లే...
దాన్ని ఇలా కోర్టులవెంట తిప్పటం భావ్యంకాదని గోల పెట్టిందట. అం...
విని అసలా సంగతే తనకు తెలీదనీ – రామ్మూర్తిని తప్పకుండా మం...
లిస్తాననీ చాలా చెప్పాడట మీ మామయ్య. ఆషాఢభూతి కబు...
వాడివన్నీ."

"అయినా ఆవిడమీద మా మామయ్య కెందుకు కోపం?"

"మొన్న పంచాయతీ ఎన్నికల్లో ఆవిడ వోటు నా మాటమీద రాజు...
వేసింది?"

"వూళ్ళో చాలమంది రాజుకే వేశారుగా?"

"అపకారం చిక్కినప్పుడు కసి తీర్చుకోవటమే కాకోలు మ...
ఉద్దేశ్యం."

మధు కొంతసేపు ఏదో ఆలోచిస్తున్న వాడిలా ఉండి పోయాడు...
"ఇంట్లో ఎలా ఉన్నా పై విషయాల్లో దయా ధర్మం లేనివా...
మామయ్యా! అనాధాశ్రమాలకూ, దేవుడి ఉత్సవాలకూ వాటికీ పెద్ద పె...
చందాలే ఇస్తూ ఉంటాడు."

"ఎవరిపేర?"

"అంటే?"

"సీతాపతి ఇచ్చినట్లు ఎన్నడైనా ఇచ్చాడా? పేరుకోసం ...
నాటకంలే అదంతా!"

మధుకి కొన్ని విషయాలు గుర్తువచ్చాయి. పుస్తకాల్లో పేరు ...
కునే వాళ్ళకీ .. మీటింగులో పేర్లు చదివే వాళ్ళకీ చందాలిచ్చి వి...
బిచ్చంతో తృప్తిపడే ముష్టివాళ్ళని కసిరికొట్టే మామయ్య దేవుడి ఉ...

ను మాత్రం ముందుగా తయారౌతాడు – చేసిన పాపాలు దేవుడికి అప్ప
ంచటానికి కాబోలు – మధుకి నవ్వు వచ్చింది.

"ఎందుకురా నవ్వుతావ్ ?"

"మా మామయ్యకి ఉండే దైవభక్తి గుర్తువస్తోంది."

"వాళ్ళని మెచ్చుకోక తప్పదు. తనలో ఏదో పాపం ఉందనీ —
ను తప్పు చేశాననీ అనుకోబట్టే కదా దేవుడి దగ్గరకు బయల్దేరు
న్నాడు."

"నీ దగ్గరికి రావటంతో నేను మరీ పాడైపోతున్నానని మా
ామయ్య ఉద్దేశ్యం. ఏం పాడైపోతున్నానో మరి నాకు తెలీటంలేదు."

"అది వాణ్ణే అడుగు."

"ఎంతైనా చెప్పగలడు."

రుక్మిణి వచ్చింది – "ఎగాగా వేళయింది. నువ్వు ఇక్కడే
ంచేసి వెళ్ళిపో అబ్బాయ్." అంది.

"నిజమేరా. లేలే, భోంచేద్దాం. ఆకలవుతోంది." కుర్చీ వెనక్కి
ట్టి లేచాడు కేశవరావు.

మధుకూడా లేస్తూ – "వద్దు మామయ్యా ! అనవసరంగా ఎందు
చ్చిన గొడవ. ఇంటికి పోతాను" అన్నాడు.

మధుని ఇబ్బంది పెట్టటం ఇష్టంలేక వూరుకున్నాడు కేశవరావు

భోంచేసి తిరిగా పడకుర్చీలో కూర్చుని విశ్వనాథం మధుని
స్తూ అన్నాడు – "శెలవ రోజైతే మాత్రం రాత్రీ పగలూ అలా బజా
్ల తిరక్కపోతే ఇంట్లో కూర్చొని చదువుకోకూడదూ?"

"బజార్లెక్కడ తిరిగాను ? అలా కాస్సేపు కేశవ్ మామయ్య
ంటికి వెళ్ళాను."

"ఘనకార్యం చేశావ్. పెద్ద మొగాడివై పోయావనేనా ఇంటి
పనులన్నీ తప్పించుకొని తిరుగుతున్నావ్ ? అయినా వాడికీ-నీకూ
స్నేమిట్రా? కుర్ర వెధవ్వి, నీకు బుద్ధి లేకపోతే వాడికి లేమా ?"

మధుకి అసహ్యం వేసింది. మాట్లాడకుండా లోపలికి వెళ్ళిపోయాడు. విశ్వనాథం అధికారం మధు మీద ఏ విధంగానూ పనిచెయ్యలేదు.

రానురాను కేశవ్ మామయ్యతో మధు స్నేహం అంతులేని ఆత్మీయతగా ఏర్పడింది. — కేశవరావు మంచి మాటకారి, పిన్నకొద్దీ వినాలనిపించేటట్లు మధురంగా మాట్లాడుతాడు. — అంతేకాదు, కేశవరావు పుస్తకాలు విశేషంగా అభిమానిస్తాడు. చదువుకొనే రోజులనుంచీ మంచి మంచి పుస్తకాలు సంపాదించి స్వంత లైబ్రరీ ఒకటి ఏర్పరచుకున్నాడు. అది మధుకి బంగారు గని వంటిది. ఏ మాత్రం అవకాశం చిక్కినా కేశవరావు లైబ్రరీలో తప్పితే మధు మరో చోట కన్పించడు. ఒక పుస్తకం చదవటం—అర్థంకాని చోట కేశవరావ్ మామయ్య నడిగి తెలుసుకోవటం—చదివిన ప్రతి పుస్తకం గురించీ మామయ్యతో సంప్రదింపటం — ఒక్కోసారి మామయ్యకు వ్యతిరేకంగా వాదించటం— ఈ కార్యక్రమంలో మధు ఆ సంవత్సరం రెండువందల పుస్తకాలకు పైగా చదివాడు.

"మామయ్యా! ఈ వూరు నువ్వు రాకపోతే నేను కూపస్థమండూకంలా ఉండిపోయేవాణ్ని. నేనూ, మా ఇల్లూ, మా తోట తప్పితే ఇంకా ప్రపంచం ఉందని ఎప్పటికి తెలిసేది?" మధు ఆనంద పారవశ్యంతో అన్నాడు ఒకసారి.

కేశవరావు నవ్వాడు — "అయితే నువ్వు నాకు చాల ఋణపడి ఉన్నాననంటావా?"

"కాదా మామయ్యా! కృతజ్ఞత ఎలా చెప్పుకోవాలో తెలీటంలేదు.

"ఏమిట్రా మధూ! బొత్తిగా నాటకం ఫక్కీలో మాట్లాడుతున్నావ్."

"అలా హాస్యం చెయ్యకు మామయ్యా! నేను నిజమే చెపుతున్నాను."

"ఏమిట్రా నిజం? మధ్య నాదేముంది? ఇవాళకాకపోతే రేపైనా నువ్వు ప్రయోజకుడివౌతావు. ఆ శక్తి నీలో ఉంది. నేను ఏమైనా అదుం

చూపించాను అంటే అది పొందగలిగే అర్హత నీకు ఉందన్నమాట. నివురు గప్పిన నిప్పు ఏ నాటికయినా బయటపడుతుంది."

కేశవ మామయ్య స్నేహంతో మధు చాల సెన్సిటివ్గా తయారయ్యాడు.

స్కూలు ఫైనల్ పరీక్షలు ముగిశాయి.

మధుకి చాలా సంతోషంగా ఉంది, తాను తప్పక పాసౌతాడు. కాలేజీకి వెళితే ఈ యింటి పీడ విరగడై పోతుంది. ఒంటరిగా తోటంతా తిరిగి సపోటా చెట్టుక్రింద కూర్చున్నాడు. మనసు ఎటో పోయింది.

"ఏంరా అంత దర్జాగా కాలుమీద కాలేసుకు కూర్చున్నావ్ ?"

ఉలిక్కిపడ్డాడు మధు. ఎదురుగా విశ్వనాధం తోట షికారుకి వచ్చాడు కాబోలు — నిలబడి ఉన్నాడు — మధు కోపం తొక్కిపట్టి నవ్వుతూ అన్నాడు.

"నా కాలుమీదే కాలేసుకున్నాను, గానీ నీ కాలుమీదేం వెయ్యలేదుగా !" మధు నిర్భయంగా, నిర్లక్ష్యంగా విశ్వనాధానికి జవాబులివ్వటం ఏ నాడో అలవాటు చేసుకున్నాడు.

"అఘోరించావ్లే. పరీక్షలు అయిపోయాయి కాబోలు. ఎలా రాశావ్ ?"

"అది మాస్టర్లకి తెలియాలి."

"ఏంరోయ్ ! చమత్కారం నేర్చావే ! మామ నేర్పుతున్నాడా ? గిన్నూ ఓ డాక్టర్ని చెయ్యమనలేకపోయావ్ !"

"నీ వంటి మేనమామ ఉండగా మిగిలినవాళ్ళ కెన్ని గుండెలు?"

"పిచ్చిపిచ్చి వాగుడుకేంగాని తర్వాత ఏంచేద్దామనుకొంటున్నావ్?"

"ఏమీ అనుకోవటంలేదు."

"ఇంకా అనుకోవటాని కేముంది ? టీచర్ ట్రైనింగ్కి వెళ్ళకూడదూ ?"

"ఎందుకు వెళ్ళకూడదు ?"

"అయితే వెళతావా ?"

"ఎవరు ? నేనా ?"

"రాకపోతే నేనా ?"

"ఎందుకొకూడదు ?"

"వెధవ చమత్కారం మాని అడిగిందానికి చెప్పవోయ్ !"

"అడిగా ?"

"నువ్వు టీచర్ ట్రైనింగ్‌కి వెళితేనే మంచిది."

"ఎవరికి !"

"ఎవరికేమిటి ? అందరికీనూ."

"అందరి మంచికోసం నేను టీచర్ ట్రైనింగ్‌కు వెళ్ళటం అసంభవం."

"ఏమిట్రా ఆ తల తిరుగుడు ? చెప్పింది వినేది లేదా ?

"ఎందుకులేదు ? అక్షరాలా "

"అఘోరించు. నీకు మంచి చెప్తే తలకెక్కదు."

"తలకెక్కేది చెప్పటం నీకు మంచిది కాదు."

"నోర్ముయ్, వెధవా !"

విశ్వనాధం అహం దెబ్బతిన్నది. చరచరా నడిచి వెళ్ళిపోయాడు. మధు నవ్వుకొంటూ లేచాడు.

ఆ సాయంత్రం సంగతంతా చెపితే కేశవరావు అన్నాడు—"ఆషాఢభూతిగాడి సలహా కేంలే. ఎవరయినా బాగుపడిపోతారేమోనని ఏడుస్తాడు. నువ్వు కాలేజీలోనే చేరు."

"నేను అదే అనుకొంటున్నాను మామయ్యా ! కాని డబ్బు .... ? నీకు తెలీని దేముంది ?"

"డబ్బుకేంలేరా ! చూద్దాంలే."

మధు ఇంటికి వచ్చేసరికి సావిత్రి అంది.

"సుధకి రేపటి కేదో తెల్లకాయితాల పుస్తకం కావాలట? డబ్బిస్తాను. ఓ అరదస్తా కాయితాలు తెచ్చి పుస్తకం కుట్టిపెట్టు."

మధు మాట్లాడకుండా చొక్కా విప్పి ఒంకెన తగిలించేశాడు.

"బట్టలు మార్చటం దేనికి ? బజారు కెళ్ళవా ?"

"వెళ్ళను."

"ఏం ?"

"ఏమీలేదు."

"బావుంది. కొంచెం పుస్తకం కుట్టిపెట్ట మంటేనే అంత నిర్లక్ష్యమా ?"

"ఎవరికి ?"

"పోనీ నాకే. వెళ్ళవు కదూ ?"

"ఒకసారి చెప్పాను."

"నువ్వు పుస్తకాలు బాగా కుడతావంది సుధ. అందుకే నిన్ను అడిగాను."

"దాని మెచ్చుకోలు ఎవడికీ అక్కర్లేదు."

"కృష్ణుడు ఎక్కడికి పోయాడో ఏమో ! దానికి తెల్లారే సరికి పుస్తకం కావాలట."

"ఏం చిన్నత్తా ! నాకూ మరి చదువంటేనే నీ అంత శ్రద్ధ కదూ ! ఇలాంటి అవసరాలు చదువుకునే వాళ్ళందరికీ ఉంటాయని ఎన్నడూ అనుకోలేక పోయావేం ?— నీకు జ్ఞాపకం ఉందా ? ఒకసారి నేను డ్రాయింగు పుస్తకం కోసం పావలా అడిగితే ....."

"బాగానే ఉంది. ఎప్పుడో జరిగిపోయిందంతా .... సుధ నీకు చెప్పమంటే చెప్పాను."

"ఆ మాట అదే నాతో ఎందుకు చెప్పకూడదు ?"

"అదే కదా చెప్పి వెళ్ళింది?"

"అది ఆర్డర్ వేసి వెళితే పాటించటానికి నేనేం దాని నౌకర్ని కాదని చెప్పు. కావాలంటే వచ్చాక అడగమను. అప్పుడే వెళ్ళి తెస్తాను."

కేశవ్ మామయ్యా లైబ్రరీ నుంచి తెచ్చుకున్న పుస్తకం తెరుచుకు కూర్చున్నాడు మధు. ఓ పావుగంటలో సుధ పరిగెత్తుకుంటూ వచ్చింది. ఎర్రటి సుధ పరికిణీ మీద దీపం కాంతిపడి చంద్రనిప్పులా మెరిసింది. వస్తూనే అడిగింది సుధ—"పుస్తకం కుట్టేశావా ?"

"ఓ—ఎప్పుడో కుట్టేశాను."

"ఏది ?"

"అమ్మకి ఇచ్చాను, వెళ్ళిచూడు."

హుషారుగా పరికిణీతో చురుకుగా లోపలికి పరిగెత్తింది. సుధ—కాసేపటి మాడ్చుకున్న మొహంతో వచ్చి అరుగుమీద కూర్చుంది.

"పుస్తకం బావుందా ? నీకు నచ్చిందా ?"

"ఛీ ! నువ్వు కుట్టకపోతే నేను కుట్టించుకోలేనా? మా అన్నయ్యని రానీ."

ఇంటిపరిస్థితులూ, సావిత్రి మన స్తత్వం—మధు మీద అందరికీ ఉన్న నిరసన భావం—అన్నీ కలిసి మధు పట్ల సుధకు అభిమానమేమీ కలగనివ్వలేదు. పైపెచ్చు అందరికీ ఉన్న నిరసన కన్నా ఎక్కువే సుధలో ప్రబలింది.

మధుకి మాత్రం సుధ అంటే ఒక విధమైన ప్రత్యేక అభిమానం! అందరికన్నా సుధ ఒక్కతే తనకు దగ్గర కావలసిన వ్యక్తి అనే అనురాగ భావం !

* * *

మధు తదేకంగా పుస్తకం చదువుకుంటూ కూర్చుని సుందరమ్మగారు ఎన్నిసార్లు భోజనానికి పిల్చినా లేవలేదు. గదిలోంచి చావిట్లోకి వచ్చిన విశ్వనాధం, మధు చదువుతూన్న పుస్తకంచూచి అగ్గిమీద గుగ్గిలం అయ్యాడు "భారత కమ్యూనిస్టుపార్టీ నిర్మాణం"—అక్షరాలు ఎర్రని అట్ట మీద మల్లెపువ్వులా తెల్లగా మెరిసిపోయాయి.

"మధుసూదనరావుగారు పెద్ద రాజకీయవేత్త లౌతున్నారే!"

మధు తలయెత్తి చూశాడు–క్షణం కూడా తడుముకోలేదు–"ఏం? కాకూడదా ? రాజకీయాలు నీ ఒక్కడికే స్వంతమా ?"

"నోరు ముయ్ ! మహా జవాబు చెపుతున్నావ్ ? ఇలాంటి చెత్త చదివి బాగుపడాలనేనా ?"

"నేను చెడిపోతాననే నీకు విచారమా ?"

"విశ్వాసం లేని వెధవ్వి ? ఇంకేం మాట్లాడుతావు ? ఆ క్షేనానితో చేరి ఇటువంటి చెత్తంతా ఇంట్లోకి తెస్తే వూరుకునేది లేదు."

"పుస్తకం తెస్తే తప్పేమిటి ?"

"తప్పే ! నా యింట్లో నాకు యిష్టంలేని పుస్తకాలు ఉండటానికి వీల్లేదు."

"ఇష్టంలేని పుస్తకమే ఉండకూడదంటే, ఇష్టంలేని మనుషులు మాత్రం ఏలా పనికి వస్తారు ?"

"అంత పౌరుషం ఉంటే మహారాజులా వెళ్ళవచ్చు."

ఇద్దరి మధ్యా మాటల యుద్ధం జరిగింది. ఆ సంఘటన ఫలితం తీవ్రంగా పరిణమించింది.

సూర్యాన్ని వో యింటివాణ్నిచేసి, ఇక వేరుగా ఉంచేస్తే బావుంటుం దన్న వూహ సుందరమ్మగారికి రోజుకో సారైనా వస్తూ ఉంటుందగానీ ఎప్పటికప్పుడు సూర్యమే అడ్డు తగులుతూ వచ్చాడు. "మనం తొందర పడటం దేని- ?" అంటాడు.

"అన్నీ భరించి నోరు మూసుకుని కూర్చుంటే నవ్యంగానే జరిగి పోతుంది. వాళ్ళకి ఇష్టం లేనప్పుడు ఇంకా వాళ్ళ ఇంట్లో కూర్చోవటం ఎందుకు నాయనా ? మనం పోతే తేలిగ్గా వూపిరి పీల్చుకోవాలని చూస్తు న్నారు."

"మనమేమీ భారంగా కూర్చోలేదు గదా అమ్మమ్మా ! నా జీతం మామయ్యకే ఇస్తున్నాను. పొలం విషయమంతా తనే చూస్తున్నాడు."

"అయితే ఏం ? వాళ్ళకి కష్టంగానే ఉంది."

అప్పటికలా సరిపెట్టుకుని సుందరమ్మగారు ఊరుకోక తప్పిం గాదు— ఎంతైనా కొడుకులు ! వాళ్ళని ధిక్కరించి ఏమి చెయ్యగలిగిన చెయ్యదు. పసివాళ్ళ మొహాలు చూస్తే ఏదో అనిపిస్తుందిగానీ తల్లి మనసు బిడ్డలకు దూరంగా పోవాలని ఎన్నడూ కోరుకోదు.

హరి..........మధు మూలంగా ఈనా డది తప్పనిసరి అయింది ... "తప్పకుండా వెళతాం మామయ్యా! ఇక నువ్వు మా గురించి దిగులు పడకు..." అన్నాడు.

సూర్యానికి విషయమంతా చెప్పాడు ...."ఇక మనం వీళ్ళింట్లో ఉంచొద్దన్నయ్యా! ఎంతకాలం యిలా పరాయి పంచలు పట్టుకు పాకు లాడుతాం ?

అంతా విన్న సూర్యం శాంతంగా అన్నాడు—

"చూడు మధూ! ఎంతకాదన్నా చిన్నతనంనుంచీ వాళ్ళే చూశారు. వాళ్ళ పిల్లలతో సమానంగా చూడలేదంటే — అది మన ఖర్మ అనుకోవాలి —ఏదో చిన్న మాట పట్టింపుకి మనం ధిక్కరించిపోతే.... సమజసంగా ఉంటుందా ? చెప్పు ?"

"సమంజసాలూ, గిమంజసాలు ఇక ఆలోచించి కిన్నయ్యా! చిన్న తనం కాబట్టి ఇన్నాళ్ళూ ఏం జరిగినా భరించగలిగాం -— ఇక పైదట చీటికీ మాటికీ ఇటువంటి గొడవలు రాక మానవు. ప్రతి చిన్న విషయా నికీ ఓర్పుకు పడి ఉండే ఖర్మ మనకేమిటి? వాళ్ళింట్లో ఉంటాఉంటే వాళ్ళ విధేయతగానే ఉండాలి — అలా కాకుంటే మన దారిన మనం పోవాలి — ఏనాడో దిక్కులేక చేరాం, ఏదోవిధంగా పెంచి పెద్దవాళ్ళని చేశారు. ఏనాటికైనా మన రెక్కలు కట్టుక మనంకపోక తప్పదు — ఇందులో అసమంజసం ఏముంది ?"

"మామయ్య ఏదో అన్నాడనే నీకింత పట్టుదల. పోనీ పెద్ద వాడు."

"పెద్దతనానికేముంది అన్నయ్యా! ఆ స్తంభం చూడు — దానికి వంద సంవత్సరాలైనా ఉంటాయి. అంత మాత్రాన అదే మనకన్నా గొప్పదై పోతుందా? పెద్దతనం ఒక్కటే గౌరవం పొందటానికి చాలదు."

సూర్యం మాటాడలేదు. తమ్ముడిమనస్సు కష్టపెట్టాలనే ఉద్దేశ్యం ఎన్నడూ లేదు.

"ఏం అన్నయ్యా! నీ కిష్టంలేదా?"

"అలాగే మధూ! తప్పకుండా వెళ్దాం ఇల్లు చూడనీ!" ఆ సంగతి నెమ్మదిగా సూర్యం విశ్వనాధంతో చెప్పాడు.

"ఇప్పుడేమయిందిరా! మీకేం లోటు జరిగిందనీ?"

"ఏనాటికైనా మాకో ఇల్లంటూ ఉండాలి కదా మామయ్యా! అంతకు తప్పితే మరే ఉద్దేశ్యం లేదు."

నాకు తెలుసురా సూర్యం! వాడికి ఎదురు చెప్పలేని చవట వయ్యావు. ఆ వెధవ ఎంత చెపితే అంతేనా? నీకైనా బుద్ధి ఉండొద్దా?"

"అదేంకాదు మామయ్యా! మీకైనా మావల్ల శ్రమేకదా? అంతే గాని—"

"సరే! వెళ్ళండిరా! మీ అవసరాలు తీరిపోయాయి. చేసినమేలు గుర్తు ఉంచుకునే గుణం ఎంతటి వాళ్ళకి? చివరికి నా మీద నిష్ఠూరం వేసి వెళ్ళటమేగా!"

"అన్నయ్యా!"—సూర్యంతోపాటు విశ్వనాధం కూడా తల తిప్పి చూశాడు. గుమ్మంలో మధు నిలబడి ఉన్నాడు. తీక్షణంగాచూస్తూ-సూర్యాన్ని ఉద్దేశించి అన్నాడు — "ఆయనగారి శెలవు తీసుకోకపోతే నీ ఉద్యోగం పోతుందనుకున్నావా?"

విశ్వనాధం మండి పడ్డాడు — "నీలాంటి విశ్వాసంలేని వెధవైతే అలాగే చేస్తాడు."

మధువిశ్వాసంతో తలపడ్డాడు — "ఎందుకు నీకు విశ్వాసం చూపించాలి? మచ్చలు కట్టేలా చావకొట్టినందుకా? కండలు కరిగేలా చాకిరీ చేయించినందుకా? కుక్కలకన్నా నీచంగా చీదరించుకున్నందుకా? ఎందుకు నీకు విశ్వాసం చూపించాలో ఒక్కసారి చెప్పు"—మధు కళ్ళు చింత నిప్పుల్లా మెరిశాయి. సంవత్సరాల తరబడి కూడుకున్న క్రోధం-ఆ రెండు కళ్ళలో ఎర్రగా మిడిసిపడింది.

"ఏంరా? పెద్దవాడివై పోయానని విరగబడుతున్నావా? కాస్త నోరు సంబాళించుకో. తన్నులు తినగలవ్."

పిడికిళ్ళు బిగిస్తూ గర్జించాడు మధు.

"ఆరోజులు పోయాయ్ విశ్వనాథంగారూ! పోయాయ్. నేను నోరు సంబాళించుకోవటంకాదు మీ ఒళ్లు భద్రంగా కాపాడుకోండి. తిట్టి కొట్టి బెదిరించటానికి వీడు అలాటి మధూ కాడు" — మధు దండల మీద ఒంపులు—తోట పనిచేసి బలిష్టమైన కండరాలు విశ్వనాథాన్ని సవాల్ చేశాయ్.

"అయితే నువ్వు నన్ను దడిపిస్తున్నావా?"

"నీ వెటకారాలు కట్టిపెట్టు దడిపించటమేం ఖర్మ? దండిస్తాను. ఏం? ఆశ్చర్యంగా ఉందా? నీవంటి పెద్దమనిషికి ఇంతకన్నా సత్కారం కావాలా!"

"ఏమిట్రోయ్ నీ వాగుడూ? వూరుకుంటున్నాననా?" — విసురుగా లేచాడు విశ్వనాథం.

"ఈ మాత్రపు గౌరవం కాపాడుకోవాలంటే అక్కడే నిలబడు. కాలు ముందుకు వేశావో తేల్చేస్తాను. ఏం? నువ్వు తినిపించినవన్నీ నీకు తినిపించమంటావా? పసివాళ్ళమీద చెలాయించట మనుకున్నావా? తల్లి తండ్రీ లేక నీ పంచ చేరితే ఏమిటి నువ్వు చేసింది? ప్రాణమంటూ ఉంటే మర్చిపోతా ననుకున్నావా? తల్లి తోడబుట్టిన మేనమామవి.... నువ్వు—"

అత్తా, కోడళ్ళూ, పిల్లలూ గలభా విని ఎక్కడిపను లక్కడే వది లేసి చావిటి గుమ్మాల్లో చేరారు. బంధాలు తెంచుకున్న పోట్లగిత్తలా విజృంభిస్తున్న మధునీ - కటకటాల మధ్య ఇరికిన పులిలా గుటకలు మింగుతున్న విశ్వనాథాన్నీ అందరూ చూశారు.

పార్వతి కంగారుగా గొంతు పెద్దదిచేసి విశ్వనాథాన్ని ఉద్దేశిస్తూ అంది - "ఎందుకీ గొడవ? ఆ పిల్లాడు అనట మేమిటి? మీరు పడట మేమిటి? ఇష్టం ఉంటే ఉంటాడు. లేకపోతే పోతారు. మనం పాకులాడితే అవుతుందా?"

"అత్తా!" మధు పార్వతికేసి తీవ్రంగా చూశాడు. "నువ్వు ఆడదానివే! ప్రేమకీ, కరుణకీ స్థానమైన స్త్రీ హృదయం - నీలో మచ్చు

కైనా ఉందా ? నేనేం మతిచెడి మాట్లాడుతున్నానా ? మీరు చేసిందంతా మర్చిపోయానా ? ఏమిటి నీ ఉద్దేశ్యం ? మీరు మాకోసం పాకులాడటమా? ఎందుకూ ? జీతం బత్తెం లేని నౌకర్లు వెళ్ళిపోతున్నారనా ? కోపతాపాలు భరించే దరిద్రులు దాటిపోతున్నారనా ? ఎందుకు మీ పాకులాట ? ఎవర్ని నువ్వు మధ్యపెడతావ్ ?"

"ఎందుకలా విరుచుకు పడతావ్ ? నీతో మాకు వాదనేమిటి ? చిన్నవాళ్ళ జోలికెళితే పెద్దవాళ్ళ తప్పు - కానివాడి జోలికెళితే అయిన వాడిది తప్పౌను. గతిలేనివాళ్ళని చేరదీసి పెంచి పెద్దచేసినందుకు...."

"అత్తా ! సూటిగా చూశాడు మధు. "నీకు నోరెలా వచ్చింది ? మనసెలా ఒప్పింది ? పెంచి పెద్ద చేశావా ? అవును. నీ తోటలో పిచ్చి మొక్కలు మొలుస్తున్నాయ్ - నీ దొడ్లో వూర కుక్కలు తిరుగుతున్నాయ్ - వాటి నన్నింటినీ నువ్వే పెంచి పెద్దచేశావ్—జాలితో — ప్రేమతో — అభిమానంతో....... ... అంతకన్నా గొప్పగా పెరగలేదే మేము ! కడుపు నిండా తిండిలేక, కట్టుకోటానికి గుడ్డలేక. ఏ అవసరమూ తీరక— ఏ కోరికా నెరవేరక హీనంగా, నీచంగా నీ యింట్లో బిచ్చగాళ్ళమై బ్రతికాం - మమ్మల్ని మీరంతా పెంచి పెద్దచేశారు ఆ కృతజ్ఞత మాకే లేకుండా పోయింది."

"తిన్నది అరిగిపోతే ఎన్ని నిష్ఠూరాలన్నా వెయ్యొచ్చు. అంత్య నిష్ఠూరం కన్నా అది నిష్ఠూరం మేలని — అనాడే మీ దారిన మిమ్మల్ని వదిలేయక పోవడమె మా పొరపాటు— దారే పోయేవాళ్ళకోసం ఇల్లు గుల్ల చేసుకొన్నది చాలక—వాదం ఒకటి."

"ఇల్లు గుల్ల చేసుకున్నావ్ ? ఎవరికోసం ? రూపాయి చాకిరీచేస్తే పావలా తిండి పెట్టావ్ ! మేము వచ్చింది మొదలు, ఇంట్లో పనిమనిషిని మాన్పించావ్—మా రెక్కల కష్టంతో తోటమీద వందలు సంపాదించావ్—ఎవరికోసం ఇల్లు గుల్లచేసుకున్నావ్ ? ఎలకలేమైనా ఉన్నాయేమో చూసుకోలేక పోయావా?"

"ఏమిటా చమత్కారం ? ఇష్టంలేకపోతే పోరాదూ!"

"పోతాం మహారాజులా పోతాం. మీ అందరికీ ఒక్కో వొప్పనం యిచ్చి మరీపోతాం. ఇంట్లో పడి తిన్నామనీ — విశ్వాసంలేని ఘాతకుల మనీ మళ్ళీ వాగితే నోరు మూయించిపోతాం. మా అమ్మా-నాన్న బ్రతికి ఉన్నన్నాళ్ళూ అడుగులకు మడుగులొత్తి—వాళ్ళకు కాకాలుపట్టి వాళ్ళ సొమ్ము తిన్నది మీరు! వాళ్ళు దాటిపోయారని వాళ్ళ బిడ్డల్ని నానా హింసలు పెట్టి తిన్న విశ్వాసం మర్చిపోయింది మీరు! అంత సులువుగా పోతామా ? మీకు మా కృతజ్ఞతలుకూడా చెప్పుకు పోతాం. ఈ ప్రాణాలు ఏనాడో ఎగిరిపోకుండా పదేళ్ళపాటు నిలిపి ఉంచారు. ఏళ్ళ తరబడి పెరిగి పోయిన ద్వేషం వెళ్ళగక్కుకోటానికీ, ఎదురు తిరిగి ఘర్షణ పడటానికీ అవకాశం కల్పించారు. అందుకైనా మీకు కృతజ్ఞత చెప్పుకొక తప్పదు."

"పెద్దా! సుందరమ్మగారు కాస్త కటువుగా అంది. "ఏమిటా మాటలు ? ఇప్పుడేమయిందని అలా నోరు పారేసుకుంటున్నావు ? జరిగి పోయినవన్నీ తవ్వుకుంటూ కూర్చుంటే ఏం వస్తుంది ? పెద్దవాళ్ళనైనా ఆలోచించకుండా........"

"హం! పెద్దవాళ్ళు ? ఎవరా పెద్దవాళ్ళు తల్లిలేని పసివాళ్ళని ఏడిపించినప్పుడూ—గొడ్డుకన్నా ఘోరంగా చావబాదినప్పుడూ — ఒక్క అర్ధణాకి దేవుళ్ళాడితే కసిరికొట్టినప్పుడూ—రోజంతా చాకిరీ చేయించు కుని దొంగతనంగా దాచుకు తిన్నప్పుడూ— చదువు సంధ్యలు నేర్పి ఎక్కడ వృద్ధిలోకి వస్తామేమో అని అఘోరించినప్పుడూ.... .... .... ఏమయ్యారీ పెద్దవాళ్ళు ? పిల్లలున్న తల్లులున్నారు. కష్టసుఖాలు ఎరిగిన ... లున్నారు—దిక్కులేని మా విషయమొస్తే ఈ పెద్దమనుషు ... పట్టించుకోరేం ? వయస్సు పెరగటం ఒక్కటేనా పెద్దవాళ్ళకి లక్షణం?"

"నీ ఖర్మకి నువ్వు అఘోరించక ఎవరో చూడలేదని ఏడవటం ...ికి ?"

"ఖర్మ! జానేదేవ్! ఏమిటా ఖర్మ ? ఖర్మంటూ ఉంటే ... ...టం కాదు—ఆస్తిపోవటమూ కాదు. వీళ్ళింట్లో చేరటమే మా ... మమ్మల్ని ఎవరూ అప్పనంగా పోషించలేదు. పనిమనుషులకన్నా

ఎక్కువగా చాకిరీ చేశాం. అర్థాకలితో సంతృప్తిపడ్డాం. అమ్మ నగలమ్మి కొన్న పొలం నాలుగెకరాలు పంట సరిపడక ఇల్లు గుల్ల చేసుకున్నామంటు న్నారీ పెద్ద మనుష్యులు— ఈ విశాల హృదయుల దగ్గర చేరటం మా ఖర్మ కాకపోతే ఏమిటి ?"

విశ్వనాధం విసురుగా అన్నాడు— "ఒరేయ్ ! నువ్వు అనవస రంగా నోరు చేసుకోకు. ఏనుగునుచూసి కుక్కలు మొరగటం ఎన్నడూ ఉంది—మా పెద్దనునిషితనాన్ని చిన్న బుచ్చావనీ - కపటం లేని ప్రవ ర్తనని ఆడిపోసుకున్నావనీ విచారించటం కూడా అనవసరం - నీ చదు వుకీ— నీ అన్న చదువుకీ రెండెకరాలు తెగనమ్మాను. నీ లాంటి విశ్వాస ఘాతకుడికి జాలి దల్చినా మహా పాపం — ఈ క్షణంలో ఇంట్లోంచి పొండి."

"పోయేముందు ఒక్కమాట. నీకు శత్రువులంటూ ఉన్నారో లేదో నాకు తెలీదు—నేను నీ గుండెల్లో నిద్రపోతానని మాత్రం మర్చిపోకు. ఆ తెగనమ్మిన రెండెకరాలు చదువులకయ్యాయని వంక పెట్టకపోతే నీకు కావాలని అడక్కోలేక పోయావా ? మా నాన్నని దేవిరించి నీ అవసరాలు గడుపుకోలేదా ! వీళ్ళిద్దరూ ఆ తండ్రి కన్న కొడుకులు కారనుకున్నావా?"

"నోరుముయ్ ! ఏమిటా వాగుడు ?"

"అది నీ వంతు. నీలాంటి పెద్దమనుషులుకూడా కొన్ని వంతు లేసుకుంటే మజాగా ఉంటుంది."

"మధూ!" మందలింపు స్వరంతో పిలిచాడు సూర్యం — "ఎందు కలా మాటలు పెంచుతూ పోతావ్ ? ఆనాడు ఇష్టమై వచ్చాం. ఇష్టమై నన్నాళ్ళూ ఉన్నాం. ఇష్టంగానే పోలే వాగాష్టుంటుంది. కష్టాలు వచ్చింది మనకు. బాధపడాల్సిందకూడా మనమే."

విశ్వనాధం అన్నాడు వెటకారంగా "నువ్వు ఆగరా ! వాడి—కసి అంతా తీర్చుకోనీ"

సూర్యం మందలింపుతో కొంత జంకినా మధు వూరుకోలేదు "కసి ! అది ఈ జన్మలో తీరదు. ఏచ్చే జన్మంటూ ఉంటే చూచుకుంద విసురుగా అంగలేసుకుంటూ బయటి కెళ్ళిపోయాడు.

ఎక్కడి వాళ్ళక్కడ శిలా ప్రతిమల్లా నిలబడిపోయారు. ముందు మాట్లాడటానికి ఎవరికీ మనస్కరించలేదు. చివరికి పార్వతి అంది _

"ఎన్నడూ లేందే ఎందుకలా గంగిగ్లెత్తినట్లు వాగి వెళ్ళాడు?"

"ఆ కేశిగాడు చేయిస్తున్న ఏదంతా!" పళ్ళు నూరాడు విశ్వనాథం.

* నెమ్మదిగా సూర్యం వీధిలోకీ, సుందరమ్మగారు దొడ్లోకి తప్పుకున్నారు.

సంగతంతా విన్న కేశవరావు ఆశ్చర్యంగా చూశాడు — "నీకూ చిన్న వ్యక్తిత్వం ఏర్పడిందిరా అల్లుడూ!" అంటూ నవ్వాడు.

మేనమామలకూ, మేనల్లుళ్ళకూ మధ్య అనురాగాలకు బదులు అగాధాలు ఏర్పడ్డాయి. అవి పూడ్చుకోవాలన్న కోరిక ఏ ఒక్కరికీ ఉన్నట్లు లేదు—సూర్యం అప్పుడప్పుడూ వెళ్ళి అత్తతో, మామలతో ఓ క్షణం మాట్లాడి తనమీద నేరం లేకుండా చేసుకు వస్తున్నాడు. మధు మాత్రం ఆ గడప ఎక్కలేదు – వారాని కోసారైనా ఓ గంట తోటలో తిరిగి ప్రతీ చెట్టుమీద చేయివేసి – ప్రతి మొక్కనీ ముట్టుకుని రాక తప్పటం లేదు. లేకపోతే ఏదో పోగొట్టుకొన్నట్టు .. తోటంతా తన కోసం ఎదురు చూస్తున్నట్టు .. ఆవేదన కలుగుతోంది.

ఆ రోజు మధు చాల సంతోషంగా ఉన్నాడు. పరీక్షా ఫలితాలు తెలిశాయి. తను పాసయ్యాడు. ఇక కాలేజీ మెట్లెక్కి భవిష్యత్ సౌధానికి సోపానాలు కట్టుకోవచ్చు. తను కష్టపడి చదివి పెద్దవాడై మంచి ఉద్యోగం సంపాదించి విశ్వనాథంవంటి అసూయాపరుల కళ్ళల్లో నిప్పులు పొయ్యాలి. అంతవరకూ ఈ పంతానికి అర్థంలేదు.

తోటంతా తిరుగుతూన్న మధు అప్రయత్నంగా తెల్లగులాబీ చెట్లగ్గరికి నడిచాడు.

సుధ ఎత్తుగా ఉన్న గులాబీకోసం ఎగిరేటి కుచ్చెళ్ళు ఎడంచేత్తో

పట్టుకుని కుడిచెయ్యి పైకెత్తి ఎగురుతూ పువ్వు అందుకోవాలని విశ్వ ప్రయత్నం చేస్తోంది. మధు ఒక క్షణం చూస్తూ నిలబడ్డాడు.

"నేను కోసి ఇవ్వనా సుధా?"

సుధ గిరుక్కున వెనక్కి తిరిగి చూసింది. కంగారుపడిన దానిలా కుచ్చెళ్ళు వదిలేసి పువ్వుకేసి చూడకుండా నిలబడిపోయింది. మధు గులాబీ కోశాడు. రెండు ఆకులతో నక్షత్రంలా గులాబీ అందంగా ఉంది. సుధకి ఇవ్వబోయాడు - అడ్డంగా తల తిప్పింది సుధ - "వద్దు."

"ఏం? నువ్వే కోసుకోబోతున్నావుగా ?"

సుధ మాట్లాడలేదు.

పదిహేడేళ్ళ మధు చనువుగా, కోరికతో పదేళ్ళ సుధ జడలో గులాబీ పెట్టబోయాడు. సుధ గిరుక్కున తల తిప్పేసింది — "నాకేం వద్దు."

గులాబీ కింద పడింది — మధు సూటిగా సుధకేసి చూశాడు. చెంపలు రెండూ పగలగొడదా మనిపించింది. వంగి గులాబీ తీసుకున్నాడు.

వెటకారంగా అన్నాడు — "నీకు గులాబీ ఎందుకులే ఆ దడి దగ్గిర పూశాయ్, ఉమ్మెత్త పువ్వులు, పెట్టుకో."

"నువ్వేం చెప్పక్కర్లా."

"ఓహో! చాలా పౌరుషంగా ఉందే అమ్మాయిగారికి?"

సుధకి ఉక్రోషం వచ్చింది — "మా పెదనాన్నతో దెబ్బలాడి మా తోటలోకెందుకొచ్చావేమిటి ?"

"నువ్వు తప్పకుండా లాయరువై పోతావ్ — చదివిస్తా నంటున్నాడా మీ పెదనాన్న?"

"ఆఁ నేను పెద్దబళ్లో చేరతాను తెలిసిందా ?"

"చేరు. చేరాక అన్నగారిలా అక్కడే ఉండిపోకు."

"మా అన్నయ్యకూడా పేసయ్యాడు. తెలిసిందా ?"

"ఆఁ క్లాసులో మరి ఉంచటానికి వీల్లేక పైకి తోశారు. ఎవ తెలీదు ?"

సుధ బిక్క మొహం వేసింది—మధుకి జాలేసింది.

"అది సరేగానీ నాతో నువ్వు ఎప్పుడూ సరిగ్గా మాట్లాడవేంసుధా?

"నువ్వు మా పెదనాన్నతో దెబ్బలాడ లేదేమిటి?"

"అయితే నీ కెందుకు కోపం? నీతో దెబ్బలాడలేదుగా? నాతో మాట్లాడటానికేం?"

"ఏం మాట్లాడనూ?"

"ఏదో ఒకటి — ఏం? నాతో మాట్లాడటం నీకు ఇష్టం లేదా?"

"ఏమో బాబూ! నేను పోతాను. మా అమ్మ తిడుతుంది."

"నాతో మాట్లాడవద్దని చెప్పారా?"

"నాకేం చెప్పలా..."

"పోనీ ఈ పువ్వు తీసుకు వెళ్ళిపో — ఆడపిల్లవి కదూ? పువ్వు పెట్టుకోవూ?"

"..................."

"నేను నీతో జట్టుగా ఉందామనుకొంటే నీకు నామీద కోపం ఎందు కేమిటి?—మర్చిపోయాను నేను స్కూలు ఫయినల్ పాసయ్యాను. నీకు తెలుసా?"

"మా అన్నయ్య చెప్పాడుగా?"

"మీ పెదనాన్న ఏమన్నాడేం?"

"మమ్మల్ని నీకన్నా బాగా చదువుకోమన్నాడు."

మధు నవ్వాడు. "కొత్త దారిలో కొస్తున్నాడు."

సుధ అర్థంకానట్లు చూసింది.

"పువ్వు తీసుకు వెళ్ళిపో. వెళతానన్నావుగా?"

"సుధ వ్యతిరేకంగా మాట్లాడటానికి ధైర్యంలేక గులాబీ అందుకుంది."

* * *

జగన్నాథస్వామి కోవెలలో సూర్యంపెళ్ళి నిరాడంబరంగా జరిగింది. సూర్యం భార్య కాగలిగిన అదృష్టవంతురాలు ఇందిర పేద కుటుం

బంలో పుట్టిన కారణంగా ఏ సిరి సంపదలూ తెచ్చుకోలేకపోయినా సౌంద ర్యమూ, సౌశీల్యమే ఆమె ఆభరణాలు.

సూర్యం తొలిసారిగా ఇందిరతో మాట్లాడినప్పుడు ప్రత్యేక శ్రద్ధతో చెప్పింది మధూ విషయమే.

"ఇందిరా! మధు నీకు మరిదికాదు – కొడుకు! వాడిని తల్లిలాగ చూచుకోవలసిన బాధ్యత నీమీద పెడుతున్నాను. ఇంతకన్నా చెప్పనవ సరం లేదనుకుంటా."

సిగ్గు దొంతరల పెళ్ళికూతురు. ఇందిర – కొంచెం తెల్లబోయింది. భర్త ఇంత ప్రత్యేకించి మరిది విషయం ఎందుకు చెప్పినట్లో అర్థం కాలేదు.

"మీరు చెప్పినట్లే చేస్తాను–" అంది తల దించుకొని.

"ఎందుకో నీమీద నాకా నమ్మకం కుదిరింది ఇందూ!" వయ స్సులో యువకుడై, అనుభవాల్లో పెద్దవాడైన సూర్యం — సంతోషం నిండిన మనస్సుతో ఇందిర సన్నిధిలో విశ్రమించాడు

ఒక సంవత్సరం కాలేజీలో చదివి వచ్చిన మధు — అపారమైన కోరికతో చదువు సంధ్యలు ఒంట పట్టించుకొంటూన్న మధు ఇందిరను చూసి చలించిపోయాడు. కన్నతల్లి జ్ఞాపకాలు వెర్రివాణ్ని చేస్తోంటే ఏడేళ్ళ పసివాడిగా మారిపోయి కుతూహలంగా ఇందిరని పరికించసాగాడు. పట్టుబట్టలతో అన్నయ్య ప్రక్కన నిలబడిన వదిన ముఖంలో దేని కోసమో వెదుక్కున్నాడు— మధు మనసు ఆనందంతో గంతులేసింది.

"వదిన! .... వచ్చింది అమ్మలాగ .... ఎప్పుడూ ఇంట్లోనే ఉండిపోతుంది."

వదినతో మాట్లాడాలన్న కోరిక నిలవనివ్వకుండా చేసింది. ఆ శుభ సమయం కోసం మూడు రోజులు ఎదురు చూశాడు.

సంధ్యవేళ — ఇందిర దీపం వెలిగిస్తోంది.

"వదినా!"

తలతిప్పి చూసిన ఇందిర సిగ్గుపడిపోయింది.

భర్తకన్నా బలిష్ఠుడైన పురిది! — మౌనంగా తల దించుకొంది.

"ఈ పువ్వులు తీసుకో వదినా!" మధు చేతిలో తెల్ల గులాబీల గుత్తి ఉంది—"నీ కోసమే తెచ్చాను వదినా?"

ఇందిర సిగ్గు ముసుగు తొలిగించుకొని ప్రయత్నం చేస్తూ అంది. "లోపలికి వచ్చి కూర్చోండి."

మధు సంతోషంగా వచ్చి చాపమీద కూర్చున్నాడు — ఇందిర గులాబీ గుత్తి తలలో ఇముడ్చుకుంది.

"పువ్వులు చాలా బావున్నాయి. ఎక్కడివి!"

"మామయ్యగారి తోటలోంచి తెచ్చాను."

"అక్కడ ఎక్కువగా పూస్తాయా?"

"మేము వాళ్ళింట్లో ఉండే రోజుల్లో ఎక్కువగానే పూసేవి. ఇప్పుడు తోటపని బాగా చెయ్యటంలేదు. కొన్ని కొన్ని పూస్తున్నాయి."

"…. …. …."

"నీకు గులాబీలంటే ఇష్టమేనా వదినా?"

ఇందిర నవ్వింది—"గులాబీ ఎవరికి ఇష్టముండదు?"

"మా అత్తలు మాత్రం పెట్టుకోరు. చేమంతుల దండ ఓ బార పైతేగాని వాళ్ళకి సరిపోదు."

"దానికేముంది? మనిషికో ఇష్టం."

"మన దొడ్లోకూడా గులాబీ మొక్కలు వేద్దాం వదినా!"

"నేనే చెప్పాలనుకొంటున్నాను—మల్లి మొక్కలు కూడా."

"ఓ తప్పకుండా, నీ కిష్టమైన పువ్వులన్నీ మన దొడ్లోనే పూయిస్తాను వదినా!"

"మీకు పువ్వుల పెంపకం బాగా తెలుసనుకొంటాను."

మధు అయిష్టంగా మొహం పెట్టాడు — "నన్ను అలా మన్నించకు వదినా! నాకేమీ నచ్చలేదు. మా అమ్మ అయినా, అమ్మమ్మ అయినా, నువ్వు అయినా ఒక్కటే."

ఇందిర మధు మొహంలోకి సూటిగా చూడగలిగింది. ఆ మొహంలో, కళ్ళలో, చిరునవ్వులో పసిభావాలు తప్పితే మరేమీ కాన రాలేదు.

"చిన్నవాడు కాస్త ఆకతాయి వాడమ్మా! ఎలా చూసుకుంటావో!" అని సుందరమ్మగారు కూడా మధు గురించి చెప్పినప్పుడు ఇందిర చెడ్డ గానే వూహించుకొంది. అటువంటి మరిది బాధ్యత స్వీకరించటం సాహస మేనని భయపడింది. కాని ఈ మధు—మరిది ఉత్త పసివాడు! అమా యకుడు! తన భయాలు ఎంతమాత్రం నిజంకాదు.

"వదినా! నువ్వు మా అమ్మలాగే ఉన్నావు." అన్నప్పుడు ఇందిర నవ్వింది.

"నిజం వదినా!" మధు రెట్టించాడు.

వదినా! వదినా! అంటూ ఎప్పుడూ తన చుట్టూ తిరిగే మరిది! నిత్యమూ పూలమాలలు తెచ్చి దేవతకన్నా మిన్నగా పూజించే భక్తుడు! అపారమైన భయభక్తులతో తాను చెప్పినట్లు ఆచరించే శిష్యుడు! —మధు ఇందిరకు మరిది కానేకాడు!

ఇందిర సూర్యానికి సామాన్యమైన ఇల్లాలే — కానీ మధుకి అపు రూపమైన స్నేహితురాలు!

తల్లి కొడుకును ప్రేమిస్తుంది.

అక్క తమ్ముణ్ని ప్రేమిస్తుంది.

ఇందిర మధుని ప్రేమిస్తోంది.

* * *

"కాస్త లేచి తొందరగా స్నానం చెయ్యి మధూ! గుడికి వెళ్దాం."

"బద్ధకంగా ఉంది వదినా! రాత్రి ట్రైనులో నిద్రపోలేదు."

"అయితే ఎంతసేపు పడుకుంటావో చూస్తాను, పడుకో."

"లేదులే వదినా! అంత కోపమా?"

"మరేమిటి? గంటనుంచీ మొత్తుకుంటోంటే."

"గంట నుంచీనా? హరి దేవుడా! ఎందుకూ?"

"దేవుడి దగ్గరకి వెళదామనీ!"

"సరిగా చెబుదూ?"

"ఇంకా ఏం చెప్పను? గుడికి వెళదాం."

"గుడికా! ఎందుకూ?"

"ఇది మరీ బావుంది. దేవుడి గుడికి ఎందుకెళతారు?"

"ఓహో! ఏవో కోరికలు కోరుకోవటానికి కాబోలు! అయితే నీ కోరికేమిటి?"

"ఇక్కడ నీతో చెప్పమంటావా!"

"నోరులేని రాతిబొమ్మకన్నా తీసిపోయానా వదినా? నాకు చెపితే చెయ్యగలిగితే చేస్తాను, లేకపోతే కొంత సానుభూతైనా చూపిస్తాను కదా?"

ఇందిర నవ్వింది — "కాలేజిలో కష్టపడి రెండేళ్లు చదివావు. పరీక్షలు రాసి వచ్చావు. మా మధు పరీక్ష పాసయ్యేలా చెయ్యమని కోరుకోవటానికే బయల్దేరుతున్నాను."

"దానికైతే వెళ్ళక్కరలేదు. పరీక్ష రాసినవాణ్ని వదిలేసి ఎవణ్నో అడగటం ఏమిటి? నేను పాసౌతానని చెపుతున్నానుగా!"

"ఏమో! ఆ రోజుకి ఏదో అడ్డు రావచ్చు."

"పిచ్చి వదినా! నేను పేపర్లు సరిగ్గా రాసి ఉండకపోతే నీ దేవు డెలా ప్యాసు చేయిస్తాడో చెప్పు వింటాను." మధు దిండుమీద వోరగా పడుకొని ప్రశ్నించాడు.

"ఏమో బాబూ! నీకు నేను చెప్పలేను. నా కోరికేదో చెప్పుకుని వస్తాను."

"ఓహో! ఆ గుడిలో నీ కోరిక తీర్చే దేముడున్నాడన్నమాట."

"ఉన్నాడో లేడో! ఆ విగ్రహాన్ని వోసారి దర్శించి ఏవో నమ స్కరించి వస్తాను."

"అటువంటి విగ్రహం నీ పూజ గదిలోను ఉందిగా? కాకపోతే సైజు తేడా! అంతే."

"అసలు నువ్వు వస్తావా? రావా? చెప్పు."

"కోప్పడకు వదినా? నువ్వు చెపితే చెయ్యనని ఎప్పుడయినా అన్నానా? కానీ, వదినా! ఒకటి చెప్పు. నువ్వు చేసే పనిమీద విశ్వాసం లేకుండా ఎందుకు చేస్తావు?"

"అంటే నీ ఉద్దేశ్యం? దేవుడు లేడనా?"

"నే నలా అనలేదే! నాకు రూఢిగా తెలీని విషయం గురించి నేను ఎప్పుడూ వాదించను — సరే! దేవుడున్నాడే అనుకుందాం, అయితే దేవుడు ఆ గుళ్ళోనే ఉన్నాడా? నీ పూజా మందిరంలో లేడా?"

"ఉంటే ఉండొచ్చు. మన ఇంటికన్నా ఆ గుడి పవిత్రమైనదీ, ఉన్నతమైనదీ. అక్కడ నిలబడితేనే ఏదో శాంతిగా ఉన్నట్టు అనిపిస్తుంది."

అదే సైకాలజీ! అంటే నీ మనస్సు కొన్ని నమ్మకాలకు అలవాటుపడి ఉంటుంది. అంతేగాని ప్రత్యేకించి దేవుడి గుడిలోనే పవిత్రతా, శాంతి అనేవి లేనేలేవు. అక్కడ ఎంత నీచమైన పనులు జరుగుతూ ఉంటాయో తెలిస్తే నువ్వా మాట అననే అనవు."

"ఉంటే ఉండవచ్చు. అవేవీ దేవుణ్ణి అంటవు."

"దేవుణ్ణి అపవిత్రత అంటనప్పుడు మన ఇంట్లో అపవిత్రంగా ఉంటని ఎందు కనుకొంటున్నావు?"

"మన తృప్తికోసమే అక్కడికి వెళతాం. అంతే."

"ఒప్పుకున్నావా! అయితే దేవుణ్ణి పళ్ళూ, పువ్వులూ పెట్టి పూజించాలా?"

"దేవుణ్ణి భక్తితో పూజించకపోతే ఎలా?" విస్మయంగా చూసింది ఇందిర.

"ఎందుకు పూజించాలి? చూడు! బాపూజీని తీసుకుందాం — ఆయన మానవునిలాగా పుట్టినా మనం మానవాతీతుడిగానే భావిస్తునా ఏనాడైనా గాంధీతాత మనకు దేవుడితో సమానమే. అయితే ఆయన పేరున గుళ్ళు కట్టించి, పూజారిని పెట్టి, రకరకాలుగా పూజలు టమా? లేక ఆయన ఆదర్శాలు అర్థం చేసుకుని ఆయన ధర్మాలు పట్టించుకొని, ఆయన అడుగుజాడల్లో నడుస్తూ, ఆయన్ని అ

టమా ? ఏది మన కర్తవ్యం ? ఏది సమంజసం ? బాపూజీ తనకు పూజలు చేస్తే సంతోషిస్తాడా ? తన సూక్తులను పాటిస్తే సంతృప్తి పడతాడా ?"

"గాంధీతాత చెప్పిన విధంగా నడుస్తూనే ఆయన్నికూడా పూజించ వచ్చుగా ?"

"ఈ నాటి దైవ ప్రార్థనలో అదే జరుగుతుందా ! దేవుడి పేరిట మన పురాణాలు శాసించిన నీతి నియమాలు ఎంతమంది పాటిస్తున్నారు ? పుణ్యాన్ని గౌరవించి. పాపానికి ఎంతమంది భయపడుతున్నారు ? దొంగ తనం పాపం ! వ్యభిచారం పాపం ! అబద్ధాలాడటం పాపం ? ఇతర్లని మోసం చేయటం పాపం ! ఇవన్నీ అందరికీ తెలుసు — పురాణాలు చెప్తు తున్నాయ్. కాని ఎంతమంది ఆచరిస్తున్నారు."

"అందుకే ఈ దేవతార్చన ! ప్రతి వ్యక్తి ఎల్లకాలం నీతి నియ మాలు ఆచరించటం సాధ్యంకాదు. ఎన్ని ఆటంకాలు ఉన్నా మనిషి తప్పు చేస్తూనే ఉంటాడు. నువ్వు ఏ పాపమూ చేయటం లేదనేనా నీ అహం కారం ?"

"మనిషి పాపం చేస్తే అది మాసిపోవలసింది పశ్చాత్తాపంతోనే. ఓ పావలా పట్నూ, పువ్వులూకొని పూజారి కప్పగించి చేతులు దులుపుకు వస్తే పోయేది మాత్రం కాదు. నేను తప్పుచేస్తే తగిన శిక్ష అనుభవించ టానికే సిద్ధంగా ఉంటాను. కానీ లంచం తీసుకుని క్షమించగలడనుకొనే దేవుణ్ణి మాత్రం ఎన్నడూ ప్రార్థించను."

"అయితే అనాదిగా వస్తూన్న తీర్థయాత్రలకూ, దైవ ప్రార్థనకూ అర్థమేలేదా ?"

"ఎందుకు లేదు? అడవుల్లో అనాగరికంగా, అసభ్యంగా తిరిగిన మానవుడు సంఘజీవి అవుతూన్నపుడు ఏర్పడిన తతంగం ఇది. ఆనాటి -- వుడికి చేయవలసినవీ— చేయకూడనివీ—పరోక్షంగా పుణ్యంపాపం తెలివు. సాంఘిక శాంతి కోసం మనుషులంతా నీతి నియమాలు అనాడు సంస్కారంలేని మనిషిని లొంగదీయటానికి పాప

భీతి—దైవభక్తి ఎంతయినా అవసరమయ్యాయి. ఈనాడైనా సంస్కారం లేని వారందరికీ వుండి తీరవలసిందే ఈ తతంగం. కానీ నీతి నియమాలు పాటించాలనే ముఖ్యోద్దేశం లోపించి అవి పోగొట్టుకోవటానికే ఈ దైవ భక్తి మిగిలిఉంటే. అది మహా ప్రమాదకరమైన సంగతి. దైవభక్తి అనేది పిచ్చి పిచ్చిగా విగ్రహారాధన కిందికి దిగటం అర్థంలేనిపని."

"నీలా నేను చదువుకోలేదు మరి. లేకపోతే నీకు తగిన సమాధానం చెప్పగలిగేదాన్ని కాదూ?"

"అలాగే అయితే చాలా సంతోషించేవాణ్ని వదినా! నాకో ఉద్దేశ్యమంటూ ఉంటే అది నిరాటంకంగా సాగాలి. లేదా ఎదుటివారి వాదనతో సమూలంగా నశించి పోవాలి.. నీకు ప్రత్యక్షంగా కన్పిస్తూన్న దాన్ని మించి కన్పించని దేదో ఉందని భ్రమిస్తావు దేనికి?"

"అయ్యోరాత! నిద్ర మంచంమీద ఏమిటీ వాదన? ఇంతకీ గుడికి వస్తావా? రావా?"

"నీ ఇష్టం రమ్మంటే నాకేం అభ్యంతరం లేదు, నేను ఎన్ని చెప్పి కొట్టటంలేదు! అంతేగాని నేను మాత్రం పళ్ళూ గిళ్ళూ యివ్వను. నా పావలానో, అర్ధరూపాయో నాకిచ్చేయ్,"

"పావలా ఏం ఖర్మ? రూపాయి. ఏం చేసుకుంటావు?"

"ఏదో చేసుకుంటాను. పూజారికి మాత్రం ఇవ్వను. అతగాడు సూర్యోదయానికి ముందే కాఫీ హోటల్లో ప్రత్యక్షమై, చీకటి పడగానే మిలటరీ హోటల్లో అస్తమిస్తాడు. ఆ లాంఛనాల తర్వాత దేవుడికి నైవేద్యాలూ—పూజలు—పునస్కారాలు వగైరా!" ఇందిర చిత్రంగా చూసింది.

"నీకో బేడ ఇస్తాను. నన్ను గుడికి తీసుకువెళ్ళు."

మధు నసుగుతూ లేచాడు—"బొత్తిగా బేడ—కిట్టదు వదినా! ఇంకో అణా వేసుకో? ఏం?"

ఇందిర నవ్వింది.

* * *

వదులుగానే వేసుకున్నా జడలో ఒకే మందారం పెట్టుకుంది. గాజు పళ్ళెంలో పళ్ళూ, పువ్వులూ హారతి కర్పూరం—చిల్లర డబ్బులు వేసుకుని బయల్దేరింది — మధు సుష్టుగా కాఫీ టిఫెన్లు కానిచ్చి మరీ అనుసరించాడు.

గుడికి వెళుతోంటే దారిలో సంచి బుజాన వేసుకు స్కూలుకి వెళుతూ సుధ కన్పించింది। ఇందిరని చూసి నవ్వబోయి మధుని చూసి తల తిప్పేసుకుంది. మనిషి చాల ఏపుగా, బొద్దుగా పెరిగింది. ఎఱ్ఱటి పరికిణీమీద పాము పొరల్లాంటి సిల్కు వోణీ వేసుకుంది. రెండు జడల్లో ఒకటి ముందుకు వేసుకుని వయ్యారంగా నడిచిపోయింది. మధు కుతుహలంగా సుధకేసి చూస్తోంటే ఇందిర ఎగతాళి చేసింది — "ఏమిటా చూసుకోడాలు నడి రొడ్డులో ? సిగ్గులేదూ?"

మధు ఉలిక్కిపడ్డవాడిలా తల తిప్పేశాడు.

"బాగా చూశావా ?"

"నా కళ్ళు రెండూ సలక్షణంగా ఉన్నాయివదినా।"

"అయితే దారేపోయ్యేఆడపిల్ల లందర్నీ చూడమనా నీకు కళ్లు ఉన్నది ?"

"కాక మొగ పిల్లల్ని మాత్రమే చూడమనా ?"

"సరేలే । నీ బడాయి ఇంకెన్నాళ్ళో చూస్తాను. సుధ నీకు దిమ్మ తిరిగేలా జవాబు చెపుతుంది."

"వాలకం చూస్తే అలాగే ఉందిలే. చూశావా ఎంత గర్వంగా పోయిందో ?"

"కాక । నీకు ఒంగి నమస్కారాలు చేస్తుందనుకున్నావా ? ఓ పదేళ్ళుపోతే పెద్దడాక్టరై కూర్చుంటుంది. తెలుసా?"

"అలాగా । నువ్వుమాత్రం ఖాళీగా దేనికి ?"

"నేనేం హాస్యమాడుతున్నా ననుకొన్నావా ? మీ పెద్దమామగారు కూతుర్ని డాక్టర్ చదివిస్తారట. సుధ డాక్టరై మీ అన్నయ్యను కాంపౌండర్‌గా పెట్టుకొంటుందిట ।"

"చాల్లే ! కట్టి పెట్టు. ఏమిటా చమత్కారం ?"

"అయ్యో రాత ! నమ్మకపోతే నేనేం చెయ్యను. మీ అన్నయ్య వోసారి—"డాక్టరమ్మగారూ !" అని హాస్యానికి పిలిస్తే — "ఎందుకంత వెటకారం బావా! నేను డాక్టరైతే నిన్ను కాంపౌండర్‌గానైనా పెట్టు కుంటాగా ?" అందట."

"అంత గర్విష్టయిందన్నమాట. ఏమన్నాడేమిటి అన్నయ్య?"

"నీ దగ్గర కాంపౌదరుగా ఉండటానికైనా నేను తగను. మా తమ్ముణ్ని పెట్టుకుంటే నీ హాస్పిటల్‌కి ఒకటేపేరు ఏక సందడి ! అన్నా రట—"

ఇందిరతోపాటు మధూనవ్వాడు — "బాగా అన్నాడు — దానికి మొదటినుంచీ మేమంటే తేలిక అభిప్రాయమే వదినా !"

"అదే మారుతుంది. సమయం రానీ!"

ఇందిర మౌనంగా నడవసాగింది.

మధు హఠాత్తుగా అడిగాడు— "వదినా ! దేవుడి గుడికి వస్తూ న్నప్పుడైనా నీ మనస్సు కాస్త దైవ చింతతో నింపుకున్నావా ? ఎందుకీ ముక్కుబడి చెప్పు." అంటూ నవ్వాడు.

"ఫో మధూ! ఇంకా సన్యాసుల్లా భజనలు చేసుకొంటూ నడవా లేమిటి ?"

గుడినుంచి వస్తున్నప్పుడు అంది ఇందిర -

"ఎగతాళి చెయ్యకుండా ఉంటే నీకో మాట చెప్తాను."

"ఏమిటబ్బా అది ?"

"మీ డాక్టర్ మామయ్య భార్యని పుట్టింటికి పంపించేశారు నీకు తెలుసా ?"

"ఇందులో తెలీటానికేముంది? చూడాలని ఉండి వెళ్ళింది కాబోలు. ఈ పూట మామయ్య దగ్గరికి వెళదామనుకుంటే దేవుడి దగ్గరికి తీసు కొచ్చావ్."

"అదికాదు మధూ ! మీ మామయ్య భార్యని కోపంతోనే పంపించే శారట".

"కోపంతోనా? అత్తయ్యమీదా?"

"ఏం! అంత విస్తుపోతున్నావ్? ఆయన కేవేవో పరాయి ఆడ వాళ్ళ స్నేహాలున్నాయటగా?"

"ఛ! వూరుకో వదినా! నిజం తెలీకుండా మాట్లాడుతున్నావు." మధు కొంచెం తీవ్రంగా మందలించాడు.

"సరి! వూళ్ళో అంతా అనుకొంటూంటే నే నేనా అబద్ధమాడింది? నిన్న వచ్చిన వాడివి నాతో వాదిస్తావేం?"

మధు ఇందిర చెప్పింది నమ్మలేకపోయాడు.

"అత్తయ్య ఇప్పుడు వూళ్లోలేదా?"

"లేరంట. మీ అన్నయ్యే చెప్పారు."

"ఛ! నేను నమ్మను. వాళ్ళిద్దరూ ఎంతో అన్యోన్యంగా ఉండే వాళ్ళే!"

"సరేలే! నీకే తెలుస్తుంది."

"మామయ్య మారిపోయాడంటే దానికి తగిన కారణమేదో ఉండాలి."

ఇందిర తను విన్న విషయాలన్నీ చెప్తానకింది.

"మామయ్య ఎందుకలా మారిపోయాడు? అత్తయ్య ఏమంత తప్పుచేసింది?"—మధు లోలోపల మధనపడ్డాడు—"వాళ్ళిద్దరూ ఒకళ్ళ నొకళ్ళు అర్థం చేసుకొని అన్యోన్యంగా ఉండేవాళ్ళే వదినా! మరి ఎందు కలా జరిగిందో!"

"ఈనాడు ఈమాట చెప్పుకుంటున్నట్టే ఆనాడు ఆ మాట చెప్పు కున్నారుగా? డాక్టరుగారికి భార్యంటే పంచ ప్రాణాలనీ! ఆవిణ్ని పట్టు మని పదిరోజులైనా పుట్టింటికి పంపించారనీ—వాళ్ళు సాక్షాత్తు పార్వతీ పరమేశ్వరులంటే అబద్ధం కాదనీ ...... ఒకళ్ళు చెప్పట మేమిటి? నా కళ్ళతో నేను ఎన్నిసార్లు చూడలేదు?—కాలమంతా ఒక్కలాఉంటుందా? చీకటి కొన్నాళ్ళు-వెన్నెల కొన్నాళ్లు!"

ఆలోచిస్తూ నడుస్తోంటే మధు జ్ఞాపకాల్లో ఒకనాటి సంఘటన మెరుపులా మెరిసింది.

"ఒక విషయం చెప్పనా వదినా ! అలాంటివి వాళ్ళ సంసారంలో ఎన్ని ఉన్నాయో మనకు తెలీదు. ఏ ఒక్కటివున్నా జీవితం ధన్యమై పోతుందనిపిస్తుంది."

నేను తరచుగా సాయంత్రాలు మామయ్యా వాళ్ళింటికి వెళుతూండే వాడిని. ఆరోజు చినుకులు పడుతున్నాయని ఇంట్లోనే కూర్చుని చదువుకో టాని కుపక్రమించాను చదువేమీ సాగలేదు. పుస్తకం మూసి మామయ్యా గారింటికే బయర్దేరాను—వెళ్ళేసరికి అత్తయ్యా, మామయ్యా తాలింపు శెన గలు తింటున్నారు. నాక్కూడా ఓ గాజు ప్లేటులో పెట్టారు. ముగ్గురం కబుర్లు చెప్పుకొంటూ కూర్చున్నాం. అత్తయ్యలేచి పరుపు మీదికి జల్లు కొడుతోందని కిటికీలు మూసి జడ విప్పుకుంటూ అద్దం ముందు నిలబడింది—బయట చినుకుల ధాటి ఎక్కువైంది. హోరుమంటూ గాలి కూడా ప్రారంభించింది.

అత్తయ్య తల దువ్వుకొని అందంగా సిగ చుట్టుకొంది. బొట్టు పెట్టుకుంటూ అడిగింది.—

"సిగ చక్కగా కుదిరింది కదూ ?"

మాటల్లోపడి మేమిద్దరం అత్తయ్యా అడిగింది విన్పించుకోలేదు.

"ఏమిటా గర్వం ? వినిపించుకోరేం ?" అంది కోపంగా. అప్ప టికి మామయ్యా తలతిప్పి చూశాడు. అత్తయ్య విసురుగా వెనక్కి తిరిగి పోయింది.

"నీ సిగ చాలా బాగుంది రుక్మిణీ!"

అంతలోనే కోపం మర్చిపోయింది అత్తయ్యా.

"నిజంగానా ?"

"అక్షరాలా! పూర్ణచంద్రుడికైనా వంక ఉంటుందిగానీ నీ సిగకి లేదు — గుండ్రంగా చంద్రబింబంలా – నల్లగా – కాదు మేఘంలా — కాదు – కాదు – తుమ్మెదల గుంపులా ...."

"నయం ఈగల దండులా అన్నారుకాదు. నిజం చెబుదురూ !"

"నిజం రుక్మిణీ ! నాకు కవిత్వం రాదు ఖర్మ ! కావాలంటే మధూ నడుగు,"

"నాకూ రాదు మామయ్యా!"

ముగ్గురం నవ్వుకున్నాం.

అత్తయ్య ముడి అందంగా, చక్కగానే ఉంది. అద్దంలో పదేపదే చూసుకుంటూ యదాలాపంగా అంది -

"ఇప్పుడు మల్లె మొగ్గలు ఉంటే ఎంత బావుంటుంది. సిగ చక్కగా కుదిరింది."

మామయ్య నవ్వాడు. నాకేసి చూస్తూ అన్నాడు.

"మీ అత్తయ్యకి మల్లె మొగ్గలు కావాలిట! ఎక్కడన్నా సంపాదించగలవేమిటి?"

"తోటలో పువ్వులు నేను వచ్చే ముందే కోసి చిన్నత్తకిచ్చి వచ్చేశాను మామయ్యా! రేపైతే పూసినవన్నీ తెస్తాను."

"మంచి సరసుడవే! మీ అత్తకి ఇప్పుడు మనసౌతోంటే రేపు తెస్తావ్!" అన్నాడు మామయ్య.

"రుక్మిణీ! మొగ్గలే కావాలా? పువ్వులైనా ఫరావాలేదా?" అడిగాడు హాస్యంగా.

"ఏవో ఒకటి తెప్పించుదురూ?" అంది అత్తయ్య.

"వాళ్ళతోటలోవి మనకెందుకు గాని....... బజార్లో దొరక వ్వటా?" తిరిగి నాకేసి చూశాడు.

"ఉండటంలేదు మామయ్యా! స్కూలునుంచి వస్తోంటే బజార్లో ఎక్కడా కన్పించలేదు."

"ఎలా మరి?"

అత్తయ్య నవ్వుతూ దగ్గరికి వచ్చింది—"బావుంది నేనేదో సరదాగా అనుకుంటే ఇప్పుడే మిమ్మల్ని తెప్పించమన్నానా?"

"నీకు సరదాగా ఉంది కదూ! పోనీ చూద్దాం టౌనులోనన్నా ఉండక పోతాయా? వెంకన్నను పిలు."

అత్తయ్యా, నేను కూడా ఆశ్చర్యపోయాం—

ఈ వర్షంలో— ఈదురు గాలిలో— టౌన్— ఏడెనిమిది మైళ్ళు —

వెంకన్నని పిలవమంటే ఏమిటాశ్చర్యం?"

"చాల్లెండి. ఏదో శాస్త్రం చెప్పినట్టు ఉంది. ఇప్పుడు పువ్వులు లేక పోతే కాదా? వర్షంకూడా ఎక్కువవుతోంది. పాపం వాడెలా వెళతాడు?"

"వాడు వెళ్ళలేనంటే నేనే వెళతాను. ముందు వాణ్ణి పిలు."

అత్తయ్య ఎంత బ్రతిమాలినా మామయ్య వినలేదు. చివరికి అంది —"ఇప్పుడు పువ్వులు తెచ్చినా నేను పెట్టుకోను."

"అదీచూద్దాం. కావాలనటం - ఒద్దనటం నీ యిష్టమే కాబోలు." నవ్వాడు మామయ్య. ఇక చెప్పేదేముంది? - ఐదురూపాయల ఖర్చుతో వెంకన్న టౌనువెళ్ళి పది గంటల రాత్రికి నూటపాతిక మల్లెపువ్వులూ ఓ అరడజను ఎర్ర గులాబీలూ తీసుకు వచ్చాడు. మర్నాడు అత్తయ్య నడిగితే ఆ సంగతి చెప్పి, నవ్వుతూ అంది—"మీ మామయ్య రసికత్వ మంతా నువ్వు నేర్చుకో,"

అర్థంకాకపోయినా వూరుకున్నాను.

"కాని —అటువంటి మామయ్య అత్తయ్యని కోపంతో పంపించేశా డంటే—వాళ్ళిద్దరూ వేరై పోయారంటే-ఎలా నమ్మటం వదినా? అదే నిజమైతే ఏమిటి కారణం?"

ఇందిర తల పంకిస్తూ అంది—"చిత్రంగానే ఉంది."

* * *

భోజనం కాగానే మధు హాస్పిటల్‌కి బయల్దేరాడు. ఇంటికి వెళ్ళ టానికి సిద్ధంగా ఉన్న కేశవరావు మధుని చూసి ఆగిపోయాడు- "ఎప్పుడ్రా రావటం? కులాసా? ఎప్పట్లాగే పల్కరించాడు నవ్వుతూ

"రాత్రే వచ్చాను మామయ్యా! ఉదయం వద్దామనుకొంటే మా వదిన గుడికి తీసుకెళ్ళమంది."

"కూర్చోముందు, ఏమిటి విశేషాలు? తను ఓ కుర్చీలో కూర్చుంటూ మధుకి కుర్చీ చూపించాడు.

"అవ్వే! ఏమున్నాయ్? ఎందుకో మునుపటిలా మాట్లాడలేక పోతున్నాడు మధు.

"ఊఁ ఎలా రాశావు పరీక్షలు ?"

"ఫర్వాలేదు."

సంభాషణలో ఎన్నడూ ఎరగని వెల్తి ఏదో అనుభవమవుతోంది ఇద్దరికీ. కొంత సేపటికి కేశవరావు అన్నాడు.

"అయితే నీకు కొత్త విషయమేమీ తెలీదా ?"

"కొత్తదా ? ఏమిటది ?"

"ఎందుకురా, దాస్తావ్ ! నా గురించి ఏమీ వినలేదూ?"

"అదా! దానికేంలే ? పుకార్లు పుడుతూనే ఉంటాయి."

"పుకారు కాదులే. నిజమే."

మధు మాట్లాడలేదు.

"మీ అత్తయ్య పుట్టింటికి వెళ్ళిపోయింది."

మధు వెంటనే అడిగాడు—నువ్వే వెళ్ళిపొమ్మన్నావా ?"

"ఏదైనా ఒకటే— సామరస్యం లేకపోయాక" మధు కేశవ రావు మొహంలోకి చూడలేక కాంపౌండు గేటుమీదికి దృష్టి సారించాడు.

కేశవరావు నెమ్మదిగా అన్నాడు – "రుక్మిణి వెళ్ళిపోతోంటే చూస్తూ వూరుకోవటం తప్పనిసరైంది మధూ!"

"ఇంటికి వెళ్దాం లే మామయ్యా ! నువ్వు భోజనం కూడా చెయ్య లేదు కాబోలు— తర్వాత మాట్లాడుకోవచ్చు." మధులేచి నిలబడ్డాడు. కేశవరావు మౌనంగా లేచాడు.

అత్తయ్య లేని ఇల్లు బోసిగా, కాంతి విహీనంగా ఉన్నట్టుతోచింది మధుకి. ఇంట్లోసామానంతా చిందర వందరగా ఉంది. పడగ్గది ఏదో సామాను కొట్టులా తయారైంది. పరుపుమీద దుప్పటి మాసిపోయి, అద్దం నిండా మరకలుపడి, గోడలన్నీ దుమ్ము కొట్టుకుని ఛ! ఏం చేస్తున్నారీ పనిమనుషులు ? చెప్పి చేయించుకోవటమైనా తెలీలేదా మామయ్యకి ?

కేశవరావు భోంచేస్తూంటే పక్కనే కూచున్నాడు మధు. వంటిల్లు జిడ్డు కట్టుకుపోయింది. మౌనంగా పరికించటం తప్ప ఏమీ మాట్లాడ

లేదు మధు. భోజనం కానిచ్చి గదిలోకివచ్చి అలమారులోంచి వెండి డబ్బా తీస్తే వక్కపొడి కాస్తా నిండుకొంది.

"అరె! వక్కపొడి తెప్పించాలని ఏరోజుకారోజు మర్చిపోతు న్నాను."

"పోనీ వెంకన్నని పిల్చి ఇప్పుడే తెప్పించరాదూ ?"

"వాడెక్కడికో పోయాడు. ఆ పని వేళ వరకూ ఎక్కడో తిరుగు తూంటాడు. సాయంత్రం చూద్దాంలే."

మధు మౌనంగా టేబుల్ మీది పుస్తకాలు తిరిగేస్తూ కూర్చున్నాడు.

"ఏం మధూ అంత మౌనంగా వున్నావ్ ?"

"అబ్బే ? ఏం లేదుమామయ్యా ?"

"నామీద నీకు కోపంగా ఉందికదూ ?"

"మధు కొంచెం నవ్వాడు— "ఎందుకు!"

"ఏమికేమిటి ? అందరూ ఎందుకు తప్పు పడుతున్నారో అందుకే."

మధు పుస్తకాలు మూసేసి కేశవరావు మొహంలోకి చూస్తూ అన్నాడు—"కాని.... .. ఎందుకలా చేశావు మామయ్యా ?"

కేశవరావు కొంతసేపు మౌనంగా ఉండిపోయాడు.

"నేను రుక్మిణిని ఎంత ప్రాణంగా చూసుకున్నానో చిన్న వాడివైన నువ్వూ గ్రహించే ఉంటావు మధూ! అయినా తను-నన్ను సరిగా అర్థం చేసుకోలేక పోయింది."

ఒక్కక్షణం ఆగి మళ్ళీ అన్నాడు — "అర్థంచేసుకోలేకపోతే పోనీ! అపార్థం చేసుకుని వేధించటం మొదలుపెడితే ఏం చెయ్యగలను' చెప్పు!"

కేశవరావు మధు మొహంలోకి చూశాడు. మధుకి సంగతేమీ అర్థమవుతూన్నట్టు లేదు. అయోమయంగా చూస్తూ కూర్చున్నాడు.

"చిన్నవాడివైనా మా దాంపత్య రహస్యాలు నీకు చెపుతున్నాను మధూ! ఎప్పటికప్పుడు నీకు ఉత్తరం రాయాలని మనసు ఆరాట పెడు

తున్నా సాహసించి రాయలేక పోయాను. అందరిలా నువ్వు నన్నేం అస హ్యించు కుంటావోనని మధనపడుడూనే ఉన్నాను."

"అసలు నేను మొదట ఈ విషయం నమ్మలేదు మామయ్యా! కాని ......."

"నేను డాక్టర్ని. వృత్తి ధర్మాన్ననుసరించి నాకు ఆడవాళ్ళు — మొగవాళ్ళు — పడుచువాళ్ళు— ముసలివాళ్ళు — అనే భేదాభిప్రాయాలేమీ ఉండ కూడదు కదా ? ఎవరితో మాట్లాడటానికైనా నాకు ఆటంకాలు ఉండవు."

"అయితే ?" అన్నట్లు చూశాడు మధు.

రుక్మిణికి నేనంటే భర్తగా పూజ్యభావమేగాక ప్రియుడిగా అంతు లేని అనురాగం. దానికి నేను పరవశత్వంలో మైమరచిపోయిన క్షణాలు ఉన్నాయి. కాని ఏ అనురాగమైనా మోజుగా మారి మనిషిని మూర్ఖు రాల్ని చేస్తే భరించటం ఎలా?"

"............"

"నేను నిష్కల్మంగా ప్రవర్తించటం లేదనీ — నా స్నేహాలేవో రహస్యంగా సాగించుకొంటున్నాననీ---రుక్మిణి అనుమానం."

మధుకి ఆశ్చర్యం కలిగింది— "నీ మీదే అత్తయ్యకి అనుమా నమా ? ఎన్నాళ్ళనుంచి ?"

"ఖచ్చితంగా చెప్పాలంటే పెళ్ళయిన కొత్త నుంచీనూ — నేను ఎన్నో విధాల చెప్పాను. ప్రమాణాలు చేశాను. ఫలితం కనుపించలేదు. అప్పటికప్పుడు సరిపెట్టుకున్నా తన అనుమానాలు పూర్తిగా వదులుకునేది కాదు. హాస్యానికైనా వెళ్ళ గక్కుతూ ఉండేది ...ఆ మధ్య మరీమూర్ఖంగా వేధించింది. చీకటి పడితే బయట ఉండకూడదు. పనిమనిషితోనైనా నవ్వుతూ మాట్లాడ కూడదు. ఆడవాళ్ళ విషయమై నేను ఎక్కువగా పుస్తకా లవీ తెచ్చి, బొమ్మలవీ చూసి సరదా పడకూడదు — శంకించే మనసుకి ఎన్ని ఆధారాలయినా దొరుకుతాయి—రుక్మిణిని బాధ పెట్టటం నాకు ఇష్టం లేదు. తను సంతోషంగా నవ్వుతూ తిరిగితేనే నాకూ సంతోషం — నా శక్తి ఉన్నంతవరకూ ఆచరించగలను. హద్దులు మీరితే ఏం చెయ్యను!

రుక్మిణి అనుమానాలకూ, నా ఉద్యోగ ధర్మాలకు ఎక్కడా పొత్తు కుదర లేదు. క్రమంగా తనే తెలుసుకొంటుందని ఊరుకున్నాను."

"...... ......"

"ఈ విషయాలలో ఇద్దరం అప్పుడప్పుడూ ఘర్షణ పడుతూనే ఉన్నాం — అయినా ఎప్పుడూ ఇంతవరకూ రాలేదు — ఒకరోజు మధ్యాహ్నం నేను గదిలో పడుకుని ఉన్నాను. ఆ రోజు హాస్పిటల్ కెళ్ళ లేదు—నిద్రపోకుండా ఏవో కొత్త పత్రికలు చూస్తున్నాను.

"డాక్టరుగారు ఉన్నారండీ ?" అని ఎవరో స్త్రీ అడగటం—

"నిద్రపోతున్నారు. యిప్పుడు లేవరు-"అని రుక్మిణి చెప్పటం వినిపించాయి. నేను చటుక్కున లేచి వెళ్దామనుకున్నాను. రుక్మిణి ఏం చేస్తుందో చూడాలని ఆగిపోయాను.

"రాత్రంతా నిద్రలేదు తల్లీ ! ఈ పాడు దగ్గు పడుకోనివ్వలేదు. ఆస్పత్రికెళితే డాక్టరుగారు రాలేదన్నారు. ఆ బాబుని అడిగి ఒక్కబిళ్ళ యినా మింగకపోతే రాత్రికి ఆయాసంతో చచ్చిపోతానమ్మా ?"

"అయితే ఏం చెయ్యమంటావ్ ? లేపమంటావా ?" కటువుగా అంది రుక్మిణి.

"ఎంతమాట తల్లీ ! ఇక్కడే కూర్చుంటాను. ఆ బాబుని నిద్ర పోనివ్వండి."

"బాగానే ఉంది. రేపు హాస్పిటల్‌కి వెళ్ళరాదూ ?" నాకు కోపం ముంచుకు వచ్చింది. విసురుగా పుస్తకం టేబుల్ మీదికి విసిరి చప్పుడు చేశాను.

రుక్మిణి నెమ్మదిగా గదిలోకి వచ్చింది. ఏమీ చెప్పలేదు. దగ్గరికి వచ్చి కూర్చుంటూ అంది — "చదువు అయిందేమిటి ? గిరవా టేస్తున్నారు."

"బద్ధకంగా ఉంది పడుకోవాలి."

రుక్మిణి మౌనంగా దోమతెర దించుతోంది.

"నాకోసం ఎవరయినా వస్తేలేపు. ఫర్వాలేదు."

"అంత ప్రాణాలమీదికేం వచ్చి పడింది ? వెనక్కి పోతారు. మళ్ళా వస్తారు."

"పాపం ఏదో ఆశ పెట్టుకు వస్తారు. పొమ్మనటం ఏమిటి ?"

"అలాగే. పడుకోండి—అదేం ? లేస్తున్నారు ?"

"బాత్‌రూంకెళ్ళాలి." నేను గది వెనుక తలుపు తీసుకొని దొడ్లోకి వెళ్ళాను. వచ్చేసరికి చెప్పింది-

"మీకోసం ఎవతో వచ్చింది."

"ఎప్పుడు?"

"ఇప్పుడే - మీరలా దొడ్లోకి వెళ్లాక."

"అది సరేగాని—ఏమిటంత అసభ్యంగా మాట్లాడుతున్నావ్ ?"

"మరేం ఫర్వాలేదు— సభ్యతగా ఉన్నవాళ్ళసంతే కదా తప్పు?"

అప్పటికి వాదించ దల్చుకోలేదు. టవల్ బుజాల మీదుగా కప్పుకుని హాల్లోకి వెళ్ళాను. - బల్లమీద కూర్చున్న ఆ మనిషి అనుకోకుండా నా రాకచూసి తడబడుతూ లేచి చేతులు జోడించింది.

"నమస్కారంబాబూ!"

"నమస్కారం తల్లీ! కూర్చోండి. మీరు వచ్చి చాలాసేపయింది కదమ్మా ?"

"లేదు బాబూ! ఇప్పుడే. తమరు నిద్రపోతున్నారని అమ్మగారు చెప్పారు"

"ఆ అమ్మగారే నన్ను లేపితే వచ్చాను."

రుక్మిణి గదిలోకి వెళ్ళే గుమ్మంలో నిలబడి ఉంది.

"నేను కూర్చుని ఉందునుకదా తల్లీ! బాబుగార్ని ఎందుకు లేపావమ్మా!"అంటూ నొచ్చుకుందావిడ. సన్నగా — పొట్టిగా - బక్కపలచగా పాలి పోయిన శరీరంతో నీరసంగా - నలభై సంవత్సరాల వయస్సు ఉండే ఆవిడను చూస్తోంటే, నా కెందుకో బాధ వేసింది. రుక్మిణికి ఏదో కృతజ్ఞత చూపించాలని ఆవిడ తాపత్రయ పడిపోతోంది - తన గురించి రుక్మిణి ఎంత చెడ్డగా వూహిస్తోందో తెలిస్తే ఏమైపోతుందోమరి?

ఆవిడ జబ్బు వివరాలవీ అడిగి చీటీరాసి ఇచ్చాను. కాంపౌండర్‌కి చూపించి హాస్పిటల్‌లో మందు తీసుకోమని చెప్పాను – ఆవిడ మా ఇద్దరికీ దణ్ణాలు పెట్టి వెళ్ళిపోయింది – నేను లేచి గదిలోకి నడిచాను. రుక్మిణీ మౌనంగా నిలబడింది. తలుపు దగ్గరే.

"రుక్మిణీ !"

తల తిప్పి చూసింది.

"నువ్వు ఒక డాక్టర్ భార్యవి ! ఇంటికి వచ్చిన వాళ్ళని మర్యాద చెయ్యాల్సిన బాధ్యత నీది.

"ఇప్పుడు నేనేం చేశాను?"

"ఏం చేశావో తెలుసు. ఎందుకు చేశావో కూడా తెలుసు – ఇక ముందెప్పుడూ నా మర్యాద మంట గలపవద్దని మరోసారి చెపుతున్నాను."

"............"

"నీ అనుమానాలు ఎలా పోతాయో అర్థంకావటం లేదు. ఉద్యోగానికి రిజైను చెయ్యమంటావా ! అడుక్కు తినమంటావా ?"

"ఏమిటా మాటలు !"

"లేకపోతే ఏమిటి ! జీవితం పొడుగునా మనసుల్లో బరువులు పెట్టుకు కుళ్ళిపోడూ చివరిదశలో విచారిద్దాం. కాని – అప్పటికేమీ మిగలదు, బూడిదే ! తెలుస్తోందా ?"

"బాగా తెలుస్తోంది. ఇక నన్ను మభ్యపెట్టలేరుగాని వూరుకోండి."

ఆ తర్వాత మా ఇద్దరికీ పెద్ద ఘర్షణ జరిగింది. చివరికి అన్నాను —"ఈ అనుమానాలతో నువ్వు నా దగ్గిర ఉండలేవు. ఇద్దరికీ శాంతి ఉండదు వెళ్ళిపో."

"చాలా సంతోషం. ఇక్కడీ నికృష్టపు బ్రతుకు బతికేకన్నా మరెక్కడికైనా పోయి ఉండచ్చు"—అంతే. తన పంతం మార్చుకోలేదు– నేనూ వారించలేదు. ప్రయాణమై పుట్టింటికి వెళ్ళిపోయింది– నేను తనని బతిమిలాడుతానని–తను లేకుండా నేను ఉండననీ అభిప్రాయపడి అంతదూరం వెళ్ళనిచ్చింది— ఇప్పటికీ మామధ్య ఒక ఉత్తరంకూడా నడపలేదు" కేశవరావు మధు కళ్ళలోకి చూస్తూ అడిగాడు —

"చెప్పు మధూ! నేను తప్పు చేశానా ?"

ధ్యాసగా వింటున్న మధు తేరుకుని కొంచెం నవ్వాడు — "నీకు చెప్పేంతటి వాడినా మామయ్యా!"

"అలాకాదు, నీకేం తోచిందో చెప్పు."

"నీ తప్పేంలేదు మామయ్యా! అత్తయ్యే కొంచెం తెలివి తక్కువగా ప్రవర్తించింది. దానికి కారణం లేకుండా ఉండదు."

"సమర్థిస్తున్నావా నువ్వు!"

"ఎందుకు సమర్థించను ? తప్పుచేసిన వాళ్ళని ఎంతకాలం అసహ్యించుకుంటాం ? అత్తయ్యని నువ్వు అమితంగా అభిమానించావు. అపారంగా ప్రేమించావు నీ మనస్సులో మహోన్నతమైన స్థానం ఇచ్చావు— అంతటితో నీ బాధ్యత తీరిపోయిందా ? అత్తయ్య తనకు లభించిన స్థానం శాశ్వతం చేసుకోవాలనీ, నీ అనురాగం నుంచి ఏనాటికీ తను దూరంకాకూడదనీ తాపత్రయపడింది. అందుకే అమాయకంగా ప్రవర్తించి దొరికిపోయింది. ఆ అమాయకత్వాన్ని నువ్వే భరించలేకపోతే ఎలా మామయ్యా ?"

"అదిపేరే సంగతి మధూ! నా సహనానికైనా అవధులు ఉన్నాయి కదా ? — తనకి అంత స్వార్థం పనికిరాదు."

"స్వార్థం లేకపోతే జీవితమే లేదు మామయ్యా! అంత త్యాగమే ఉండి స్వార్థం లేనినాడు మనిషి కష్టాల పాలై పోతాడు."

"నువ్వు పక్షపాతంగా మాట్లాడుతున్నావు మధూ! రుక్మిణిని ఇంతగా సమర్థించటంలో అర్థమేలేదు."

"సరే! నీ నిజాయితీ ఏమిటి! నీకేవో స్నేహాలు ఉన్నాయంటున్నారు. అదికూడా నిజమేనా ?"

"ఎందుకు కాకూడదు ? అన్నీ నిజమే."

"మామయ్యా!" మధు దెబ్బతిన్నట్టు చూశాడు.

"నిజం మధూ! నేను తప్పు చేస్తున్నానని తెలిసే చేస్తున్నాను."

మధు శిలా ప్రతిమలా మాట్లాడలేకపోయాడు.

"రుక్మిణి ఉన్నంతకాలం నేను నిప్పులాగే ఉన్నాను. నా నీతి నిజాయితీలు నా భార్యే నమ్మలేక పోయింది. నా మీదకు ఎలాగూ నింద వచ్చింది. ఇంక నా నీతికి అర్థమేమిటి? నన్ను చూసి ఎవరు సంతోషించాలి! నా వ్యక్తిత్వాన్ని ఎవరు గౌరవించాలి? ఏదీలేదు. నా మంచి చెడ్డలూ లేవు—"కేశవరావు దీర్ఘంగా నిట్టూర్చాడు.

మధు తమాయించుకోవటానికే కొంతసేపు పట్టింది — బాధగా అన్నాడు "నువ్వు చేస్తున్నది నాకేమీ .... నచ్చలేదు మామయ్యా!"

"నీకు కష్టంగానే ఉంది కదూ మధూ?"

"కష్టంగానే ఉంది-" కొంచెం తీవ్రంగా అన్నాడు మధు — "ఉన్న మాట అనక తప్పదు నువ్వు మగవాడివి. మగవాడిలాగే ప్రవర్తించావు — నీమీద ఒక అపనింద పడినప్పుడు నీ కర్తవ్యం ఏమిటి? అది అబద్ధమని నిరూపించి నీ నిజాయితీ ఋజువు చేసుకుంటావా? —మనసు విరిచుకుని నీతి నియమాలు విసర్జించి ప్రతీకారం తీర్చుకుంటావా? ఒక్కటి ఆలోచించు మామయ్యా! అత్తయ్యనే నువ్వు అనుమానిస్తావ్ — అత్తయ్య నీలాగే చేసేదా? నువ్వు ఎలాగూ అననే అన్నావుగదా అని తన మాన మర్యాదలు పోగొట్టుకుని అసభ్యంగా ప్రవర్తించేదా? ఆలోచించు మామయ్యా!"

"మధూ! నేనే పొరపడ్డానంటున్నావా!"

అత్తయ్య చాలా మూర్ఖంగా ప్రవర్తించింది. అయితే నీ వివేక మేది? సంసారంలో ఒడుదుడుకులు సంభవిస్తే వాటిని సద్దుకోవలసిన బాధ్యత నీమీద మాత్రం లేదనుకున్నావా? అత్తయ్యని మనిషిని చెయ్యటానికి నువ్వు కాకపోతే ఎవరు ప్రయత్నిస్తారు?" మధు కొంచెంసేపు మౌనంగా వున్నాడు.

"మామయ్యా! మీ దాంపత్యంలో పరిపూర్ణత వెలితి పడింది— పవిత్రతే నశించిపోయింది." మధు మథనపడిపోయాడు. కేశవరావు మాట్లాడలేదు.

చేదు చరిత్ర విన్నట్టు మధు మనస్సు కలతబారిపోయింది — జీవితంలో ప్రతీ ఒక్కరికీ ఒక్కో సమస్య ! దాని పరిష్కారం తప్ప అన్నీ తెలుస్తాయి.

స్త్రీ జీవితంలో ఉన్నతమైనది మాతృస్థానం ఒక్కటే. బిడ్డలు నిరసించినా మాతృస్థానం మారదు. కాని భర్త నిరసించినప్పుడు భార్య స్థానానికి విలువలేదు. కొడుక్కి తల్లి ఒక్కతే ! కాని భర్తకు — భార్యలు చాలమంది. క్షణ క్షణానికీ ఊగిసలాడే భార్యస్థానాన్ని నిలుపుకోవటానికి స్త్రీకి వివేకం కావాలి. అదే రుక్మిణిలో లోపించింది — భర్త సక్రమంగా ఉన్ననాడు అర్థం చేసుకోలేక పోయింది. విసర్జించి పోయిననాడు అతను అక్రమాలకు తలపడ్డాడు—పిచ్చి రుక్మిణి ఏం సాధించ గలిగింది ?

మధు హఠాత్తుగా అడిగాడు — "మురళి ఎక్కడున్నాడు ?"

"చదువుకొంటున్నాడు. కాన్వెంటులోనే."

"సరళ"

"వాళ్ళమ్మ దగ్గర."

"మామయ్యా ! నా అనుభవంతో చెప్తున్నాను, బిడ్డలకు తల్లిదండ్రుల లోటుకన్నా నికృష్టమైంది మరొకటి లేదు—వాళ్ళభవిష్యత్తయినా మీరు ఆలోచించకపోవటం మూర్ఖత్వం"—మధుకి కోపం వచ్చింది. లేచి నిలబడ్డాడు. కేశవరావు ఏదో అనబోయే సరికి రామ్మూర్తి గేటు తీసుకొని దగ్గుకొంటూ వచ్చాడు—"రాత్రి దగ్గు మరీ ఎక్కువయింది బాబుగారూ, పడుకోనివ్వకుండా నిద్రేసిందండి !" అన్నాడు దగ్గుతూనే — "పొద్దున్న వచ్చి తమ దర్శనం చేసుకుందామంటే మాయదారి చుట్టాలు నా ప్రాణాల మీద కొచ్చి పడ్డారు. వాళ్ళందర్నీ పేరు పేరునా పలకరించి మర్యాదలు చేసేసరికి ఈ వేళయింది. ఆస్పత్రికి పరిగెత్తుకుపోతే తమరు లేరు"— అంటూ సోది చెప్పుకొచ్చాడు.

కేశవరావు వివరాలన్నీ తెలుసుకొని చీటీ రాసి యిచ్చాడు — అది అందుకొని వెళుతూ రామ్మూర్తి మధుకేసి చూసి ఇకిలించాడు —"పెద్దవాడివై పోయావయ్యా ! గుర్తున్నానా ?"

"ఏదో లెండి."

"ఏదో అంటే ఎలాగ ? మీ ఆవిడ డాక్టరమ్మ చదువుతుందట. నువ్వు కూడా అంతకుమించి చదువుకోవద్దూ ?"

మధుకి ఒళ్ళు మండింది — "రామ్మూర్తిగారూ! ఇది మీ ఇల్లు గాదు, మా ఇల్లుగాదు, డాక్టరుగారిల్లు. తర్వాత మాట్లాడుకుందాం, వెళ్ళి రండి." రామ్మూర్తి మాడ్చుకున్న మొహంతో వెళ్ళిపోయాడు.

"ఈయనే కదూ వదినగారిమీద కేసు పెట్టాడు. ఏమైంది?"

"అందుకే కొత్తగా దగ్గు పట్టుకుంది. విశ్వనాథం మాట విని సర్వనాశనమైపోయానని ఇప్పుడేడుస్తున్నాడు."

"మామయ్య అప్పు?"

"నెత్తిమీద చేతులు."

"వస్తామామయ్యా ! సాయంత్రం మళ్ళా వస్తా."

మధు లేచాడు — "మా అమ్మమ్మని చూడనేలేదు .. మా చిన్న [illegible] మళ్ళా మొగపిల్లవాడటగా ? అక్కడేఉంది. వస్తుందేమో ! వెళతా మామయ్యా !"

దారిలో సీతాపతి కన్పించాడు. ఎప్పుడు కన్పించినా మధుని ఆప్యాయంగానే పలకరిస్తాడు. మధుకూడా సీతాపతితో ఇష్టంగానే మాట్లాడతాడు.

మామూలు పలకరింతలు అయ్యాక మధు నవ్వుతూ అన్నాడు — "కృష్ణుడికి తమ్ముడు పుట్టాడట."

"అవున్రా ! చూద్దువుగాని రాకూడదూ ?"

మధు చిత్రంగా చూశాడు.

"ఎన్నాళ్ళురా ఈ పంతం ? నీ కసికొద్దీ తిట్టావుగా ? ఇంకా దేనికి కోపం ?"

"నాకు కోపమేమిటి మామయ్యా ? అందులోనూ మీ మీద అచ్చే !"

"నీ వెటకారాలకేంలేరా ? తిట్టుకున్నవాళ్ళం తిట్టుకున్న పోతామా ? ఒక్కసారి రద్దూ ! సరదాగా కాస్సేపు కూర్చుని

"వస్తాలే. ఇప్పుడుగాదు. మా వదిన నాకోసం ఎదురు చూస్తూ వుంటుంది. బజ్జీలో ఏవో చేస్తోంది, తొందరగా వచ్చెయ్యమంది."— 'మీ ఇంట్లో వున్నంతకాలం నన్ను లెక్క చెయ్యకపోయినా ఈనాడు నా కోసం మా వదిన తహతహ లాడుతోంది సుమా!' అని మధు మాటలు చెప్పక చెపుతున్నాయి.

సీతాపతి మరేం మాట్లాడలేదు కాస్సేపు. "సరేలే నీ యిష్టంవచ్చి నప్పుడు రా! నీ పంతం నీదే" నవ్వాడు.

మధు ఇంటికి వచ్చేసరికి సుందరమ్మగారూ! సూర్యం, ఇందిరా మాట్లాడుకొంటున్నారు. మధు రాకతో వాతావరణం వుల్లాసంగా మారింది. మాటలమధ్య మధు అన్నాడు — దారిలో చిన్నమామయ్య కన్పించా డమ్మమ్మా! వాళ్ళింటికి రమ్మన్నాడు ఇప్పుడు రానని వచ్చేశాను."

"ఎన్నాళ్ళురా నీకీ తిక్క! మనలో మనం అనుకుంటాం, [illegible]. ఓసారి వెళ్ళి చిన్నత్త కొడుకుని చూసిరా! బావుంటుంది" అంది సుంద రమ్మగారు.

"ఇదంతా ఉత్త ఆర్భాటం లెండి రూ! ఇంటల్లుడు కదా? ఆ మాత్రం పెట్టుచేస్తున్నాడు"— నవ్వింది ఇందిర.

"అవును. అదొక్కటే తక్కువ."

"మధూ! సూర్యం కొంచెం కోపంగా చూశాడు—అలా మాత్రం ఎప్పుడూ పెంకితనం చేయకు ఈ పెళ్ళి జరిగి తీరాల్సిందే."

సుందరమ్మగారు అంది .. "మీ అమ్మకు చివరికోరిక అంటూ ఏదైనా వుంటే ఇదేరా! మీ చిన్న తనంలో జరిగిన గొడవలకీ ఈ పెళ్ళికీ సంబంధం ఏమిటి! మీరూ మీరూ కలిసి మెలిసి వుండాలంటే ఇదొక్కటే దారి."

ఇందిర హాస్యంగా అంది—"ఏం మధుబాబు కబుర్లు నిజమే అను కుంటున్నావేమిటి? ఆ పిల్లతో ఎప్పుడెప్పుడు మాట్లాడాలా అని తెగ ఆరాట పడిపోతూంటేను."

"చాల్లే వదినా!" మధు కోపం నటించాడు.

సుందరమ్మ గారు మధుని దగ్గిర కూర్చోబెట్టుకుని మామూలు విషయాలన్నీ అడుగుతూ కూర్చుంది. "అయితే నాయనా! నీ తి.డి. హోటలు వాడు యాభై రూపాయిలు తీసుకుంటున్నాడట .... అన్నయ్య చెప్పాడు నిజమే ?" అంది ఆశ్చర్యంగా.

"అవునమ్మమ్మా! అంతకన్నా తక్కువ వుండదు."

"ఎంత వెర్రి సన్యాసివిరా! నువ్వు తినే మెతుకులెన్ని ? పట్టుమని గుప్పెడుండవు."

మధు నవ్వాడు — "అభిమానంతో నువ్వాది అంటావుగానీ, నేను గుప్పెడు మెతుకులే తింటే గోవిందా కొట్టేద్దును."

"చాల్లే పిచ్చి వెధవా! గుప్పెడు గాకపోతే మరో గుప్పెడు. అంత మాత్రానికే యాభై రూపాయలా! హోటలు వాడిలో బేరం చెయ్యకూడదు ?—సిగ్గు పడుతున్నావో ఏమో! ఫర్వాలేదు. కాస్త జబర్దస్తీగా అడిగితే వాడే చచ్చినట్టు ఒప్పుకుంటాడు."

మధు నవ్వు ఆపుకున్నాడు "అయితే ఎంతయివ్వను?"

"ఇరవై రూపాయలిస్తే ఇద్దరికీ నష్టం వుండదు."

అమ్మమ్మకి ఐచ్ఛ జెప్పేసరికి తాతయ్య దిగివచ్చాడు.

సాయంత్రం మధు బయటకి వెళ్దామని బయల్దేరబోతుంటే కృష్ణుడు వచ్చాడు—మధు మొదట పోల్చుకోలేక తెల్లబోయాడు.

"ఏంరా అలా చూస్తావ్ ? నేను, వెంకట కృష్ణారావునోయ్! పోల్చలా ?" అన్నాడు కృష్ణుడు హాస్యంగా.

"ఓరి నువ్వట్రా? మొన్న అరనెల్లక్రిందటే చూశాను. ఇంతలో బడాజానవర్‌లా ఇలా ఎదిగి పోయావేంరా ? ఏమిటీ వేషం ?" మధు సంభ్రమంగా చూశాడు. కృష్ణుడు కర్రలా పొడుగ్గా ఎదిగిపోయాడు. ఎర్రగా పచ్చగా, గులాబీ తీగలా నిలబడ్డాడు. ఎగదువ్విన క్రాఫింగూ—టకప్ చేసిన షర్టూ—కళ్ళకీ సుర్మా--

"ఏంరోయ్! ఇంత నాజూకు చేస్తున్నావ్ ?"

"ఎన్ని మెయ్యకపోతే పొట్ట నిండుతుందిరా ?"

"ఏమిటి ఇలా దయచేశావ్?"

"తమ దర్శనం కోసం. నీవు ఎట్లుగా ? నే వయినా చూచిపోదా మని."

"చాలా ప్రేమ పుట్టిందే !"

"నన్నెందుకురా దెప్పుతావు ? మా ఇంట్లో అందరూ నీ కోసం ఎదురు చూస్తున్నారు - సవరణ — మా పెళ్లి కాదనుకో."

"ఆ వెలితి ఎందుకో ?"

"నీ బడాయితో పోటీకి — నువ్వు వస్తానన్నావటగా ? రాత్రి భోజనానికి తీసుకు రమ్మన్నారు నిన్ను."

"నన్నా ? భోజనానికా !"

"ఏంరా అంత ఆశ్చర్యం ?"

"కాదూ ! నన్ను మీవాళ్ళు భోజనానికి పిలవటం అపూర్వమైన విషయం. ఇంతకీ ఎవరేమిటి నన్ను రమ్మన్నది ?"

"అందరూనూ—అమ్మ, నాన్న, పెద్దమ్మ, పెదనాన్న,

"ఛా ! అబద్ధం ! మీ పెదనాన్న పిలాడూ ?"

"నమ్మవేమిట్రా ? పెదనాన్నకి నీమీదేం కోపంలేదు."

"ఉండనీవోయ్. ఎవరికి నష్టం ?"

సుందరమ్మగారు మధ్యాహ్నం నిద్రముగించి లేచింది. "ఎవరూ కృష్ణుడొచ్చినట్టున్నాడే !" అంటూ బయటికొచ్చింది.

"చూడు నాయనమ్మా ! వీడు మన ఇంటికి రమ్మంటే బెట్టు చేస్తున్నాడు." - ఫిర్యాదు చేశాడు కృష్ణుడు.

"అదేమిట్రా మధూ ! ఎప్పటికప్పుడు మర్చిపోవాలి గానీ ఇంత పట్టుదలా ? వెళ్ళి ఓసారి అందర్నీ చూసిరా. వెంటవుండి తీసికెళ్ళరా కృష్ణా !"

మధుకి చిరాకు వేసింది. మాట మార్చేస్తూ "దానికేంగాని నువ్వు ఈసారన్నా పరీక్షలు సరిగా రాశావురా కిష్టిగా ?" అన్నాడు నవ్వుతూ.

"ఆ పోనిద్దూ ! స్కూలుకీ-మనకీ అవినాభావ సంబంధం వుంది."

"నువ్వు నాకన్నా బుద్ధిగా చదువుకోటంలేదూ ?"

"నా చదువుకేంగాని మా సుధని బాగా చదివిస్తాండ్రా !" కృష్ణుడు మధు వేసి చూశాడు.

"మీరు చదివిస్తారా ? అది చదువుతుందా ? — అహ ! పూరికే అడిగాననుకో."

"నీ కబుర్లకేంగాని ఇంతకీ వస్తావా ? రావా ?"

"మీ తమ్ముణ్ని చూడాలి, వస్తాను. అంతేగాని భోజనం గీజనం— బొంతానై."

"నిన్ను లాక్కుపోవటమే నా డ్యూటీ! తర్వాత వాళ్ళేదో తగలడతాడు."

ఇల్లు దాటనిచ్చి మధు జేబులోంచి సిగరెట్ తీసి ఒకటి కృష్ణుడి తనూ అంటించాడు.

"ఇదెప్పటినుంచి రోయ్ ! నువ్వు బుద్ధిమంతుడివిగా?"

"ఇప్పుడు కాదు ?"

"మా ఇంటిదగ్గర కాల్చకుసుమీ ! పెదనాన్న చూస్తే తన్నగలడు."

"తన్నుకో గలడు. మనలో మాట. నువ్వు కాల్చవూ ?"

"మనలో మనమాట, నేనూ కాలుస్తాలే. రహస్యం."

"ముందు తోటలోకి పోదాంరా. చూసి చాలారోజులయింది."

"నోరు మూసుకొని పదరా ఇంట్లోకి. తోట షికార్లు తర్వాత."

వీధి మెట్లెక్కుతుంటే మధు శరీరం కంపించింది. అర్థంగాని అనుభూతేదో ఆవరించింది. ఆ మెట్లు దిగి రెండు సంవత్సరాలు దాటిపోయాయి. ఇంత సాదరస్యంగా తిరిగి వస్తానని కలలోకూడా అనుకోలేదు తను— దావిట్లో సావిత్రి చంటివాణ్నెత్తుకు నించుంది? రాధ మరో స్నేహితురాలితో బొమ్మలాడుకుంటోంది.

సావిత్రి సంతోషంగా సంభ్రమంగా చూసింది.

"ఎంతవాడివై పోయావయ్యా ! దొరబాబులా తయారయ్యేవు!" అంది.

మధుని చూసిన వాళ్ళందరూ ఆశ్చర్య పడటంలో అర్థంలేకపోలేదు. సన్నగా సూర్యకిరణంలా ఆకతాయిగా తిరిగే మధు — బలిష్ఠమైన అవ

యౌవనాలతో హుందాగా కన్పిస్తాడు. కళ్ళల్లో ఆ చురుకుతనం — నడకలో ఠీవి - మాటల్లో గాంభీర్యం మధు అలంకారాలు. చదువునేర్పిన సంస్కారం మధు ప్రవర్తనలో పువ్వునుంచి వెలువడే తావిలా అనుభవమౌతుంది.

మధు అంతకాలానికి సావిత్రిని చూస్తూంటే ఏమీ మాట్లాడలేక పోయాడు — మౌనంగా చంటివాణ్ని అందుకున్నాడు — కృష్ణకి పోలికే అత్తా!"

సావిత్రి నవ్వింది — "నిలబడే వున్నావు కూర్చో."

"పెద్దత్త లేదా?" పొడిగా అడిగాడు మధు.

"దొడ్లో ఏదో చేస్తున్నట్టుంది. వస్తుందిలే, కూర్చో". సావిత్రి చంటివాణ్ని అందుకుని గదిలోకి వెళ్ళింది.

"రాధా!" మధు తనకేసి వింతగా చూస్తున్న రాధని పిల్చాడు - "ఇలారా!"

రాధ సిగ్గుతో తుర్రున పరిగెత్తింది. మధు ఇల్లంతా కొత్తగా చూడసాగాడు.

"సుధ కోసమా బావా?" కొంటెగా అన్నాడు కృష్ణుడు.

"నీ హాస్యాలకేంగానీ నాకేమిటో బాగా లేదురా!"

"ఏం?"

"ఏమిటో మనసంతా గందరగోళంలా వుంది -" మధు అప్రయత్నంగా సిగరెట్ ముట్టించాడు.

"కిష్టా! మధు వచ్చాడటగా?"— విశ్వనాథం కంఠం వినిపించింది—విశ్వనాథం వచ్చేలోపునే మధు సిగరెట్ కుర్చీ క్రిందికి విసిరేశాడు.

"నిజంగా పెదనాన్నంటే నీకు భయమేనేమిట్రా?"

"ఏదో కాస్త భక్తి వుందిలే."

విశ్వనాథం వస్తూనే కుర్చీక్రింద పొగలు కక్కుతూన్న సిగరెట్ చూశాడు —

"ఓహో! చాలా పెద్దవాడివై పోయావ్!"

---

మధు ఏమీ మాట్లాడలేదు. చివరి సారి ఘర్షణ పడిన మామయ్యతో ఇన్నాళ్ళకేం మాట్లాడాలో తెలీలేదు—

"ఏంరా అలా చూస్తావ్ ?"

"ఇంకెలా చూడాలి మామయ్యా ?"

"నీకీ తలతిరుగుడు తలతోపాటు పోవాల్సిందే."

సీతాపతీ, పార్వతీ కూడా వచ్చారు. పరామర్శాలూ వగైరా ముగి శాయ్—సుధ మాత్రం ఎక్కడా కనిపించలేదు."

ఏవో మాటలమధ్య విశ్వనాధం అన్నాడు—"మా సుధని డాక్టర్ చదివిస్తాంరా ! ఆ మాటల్లో గర్వం—వ్యంగ్యం అర్థమయ్యాయి మధుకి

తాపీగా అన్నాడు— "ఓహో!"

సీతాపతి ఒక రకంగా చూశాడు—"ఏం నీ కిష్టంలేదా ?"

మధు నవ్వాడు—"అదేమిటి మామయ్యా ! చదివేది నీ కూతురూ —చదివించేది నువ్వూ — చదువు చెప్పేది మరొకళ్ళు — మధ్యనా యిష్టమేమిటి ?"

"నేను చెప్పలేదూ ? వీడికి తలతిరుగుడు తగ్గలేదు." విశ్వనాథం అదోరకంగా నవ్వాడు.

మధు విశ్వనాధాన్ని అనేక విధాల పరికించాడు. ఆ మనిషిలో తన మీద అభిమానం వున్న సూచనలు మధు కెక్కడా కన్పించలేదు—

"తల తిరుగుడూ కాదు. ఏమీకాదు. మామల్ని ఆ మాత్రం లట పట్టించవద్దా ఏమిటి ?" పార్వతి రెండు వెండి ప్లేట్లలో ఏవో ఫలహారాలు తెచ్చి మధు ఎదురుగా పెడుతూ అంది—"తినవయ్యా చాలా రోజు లైంది మా చేతులతో పెట్టి."

"ఏమిటిదంతా ?" తనకు జరుగుతూన్న సత్కారం ఆశ్చర్యం కలి గించింది మధు. ఇట్లోవాళ్ళంతా ఇంత సడన్‌గా మారి పోయారేమిటి ? ఈ పలకరింపులూ, ఈ మర్యాదలూ గమ్మత్తుగా వుందే "

"ఆఁ ఒరేయ్ మధూ!" విశ్వనాధం మధూ మొహంలోకి గుచ్చి గుచ్చి చూశాడు— "మీ డాక్టర్ మాధవి పెళ్లాం వదిలేసి పుట్టింటికి పోయిందట నీకు తెలిసిందా?"

చూడలేక పోయావ్ ?"

మధుకి అసహ్యం వేసింది — వయసొచ్చిన మనిషి, పరాయివాళ్ళ దాంపత్యాన్ని గురించి అంత అసహ్యంగా మాట్లాడితే — ఎలా సహించటం ? తీక్షణంగా చూస్తూనే అన్నాడు — "గోరంతని కొండంతలుగా చేసి చెప్పుకొని సంతోషించటం లోకులకి సహజమేగా మామయ్యా ! లోకుల్లో పుత్ర ప్రజ్ఞానికే అసూయపడే కాకులు చాలా ఉంటాయి. ఎవ్వరేం చెయ్యగలరు ?"

ఆ ధోరణి ఏదైనా గొడవకి దారితీస్తుందేమోనని భయం వేసింది సీతాపతికి. కాస్త కంఠం పెద్దదిచేసి — "ముందు టిఫిన్ తినరా మధూ." అంటూ అల్లుడికేసి చూశాడు.

"నీకు కాఫీ కూడా అలవాటు కాదోయ్.. తయారవుతుందిలే." — విశ్వనాధం కుర్చీలో చేరబడ్డాడు.

"మీరంత శ్రమ అక్కర్లేదు మామయ్యా ! ఇప్పుడే మా వదిన ఉప్మా చేసిపెడితే కడుపునిండా తిని వచ్చాను. మరేం ముట్టుకోలేను."

పార్వతి కొంచెం సిగ్గుపడంగా అంది — "మీ వదినలా మేమూ ప్రేమతోనే పెట్టాంలే."

"ఇంతమంది ప్రేమలు భరించే శక్తి నాకు లేదులే అత్తా!" — మధు హారాలేమీ ముట్టుకోలేదు — "ఇంటికి వచ్చినా పంతంగానే వున్నాడటే ?"

"తెలివి లేకుండానే డాక్టర్ అవుతావా ?"

"డాక్టర్ నవుతానని నీకు నేనేం చెప్పలేదు."

"మీవాళ్ళు చెప్పార్లే. నా వుద్దేశ్యం కూడా అదిగాదు."

"నా చదువుకి నీ వుద్దేశ్యం దేనికి ?"

"దేనికో వెళ్ళి మీవాళ్ళ నడుగు"

సుధ మాటలు దొరకనట్టు ఆగిపోయింది.

"బావుంది లెండి. మీ రిద్దరూ దెబ్బలాడుకునేలా వున్నారు. ..గా కబుర్లు చెప్పుకుందామంటే ఏమిటిది?" కృష్ణుడు విసుక్కున్నాడు.

సుధ నిర్లక్ష్యం మధుకి బాగా అర్థమైంది –

"మాష్టారు వస్తారటగా ?"

"అరుచుకుని అరుచుకుని పోతాళ్ళెద్దూ ! ఈ పూట మా అమ్మ పంపించేస్తుందిలే."

"అదేంకాదు. నేను పోతాను. ఇవ్వాళ ఇంగ్లీషు పద్యాలు అప్ప ..వాలి." సుధ విసురుగా లేచి నిలబడింది – ఎవ్వరూ వారించక పోవ ..డో అడుగులో అడుగు వేసుకొంటూ వెళ్ళిపోయింది. కన్పించేవరకూ చూ.. మధు తల పంకించాడు.

"పెద్దమామయ్య లక్షణాలే వచ్చినట్లున్నాయ్."

"మా పెదనాన్నకి సుధంటే భలే ఇష్టంలేరా ! దాన్ని డాక్టర్ చది వించేస్తాననీ, ఎవ్వరూ దానిముందు పనికిరారనీ కబుర్లు చెప్తూవుంటాడు."

"ఊ ఇంకా యింట్లో సంగతులేమిట్రా."

"మామూలే. నీమీద మాత్రం ఎవ్వరికీ కోపంలేదు."

మధు ఇంటికి తిరిగి వెళ్ళాక సూర్యంతో అన్నాడు.

"వాళ్ళ ప్రవర్తన చిత్రంగా వుందన్నయ్యా! ఎంత మర్యాదా ! ఎంత ఆప్యాయతా! ఏం చెప్పను ?"

"నిన్ను మంచి చేసుకోవాలనే వాళ్ళ తాపత్రయం." న అంది ఇందిర.

"చాల్లే వూరుకో—" సూర్యం కోపంగా అన్నాడు.

—"ఔను నిజమే అనుకుంటాడు — కాలం ఎప్పుడూ ఒక్కలాగే వుండిపోతుందా ?" సమర్థించాడు సూర్యం.

"పెద్ద మామయ్య మాత్రం ఎప్పటిలాగే ఉన్నాడనిపించింది."

"పోనిద్దూ ! ఎంతయినా పెద్దవాడు."

మధు తర్వాత ఇందిరతో చెప్పాడు — "సుశీల మాత్రం మహ గీరగా వుంది వదినా ! దాని స్టయిలూ అదీ చూస్తూంటే డాక్టర్ కాదుగాని ... యాక్టర్ అయ్యేలా వుంది."

ఇందిర నవ్వింది — "చిన్నతనం. పెద్దవాళ్ళలా నేర్పి పెట్టటం ఆ పిల్లేం చేస్తుందీ ? రేపు నీ పెత్తనం వచ్చాక చెవులు మెలిపెడుదువు గానిలే." మధుకూడా నవ్వేశాడు.

* * *

వేసంగి సెలవులు వుల్లాసంగా గడిచిపోయాయి. మధు జానకి పిన్ని దగ్గరికి వెళ్ళాడు. వెంకట్రావుబాబాయ్ జానకి పిన్ని అన్యోన్యంగా బ్రతుకుతున్నారు. పిన్ని కొడుకు బళ్ళో చేరి అ ఆ లు కూడా దిద్దు తున్నాడు. సుశీల అప్పుడప్పుడూ వచ్చి ఎప్పటివలె పిన్ని దగ్గర వుండి వెళుతుంది.

మధు సుశీలను చూసేందుకు సంస్థానానికి కూడా వెళ్ళాడు సెలవు లకు వచ్చినప్పుడల్లా శ్యామసుందరీదేవి దర్శనం చేసుకుని మరీ వెళ్ళటం పరిపాటే. పద్మావతి వివాహమై అత్తవారింటికి వెళ్ళిపోయింది. రాగిణీ బస్తీలో చదువుకుంటోంది — పెద్దచదువు చదువుకొంటున్న రాగిణిలో నవనాగరికత తాలూకు లక్షణాలేమీ లేవు—చిలిపితనం మాత్రం చిన్నప్పటి లాగే వుంది.

"మధుబాబూ ! మనం చిన్నప్పుడు ఛలే ఆడుకునే వాళ్ళంకదూ ? దొంగరాల ఆట జ్ఞాపకం వస్తే నాకు మరీ నవ్వొస్తుంది. ఇప్పుడు మళ్ళా మనం చిన్నపిల్లలమైపోయి తోటలో పరుగులెత్తితే ఎంత బావుంటుంది." అంటుంది ప్రతిసారి.

"నిజమే రాగిణీ ! అది సాధ్యమైతే ఎంతయినా బావుంటుంది." అంటాడు మధు.

మధు కలవరపడ్డాడు—"ఏమిటి మామయ్యా!"

"ఏమీ అనుకోవు కదూ ?"

"చిత్రంగా మాట్లాడుతున్నావు మామయ్యా!"

"నేను ఇన్నాళ్ళూ ఇంత పరిశీలనగా చూడలేదు. నీ పెదాలు చూడు ఎలా నల్లబడిపోయాయో!"

మధు గతుక్కుమన్నాడు—"ఛ! లేదే!"

"అదుగో, అద్దం. నా దగ్గరేనా నీ దాపరికం ?"

"సిగరెట్లు జోరుగా కాలుస్తున్నావుకదూ ?"

మధు ఇబ్బందిగా మొహం పెట్టాడు.

"మధూ! నీ తండ్రివంటి వాణ్ని అనుకో — మీ నాన్నే నిన్నీ పరిస్థితిలో చూస్తే మందలించకుండా వూరుకుంటాడా ? మా మురళినైతే నేను విడిచిపెడతానా ? అడిగానని నీకు కష్టంగా ఉంది కదూ ?"

మధు సిగ్గుపడ్డాడు—"లేదుమామయ్యా!"

"నీ వయస్సులో నేనూ ఎన్నో చిలిపి పనులు చేశానురా మధూ! ప్రతి వ్యక్తీ వయస్సు ప్రభావానికి లోబడి పోవటం సహజమేగాని ఆ వయస్సు దాటిపోయాక అనిపిస్తుంది ఏదైనా—దారి తప్పటం—తేలిక—తిరిగి దారిలో పడటం కష్టం అని."

"లేదు మామయ్యా! నేనేమీ చెయ్యలేదు." తన నిర్దోషిత్వం వెల్లడించుకోబోయాడు మధు.

కేశవరావు నవ్వి అన్నాడు — "సిగరెట్టు కాల్చటం ఏమంత మంచిపని కాదురా! మనల్ని ఉత్తేజ పరచేవాటికి తేలిగ్గా లొంగిపోతాం—దాని ఫలితం భవిష్యత్తులోగాని అర్థంకాదు—సిగరెట్లు కాల్చి క్షయ దగ్గులు తెచ్చుకున్నవాళ్ళు కొన్ని వందలమంది ఉన్నారు – నీకు తెలుసా ? మనం పశువులం కాదు—మనకు ఆలోచించగలిగే శక్తి, అర్థంచేసుకోగలిగే వివేకం ఉన్నాయి. ఇంత చిన్న విషయాన్ని రూపుమాపలేనప్పుడు మరే విషయానికైనా తేలిగ్గా వశంకావచ్చు — మనలో శక్తి సామర్థ్యాలు నశించి పోవటానికి ఇటువంటి చిన్నచిన్న విషయాలే చాలావరకు కారణం—ఇక ఆరోగ్యం మాట ? చెప్పుకోవలసింది కాదు — ఆర్థికంగా కూడ

ఇటువంటి చిల్లర పనులు మనకు సరిపడవు —రోజూ రెండు పూటలా ఓ గ్లాసెడు పాలు తాగు — అది వృథా అనగలవా ? మనం ఆరోగ్యంగా ఉండటం మనకోసమే కాదు మననుంచి బయల్దేరే సంతానం — మనలో నిండి ఉన్న దేశం అంతా ఆరోగ్యంగా ఉంటుంది— ఉపన్యాసం చదువు తున్నానని నీకు విసుగ్గా ఉందా ?"

"లేదు మామయ్యా !" మధు కొంచెం నవ్వాడు—

"చెప్పు" అన్నాడు.

"చెప్పటానికేముంది ? అంతా నీకు తెలిసిందే. కాకపోతే నన్ను నువ్వు మందలించటం, నిన్ను నేను మందలించటం ఇదో అభిమానం. నువ్వు అర్థం చేసుకోవటానికి ప్రయత్నిస్తావనే సుమా నా తాపత్రయం.

నీకో చక్కని కథ చెప్పనా ? విను.

నీలాగే—వయస్సులో కాలు మోపుతున్న ఓ ఆకతాయి, వాడి కెలాగో సిగరెట్లు కాల్చటం అలవాటైంది సిగరెట్ కేస్ మీద ఓ అడ్వర్టయిజ్‌మెంటు కన్పించింది. — "మహారాణీ కార్డుతో ఆడి చూడండి. మిమ్మల్ని జయలక్ష్మి వరిస్తుంది." అది పేక కంపెనీవాళ్ళ ప్రకటన. చూడగా చూడగా ఆకతాయికి ఆ పేక కట్టను కొనాలనిపించింది — అని పించటమేమిటి ? నాలుగు పెట్టెలు కొన్నాడు— పేకాటకి బాగా అలవాటు పడ్డాడు—

మరో రోజు పేక పెట్టెమీద ఇంకో అడ్వర్టయిజ్‌మెంటు చూశాడు — నిగ నిగలాడే బ్రాందీసీసా ! దాని క్రింద —"ఉమర్ బ్రాందీ, విస్కీలు సేవించండి, మీరు వూహాలోకాలలో విహరిస్తారు" ఇంకేముంది ? ఆక తాయికి బ్రాందీ తాగటం కూడా అలవాటైంది. పీకల్దాకా తాగి తూలుతూ జట్కాలో కూలబడ్డాడు.

"మంజువాణి ఇంటికి దయచేయండి. మీకు స్వర్గం చూపిస్తుంది. వాలు ఆకతాయిని ఓ వేశ్య గుమ్మంలో దిగవిడిచి చక్కాపోయాడు జ విసిరేసిన ఐదు రూపాయల నోటు అందుకొని. మన ఆకతాయి

మంజువాణీ భద్రుడై కూర్చున్నాడు. "నాకో నక్షత్రాల హారం కొని పెట్టరూ" అంది మంజువాణి గోముగా. అకతాయి కరిగి నీరై పోయాడు తలయినా అమ్మేసి ప్రేయసి కోరిక చెల్లిస్తానని కంకణం కట్టుకున్నాడు —ఆ రాత్రి మంజువాణి మరికొందరు స్నేహితులతో అకతాయినికూడా పంపింది. ఎక్కడికి! దొంగతనానికి! అకతాయి తెలిసే బయల్దేరాడు — డబ్బుకోసం.

తీరా ఇనప్పెట్టి తెరుస్తోంటే షావుకారు లేచిపోయి — "దొంగలు దొంగలు!" అంటూ గావుకేక లెట్టాడు. అంతేగాదు. అకతాయిని బలంగా వాటేసుకున్నాడు జట్టు గాళ్ళంతా పారిపోతే అకతాయి ఒక్కడే మిగిలాడు —ప్రాణభయం అకతాయిని మరేమీ ఆలోచించనివ్వకుండా చేసింది. పళ్ళతో షావుకార్ని కండలూడేలా కొరికి, చేతిలో సుత్తితో నెత్తిమీద "ఠకేలుమని" ఒక్కటి పెట్టి పిక్కబలం చూపించాడు — అయినా అక తాయి పోలీసులకు దొరికిపోక తప్పలేదు.

వింటున్నావా మధూ? — సిగరెట్టు— జూదం — త్రాగుడు వ్యభి చారం — దొంగతనం — హత్య ...ఒకదానితర్వాత ఒకటి అకతాయికి తప్పనిసరే అయ్యాయి.

నీకు నేనో కథ చెప్పాను. ఇందులో నీతి మాత్రమే గ్రహించు. అంతేగాని నేను నిన్ను అకతాయిగా వూహించటంలేదు."

మధు సూటిగా నిరభిమానంగా కేశవరావు కళ్ళలోకి చూశాడు. "నేను సిగరెట్లు కాల్చను మామయ్యా!"

"ఏమిట్రా మరీ డ్రామా ఫక్కీలో మాట్లాడుతున్నావ్! అప్పుడే ఇంత పశ్చాత్తాపమా?"

"పశ్చాత్తాపంకాదు మామయ్యా! నువ్వు చెప్పినట్లు వినాలని ఎప్పుడూ అనిపిస్తుంది."

"సడెన్‌గా మానలేవు క్రమంగా ప్రయత్నించెయ్యి. రోజు ... తగ్గించేస్తూ ఉండు."

"కాదులేమామయ్యా! పూర్తిగా మానేస్తాను."

కేశవరావు నవ్వాడు —"నీ పట్టుదల నీదేరా! సరే! నువ్వు

గలవంటే నాకు మరీసంతోషం. చూడు మధూ! ఉన్నత శిఖరాలపైదాకా ఎక్కాలంటే ఒక్కోమెట్టు ఎక్కితీరాలి. కాని క్రిందికి పడిపోవాలంటే ఒక్కదూకు దూకితే చాలు--- బాగుపడటం కష్టంగానీ పాడైపోవటం తేలిక మధూ! తల్లీ దండ్రీ లేని నువ్వు మురళికన్నా ఎక్కువ నాకు." కేశవరావు కంఠం వణికిపోయింది. మధు మనస్సు ఆర్ద్రమైపోయింది. "క్షమించుమామయ్యా! ఎప్పుడూ చెడ్డ పనులు చేయను." అప్రయత్నంగా అన్నాడు.

* * *

మధు పక్క చుట్టుకుంటూ ఇందిరను పిలిచాడు. "వదినా! నీ కిచ్చిన పుస్తకాలు చదివేశావా? ఇలా తిసుకురా! సర్దుకోవాలి."

ఇందిర పెట్టెతీసి పుస్తకాలన్నీ తెచ్చి పడేసింది — "తొందరగా తీసుకెళ్ళు బాబూ! అర్థం పర్థంలేని రాతలూ నువ్వూను" మధు దుప్పటి మడత పెట్టటం మాని ఆశ్చర్యంగా చూశాడు "ఏమిటీ? నీకీ పుస్తకాలు నచ్చలేదూ"

"అధునాతన సాహిత్యం అంటూ ఏది రాస్తే అది రాయటమేగాని ఏవీ పది సంవత్సరాలపాటు నిలవగలిగే కాదు నాగరికత వెర్రితలలు వేసిన ఫలితం మాత్రమే ఇవి."

"ఎంత తేలిగ్గా తీసి పారేశావు వదినా! నిత్యమూ మనం అనుభవిస్తూన్న జీవితాలనూ, మనకు ఎదురవుతూన్న సమస్యలను యథాతథంగా చిత్రించటం తప్పంటావా?"

"నువ్వు చెప్తున్న సహజత్వం ఈ పుస్తకాల్లో లేదయ్యా! ఊహా లోకాల్లో విహరిస్తున్నారీ అభ్యుదయ రచయితలు. చదివే వాళ్ళని విశేషంగా ఆకర్షించాలని చేసే ప్రయత్నం తప్పితే మరేం కన్పించదు."

"నువ్వు చెప్పింది కాదనను. కాని నువ్వు మొత్తంగా అభ్యుదయ రచనల్ని ఏవగించుకోవటం మంచిదికాదు. కుక్కపిల్లా! అగ్గిపుల్లకూడా కవితా వస్తువులేనట తెలుసా?"

"అయితే కుక్కపిల్ల అరిచిందనీ — అగ్గిపుల్ల వెలిగించినీనా రాయటం? అదే కాబోలు సహజత్వమంటే — ఎందుకొచ్చిన వావన

గానీ ఈ సారి మంచి పురాణ గ్రంథాలు తెచి పెడదూ! కాస్త పుణ్యమైనా వస్తుంది." మధు నవ్వి తాపీగా దుప్పటి విసిరేసి కూర్చున్నాడు— "పుణ్యం కోసమే కదూ పురాణాలు చదువుతావు?"

"పుణ్యం మాట దేవు డెరుగు. అవి చదువుతోంటే శాంతిగా ఉంటుంది."

మధు విస్తుపోయాడు — "నీకు శాంతిగా ఉంటుందా? నాకైతే పేజీకో లక్ష అనుమానాలు వస్తాయి."

"బుర్రలేకపోతేసరి."

"అది లేనిది నీకే. అలా గుడ్డెద్దు చేలో పడ్డట్టు చదువుకు పోతావు కాబోలు."

"మరి నీలా నేను చదువుకోలేదుగా? నీకేం అనుమానాలొస్తున్నాయో చెప్పు వింటాను."

"హాస్యానికి అన్నానుగాని వదినా! పాపం పురాణాల్లో ప్రతివ్రతల్ని చూస్తోంటే జాలేస్తుంది నాకు"

"ఎక్కడ నేర్చావ్ బాబూ ఇదంతా? నాకు మతి తప్పేలా ఉంది."

"మీ సిస్టర్ డాక్టర్ చదువు కుందటగా? బాగుచేస్తుందిలే."

"కొనబోయే ఆవు పెట్టబోయే పొట్లపాముని మేసినట్టే ఉంది".

"ఇంతకీ నీ కెలాంటి పుస్తకాలు కావాలి!"

"మంచివి."

"మంచివా?" మంచికీ నిర్వచనం ఏమిటి? సిగరెట్టు కాల్చటం నిన్నటివరకూ మంచి నాకు. ఇవాల్టినుంచి చెడ్డ."

"అబ్బో! నమ్మమనేనా?"

"మారిపోయాం. అంతే. నువ్వొకపని చెయ్యి వదినా— కేశవ్ మామయ్య లైబ్రరీలో కావలసినన్ని పుస్తకాలు. నీకు కావలసినవి తెప్పించుకుని జాగ్రత్తగా తిరిగి ఇచ్చేస్తూండు."

"పంచాయితీ లైబ్రరీ నుంచి తెమ్మని మీ అన్నగారిని బ్రతిమిలాడుకుని సంవత్సరంన్నర దాటింది.

"అయితే నేనే చందా కట్టేసి అన్నయ్యకి చెప్తానుండు. — పిన్ని అత్తయ్య వచ్చేస్తుందట గానీ వాళ్ళింట్లోవికూడా తెచ్చుకో."

ఇందిర దిగులుగా అంది — "నువ్వు వెళ్ళిపోతున్నావు. నాకేమి తోచదు మధూ! ఏదో పోగొట్టుకున్నట్టు ఉంటుంది."

"అనుమానం లేదు. నువ్వు రచయిత్రివై పోతావ్. రాయటం మొదలెట్టకూడదూ?"

"పోమ్మా! నీ కన్నీ హాస్యాలే. నా బెంగ నీ కర్థంకాదు."

"బాధపడకు వదినా! నేను వచ్చేటప్పుడు బిస్కత్తులూ, అగరొత్తులూ అన్నీ తెస్తాను తిందుగాని."

ఇందిర ఫక్కుమని నవ్వేసింది.

మధు రైలెక్కి చోటు చూసుకునేసరికి హడావుడిగా వచ్చాడు సీతాపతి — కవరొకటి మధుకి అందించబోయాడు. — "ఏమిటి మామయ్యా?"

"తర్వాత చూసుకొందువుగానిలే, తీసుకో."

"ఊహూ! ఏమిటో చెప్పు."

మధు పట్టుదల ఎరిగిన సీతాపతి చెప్పక తప్పలేదు.

"అబ్బే! ఏం లేదురా! ఓ యాభయ్ రూపాయలుంచేనూ ... తీసుకో. నీకే ఖర్చుకైనా పనికివస్తుంది."

"వద్దులే మామయ్యా! నా దగ్గిర డబ్బు ఉంది."

"నీ దగ్గిర లేదనేనా? ఎందుకైనా పనికివస్తుందని .."

"అక్కర్లేదు. ఇన్నాళ్ళూ ఎలా చదువుకుంటున్నానో — ఏమై పోతున్నానో పట్టించుకోని నువ్వు ఇప్పుడు వెయ్యి రూపాయలివ్వబోయినా నాకేం అవసరంలేదు."

సీతాపతి అనునయంగా అన్నాడు — "తీసుకోరా మధూ."

"వద్దు మామయ్యా! ఎందుకిక్కడ పబ్లిగ్గా ఈ గల్లంతు? అందరూ చూస్తారు - నీమీద నాకేం కోపంలేదు. నువ్వయినా ఈమాత్రం అభిమానిస్తావ్. అదే పదివేలు."

సీతాపతి మరేమీ మాట్లాడలేక కవరు జేబులో పడేసుకున్నాడు.

మధు కదిలుతూన్న రైల్లోంచి సీతాపతిని చూశాడు. "పిరికి మనిషి!"

చిన్నప్పుడు ఆకలేస్తోందని గోలపెడితే వినికూడా పట్టించుకో కుండా పెళ్ళాంతో చెప్పకుండా వెళ్ళిపోయేవాడు — ఈనాడు యాభయ్ రూపాయలివ్వటాని తయారయ్యాడు దొంగచాటుగా.

* * *

మధు బి ఎ ఆఖరి పరీక్షలు రాసి వస్తున్నాడన్న సంగతి రెండిళ్ళ వాళ్ళకీ సంతోషం కలిగించింది. నిండుకుండవంటి సూర్యం కూడా సుంద రమ్మగారూ, ఇందిరా కూర్చున్నప్పుడన్నాడు — "మధు అనుకున్నంతా చేశాడు అమ్మమ్మా! నా కెంతో సంతోషంగా ఉంది."

"పదహేనేళ్ళుగా కళ్ళల్లో ఒత్తులేసుకొని కూర్చుంటే ఈనాటి కీ ఆనందం కంటబడింది — చూడుకోటానికి మీ అమ్మా నాన్నా లేకపోయా రురా! కొడుకు బియ్యే చదివినందుకూ — మనవుడు పుట్టినందుకూ ఎంత సంతోషించేదో!" అంది ఓగులుగా సుందరమ్మగారు.

ఇందిర ఒళ్ళో నిద్రపోతూన్న కొడుకుని పడుకోబెట్టటానికి లేచింది —అంతలో విశ్వనాధం వచ్చాడు — "మధు ఎప్పుడు వస్తున్నాడమ్మా?" అంటూ.

రెండిళ్ళ మధ్యా బాగా సామరస్యం ఏర్పడింది. మామయ్యలూ, అత్తలూ, పిల్లలూ అంతా సూర్యం ఇంటికి వస్తూ పోతూనే ఉన్నారు.

కొడుకు చదువు సంధ్యలు లేకుండా తిరుగుతున్నాడనే బాధ వేదిం చినా, అల్లుడు బియ్యే చదువుతున్నాడన్న సంతోషంతో సంతృప్తిపడ్డారు సీతాపతి దంపతులు.

పెళ్ళికేమిటి? ఎప్పుడయినా చేసుకోవచ్చు. తను మాత్రం డాక్టర్ కావాలి—కలలు కంటూనే ఉంది సుధ. సుధ ఊహా లోకాల్లో మధు ఏమంతగా నిలవలేకపోయాడు. తను డాక్టరు కావాలేగానీ— ఆస్పత్రి — మధు బావని మించినవాళ్ళు తొంభైమంది!

విశ్వనాథం ఒకప్పుడు మేనల్లుళ్ళను నిర్లక్ష్యం చేసినందుకు విచారిస్తున్నాడనీ — పశ్చాత్తాపంతో ఈనాడు మేనల్లుళ్ళని అభిమానిస్తున్నాడని అనుకుంటే అదేమంత నిజంకాదు.

మధు పెంకితనం విశ్వనాథాన్ని ఏనాడూ సవాల్ చేస్తూనే ఉంటుంది. మధు చదువు సంధ్యలు విశ్వనాథాన్ని వెక్కిరిస్తూనే ఉంటాయి — ఆ రౌడీ వెధవ పరీక్షలు పాసయిపోతున్నాడంటే బుద్ధిగా చదివేస్తున్నాడను కుంటున్నా వేమిటి ? ఏదో వాడి గీత బాగుంది. పాసౌతున్నాడు..." అంటూంటాడు పార్వతితో.

ఆ కుటుంబంలో ఒక్క సీతాపతిమీద తప్పితే మరెవరిమీదా సద్భావంలేని మధు, అందరికీ దూరంగానే ఉండిపోయాడు — సుధ మీద ఉన్న ఈ అభిమానం — చిన్ననాటినుంచీ పెంచుకొంటూన్న ఆత్మీయతలు మాత్రం మధుని ఒక రకంగా ఆ కుటుంబాన్నుంచి పూర్తిగా వేరుపడకుండా నిలప గలిగాయి.

* * *

మెట్రిక్ పరీక్షలు రాసి వచ్చిన మధులో ఏదో వెలితి ఉన్నట్లు గ్రహించగలిగింది ఇందిర ఒక్కతే — మధు మాట్లాడుతూ మాట్లాడుతూ హఠాత్తుగా ఆపి లేచిపోవటం — పూర్వంలా చురుగ్గా, హాస్యంగా మాట్లాడక పోవటం - చదువుకోవాలని తెరిచిన పుస్తకం గుండెలమీద పడేసుకొని తలకింద చేతులు పెట్టుకొని ఇంటి కప్పుకేసి చూస్తూ ఉండిపోవటం —అంతా ఇందిరకు చాలా ఆశ్చర్యం కలిగించింది. మధు మౌనంగా భోంచేస్తోంటే ఇందిర దగ్గరే కూర్చుని నెమ్మదిగా అడిగింది .. "అదేమిటి మధూ అలా ఉంటున్నావు కొత్తగా ?"

మధు తలెత్తి చూశాడు.

"నువ్వేమిటో మునుపటిలా లేవు. కొత్తగా మారిపోయావే. సరిగ్గా మాట్లాడటమే లేదు."

"ఏలేదే దానివే వదినా!" మధు కొంచెం నవ్వి తిరిగి అన్నం తినపుకో సాగాడు.

"నేనేం హాస్యాని కనటంలేదు సుమా! నువ్వు చాలా మారి పోయావు."

"చాల్లే! పూరుకో వదినా!"

ఇందిర ఎంత ప్రయత్నించినా ఏమీ తెలుసుకోలేక పోయింది. సూర్యంతో మధు విషయం చెపితే— "ఆ పోదూ! నీ అనుమానాలకేం?" అనేశాడు. సుందరమ్మగారితో అంటే ఆవిడ నిండుగా నవ్వుతూ అంది — "వాడింకా చిన్నవాడా, చితకవాడా అమ్మాయ్. ఏళ్ళు పైబడుతూన్నొద్దీ కుదురు రాదూ? ఏదో చిన్నప్పుడలా ఆకతాయి గంతులేశాడు గాని."

ఇందిరకు మాత్రం సంతృప్తి కలగలేదు.

మధు మునుపటిలా లేడు — ఎందుకో చాల ముభావంగా ఉంటు న్నాడు. ఏదయినా ఆలోచించుకొని బాధ పడుతున్నాడో ఏమో! అంత పరిహాస ధోరణి. మధు ఉదాసీనంగా ఉండటం ఇందిరకు చాలా కష్టం కలి గించింది. మధూ ఆలోచన లేమిటో తెలుసుకొని ధైర్యం చెప్పి, బుజ్జగించా లని ఎంత ఆరాటపడినా చేయలేకపోయింది.

"ప్రేమలోగాని పడ్డా వేమిటయ్యా? చెప్పనైనా చెప్పు." అంది వోసారి హాస్యంగా .. దానికో ఉపన్యాసం ఇవ్వాల్సిన మధు చిన్నగా నవ్వి పూరుకున్నాడు.

"ఏమిటి బాబూ బొత్తిగా ఈ చిద్విలాసాలు? షోకా?" అంది విసుగ్గా ఇందిర.

"అలాగే అనుకో."

"అంతేగానీ నువ్వు చెప్పవ్?"

"చెప్పటాని కేమైనా ఉంటే గదా?"

ఇందిర మరి మాట్లాడలేదు.

కాలేజీనుంచి వచ్చింది మొదలు ఊరంతా కాకిలా తి ఇంటిపట్టు వదలటంలేదు. ఓసారి ఇందిరతో అన్నాడు ఉత్తరాలొస్తే జాగ్రత్తగా ఉంచు వదినా!"

"ఎప్పుడూ నీ ఉత్తరాలు నీకు జాగ్రత్తచేసి ఇవ్వటంలేదూ ?"

మధు మాట్లాడలేదు.

రుక్మిణత్తయ్యకి జ్వరంగా ఉందని కబురు తెలిస్తే మధు భోజనం కాగానే వెళ్లాడు. వెళ్ళేముందు మరోసారి అన్నాడు—"బహుశా ఇవ్వాళ ఉత్తరాలేమైనా రావాలి."

"ఏం ? నీకేమైనా ప్రేమలేఖలు వస్తాయా ? నీలం కవరేదైనా ఉంటే నేను చించి చదివేస్తాలే"—నవ్వింది ఇందిర. — మధు మాట్లాడకుండా వెళ్ళిపోయాడు. ఆ మౌనమేమిటో — ఆఖరికి ఇందిరకు చిరాకు వేసింది

మధు కేశవరావు వాళ్ళింటికి వెళ్ళినా నిప్పులమీద నించున్నట్టే నించుని రుక్మిణిని కాస్త పరామర్శించి మతి స్థిమితం లేనివాడిలాగే ఓ గంటకంతా ఇంటికి వచ్చేశాడు ఇందిర విజయ్‌కి చొక్కా తొడుగుతూ గుమ్మం దగ్గర నించుంది —మధుని చూసి ఎప్పటిలా పలకరించకుండా తల తిప్పేసుకుని కొడుకు చొక్కాగుండీలు సర్దసాగింది — అదేం పట్టించుకోకుండా వస్తూనే ఆతృతగా అడిగాడు మధు "వదినా ! ఉత్తరం వచ్చిందా!"

"వచ్చింది."

"వచ్చిందా ? మరేం ? యింకా చెప్పవేం?"

"ఇప్పుడేగా వచ్చావు !"

"సర్లే ! కవరేనా?"

"ఆఁ కవరే, యిస్తానుండు."

"ఎక్కడుంది ? నేను తీసుకుంటాను —" అంతులేని నిరీక్షణ తాలూకు ఆరాటం మధు చేష్టల్లో గోచరించింది.

"నీ పెట్టెలో పెట్టాను, తీసుకో"— ఇందిర కొడుకుని భుజంమీద వేసుకుని దొడ్లోకి వెళ్ళిపోయింది పెట్టెతీసి ఉత్తరం చూసుకున్న మధు పిచ్చివాడయ్యాడు—"వదినా !" ఒక్క గావుకేక పెట్టాడు— ...త్రిగా వెళ్ళిన ఇందిర వెనక్కి వచ్చింది—"పిల్చావా ?"

...ము చించావే కవరు?"

"మీ పెద్దమామయ్యగారు."

"వా డెప్పుడొచ్చా డిక్కడికి ?"

"పోస్టు జవాను వచ్చేసరికి ఆయనిక్కడే ఉన్నారు. చొరవగా ఉత్తరం చించేస్తుంటే...."

"నువ్వు నోరు మూసుకుని వూరుకున్నావు, అంతేనా ? ఉత్తరం జాగ్రత్తని చెప్పలేదూ ? చూస్తూ వూరుకున్నావా ?"

ఇందిర బ్రమాన్పడిపోయింది. మధుని ఎన్నడూ ఆ స్థితిలో చూసి ఎరుగదు. నెమ్మదిగా అంది—"ఆయన అందుకుని చింపేస్తోంటే ఏమీ అనలేక పోయాను."

"ఛీ! మీరు మనుష్యులా ? బుద్ధిలేనివాళ్లు — జంతువులుకూడా నయం మీకన్నా."

సుందరమ్మ కంగారుగా వచ్చింది—"ఏమిట్రా అరుపులు ? నువ్వు కాలేజీలో ...."

"నోర్మూయ్ !"

"ఏమిటా కోపం ?"

"హు ! కోపం !" మధు కోపంతో పళ్ళు నూరుకున్నాడు— "మీతో కాదు, ముందు వాడిపని .. వాడిపని చెప్తాను—" ఉత్తరం జేబులో కుక్కుకున్నాడు.

"మధూ ! ఒరేయ్ !"

విన్పించుకోని మధు గజానికో అంగవేసుకుంటూ వెళ్ళిపోయాడు.

సుందరమ్మగారు భయపడి పోయింది—

"అక్కడేం కుమ్ములాడుకుంటారో ఏమిటో నమ్మాయ్, అసలే యిలా వచ్చిందేమా అని ఏడుస్తోంటే పైగా వీళ్ళ గొడవేమిటి ? నెమ్మదిగా వెళ్ళొస్తాను."

పెద్దకాలం వచ్చేసిన సుందరమ్మగారు దడదడలాడుతూన్న గుండెలతో లేచింది.

మధు ఆవేశంతో వూగిపోతూ మెట్లు ఎక్కేసరికి కృష్ణుడు చావి ఎదురు పడ్డాడు— "ఏం బావగారూ ! బహుకాల దర్శనం ?"

"ఏడిశావులే. పెదనాన్న గారెక్కడ ?"

"ఏవిట్రో ఆ వ్యంగ్యం ? ఏమిటి కథ ?"

"నోరు మూసుకు పిలవోయ్‌! యింట్లోవున్నాడా?"—మధు అసహనంగా, చిరాగ్గా అరిచాడు.

కృష్ణుడు తెల్లబోయాడు — పెదనాన్న ? ఉన్నాడు, పిలుస్తాను కూర్చో"

"హు ! కూర్చో. కూర్చోటానిక్కాదు రావటం. మర్యాదలు తర్వాత వాణ్ణి పిలు."

కృష్ణుకు మధు చాలా వేడిగా ఉన్నాడన్న సంగతి అర్థం చేసుకున్నాడు. ఒక్కక్షణం అయోమయంగా చూసి లోపలికి వెళ్ళబోయేసరికి విశ్వనాథం ఎదురుపడ్డాడు. వస్తూనే మధునిచూసి వెటకారంగా నవ్వుతూ అన్నాడు.

"ఓహో ! మధుసూదనరావుగారా ! కాలేజీలో ఘనకార్యం చేసినట్టున్నారే ?"

"నోర్ముయ్ ! బుద్ధిలేని పశువా ? నువ్వుచేసే నీచాలకన్నా నేను చేసింది ఘనకార్యమే. ముమ్మాటికీ —" మధు కోపంతో ఆగిపోయాడు.

అనుకోని సంఘటనకి విశ్వనాథం క్షణం తెల్లబోయాడు. మరుక్షణంలోనే తన కలవరపాటు కప్పిపుచ్చుకొంటూ దురుసుగా అన్నాడు—"ఏవిట్రా మహా వాగుతున్నావ్ ? ఒళ్ళు భద్రం."

"వాగుడంతా నీది. చేసింది చాలక వెటకారం కూడానా ? ఏదీ ? మళ్లా వాగు."

"ఉన్నమాటంటే ఉలుకే మరి. ఇలా వాగుతోంటేనే కాలేజీనుంచి వెళ్ళగొట్టారు."

మధు దాదాపు పిచ్చివాడయ్యాడు. విసురుగా రెండంగలేసి విశ్వనాథం గుండెలమీద గుప్పిట్లో పట్టుకుని ఒక ఊపు ఊపాడు—"చెప్పు. యిలా వాగితేనా నన్ను పొమ్మన్నారు. నీకు బాగానా ? చెప్పవేం ?"

అడుగంటిపోయిన అభిమానంతో విడిలించుకోటానికి ప్రయత్ని స్తున్న విశ్వనాధాన్ని, గుప్పిట్లో బిగించుకున్నాడు, మధు—"నిన్ను నాలుగు తంతే దిక్కేవిట్రా ? ఒళ్లు భద్రం ఎవరిక్కాడు ? నీ ఎంగిలి మెతుకులు తిని బ్రతికే పడట ననుకున్నావా ? మాటి మాటికీ నువ్వా నన్ను హెచ్చ రిస్తావ్ ? ఏం ? మాట్లాడవేం ?" కసికొద్దీ మరో వూపు వూపాడు.

బిక్కచచ్చిపోయిన కృష్ణుడు లోపలకు పరిగెత్తాడు.

"ఎటుపోతావ్ ? చేతిలో చిక్కావ్ నిన్నేం చెయ్యాలి ? నన్నేం చేశావో గుర్తుచేసుకో— ఒక్కసారి నీ యిష్టంవచ్చినట్టు చిత్రవధ చేశావ్, జ్వరంతో మూలుగుతోంటే కాలితో తన్నావ్. కాలుతెగి ఏడుస్తోంటే నవ్వుకొంటూ పోయావ్. దొంగతనం అంటగట్టి స్తంభానికేసి కొట్టావ్— అంతేనా ? నేను చేసిన దారుణాలు భరించలేక పోయావ్ కదూ ? నన్ను [illegible]గుచేస్తానని కంకణంకట్టుకున్నావ్ కదూ ? నా భవిష్యత్ కోసమే పాటు [illegible]డ్డావ్ కదూ ? ఎంత చిత్రం ! నీ చేతిలో మసై పోవాల్సిన నేను, నిన్ను నిలవెయ్యటం ఎంత ఘోరం ! నాకిచ్చిన ప్రతి బహుమానం తిరిగి నీకు [illegible] వించకపోవటం—నీ ఋణం తీర్చుకోవటానికి నేను ప్రయత్నించక [illegible]వటం— ఇదంతా కృతఘ్నతేకదూ ? నీ పాపం పండింది. అందుకే నేను వచ్చాను. నా ఉత్తరం ఉంచి మంచి అవకాశం యిచ్చావ్."

విశ్వనాధం మొహంలోకి తీక్షణంగా చూస్తూ ఈ క్షణంలోనో మరో క్షణంలోనో తన్నటానికి సిద్ధమవబోతూన్న మధూ వీరావేశంచూసి పార్వతి, సావిత్రీ కంపించిపోయారు. విశ్వనాధం యింటికివచ్చి మధూ [illegible]మాట చెప్పి నవ్వుకొంటూంటే అంతలోనే ఈ ఉపద్రవం ముంచు కొచ్చింది.

భర్త మధుచేతుల్లో తన్నులు తినగలడేమో నన్న అనుమానం పార్వతిని భయపెడుతోంటే కం[illegible]గా ప్రాధేయపూర్వకంగా అంది— "ఏదో పొరపాటైపోయిందిలే నాయనా। ఈ సారికి కోపగించుకోక [illegible]బూ।"

"ఆమాట ఈ పెద్దమనిషి ఒప్పుకంటాడేమో చూడు. ప్రె[illegible] జీలో ఘనకార్యం చేసివచ్చానని వెటకారం । ఛీ నీ[illegible]

చెయ్యవేస్తే నాకే సిగ్గుచేటు. నీ పెంపకంతోనైనా నీలా బుద్ధిలేని కాలేదు. వదిలేస్తున్నాను. కాస్త నోరు సంబాళించుకొని ఒళ్ళు చేసుకుని మరీ మాట్లాడు భద్రం చేసుకోవటం నీకు బాగా తెలుసు కదూ?' —పధు వెటకారంగా నవ్వుతూ చేతులు దులుపుకున్నాడు

విశ్వనాథం పరిస్థితి వర్ణనాతీతం. కోసిన కంద గడ్డలా ఎర్రబడి పోయాడు. మరిగే నీళ్ళలో పడ్డ దుంపలా వుడికి పోయాడు — అవమాని భారాన్ని వెనక్కి నెట్టి సాధ్యమైనంత విసురుగా, దుసుసుగా అన్నాడు. —

"రౌడీ వెధవ్వి కాలేజీలో డిబార్రై వచ్చి మధ్య నా మీదట్రా నీ తిరుగుబాటు?"

"నీకు మతి కూడా పోయిందా? తప్పతాగేసి ఉన్నావా? నేను అడిగిందేమిటి? నువ్వు చెప్పేదేమిటి? డిబారే అవుతాను. ఇంకో టౌతాను. చోరీలు చేస్తాను. ఖూనీలు చేస్తాను — నా మంచిచెడ్డ లేమి నీ కింటవు అది నీకు అనవసరం. ఉత్తరం ఎందుకు చించావనే నే నడుగుతున్నాను. తెలుస్తోందా?"

విశ్వనాథం ఏమీ మాట్లాడలేక పోయాడు.

"చిన్నతనంలో నాకు గోపాలం రాసిన వుత్తరం ఐబర్దస్తీగా తీసేసు కున్నావు - గుర్తు వుందా? ఆ కసి తీర్చుకోలేక దాచుకున్నా నింతవరకూ, ఈనాడు కూడా యింత అధికారం వెలగబెట్టటానికి ఎన్నిగుండెలోయ్ నీకు? ఊళ్ళో పేరు మోసిన పెద్దమనిషివి. కాబోయే పంచాయితీ బోర్డు ప్రెసి డెంటువి. ఇంత మాత్రం సభ్యత తెలీకపోయిందా నీకు? — డబ్బు జిమ్మి వోట్లుకొనే ఖామందువు — నీకు సభ్యతేమిటి? నా వెర్రి? — ఆ ఉత్తరం మీది అడ్రసు నీ దనుకున్నావా? నీది కాని ఉత్తరం నువ్వు చింపకూడదనే చిన్న విషయం తెలీలేదూ నీకు?"

"ఉడుకుమోతు వెధవా! నీ రహస్యం బయట పడిందని ఏడుపు ...."

ఇప్పటికైనా గౌరవం కాపాడుకోవాలంటే నోరుమూసుకు మరీ వుండు — నా రహస్యం బట్టబయలైందని ఏడవటానికి అది

, కానేకాదు. పబ్లిగ్గా లెక్చరర్‌తో ఘర్షణపడ్డాను. కాలేజీ రూల్సు రం ఉల్లంఘించాను — దానికి నేను గర్వపడుతున్నాను కూడా. కాని నా ఉత్తరం నా అనుమతి లేకుండా చించే అధికారం ఎవ్వరికీ లేదని చెప్ప టానికి — నీకో పాఠం నేర్పి వెళ్ళటానికీ వచ్చాను — వ్యభిచారం — దొంగ తనం — జూదం హత్యలు ఇవేవీ నీ తప్పుకన్నా పెద్దవికావు. నీ వంటి చీడపురుగులే ప్రజలకూ, దేశానికి అసలైన శత్రువులు."

మదపుటేనుగులా కదం తొక్కుతూన్న మధుని చూస్తూ విశ్వ నాథం మాటలు దక్క నిలబడిపోయాడు. సత్తువ ఉడిగిపోయిన సుంద రమ్మగారు ఒగర్చుకుంటూ వచ్చి మధు చెయ్యి పట్టుకొంది — "నా మాట విను బాబూ! జరిగిందేదో జరిగిపోయింది. ఈ సారి చెయ్యడుగా? వెళ్ళిపో. నలుగురూ నవ్వుతారు."

మధు ఉడికిపడ్డాడు — "నవ్వుతారు! నీ కొడుకు సంగతి వచ్చే సరికి నలుగురూ నవ్వుతారు — ఇంతపాటి అభిమానం — గౌరవం — వ్యక్తిత్వం మరెవ్వరికీ లేవని నవ్వుతారు. అంతేనా ?"

తన తప్పుని తల్లీ పెళ్ళాం సంజాయిషీలు చెప్పుకోవటం. క్షమా పణలు కోరటం విశ్వనాథానికేం నచ్చలేదు — అడ్డంగా దిగి దబాయించ టానికీ సిద్ధమయ్యాడు — "ఉత్తరం చూసినంత మాత్రాన తప్పేమిటోయ్ మహా ?"

"ఛీ! నీకు బుద్ధేకాదు. సిగ్గుకూడా లేదు. నా ఉత్తరం నువ్వు చూసినా తప్పులేదు నీ పెళ్ళాన్ని ఎవడు చూసినా తప్పులేదు. నీ దృష్టిలో ఏ వస్తువూ ఎవరికీ సంబంధించింది కాదు —

ఎందుకు? నీకు ఏళ్ళు పెరుగుతున్నాయి. అంతే — ఇప్పటికైనా ఒక గుణపాఠం నేర్చుకో — జీవితంలో మరెప్పుడూ ఇలాంటి వెధవపని చెయ్యకు. అసలు నీ వంటి తప్పుడు మనిషి కడుపున పడటం నాకే సిగ్గు చేటు — మరొకసారి హెచ్చరిస్తున్నాను. నా విషయంలో ఒళ్ళు దగ్గర పెట్టుకొని చేసుకు తిరుగు.

మధు మరోక్షణం నిలబడకుండా చీత్కరించుకొంటూ పోయాడు.

సుందరమ్మగారి కళ్ళు కన్నీళ్ళతో నిండిపోయాయి. కొడుకు మొహం చూడలేక నెమ్మదిగా దొడ్లో కెళ్ళిపోయింది.

ఎక్కడెక్కడో తిరిగి మధు రాత్రి చాలా ప్రొద్దు పోయాక ఇంటికి వచ్చాడు. ఇందిర మౌనంగా అన్నం పెడితే తిని తప్పుచేసిన వాడిలా తల దించుకుని లేచాడు. పడుకోవటానికి సిద్ధపడిన సూర్యం, మధూ కోసమే నిరీక్షిస్తూ కూర్చున్నాడు. మధు వంటింట్లోంచి రాగానే కొంచెం మందలించాల న్న ఉద్దేశ్యంతోనే అన్నాడు — "మామయ్యతో ఏదో ఘర్షణ పడ్డావట?" — వరండాలోకి వెళుతూన్న మధు ఆగిపోయి సూటిగా చూశాడు — "ఘర్షణ కాదు. తన్నకుండా వదిలేశాను. సంతోషించండి."

"మధూ? ఎందుకంత దురుసుగా మాట్లాడతావ్? ఒనువునా ఫుత్తరం తీసినంత మాత్రాన ..."

"అన్నయ్యా?" తీక్షణంగా చూశాడు మధు

"మరెప్పుడూ అలా మాట్లాడకు. దొంగ ఉత్తరాలు చూడటాన్ని సమర్థించటం కూడా చాలా నీచమైన పని. ఉత్తరాలనేవి పరువు ప్రతిష్ఠ లకూ, మానాభిమానాలకీ సంబంధించినవి. నా మర్యాద మంట గలిసి పోతోంటే చూస్తూ వూరుకోమంటావా?"

సూర్యం నెమ్మదిగా అన్నాడు — "నీ ధోరణే నీది మధూ! ఉత్తరం అంటే మామూలు ఉత్తరం అనుకుంటాం గానీ .."

"మామూలుదే కావచ్చు! అయితే ...."

"నిజమే ఎవరికి రాసినవి వాళ్ళు చదువుకోవటంలోనే అర్థ ముంది. అది నేను కాదనటం లేదు. అంత మాత్రపు సభ్యత తెలీని ..."

"తెలీకపోతే తెలియజేస్తాం. చూస్తూ వూరుకోవటం నా చేతకాదు." సూర్యం మాట్లాడలేదు. ఇందిర అంది — "నీ విషయాలు మరె వరికీ తెలియాల్సిన అవసరం లేదని కాబోలు చెప్పకుండా దాచుకుంటావు."

"నువ్వు నిష్ఠూర పెట్టటమేగానీ నీ దయవల్ల దాచుకోవాలన్నా దాగలేదుగా?"

ముగ్గురూ కొంతసేపు మౌనంగా వుండిపోయారు. మధు అన్నాడు — "ఈ విషయం నేను దాచి పెట్టాలనే ప్రయత్నించాను కాని జరగ లేదు. నే నేదో తప్పుచేశానని సిగ్గుపడి మాత్రం కాదు. నా నిజాయితీ నాకు తెలుసు.. మొన్న పరీక్షల్లో ఓ వెనక బెంచీలోంచి ఒక స్టూడెంటు నన్ను పలకరించాడు. తగ్గట్టు జవాబు చెప్పి తల తిప్పేసరికి వాచర్ నా దగ్గర నిలబడి వున్నాడు. వెనక్కి తిరిగి నేనేదో అడుగుతున్నానని అపోహ పడ్డాడు. కాదని చెప్పాను. నమ్మలేదు. — "నీకై నువ్వు మాట్లాడటం చూశాను. లేచి నిలబడు" అన్నాడు.

నిలబడ్డాను.

"బయటికి రా!" అన్నాడు.

"పేపరు పూర్తి కానివ్వండి." అన్నాను.

"వీల్లేదు. బయటికి రా!" అన్నాడు.

"రాను, పేపరు పూర్తి చేసి కాని కదలను." వాచర్‌కి కోపం వచ్చింది — "రావూ? అంత నిర్లక్ష్యంగా మాట్లాడుతున్నావేమోయ్! వెటకారంగా అని చేతి మీద చెయ్యి వేశాడు.

"మర్యాదగా చెయ్యి తీసి మాట్లాడండి, లేకపోతే బావుండదు "

"వాగోగులు తర్వాత చూద్దాం. బయటికి వచ్చి మాట్లాడవయ్యా!" అంటూ చెయ్యి పట్టి లాగాడు. విసిరి కొట్టాను అంతే! తూలి ఎదుటి బల్లమీద పడ్డాడు. బంతిలా పక్కకి దొర్లాడు — దాని ఫలితమే యివ్వాల్టి ఉత్తరం నా పరీక్ష ఈ సంవత్సరం ఆపేశారు. నాకేం విచారం లేదు. నేను చేసింది కాలేజీ రూల్సు ప్రకారం తప్పే కావచ్చు. కాని, నా ర్తనలో విధేయత ఉందో లేదో నాకు తెలుసు. కేవలం ఈ దృష్టిలో వుంచుకొని వాచర్ చేస్తున్న అవమానాన్ని సహించ చేతకాని పని — ఈ వుత్తరం వస్తుందని నాకు తెలుసు. ఇది ఎవ కుండా ఉంచాలని ప్రయత్నించాను. నేను మరో సంవత్సరం పా

కానీ పోయిన గౌరవాన్ని తెచ్చుకోలేను. నేనేదో కానిపని చేశానని - అందుకే నన్ను కాలేజీనుంచి పంపించేశారనీ ఇప్పటికే పాక్కిపోయింది. అసలు విషయం ఎవరికీ తెలీదు. తెలుసుకోటానికి ప్రయత్నం కూడా చెయ్యరు." మధు ఆగాడు.

ఇందిర ఆశ్చర్యంగా చూసింది.

సూర్యం అన్నాడు - "ఇందుకేనా నువ్వింత బాధపడ్డావు మధూ? - ఎవరి విషయం ఎలా వున్నా నేను నిన్ను నమ్ముతాను. చదువుకోవాలని తహతహలాడే నువ్వు, ఆ చదువు విషయంలోనే నిర్లక్ష్యంగా ప్రవర్తిస్తావని ఎన్నడూ అనుకోను. మళ్ళీ సంవత్సరం చదివి పరీక్ష రాద్దుగాని, అంతేగా?"

మధు మనస్సంతా వికలమైపోయింది. ఇందిర మధు మొహం లోకి చూస్తూ అంది - "ఎవరో ఏదో అనుకుంటారని నువ్వు జంకటం చిత్రంగా ఉంది మధూ! ఈ విషయం నువ్వు నాకు చెపితే ఇంత జరిగేదే కాదు సుమా!"

మధు కళ్ళల్లో అప్రయత్నంగా నీరు చిమ్మింది.

* * *

సుశీల జమీందారు సంస్థానంలో చదువు పూర్తిజేసి ఇంటికి వచ్చింది. ఇందిరకు సుశీలపట్ల గౌరవమేగాక సానుభూతి కూడా. నోరు విప్పి మాట్లాడలేని లోపం తప్పితే సుశీల ఆణిముత్యం! మణిపూస, విద్యాధికురాలైన సుశీల కన్నులు చురుకుగా వివిధానుభూతులతో మెరుస్తుంటాయి. చిరునవ్వులు చిందే సుశీల వదనం కళా కాంతులకు ఆటపట్టుగా గోచరిస్తుంది. దృఢంగా, ఆరోగ్యంగా, పెరిగిన సుశీల దేహం నిండుతనం పొందుపరుచుకుంది. సన్నని తెల్లని చీరలు కట్టే సుశీల - కళ్ళతో పరి

గాలించే సుశీల - నిశ్శబ్దంగా చిరునవ్వు చిందించే సుశీల — పెదబిడ్డ గర్వంతో తిరిగే సుశీల — సశీలకు సుశీలే సాటి అని ల— అన్నలిద్దరికీ ముద్దు చెల్లెలు!

]

సుశీలకు పుస్తకాభిమానం ఎక్కువ. ఎప్పుడూ చదువుకుంటూనే కనిపిస్తుంది. అత్యవసరమైన పరిస్థితుల్లో వదినకు సాయం చేస్తుంది. వదినె దగ్గిర వంట నేర్చుకుంటుంది. చికిలకాల కుట్లూ, అల్లికలూ, వదినెకు నేర్పుతుంది. మేనల్లుడు విజయ్ విషయాలన్నీ సుశీలే చూసుకుంటుంది. నిశ్శబ్దంగా ఉండే సుశీలతో మాట్లాడటం, కంటి చూపులద్వారా సుశీల అభిప్రాయాలు అందుకోవటం ఇందిరకు వేడుక. ఒకసారి సుశీల కన్నుల్లోకి చూస్తూ అంది ఇందిర — "నువ్వేమీ అనుకోకపోతే ఒకటి అడుగుతాను సుశీలా !"

"ఏమిటీ ?" చూసింది సుశీల.

"ఇలా మౌనంగా ఉండాలంటే నీకు బాధ లేదూ ! అందరిలా గలగలా మాట్లాడాలని అనిపించటం లేదూ ?"

నవ్వింది సుశీల -- "పిచ్చి ప్రశ్న !" అన్నట్టు. నిజమే పిచ్చి ప్రశ్న కదూ ? అంత సహజమైన కోరిక ఎందుకు ఉండదు ?

సుశీల పూసలవంటి అక్షరాలతో కాయితంమీద రాసింది. "నా ఈ అవగుణాన్ని భగవంతుడు ప్రసాదించిన వరంగానే భావిస్తున్నాను. వదినా ! ఇప్పుడు నా సుఖానికి గానీ, సంతోషానికి గానీ ఏం లోపం వచ్చింది ?"

ఇందిర సంభ్రమంగా చూసింది - "నీవంటి వారికి కావలసింది సంతృప్తి, ఆత్మ విశ్వాసమే సుశీలా ! అవి నీకు బాగా వంటబట్టాయి."

"చూడు వదినా ! నాకే ఈ మూగతనం లేకపోతే పరిస్థితులు మరోలా ఉండేవి."

"అదెలా ?"

"కాదా మరి ? నేను అందరిలా మాట్లాడుతూ మామూలుగా ఉంటే సంస్థానానికి ఎందుకు వెళతాను ? ఈ విద్య ఎలా అబ్బుతుంది ! అత్తల అడుగులకు మడుగులొత్తుతూ బ్రతకాల్సివచ్చేది. అన్నయ్యని ఊబిలో చేర్చటానికే నానా అల్లరి చేసినవాళ్ళు, నా చదువుమాటైనా పట్టించుకుంటారా ? ఆ హీనమైన బ్రతుకు కన్నా ఇలా వివేకపూరితంగా ఉండటమే నాకు సంతోషంగా ఉంది వదినా !"

"అబ్బా! 'సాలా గడసుదానివే! అయితే అమ్మాయి గారూ. ఇలా వెర్రివెర్రిగా చూస్తూ మాటా మంచీ లేకుండా కూర్చుంటే నిన్నెవరు పెళ్ళి చేసుకుంటాడేమిటీ?"- ఇందిర హాస్యం చేసింది.

"నీ తాత." నవ్వింది సుశీల - "నాలో లోపం ఎరిగి సంతోషంగా. అంగీకరించే వ్యక్తి ఎవరైనా నాకు ఇష్టమే. అలా కానినాడైనా స్వతంత్రంగా బ్రతకగల శక్తి నాకుంది. అమ్మగారిచ్చిన మిషనే నా మొగుడనుకో. నన్ను ధీమాగా పోషిస్తుంది -"

ఇందిర పకపకా నవ్వింది — "ఎంత చిలిపి దానివితల్లీ! నువ్వు మూగదానివేం కాదు. నోరున్నవాళ్ళు మాత్రం నీ కన్నా ఎక్కువేం మాట్లాడగలరు?" అంది బుగ్గలు నొక్కుతూ.

ఆ సంభాషణల్లో మధుకూడా కలిస్తే మరీ సరదాగా గడుస్తుంది. ఇందిర పనులు చేసుకుంటూన్నా, సుశీలతో మధు గంటల తరబడి వాదిస్తూ కూర్చుంటాడు? వాదనలో మధుని కూడా అధిగమించి పోతుంది సుశీల — సుశీల ఆలోచన పటిష్టమైనది, సున్నితమైనది, సర్వ సామాన్యమైనది.

సుందరమ్మగారు, సూర్యం, సుశీలకు పెళ్ళి ప్రయత్నాలు కొనసాగిస్తోంటే, ఓ సారి ఇందిర నవ్వుతూ అంది — "మీ చెల్లాయికి వేరే పెళ్ళెందుకు? శ్యామసుందరీదేవి ఇచ్చిన కుట్టు మిషనే ఆవిడ భర్తగారట - దర్జాగా పోషిస్తుందట - సుశీలే అందికదా?" సూర్యం నవ్వాడు. — నీ లాంటి మొహాలకి ఇంకెలా చెపుతుంది.

ఉన్నట్టుండి ఇందిర ఓ సలహా ఇచ్చింది.

"మధుకి సుధ నెలాగూ చేసుకుంటాం. కృష్ణుడు సుశీలని చేసుకోమని షరతు పెట్టకూడదూ?"

చాల్లే! వూరుకో. నోరూ వాయీ లేనిదాన్ని ఆ వెధవకిచ్చి చేసే నూతిలో తోసెయ్యరాదూ నీ కంత భారంగా ఉంటే?" - సూర్యం

ఇందిర తెల్లబోయింది — "సుశీలా నాకు భారం? నా చెల్లెలు కన్నా ఎక్కువగా భావిస్తున్నాను. మీకు తెలుసో లేదో?" అంది ప

సుందరమ్మగారు ఇద్దర్నీ శాంత పర్చింది. — "కిష్టిగాడి మాట ఇక వదిలెయ్యండి. ఎవరి కెక్కడ రాసి పెట్టి ఉంటే అక్కడ జరుగుతుంది."

భాస్కరం — ఇందిర అన్న — చెల్లెలి యింటికి చుట్టం చూపుగా వచ్చాడు. స్కూలు ఫైనల్ పాసై, పై చదువులకు శక్తిలేక గుమాస్తా ఉద్యోగం చేస్తూ, ప్రయివేటుగా పరీక్షలకు చదువుతున్నాడు. తెల్లగా, పొడుగ్గా దృఢంగా ఉండే భాస్కరం రూపంలో కూడా చెప్పుకోదగ్గవాడే. తెల్లని పైజమాలు, లాల్చీలూ ధరించే భాస్కరం చాల నిరాడంబరంగా కన్పిస్తాడు. భాస్కరం అందచందాలలో విపరీతమైన ఆకర్షణ కూడగట్టుకున్నది — అతని నొక్కుల జుట్టు.

చలాకీగా అందర్నీ కలవేస్తూ ఇంట్లో తిరుగుతూన్న భాస్కరాన్ని పరిశీలించకుండా ఉండలేకపోయింది సుశీల. నిశ్శబ్దంగా అతని కదలికలు చూడటం, అతని మాటలు వినటం కుతూహలం కలిగించాయి సుశీలకు ఒకసారి రహస్యంగా హాస్య భావంతో అంది ఇందిరతో — "వదినా! మీ అన్నయ్య భావకవిలా ఉన్నాడు కదూ? కొంపదీసి కథలవీ రాస్తాడా ఏమిటి?"

ఇందిర ఫక్కుమని నవ్వి చేతిలో చీటీని – "ఒరేయ్! అన్నయ్యా ఇది చూడరా!" అంటూ అన్నగారి మీదికి గిరవాటు పెట్టింది. సుశీల తత్తరపడి గదిలోకి పరిగెత్తి తలుపులు బిగించుకొంది – భాస్కరం ఇందిర దగ్గిరికి వస్తూ అన్నాడు —

"మరి నువ్వేం చెప్పావు?"

"ఏదీ! నాకు నవ్వటంతోనే సరిపోయింది! ఆవిడ కాస్తా గదిలో దూరింది."

"తెలివైందే ననుకుంటాను."

"అసాధ్యమైన తెలివితేటలు. చాలా గడుసుది," ఇందిరా, చాలా సేపు సుశీల గురించే మాట్లాడుకున్నారు.

పలకరించటానికి పనికిరాని ఆ మూగపిల్లని చూస్తే ఏ కలుగుతుంది భాస్కరానికి. సుశీల నెదురుగా పెట్టుకుని

కోరిక సన్నసన్నగా బయల్దేరి వట వృక్షంలా తయారై కూర్చుంది. భాస్కరం మనోభావాలు అంచనా కట్టగలిగిన ఇందిర లో లోపల నవ్వు కొంది.

సుశీల అద్దం ముందు నిలబడి తల దువ్వుకొంటూంటే భాస్కరం రెండు నిముషాలు గడి ముందు తచ్చాడి లోపలకు వచ్చేశాడు. టేబిల్ దగ్గిర నిలబడి పుస్తకాలు కెలుకుతూ సుశీలని చూడటంలో నిమగ్న మయ్యాడు — చటుక్కున వెనక్కి తిరిగిన సుశీల భాస్కరాన్ని చూసి కంగారుపడింది. అల్లుకుంటూన్న జడ వదిలేసి దువ్వెన పళ్ళు లెక్కపెట్ట టాని కుపక్రమించింది.

సుశీలని పలకరించాలి. ఏదో మాట్లాడాలి చేతి కందిన పుస్తకం తీసి చూపిస్తూ అన్నాడు అతి సామాన్యంగా — "నువ్వీ పుస్తకం చదివే శావా సుశీలా?"

సుశీల సిగ్గుతో చితికిపోతూన్నా బింకంగా తల తిప్పి పుస్తకంకేసి చూసింది — "లేదు" అన్నట్టు తల అడ్డంగా తిప్పింది.

"నీకు పుస్తకాలంటే చాలా యిష్ట మనుకుంటాను. ఎప్పుడూ ఏదో చదువుతూనే వుంటావు"

" .... .... ...."

"నాకూ యిష్టమే. మంచి పుస్తకాలు వుంటే అన్నంకూడా అక్క ర్లేదు, నిజంగా"

అలాంటి వ్యక్తులు తనకు చాలా యిష్టమన్నట్టు అభిమానంగా చూసింది సుశీల.

"నేను భావకవినా అని అడిగావు. నీ కెందుకలా అనిపించింది?"

" .... .... ...."

"అదేమోగానీ నన్ను చాలామంది అలాగే అంటారు. నేను ...కాకపోయినా నా సరదా తీరిపోతోంది."

...న్నగా నవ్వింది సుశీల.

కళలనేవి సహజంగా రావటం అదృష్టమే అనుకో. లేనివాళ్ళకి ... విశేషాల్లో కూడా అవి పట్టుబడతాయట వాల్మీకి నోటినుంచి

రామాయణంలో మొదటి శ్లోకం అలా ఆశువుగానే వచ్చేసిందట కదూ? — అయితే సామాన్యమైన మనిషిలో కళావాంఛ ఉద్భవించటానికి తగిన దోహదం కావాలి అకస్మాత్తుగా అనుకోని విధంగా ఏదో జరగాలి. ఒక అందమైన అమ్మాయిని చూస్తే కవిత్వం పుట్టవచ్చు .. సుందరమైన ప్రకృతిని తిలకిస్తే చిత్రలేఖనం అబ్బవచ్చు. మధురమైన సంగీతం వింటే .. వింటే ... ఏదో కావచ్చు. నాలో ఉద్రేకం వస్తే అంతులేనన్ని కథలు రాసి పారేస్తాను" భాస్కరం వాగ్ధాటి విరమించుకుని చూచే సరికి సుశీల కొంగు అడ్డం పెట్టుకు నిలబడి వుంది. రెండే రెండుపాయలు అల్లిన జడ పూర్తిగా విడిపోయి వీపంతా వెంట్రుకలావరించు కున్నాయి.

"నవ్వుతున్నావా? ఎందుకూ? నిజంగా నిన్ను చూస్తే కవిత్వం పుడుతోంది. అజంతా సుందరి స్నానం చేసి వస్తూన్నట్టుగా ...."

"కానౌను. ఎల్లోరా సుందరి స్నానానికి వెళుతూన్నట్టుగా .. " కిటికీలోంచి చూస్తున్న ఇందిర పకపకా నవ్వేసింది. భాస్కరం. సుశీల కూడా సిగ్గుపడి పోయారు — "నిజమేరా అన్నయ్యా! ఈ సుందరిని చూస్తోంటే నాకూ కవిత్వం పుట్టేస్తోంది." ఇందిర గదిలోకి వచ్చింది తల దించుకొని బయటికి పోబోతున్న సుశీలని కొంగుబట్టుకుని ఆపుతూ - "ఆగవమ్మా! ఏం సిగ్గూ? నా దగ్గిరెప్పుడైనా ఇంత బుద్ధిగా నిలబడ్డావూ? మా అన్నయ్యతో నీ కేమిటా మంతనాలు? వాడంటే మొగ మహారాజు — ఏదైనా చేసి చెల్లించుకుంటాడు. అవునా?" అంది. భాస్కరంమాట్లాడక తప్పలేదు— "ఉత్తదే ఇందిరా! నేనే ఏదో వాగేస్తున్నాను గానీ సుశీలేం మాట్లాడలేదు నాతో."

ఇందిర ఉగ్గలు నొక్కుకుంది — "అయ్యో రామా! ఈమెణ్ణి చూస్తే నీకు కవిత్వం పుట్టినట్టే — నిన్ను చూస్తే ఈమెకి వ ... వచ్చేశాయనుకున్నానే!"

భాస్కరం సిగ్గుపడిపోయాడు. ఇందిర ఇద్దర్నీ కాస్సేపు పట్టించి వదిలేసింది.

తర్వాత ఇందిర అన్నగార్ని ఒంటరిగా అడిగింది. "సుశీలంటే నీ అభిప్రాయమేమిటి?" అసలే తల బొప్పికట్టివున్న భాస్కరం తూచి తూచి మాట్లాడాడు— "సుశీలంటేనా? నాకు అభిప్రాయ ఏమిటి?"

"నీ కున్నపాటి తెలివి నాకూ వుందిగానీ సరిగ్గా మాట్లాడుదూ! నేనేం హాస్యానికి అడగటంలేదు సుశీలని పెళ్ళి చేసుకోవటం నీ కిష్టమేనా?"

భాస్కరం తృళ్ళిపడ్డాడు — "సుశీలనా!"

"ఏం? అంత ఆశ్చర్యపోతున్నావ్. సుశీలంటే నీకు మంచి అభిప్రాయం లేదా?"

"ఇందూ! నువ్వు ఆలోచించే మాట్లాడుతున్నావా?"

"అంటే సుశీల నీ జీవితాని కేవిధంగానూ పనికిరాదనే నీ ఉద్దేశ్యం?"

"అయితే మాత్రం?"

"మరి సుశీలని పల్కరించి కబుర్లు చెప్పటంలో నీ అభిప్రాయం?"

భాస్కరం మాట్లాడలేదు.

"పెళ్ళికాని ఆడపిల్ల కనపడితే వెంటాడటం కాలాక్షేపానికేనా?"

"ఇందూ!"

"ఏం అన్నయ్యా? అన్యాయంగా అంటున్నానా? సుశీలని పల్కరించాలని తహతహలాడి పోయావ్. తీరా ఎదురుపడగానే ఉన్నవీ లేనివీ కల్పించి చెప్పావ్, పెళ్ళివరకు వస్తే నసిగేస్తున్నావ్ మరి ఆవిడపట్ల నీ యిష్టం ఎటువంటిది? ఆవిడ స్నేహం కోరటంలో నీ అభిరుచి ఏ తరహాది? నిన్ను నిర్మొహమాటంగా అడుగుతున్నా నన్నయ్యా!"

"నన్ను అపార్థంచేసుకున్నావు ఇందూ! నాలో చెడ్డభావం ఎప్పుడూ లేదు. ఏదో సరదాగా పలకరించానంతే."

"అదే అన్నయ్యా! నీ తప్పటడుగు! ఆడపిల్ల జీవితం నాశనం [illegible] ఆ మాత్రం చాలు. మీ స్నేహం [illegible]లపడి చెడు మార్గాలు పట్టి [illegible]వాహాని కనుకూలంగా లేని నీ మీద సుశీల లేనిపోని ఆశలు [illegible]మ్ము. కాదంటావా? అప్పు డేమౌతుంది? నీ సరదా ప్రాణ కాదా?"

"..... ..... ..... .."

"మాట్లాడవేం అన్నయ్యా! సుశీల తిరిగి జవాబివ్వకపోయినా ఆమెతో మాట్లాడుతూ పోవడం నీకు సంతృప్తిగా లేదా? బాగా ఆలోచించు అన్నయ్యా! సుశీల ఎంత తెలివైంది! చురుకైంది! అన్ని పనులూ చెయ్యగలదు. ఎన్ని బాధ్యతలైనా సమర్థించుకోగలదు. నీ వంటి వ్యక్తి సుశీలని దయదల్చటం మాత్రం ధర్మంకాదా అన్నయ్యా!"

భాస్కరం కొంతసేపు మౌనంగాఉండి అన్నాడు

"అమ్మ ఒప్పుకుంటుందా?"

"అసలు నీకు యిష్టమయిందా? ఆవేశంతో అంగీకరిస్తున్నావా? కేవలం సానుభూతితోగాక సుశీలని యిష్టంతోనే స్వీకరించాలి సుమా! ఆ బరువు బాధ్యతలన్నీ నీవి పోనీ ఆలోచించి చెప్పు."

"లేదు ఇందూ! నాకు యిష్టమే."

"మనస్ఫూర్తిగా చెప్తున్నావా?- నిన్నెవరూ బలవంతం చెయ్యటం లేదు నువ్వు కోరి చేసుకుంటానంటేగానీ, ఆవిడ అన్నలుకూడా అంగీకరించరు."

భాస్కరం నవ్వాడు

ఆ వేసంగిలో భాస్కర్ _ సుశీలల వివాహం కన్నుల పండువుగా జరిగింది.

"విధిలీలలు విచిత్రమైనవి!" "భగవంతుడు దయామయుడు!" అన్న సూక్తులు ఎంతమాత్రం అసత్యాలు కావు. భవిష్యత్ జీవితం అనామకం కానున్నప్పుడే అనుకోకుండా దానికి అడ్డకట్ట పడుతుంది. దుఃఖపూరితం కావలసిన బ్రతుకులు మరో మార్గంలో నడిచి చివరికి స్వర్గధామాలు చేరుకుంటాయి. అది గ్రహించలేని సామాన్యులు తాత్కా[illegible] చెడిన బ్రతుకుల్ని శపించిన దైవాన్ని బాధాపూరిత హృ[illegible] నిందించుకుంటారు. ఓడలు బళ్ళు - బళ్ళు ఓడలూ కావచ్చుననే కరుణాసముద్రుడైన భగవంతుని చిద్విలాస పూరితమే కావచ్చు.

కని పెంచిన తల్లిదండ్రుల్నీ. సుఖసంతోషా లివ్వగలిగే ఆస్తి పాస్తుల్ని గోల్పోయి అనాథలై రోజులు యుగాలుగా గడుపుకున్న సూర్యం, మధూ, సుశీల జీవితమార్గాలు సువిశాలమైన రాచబాటలో కలిసి పోయాయి.

సూర్యం అనుకూలవతియైన భార్యతో, కుడి - ఎడమ నేత్రాలవంటి బిడ్డలతో సంతృప్తికరమైన జీవితరథాన్ని సునాయాసంగా నడిపించుకు పోతున్నాడు.

సుశీల - కావలసినవారంతా రోసిన-సుశీల విద్యాధికురాలై తనభర్త చేత అపురూపంగా ప్రేమింపబడుతూ - కన్నపిల్లల ఆటపాటలతో ఇహ ప్రపంచమే మర్చిపోతూ శరవేగంతో జీవితంలో పరుగులు పెడుతోంది.

మధు - చిన్ననాటినుంచీ విశిష్టమైన వ్యక్తిత్వంగల మధు మొదటి శ్రేణిలో బి. ఎ. పరీక్ష పాసై అంతులేని ప్రశంసలు అందుకున్నాడు. ఆర్థిక యిబ్బందులవల్ల లాయర్ కావాలనే వాంఛను తాత్కాలికంగా అరి కట్టుకొని యు పి ఎస్. సి. పరీక్షకు కూర్చుని విజయం సంపాదించాడు.

విశ్వనాథంవంటి అసూయాపరులకు విభ్రాంతి కలిగించేలా కో ఆప రేటివ్ సొసైటీలో ఒక ఆఫీసరై కూర్చున్నాడు.

సుధ అకస్మాత్తుగా జబ్బుపడటంతో స్కూలుఫైనల్ పరీక్షలకు హాజరు కాలేకపోయింది ఒక సంవత్సరం. - రెండోసారి రాసినా విజయం సంపాదించలేకపోయింది. సుధతోపాటు యింటిల్లిపాదీ నిరుత్సాహ పడి పోయారు. సుధను ఓదార్చి ప్రోత్సహించినవాళ్ళు లేకపోయారు సుధ ఊహాలోకంలో కట్టుకున్న గాలిమేడలన్నీ చూస్తుండగానే మాయమై పోయాయి. సుధ కళ్ళనీళ్ళు నింపుకోవటంతప్ప ఏమీ చెయ్యలేక పోయింది.

సాధ్యమైనంత తొందరలో సుధా మధులకు పెళ్ళిచేసెయ్యాలని సుంద రి ఆరాటం. ఆవిడ పూర్తిగా ఒంగిపోయింది. పళ్ళు వూడిపోయి, ...ంచక మూడుకాళ్ళ ముదుసలై పోయిన సుందరమ్మగారికి తనే ...నా రాలిపోవచ్చుననే అనుమానం బలంగా ఏర్పడిపోయింది.

"మధూ! యింకా నీకు చిన్నతనమేనట్రా? పెళ్ళి చేసుకోవూ!"

"ఉండవే అమ్మమ్మా! ఇప్పుడేం తొందర పెళ్ళికి?"

"పండుటాకు ఎన్నాళ్ళు రాలకుండా వుండిపోతుందిరా? నీ పెళ్ళి నన్ను చూడనివ్వవురా మధూ?"

"అయితే అదేదో నీ చేతులతోనే చేసెయ్యవే. నువ్వు లేకపోతే నేను పెళ్ళిచేసుకోను."

రోజుకోసారైనా ఆ వాదన జరిగి బోసి నోటితో నవ్వుకుంటే గాని సుందరమ్మగారికి తృప్తి ఉండదు. ఆవిడ చిన్న కొడుకు దగ్గిర కూడా అలాగే పోరు పెడుతుంది. "ఏం చదువుట్రా నాయనా! లక్షణంగా పిల్లని పెళ్ళి చేసుకోక."

"అన్నయ్యే చూస్తాడులేమ్మా అంతా."

"నువ్వో పిచ్చి సన్యాసివి నీ బిడ్డ విషయం నువ్వు చూసుకోక అన్నయ్య మీదైతే మాత్రం ఎందుకు పెట్టాలిరా? వాళ్ళిద్దరిమధ్య పచ్చ గడ్డివేస్తే భగ్గుమంటుంది ఏమంటాడో ఏమిటో!"

"ఏమోనమ్మా! అంతా అన్నయ్య ఇష్టమే. ఆ మంచి-చెడ్డలన్నీ నాకెందుకు తెలియవు?"

సీతాపతి తన సంసార బాధ్యతంతా అన్నగారిమీద ఏనాడో వదిలేశాడు. ఈ నాడు సుధ పెళ్ళి విషయంలో కూడా తనకై తను నిర్ణయించదల్చుకోలేదు. మధుని అల్లుడిగా చేసుకోవాలనే మాట అన్నగారి నోటి వెంటనే విని తనూ తల వూపటానికి సిద్ధంగా ఉన్నాడు.

సుందరమ్మగారి ప్రోద్బలంతో - సూర్యం మేనమామల దగ్గరికి బయల్దేరాడు. సీతాపతి, విశ్వనాథం, పార్వతి, సావిత్రి,- ఉండవల్సిన పెద్ద మనుషులంతా ఉన్నారు.

"బావున్నారా సూర్యం? పిల్లలూ వాళ్ళూ కులాసాయేనా? బొత్తిగా రావటమే లేదేం?" వంటి సర్వ సామాన్యమైన పలకరింపులు మ... సూర్యం ఎందుకు వచ్చాడో అందరికీ తెలుసు. అందరికీ తెలుసని సూర్యానికీ తెలుసు. అయినా ఎవ్వరూ ఆ ప్రసక్తి ఎ... ...లో సుందరమ్మగారు కలగజేసుకోక తప్పలేదు-

"విశ్వం! సూర్యం పెళ్ళి విషయం మాట్లాడటానికే వచ్చాడురా!"

విశ్వనాథం తల్లికేసి చూశాడు. "ఏం పెళ్ళమ్మా!"

"అదేమిట్రా, బొత్తిగా తెలీనట్టే అడుగుతున్నావ్? ఈ ఏడాదైనా సుధ పెళ్ళి చెయ్యవూ? వాడి ఉద్యోగం ఎలాగూ ఖాయపడింది. ఇదింకీ వయసూ వచ్చింది. ఆ మూడు ముళ్ళూ వేయించి అయిందనిపించేస్తే" సుందరమ్మగారు ఎదో పెద్దభారం దిగిపోయినట్టు నిట్టూర్చింది.

"సుధ పెళ్ళిమాట నాతో చెప్పట మేమిటి? తల్లిదండ్రు లుండగా మధ్య నేనా పెళ్ళి చేసేవాణ్ణి?"

"అదేమిటన్నయ్యా అలా అంటావు? సుధ పెళ్ళి నీ యిష్టం మీద కాకపోతే ఇంకెలా జరుగుతుంది? ఏనాడూ నీ మాట నేను వ్యతిరేకించ లేదు." సీతాపతి అన్నగారికి కోపం రానివ్వకుండా మాట్లాడాడు. తనేమి పట్టించుకోదల్చనట్టు "అప్పే! అదేం మాటరా? నీ పిల్ల పెళ్ళి నా పెత్తన మేమిటి మధ్య? నీ యిష్టమైనట్టే మాట్లాడుకో" అన్నాడు విశ్వ నాథం.

సీతాపతి అన్నగారి మొహంలోకి చూస్తూ అన్నాడు. "ఏనాటినుంచో నా మంచి చెడ్డ లన్నీ నీ మీద పెట్టానన్నయ్యా! నీ యిష్టం లేకుండా సుధ పెళ్ళి చేస్తానని మాత్రం అనుకోవద్దు" విశ్వనాథం మరీ తెలివి తక్కువగా ప్రవర్తించడనే సీతాపతి ఉద్దేశ్యం.

గడప కవతలగా కూర్చున్న సావిత్రి కూడా బావగార్ని ఉద్దేశిస్తూ అంది — "నేను గానీ, మీ తమ్ముడు గానీ మీ మాట వినమనేగా అంత కష్టంగా మాట్లాడుతున్నారు? అంతా మీ చేతుల్లోనే ఉంది. మీ యిష్ట మైనట్టే చేయండి. కాదనేదెవరు?"

విశ్వనాథానికి బాగా ధైర్యం వచ్చింది. —

"ఇష్టాని కేముందిలే. పెళ్ళంటే బొమ్మలాటకాదుగా? పిల్ల కష్ట ఆలోచించాలిగానీ-మర్యాదలకీ, మోమాటాలకీ పోతే వీల్లేదుమరి. ప్రస్తుతం ఏ ప్రస్తావనకు నాందో ఎవరికీ అర్థంకాలేదు — విశ్వనాథం ఆలోచిస్తూన్నా వాడిలా కూర్చున్నాడు. చివరికి సీతాపతి కేసి

చూస్తూ - "సుధని వాడికిచ్చి పెళ్ళి చెయ్యటం నాకేం యిష్టం లేదురా! తర్వాత నీ యిష్టం-" అనేశాడు. ఒక్కసారిగా గాలి స్తంభించి పోయినట్టు ఉక్కిరి బిక్కిరయ్యారు అంతా.

"విశ్వం! ఏమిట్రా నువ్వన్నదీ?" ఆదుర్దాపడింది సుందరమ్మ గారు.

"అవునమ్మా! ఆ రౌడీ వెధవకి సుధనివ్వటం నాకెంత మాత్రం యిష్టంలేదు."

"మామయ్యా!" సూర్యం హెచ్చరికతో విశ్వనాధం రెచ్చిపోయాడు. "ఇక మాట్లాడక్కరలేదు. నీ తమ్ముడికీ - నా కూతురికీ పెళ్ళి జరుగుతుందని కలలో కూడా అనుకోకు. అంతే."

"ఏం? ఎందుకని?"

"ఇందుకేమిటి? చిన్నా పెద్దా అనకుండా వాడొక మేకలా వొడ వస్తోంటే నాకేనా అంత సిగ్గు లేదు?"

"చిన్నవాడితో పాటు నువ్వు తొందరపడకు విశ్వం! ఇంతకాలానికి పెళ్ళివద్దనుకుంటే సమజసంగా ఉంటుందా? కల్యాణి కోరికైనా"

"ఆఁ పోనిద్దూ! కోరికలకేం? నాకూ ఉన్నాయి. జరిగినప్పుడు కదా? చచ్చిన వాళ్ళకేం? బ్రతికినవాళ్ళని కూడా తన్నుకు చావమంటారు."

సూర్యం శాంతంగానే అన్నాడు- "మధుకి పెళ్ళికాదని నిన్నడగటానికి రాలేదు మామయ్యా! ఈ పెళ్ళి జరగటం అన్ని విధాలా మంచిది. మా అమ్మ కోరిక తీర్చవలసిన బాధ్యత ముఖ్యంగా నా మీద ఉంది. అందుకే నాకై నేను నీ దగ్గరికి వచ్చాను."

"వస్తే వచ్చావు. వచ్చినట్టే వెళ్ళు." విశ్వనాధం వెటకారంగా అని లేచాడు - "సీతాపతి ఆ బాధ్యతేదో నా మీద పెట్టాడు. సుధ బిడ్డలు చూడవలసిన పని నా మీద ఉంది. నీ తమ్ముణ్ణి చేసుకొని బాగుపడిపోయేదేం లేదని మాకు బాగా తెలుసు. నువ్వు లక్షరూ. ఎదురిచ్చినా సుధని వాడికి చెయ్యను. సరేనా?"

"మామయ్యా! నీకు యిష్టం లేకపోతే ఆ మాట చెప్పేస్తే సరిపో తుంది. ఎదుటి వాళ్ళని అవమానం చేసి పంపితే రేపు నీకు జరిగేది కూడా అదే. సరే! నేను వెళుతున్నాను." — సూర్యం లేచాడు.

సీతాపతి గుండెలు కొట్టుకున్నాయ్. "ఒరేయ్ సూర్యం! కంగారు పడకురా కూర్చో!" అనగలిగాడు నెమ్మదిగా.

సూర్యం గుమ్మంలో నిలబడే అన్నాడు. "మధుకి తెలీకుండానే నేను వచ్చాను. మామయ్యా! నా తప్పు లేకుండా అడిగి చూశాను. నీ కూతురి పెళ్ళి విషయం నీది కానప్పుడు — ఇక నేనిక్కడ నిలబడవలసిన అవసరం లేదు."

సీతాప తేమీ మాట్లాడలేదు.

విశ్వనాథం వ్యంగ్యంగా అన్నాడు —"నీ తమ్ముడొక్కడే నీ మాట విని అన్నగార్ని అందలం ఎక్కిస్తా డనుకొంటున్నావు కాబోలు."

"చిన మామయ్యా! నువ్వు మీ అన్న మాటే విను. నేను వెళుతు న్నాను." చరచరా చీడీలు దిగి వెళ్ళిపోయాడు — సీతాపతి కొయ్యబారి పోయాడు. అంతా క్షణాల మీద జరిగి పోయింది.

సుందరమ్మగారు నెత్తీ నోరూ — బాదుకుంది. "అయ్యో దేవుడా? ఇక ఈ రెండు కుటుంబాలూ ఎప్పుడూ కలుసుకుంటాయిరా విశ్వం?" అంటూ వాపోయింది — "బ్రతుకంతా చిన్నతనమేనా? రేపట్నుంచీ వాడే మంచివా డౌతాడు. కావలసిన వాళ్ళని దూరం చేసుకుంటే ఏముందిరా నాయనా?"

విశ్వనాథానికి చిరాకు వేసింది. "ఏదో జరిగిపోయినట్టు నువ్వలా గొడవ చెయ్యకమ్మా! ఇంతటి మొనగాడూ దాటిపోతే సుధకి పెళ్ళి కాద నేనా మీ అందరి భయం? ఏంరా సీతాపతీ? ఆ మధు గాడి కిచ్చి చేద్దా ముందా నీకూడా?" మధుపట్ల అన్నగారి ద్వేషం హర్షించలేని నోరు పెగల్చుకుని మాట్లాడాడు — "ఎంతయినా వాళ్ళు మనకు కావాల్సిన్నయ్యా? వాణ్ణి కాదని ఏం చేసినా లోకులు మననే

"ఇదిగో ఇలాంటి డొంక తిరుగుడు కబుర్లు నాకు పనికిరావు. నీ ఉద్దేశ్య మేమిటో తేల్చి చెప్పు."

"చెప్పటాని కేముంది! మధు మంచి ఉద్యోగం చేసుకొంటున్నాడు. కావలసినవాడు. సుధనిచ్చి పెళ్లి చేద్దామనే వుంది."

"అలాంటప్పుడు నీ ఇష్టం నీ ఇష్టం అని నక్క వినయా లెందుకురా? ఆ మధుగాడు నన్నెన్ని మాటలన్నాడో మర్చిపోయావు కదూ? అవున్లే. నీకు గురు ఉంచుకోవాల్సిన అవసర మేముంది? మీ రంతా ఒకటి — ఎటొచ్చీ నేనే ...."

"అన్నయ్యా! నీ కంటే మధు నాకు ఎప్పుడూ ఎక్కువ కాదు. ఎవర్ని వదులుకోవాలా అన్న ప్రశ్న వస్తే వాణ్ని వదులు కుంటాను. కాని .... ఒక్కటి ఆలోచించన్నయ్యా! వాడు చిన్నవాడు. మన కృష్ణుకి లాంటి వాడే. కృష్ణు డెన్ని అకతాయి పనులు చేస్తే మనం సహించటం లేదు?"

"దానికీ దీనికీ ముడి పెట్టకు నా కంఠంలో ప్రాణం వుంటే, వాడు కూసిన కూతలు మర్చిపోను. పెద్దవాణ్నని కూడా ఆలోచించకుండా నోటి కొచ్చినట్లు వాగాడే వాడి కాళ్ళు కడిగి కన్యాదానం చెయ్యమంటావా? అది నా వల్లకాదు."

".... .... ... .... ...."

"ఆ రౌడీ వెధవకి కట్టబెడితే సుధ సుఖపడుతుందనేనా నీ ఉద్దేశ్యం? ఎంత తెలివయిన పిల్లయితే మాత్రం వాడి మంకు తనం ముందు ఎలానెగ్గు కొస్తుంది? చీటికీ మాటికీ మనమీద కోపం దాని మీద తీర్చుకుంటాడు కూడా."

".... .... .... .... ...."

"ఎటొచ్చీ వాడిపాడి ఉద్యోగం వెలగ బెట్టేవాడు రాడనే! భయం? ఆ పూచీ నాది. వాడి తల దన్నినవాణ్ని తీసుకొచ్చి నాటికి ముడేయిస్తాను."

"కాదన్నయ్యా! కల్యాణి కూడా ...."

"చెప్పానుగా? సామరస్యంగా ఉన్నప్పుడు ఎన్నయినా అనుకుంటాం. బ్రతికి ఉన్న వాళ్ళ కోరికలే తీరటంలేదు. ఇక చచ్చిన వాళ్ళ మాటేమిటి? లోకం గొడ్డుపోయిందిరా సీతాపతీ! సుధకి లక్షణంగా పెళ్ళిచేసే బాధ్యత నాదేనని చెప్పటం లేదూ? నీ పిల్లలు నా పిల్లలు కారని ఎన్నడయినా అనుకున్నానా? - నువ్వేదో భ్రమపడుతున్నావు గానీ బంగారం బొమ్మలాంటి పిల్లని వాడికి కట్టబెట్టి - రేపు కష్టానికీ, సుఖానికీ వాడికి నచ్చజెప్పగలమా?"

" .. .... .... ...."

"ఏమిట్రా? నీ ఉద్దేశ్య మేమిటో తిన్నగా చెప్పు. నీ పిల్లల్ని నీ యిష్టం వచ్చినట్టు చేసుకుంటానంటే నే నెవణ్ణి మధ్య ఆపటానికి?"

సీతాపతి మాట్లాడకుండానే సావిత్రి అంది - "మీ యిష్టం వచ్చినట్టే చెయ్యండి. మే మెలా కాదంటాం? దాని మంచి చెడ్డలు మీకు తెలీవు గనకా?"

సీతాపతి నీరసంగా లేచి గదిలోకి వెళ్ళిపోయాడు - సావిత్రి లోపలికి వచ్చి భర్తకు జ్ఞానబోధ చేసింది - "దానికి పెళ్ళిచేసే బాధ్యత తనదే నంటున్నాడుగా? ఆయనకేం. పేరు లేదా? ప్రతిష్ట లేదా? ఇంతకన్నా మంచి సంబంధమే తేగలరు - ఇంత మాత్రానికి ఆయన మాట తోసి పుచ్చటం దేనికి? ఆయనకు లొంగి వుండాల్సిన అవసరం మనకే ఉంది మరి. మీకు మాత్రం తెలీని దేముంది?" - బావగారి ఆస్తి పరాయివాళ్ళ వరకూ తన్నుకు పోకుండా తగినన్ని కట్టుదిట్టాలు చేస్తూ - కావలసినన్ని ఉపాయాలు ఆలోచిస్తూనే ఉంటుంది సావిత్రి - పిల్లల తల్లి!

"అయితే సుధ ఏమంటుంది?" ఆశగా చూశాడు సీతాపతి - ఒడిగావా?"

"దాని మొహం! మొదటినుంచీ ఆ పిల్లాడంటే దానికేం లక్ష్యం

"సరే! మీ అందరికీ యిష్టమైతే ఇక నాదేముంది?" ఉదాసీనంగా అన్నాడు సీతాపతి.

* * *

ఆ విషయం విన్న మధు బ్రమ్మస్పడిపోయాడు. రెప్పపాటు లేకుండా తీక్షణంగా చూస్తూ నిలబడ్డాడు — తనకు సుధనిచ్చి పెళ్ళిచెయ్యటానికి మామయ్య తిరస్కరించాడా? పైగా తన తలదన్నిన వాణ్ణి తెచ్చి పరీ చేస్తానన్నాడా?

ఆ రోజంతా ఏదో పోగొట్టుకున్నట్టు మధు కేమీ తోచలేదు. తీవ్రంగా ఆలోచిస్తూ కూర్చున్నాడు. సుధకి తనంటే ఇష్టంలేదా? కాక పోతే తననే చేసుకుంటానని ఎందుకు చెప్పలేదు? ఒక్కసారి సుధతో మాట్లాడితే —? ఎందుకు మాట్లాడాలి —? ఆలోచనా పరంపరతోనే రెండురోజులు గడిచాయి. రాత్రి ట్రయిన్ కెళ్ళటానికి మధు పెట్టె సర్దుకొంటూంటే సీతాపతి వచ్చాడు. మధు మొహంలోకి చూడలేని వాడిలా మొహం దించుకునే అన్నాడు. "నీతో కొంచెం మాట్లాడాలి మధూ! అలా వస్తావా?"

మధు సర్దుకుంటున్న వస్తువులన్నీ ఎక్కడివక్కడ వదిలేసి సీతాపతి వెనక నడిచాడు. రోడ్డు కవతల చింతచెట్టు కిందికి పోయి నిలబడ్డాడు. సీతాపతి మధు చేతులు రెండూ పట్టుకున్నాడు—

"కోపం తెచ్చుకోకుండా నా మాట వింటావా మధూ! ఇవి చేతులు గావు...."

"ఛ అవేం మాటలు మామయ్యా? నీ మీద నే నెప్పుడైనా కోపం తెచ్చుకున్నానా? ఫర్వాలేదు చెప్పు మామయ్యా!"

"సంగతంతా నీకు తెలుసు మధూ, సుధని పరాయిచోట ఇవ్వడం నా కేమీ ఇష్టంలేదు. కాని ఏం చెయ్యను? పిల్లలు గలవాణ్ణి...."

అర్ధోక్తిలో ఆగిపోయాడు సీతాపతి.

"నే నేం చెయ్యగలను!" ఆశ్చర్యంగా చూశాడు మధు.

"నా ఉద్దేశ్యం గ్రహిస్తే ఇలా మాట్లాడలేవు మధూ! అన్నయ్యకి నేను చెప్పి ఒప్పించలేను. వాడితో ఘర్షణపడి వదులుకోనూ లేను."

"అప్పన్లే ఆ ఆస్తి నీకు రాదనే నీ భయం?"

"కాదా మధూ? నా బాధ అర్థం చేసుకుంటే నువ్విలా ఎత్తిపొడుస్తావా?"

"అయితే మామయ్యా! పెద్ద మామయ్యకే పిల్లలుంటే నువ్వేం చేసేవాడివి?"

"అది వేరే సంగతి. అప్పటి పరిస్థితులు ఇలా వుండనే వుండవు — లిప్తకాలంలో ఈ చెట్టు కూలిపోతే మనమేం చేస్తాము? ఆపగలమా?"

"అయితే నన్నేం చెయ్యమంటావు మామయ్యా?" - మధుకి సీతాపతిని చూస్తోంటే మనస్సంతా కరిగి పోయింది. తిండి, నిద్రా లేనివాడిలా నీరసంగా, బలికగా ఆయాస పడుతూ మాట్లాడు తున్నాడు సీతాపతి — "నా మీద దయ యుంచి ఒక్క సహాయం చెయ్యి మధూ! కోపం తెచ్చుకోకు. పెద్దవాళ్ళని క్షమాపణ కోరటంలో తప్పులేదు. ఒక్కసారి అన్నయ్య దగ్గిరికి వచ్చి ... ..."

"మామయ్యా!" ఆశ్చర్యంగా చూశాడు మధు — "పెద్ద మామయ్యని క్షమాపణ కోరమంటున్నావా? .. నన్నా?"

"మరోలా అనుకోకు మధూ! నీకై నువ్వు అడిగితే అన్నయ్య ఒప్పుకోవచ్చు."

"ఒప్పుకోవచ్చు. అంతేనా? ఒప్పుకుంటాడా?"

"కాదు. ఒప్పుకుంటాడు. తప్పకుండా ఒప్పుకుంటాడు."

"మామయ్యా! నీ కిది ధర్మంగా వుందా? నేనేం తప్పుచేశానని ...టున్నావు?"

"...క్రమంగా ప్రవర్తించలేదని నాకు తెలుసు మధూ!

"క్షమించు మామయ్యా! అది నా వల్లకాదు. నా వ్యక్తిత్వం చంపుకుని ఆ పని నేను చెయ్యలేను."

"నువ్విలా అంటేకాదు మధూ! సుధ జీవితం పరాయివాళ్ళ పాలు చేస్తావా?"

మధు భారంగా నవ్వాడు — "నీ తండ్రి హృదయం ఎంతయినా క్షోభిస్తుంది మామయ్యా! సుధకే ఈ పెళ్ళిమీద లక్ష్యం లేనప్పుడు...."

"అది ఒట్టి పిచ్చిది. దానికేమీ తెలీదు. అన్నయ్య మాటలే దానికి సర్వస్వంగా కన్పిస్తాయి. అంత మాత్రాన దాన్ని విసర్జించటమేనా? ఆలోచించు."

"నీ మాట నేనేదీ కాదనను కాని నువ్వు చెప్పిన పని మాత్రం చెయ్యలేను-పెద్ద మామయ్య ఆ రోజు మా అన్నయ్య నెంతో అవమానం చేసి పంపాడు. దానికి తనే మాకు క్షమాపణ చెప్పుకోవాలి. పైగా నన్ను నువ్వు నిర్బంధించటం — వద్దు మామయ్యా! అది కలలో కూడా జరగదు. నీ మీద నా కెంతయినా సానుభూతి వుంది గాని, అది వినియోగించే మార్గం లేదు — నన్ను అపార్థం చేసుకోకు. నువ్వు వెళ్ళిపో."

"మధూ !"

"అంతే మామయ్యా! నన్ను క్షమించు."

సీతాపతి హతాశుడై పోయాడు. మధు భారంగా అన్నాడు—"నేను ఈ రాత్రికే వెళ్ళి పోతున్నాను. సెలవు లేదు. సుధ సుఖంగా ఉండటమే నాకు కావాలి. వాళ్ళ ఇష్ట ప్రకారమే చేసుకోనీ."

* * *

నెల తిరక్కుండానే విశ్వనాథం కూతురిక
కొచ్చాడు — "వరుడు రాజశేఖరం, బి. ఎ.
మాటికీ జబ్బుపడి అనారోగ్యాల వల్లగానీ —
ఏ నాడో అయిపోయిందనిపించేవాడు. తల్లి తండ్రు
తర్వాత ఒక్కగా నొక్క కొడుకు. తండ్రి అ

కొడుకే చక్క బెట్టు తుంటా — ఆస్తి దండిగా ఉన్నా ఉద్యోగం చెయ్యాలనే కుతూహలం కు • అబ్బాయికి దండిగానే వుంది. రాజశేఖరం తండ్రి మేనత్త అల్లుడి అక్కగారి మరిది కాబోలు జిల్లా కలెక్టరుగా పని చేస్తున్నాడు. అతని సిఫార్సువల్ల రాజశేఖరానికి మధురాడి వుద్యోగం బాబులాంటిది వస్తుంది. ఇక పిరుడు చూట్టానికా? దబ్బపండులా వంకీల జుట్టూ, అచ్చు సినిమా యాక్టర్‌లా వుంటాడు" — అది ఇంట్లో వాళ్ళందరికీ విశ్వనాథం తెలియజేసిన ఫోగట్టా. తను తెచ్చిన ఫోటో తీసి సుధని పిల్చి — "చూసుకోమ్మా! నీకు ఎంత అందమైన వరుణ్ణి తెచ్చానో! చూచుకో." అంటూ కవరు అందించాడు. సుధ సిగ్గు సిగ్గుగా సిల్కు ఓణీలో కవరు దాచుకుని గదిలోకి పరిగెత్తింది — కవరు తెరుస్తోంటే సుధ గుండెలు దడదడా కొట్టుకున్నాయ్ — గది తలుపులు బిగించి ఎవ్వరూ చూడటం లేదని నిర్ధారణ చేసుకుని అరమోడ్పు కన్నులు చేసుకుని ఫోటో తీసింది. హృదయం ఝల్లుమంది - శరీరమంతా అద్యంతం విద్యుత్తు పరుగులెత్తింది. విపరీతమైన సిగ్గుతో ఫోటో మళ్ళా మళ్ళా చూడలేకపోయింది — "ఎంత అందమైనవాడు! ఇతనికీ మధు రాపలో అసలు పోలికేమిటి! పెదనాన్నకి నా మంచి చెడ్డలన్నీ తెలుసు.

సుధకి కాస్త గుండెలు కుదుటబడి ధైర్యం వచ్చింది. తలగడమీద ఫోటో పెట్టి మొహం బట్టూ దోసిలికట్టి తదేకంగా చూడసాగింది. ఛ! ఏమిటంత చిలిపి చూపు? పెళ్ళి చూపులకే పోజు పెట్టినట్టుందే! అంత అందమైన నొక్కుల జుట్టు దువ్వుకోపటం ఏమి చేతకాలా. పాపిడీ గీపిడి లేకుండా పైకి దువ్వేసుకుంటే మెట్లు మెట్లుగా ముచ్చటగా వుండదూ? ఆ టై కట్టుకోటం ఫాషన్ కాబోలు — ఓ పక్కకి! అవును మరి. బి. ఎ. స్టూడెంటాయె — ఆ షోకులన్నీ తనకేం తెలుస్తాయ్?— సుధ సంతోషానికి అవధులు లేకుండా పోయాయ్.

—అల్లుడు మంచి ఆస్తిపరుడన్న సంగతి గుర్తు చేసుకుని పదే పదే [illegible]త్యకొంది సావిత్రి. సీతాపతికి కూడా ఒక రకంగా [illegible]పోలేదు — "పోనీ మధూ కాకపోయినా ఏదో లక్షణ

మైందే వచ్చింది సంబంధం. అన్నయ్య మాత్రం సుధకి అన్యాయం చెయ్యగలడా ?" అనుకున్నాడు.

"ఐదు వేలకే మంచి సంబంధం కుదరటం నిజంగా సుధ అదృష్టం. వాళ్ళు మంచి ఆస్తిపరులే కాదు బాగా పలుకుబడి కలవాళ్ళు కూడాను. నాతో వియ్యం పొందటానికి వాళ్ళెంతో సంబర పడుతున్నారు" ఈ మాటలు రోజుకి రెండుమూడు సార్లయినా వల్లె వేస్తాడు విశ్వనాధం.

* * *

ఒకసారి వచ్చి వెళ్ళమని రాసిన ఇందిర ఉత్తరం చూసుకుని బయల్దేరాడు మధు.

"సుధకి సంబంధం కుదిరిందట. లగ్నం కూడా పెట్టుకున్నారట."

మధు ఆశ్చర్యంగా చూశాడు — "ఇందుకేనా వదినా నన్ను రమ్మని రాశావు ?"

"నిజంగా నాకు బాధగా వుంది మధూ, మీ అమ్మమ్మగారు తిండీ నిద్రా లేకుండా కుమిలి పోతున్నారు నీ కిష్టమైతే మీ అన్నయ్య ఇంకోసారి అడుగుతా నంటున్నారు.

"ఎంత అభిమానం లేనివాళ్ళు వదినా మీరు."

"అభిమానాల కేమిటి మధూ? సిగ్గుపడాల్సిందేమీ లేదు. మీ అమ్మగారి కోరిక తీరితేగాని బావుండదు మీ అన్నయ్యగారు బాధపడుతున్నారు."

"వదినా! ఆ నాటి విషయాలన్నీ నాకింకా గుర్తు ఉన్నాయి. మా అమ్మ సుధ చిన్న పాపగా ఉన్నప్పుడు గొలుసు కూడా ఇచ్చింది. చిన్ననాడే మా పెళ్ళి నిర్ణయం చేసింది. వాళ్ళందరి మీదా ఎంత కోపం — ఎంత అసహ్యం ముంచుకు వచ్చినా, మా అమ్మ నిర్ణయానికే ఇన్నాళ్ళూ నేను కట్టుబడి వున్నాను కాని ... అలా జరగటం లేదు. దానికి మనం చెయ్యగలిగిందేమీ లేదు ఈ పరిస్థిల్లో అమ్మ వుంటే మనల్ని క్షమిస్తుంది గాని శపించదు."

ఇందిర దగ్గరిగా వచ్చి మధు చేతి మీద చేయి వేసి

"ఇలా చూడు! నీకు సుధనే చేసుకోవాలని [illegible]

మధూ!"

మధు మాట్లాడలేదు.

"చెప్పు మధూ! మీ అమ్మతో నీ మనస్సు విప్పి చెప్పవూ?" ఇందిర అనునయంగా, వాత్సల్య పూరితంగా మధు కళ్ళల్లోకి చూసింది.

"చెప్పటాని కేముంది వదినా? నాకు వూహ తెలిసిన నాటినుంచీ సుధకీ - నాకు ఏదో అనుబంధం ఉందని అర్థం చేసుకున్నాను. ఆ అభిప్రాయాలు ఏనాడూ మారలేదు. ఈ క్షణం వరకు నా మనస్సులో సుధకే చోటు వుంది. అంతకుమించి చెప్పటాని కేముంది?"

"విశ్వనాధంగారు మొదట మొదట ఆర్భాటం చేసినా, ఇంతవరకూ రాదనీ — మీ చినమామయ్యగారు ఒప్పుకోరనీ అనుకున్నాం. కానీ. "

"చిన్న మామయ్య నిజంగా ఒప్పుకున్నాడా?"

"అదేమిటి అలా అడుగుతున్నావు? పిల్ల తండ్రి ఒప్పుకోకుండా పెళ్ళి జరుగుతుందా?"

"సుధ!"

ఇందిర ఆశ్చర్యంగా చూసింది — "నీకు నిజంగా మతి పోయిం చింది."

"కాదు వదినా! చిన్న మామయ్య సంతోషంగా ఒప్పుకోలేదు. అంత వరకూ నాకు తెలుసు. సుధనికూడా అలాగే బలవంతంగా ఒప్పించారేమో!"

"నువ్వు భ్రమపడుతున్నావు మధూ! సుధ నీ మీద ఇష్టం ఉన్న నాడు, అయిష్టంగా మరో సంబంధానికి ఒప్పుకోవలసిన అవసరంలేదు."

"పోనీ వదినా! ఇంత లక్ష్యంలేని పెళ్ళి జరిగినా సుఖం వుండదు. ఇంత మాత్రానికే మనం బాధపడటమే తెలివి తక్కువ."

"నువ్వు లోలోపల బాధపడకుండా సమర్థించుకుంటే చాలు మధూ! అదే నా విచారం."

"..జంగా ఒకసారి సుధని కలిసి మాట్లాడవా మనుకున్నాను వదినా! - కల... నాకేం నచ్చలేదు. నేను తాపత్రయపడటంవల్ల వాళ్ళ

క్ష ...యోజనం ఉండదు. - చిన్ననాటినుంచీ జరిగిన సంఘటన

లన్నీ నెమరువేసుకుంటే సుధ నన్ను అభిమానించినట్టు ఎక్కడా అనిపించదు. మొదటినుంచీ నేనంటే అలక్ష్యంగా, అయిష్టంగానే ఉండేది. సుధకి నన్ను చేసుకోవాలన్న కోరికే ఉంటే సాహసించలేనంత తెలివి తక్కువది కాదు - అదే ఆలోచించి నా ఉద్దేశ్యం మార్చుకున్నాను. సుధని బలవంతంగా ఒప్పించారేమో నన్నది అబద్ధమే కావచ్చు."

"మధూ! నీ మీద నాకు సోదర వాత్సల్యం తప్పితే మరేమీ కాదు. నిజం చెపుతున్నాను. నీ లాంటి వ్యక్తిని పోగొట్టుకుంటున్న సుధ చాలా దురదృష్టవంతురాలు"

"అలా ఎప్పుడూ అనుకో కూడదు వదినా! సుధ ఎక్కడయినా సుఖంగా ఉంటుంది."

"అది మంచిదేలే."

మధు మనస్సు నెంత సమర్ధించుకోజూచినా, కొన్నాళ్ళు ఏదో వేదన అనుభవించక తప్పలేదు సుధని భార్యగా పొందగలననే కోరిక తనలో అంతగా పాతుకుందనీ, సుధ పరాయిదై పోవటం తనకు కష్టాన్నే కలిగిస్తోందనీ అప్పటివరకూ అర్థంకాలేదు. మధుకు.

సుధ పెళ్ళి మూడు రోజులు ఉందనగానే మధు వెళ్ళిపోయాడు ఆ రోజు - సుధ పెళ్ళిరోజు శుభ ముహూర్తం వేళ - అర్ధరాత్రి ఒంటి గంట ముప్పై నిముషాల సమయంలో సిగరెట్టు పెట్టెలు ఖాళీచేస్తూ కూర్చున్నాడు.

* * *

బ్యాండు మేళాలతో, సన్నాయి పాటలతో, పెళ్ళి సందడితో మార్మోగిపోతూన్న పెళ్ళి పందిరి అంతా తా నొక్కడే అయి నించాడు విశ్వనాధం.

రాజశేఖరం సుధ మెడలో మంగళసూత్రం కడుతూన్న వేళ సీతాపతి ఎంత ప్రయత్నించినా ఆపుకోలేని కన్నీటిని రహస్యంగా తుడిచేసుకున్నాడు.

* * *

సుధ అత్తవారింటికి వెళ్ళిపోయింది. ముని మనుమలతో ఆట లాడుతూ కన్నుమూసిం సుందరమ్మగారు.

సుదీర్ఘమైన - బాధాపూరితమైన రెండు సంవత్సరాలు కాల ప్రవాహంలో కొట్టుకుపోయాయి. మధు పెదవులమీది చిరునవ్వు ఎప్పటిలా కాంతగా మెరవసాగింది. వివేకవంతుడైన మధు పరిస్థితులకు తాను లొంగిపోకుండా నిలబడ గలిగాడు -

ఆ సమయంలోనే మధుకి ప్రఖ్యాత రచయిత్రి శారదా దేవితో పరిచయం కలిగింది. ఆమె రచనలో లోపాలను విమర్శిస్తూ మధు రాసిన ఉత్తరానికి శారదాదేవి వెంటనే సమాధానం ఇస్తూ రాసింది --- "మీరు అపార్థం చేసుకోకపోతే ఒక మనవి. ఇంతవరకూ నా రచనలను మీలా విమర్శనాత్మకంగా చూసినవారూ వాటిలో లోటుపాట్లను ఎత్తి చూసినవారూ కానరాలేదు వచ్చినవాళ్ళంతా విధిగా నన్నూ, నా రచనా శక్తినీ, పొగిడి మరీ వెళుతూంటారు. మీ పరిచయం నేను చాలా గొప్పగా భావిస్తున్నాను. మీతో ముఖతః మాట్లాడటంవల్ల ఇంకా కొన్ని విషయాలు తెలుసుకోగలనని ఆశిస్తున్నాను."

శారదాదేవి లేఖ చదివి మధు మొదట విస్తుపోయాడు. తర్వాత వెళ్ళటానికే నిశ్చయించుకున్నాడు.

శారదను కలుసుకున్న రోజు మధు జీవితంలో అపురూపమైనది --, అపూర్వమైనది.

తన కోరిక మన్నించి తనతో మాట్లాడటానికి వచ్చిన ఆఫీసర్ మధు రచయిత్రి శారదాదేవి సాదరంగా ఆహ్వానించింది. ఇంట్లో రద అభిమాన పాఠకుణ్ణి గౌరవాభిమానాలతో పలకరించి మర్యా ు.

వారి పరిచయం పరిచయంగానే నిలిచిపోలేదు. నిష్కపటమైన ు - బలీయమైన ఆత్మవిశ్వాసం గల మధుసూదన్ శారదా యమైన స్నేహితుడు.

తన స్నేహాన్ని వాంఛిస్తూ తను కోరుకున్న లక్షణాలన్నీ పొందు పరచుకున్న అందాల శారద మధుసూదన్‌కి అపూర్వమైన స్నేహితురాలు।

* * *

ఆ రోజు శారదాదేవి మధుసూదన్ కోసం ఆపేక్షగా నిరీక్షిస్తూ కూర్చుంది.

శారద నిరీక్షణ వ్యర్థం కాకుండా మధుసూదన్ వచ్చాడు. తన ఆల స్యానికి సంజాయిషీ చెప్పుకున్నాడు. స్నేహితు లిద్దరూ మాటల్లో మునిగి వుండగా వారి ముందుగా ఓ యువతి నడిచి పోయింది. తెల్లని చీరా, ఎర్రని జాకెట్టుతో చాలా మనోహరంగా కన్పించింది — మంత్రించినట్టే మాటలు మాని మధు ఆ యువతి వెళ్ళిపోయే వరకూ చూశాడు.

సుధకి పెళ్ళయిన తర్వాత మధు చూసింది అప్పుడే !— అప్పుడు —

కథ ఆగిపోయింది.

* * *

మధుసూదన్ వాచీ చూచుకున్నాడు. రెండు ముళ్ళూ పన్నెండుమీద పరదా లాడుకొంటున్నాయి వాచ్ తీసి టేబుల్‌మీద పెట్టి పక్కింగుమీద వాలిపోయాడు.

కలాని కందని — మాటలకు చిక్కని విచిత్రానుభూతులకు లోన య్యాడు మధుసూదన్. అణుచుకోలేని సంతోషంతో తలమున్కలై ఉక్కిరిబిక్కిరయ్యాడు. ఎంత చిత్రం। తన జీవితం ఒక నవలగా, అందులో తను కథానాయకుడిగా — — — ఎన్నడూ వూహించనైనా వూహించలేదే।

శారద—ఆదమరచి గాఢంగా నిద్రపోతూ ఉంటుంది, కిటికీ ఎగిరిపోయి శారద గదిలో ప్రత్యక్షమై హఠాత్తుగా లేపేస్తే — ?

తీయని తలపులతోనే ఆ రాత్రి నిద్రపట్టేసింది. మర్నాడు . నీరెండలో నిలబడిన శారద మధుసూదన్‌ని చూస్తూనే

నెమ్మదిగా తన గదిలోకి దారితీసింది. మంత్రముగ్ధుడై వెంట నడిచాడు మధుసూదన్.

"చదివేశారా ? అప్పుడే ?" ఆశ్చర్యం వ్యక్తపర్చింది శారద.

"శారదా !" మధుసూదన్ సూటిగా శారద కళ్ళలోకే చూడ బోయాడు.

"ఏమిటీ?" శారద తల పక్కగా తిప్పుకుంది.

"ఆగిపోయారేం? మాటలు రావటం లేదా ?"

"లేదు, నిజంగా శారదా! మాటలు రావటం లేదు."

శారద నవ్వింది. "ఎంత చిత్రం ! మాట్లాడుతూనే మాటలు రావటం లేదంటున్నారు !"

మధుసూదన్ కూడా నవ్వాడు — "కాదు శారదా ! జీవితాలు కథలుగా మార్చితే ఇంత రమ్యంగా వుంటాయని నాకు తెలీదే!"

"అలాగా ?"

"నిజం. రాత్రి ఎనిమిది గంటలకు పార్శిల్ విప్పేవరకూ ఇది మరేదో నవల అనుకున్నాను. కాని నా గాధ నేనే చదువుకొంటూంటే ఎలా చెప్పను శారదా? ఆ అనుభూతులు నేను వర్ణించలేను. సర్వం మైమరచి పోయాను. నా కథలో లీనమై చిన్ననాటి మధుగా మారిపోయాను ఆ రోజులు, ఆ ఘట్టాలు అన్నీ మరొక్కసారి అనుభవించాను. తదేకంగా చదివి ముగించేసరికి పన్నెండు దాటింది. అప్పటి కప్పుడే వచ్చి ఇదంతా నీకు చెప్పెయ్యాలని ఆరాటపడిపోయాను — నిన్ను హృదయ పూర్వకమైన అభినందనలతో, కృతజ్ఞతలతో ముంచెత్తాలని తహతహలాడి పోయాను. నమ్మ శారదా !"

శారదా క్షణం ఆశ్చర్యంగా చూసింది — "నమ్ముతున్నాను. ...తమైన మార్పు వచ్చింది,"

"నాలోనా ? ఏమిటి ?"

...]

శారద చిరునవ్వు నవ్వుతూ అంది — "నన్ను ఏక వచనంలో సంబోధించి మాట్లాడుతున్నారు. మీకు తెలుస్తోందా?"

మధుసూదన్ తత్తరపడ్డాడు.

"నన్ను మన్నించి పిలవద్దని మిమ్మల్ని ఎన్నోసార్లు కోరాను. మీరు లక్ష్యపెట్టలేదు సరిగదా - "మన మధ్య అంత చనువుగా పిల్చుకోవటానికి అనుబంధ మేమిటి శారదా ?" అని అడిగారు. ఇప్పుడు మీకై మీరే పిలుస్తున్నారు. ఆ అనుబంధమేదో ఏర్పడిందనే మీ ఉద్దేశ్యమా ?"

"క్షమించు శారదా! అలా పిలుస్తున్నాననికూడా నాకు తెలీలేదు."

శారద మధుసూదన్ కళ్ళలోకి చూసింది—

"మధూ! అలా పిలిపించుకోవాలనేకదా నా కోరిక ? నన్ను మీరు సన్నిహితంగా భావిస్తున్నారనీ — అందుకే మీ మనస్సు ఇంతగా మారిపోయిందనీ అనుకొంటున్నాను. అవునా ?"

మధు మాట్లాడకుండా మౌనం వహించాడు.

"ఏవో అభినందనలూ, కృతజ్ఞతలూ అందజేస్తానన్నారే! అవేమీ నా కవసరం లేదు."

"మరి ?"

శారద చురుగ్గా చూసింది — "నేను ఆడదాన్నయినా మీకున్న పాటి అభిమానం, వ్యక్తిత్వం నాకూ ఉన్నాయి. సరే! ఆ విషయం వదిలెయ్యండి. నవల విషయం మాట్లాడదాం.",

"శారదా ? కోపం వచ్చింది కదూ ?"

"ఎవరిమీద?"

"నా మీదే. నామీదేగా కథంతా రాశావ్. నీకు నేను ఎంతయినా ఋణపడి ఉన్నాను శారదా! నా జీవితాన్ని కథగా రాసిన అమూల్యమైనది."

శారద నిర్లక్ష్యభావం వ్యక్తపరుస్తూ అంది — "అదేమి కేదో కథా వస్తువు దొరికింది. బావు దనిపించింది రాసుకున్నాను మిమ్మల్నేదో అందలం ఎక్కించినట్లు అభినందిస్తారేం ?"

మధుసూదన్ షాక్ తిన్నట్టు చూశాడు. మరు నిముషంలో తేరు కొని నవ్వుతూ అన్నాడు — "అలాగా. తనురు రచయిత్రినంటూ బయ లేరి కనబడ్డవాళ్ళ జీవిత చరిత్రలన్నీ కాయితాలమీద కెక్కిస్తే ఫలిత మేమిటో తెలుసా? మా కుటుంబ రహస్యాలన్నీ బట్టబయలు చేశారని నేను మీ మీద కేసు పెడితే ..?"

"ఉఫ్ మని వూదేస్తాను — విశ్వనాథంగారు ఎప్పుడూ మీకు వ్యతిరేకం. మీ యిద్దరి మధ్యా పచ్చికట్టెలు వేసినా భగ్గుమంటాయి. ఒకరు అవునన్నది మరొకరు కాదనటమే మీ ధ్యేయం. ఈ కిటుకు నాకు తెలి యకపోతే కదా?" శారద నవ్వుతోంటే మధుసూదన్ అడ్డుపడ్డాడు —

"అయితే మాత్రం ...?"

"అయితే లేదు గియితే లేదు. కేసంటూ వస్తే మనం ఇద్దరం వెళ్ళి జెయిల్లో కూర్చుందాం. ఇదంతా మీరే నాకు చెప్పి రాయించారని చెప్పలేనా ఏమిటి?"

"పోయించే!" మధు అంగీకరించాడు.

శారద, మధుసూదన్ కళ్ళలోకి మృదువుగా చూసింది — "మరి ఈ నవలకు ముగింపు?"

శారద కంటి చూపులతో మధూ మనస్సంతా నిండిపోయింది. పొంగులెత్తుతూన్న ఆవేశం బలవంతాన అణుచుకుని, అమాయకత ఉట్టి పడేలా అన్నాడు. "రచయిత్రివి నువ్వు. నీ నవలకు ముగింపు నేనెలా చెప్పను?"

"రాసింది నేనే అయినా కథానాయకులు మీరు. అందుకే మిమ్మల్ని అడిగాను." .. శారద మౌనంగా కూర్చుంది.

"ముగింపు ఆలోచిస్తున్నావా శారదా?"

"నా ఆలోచన ఎప్పుడో ముగిసిపోయింది ..ముగింపు మీరు చెప్పని వల అసంపూర్తిగా వదిలేస్తాను." శారద కొంతసేపు ఆగి నెమని ంది— "మధూ ఏమిటో నాకిప్పుడు పూర్తిగా తెలుసు. ఆ పాత్ర

నే నెంతో అభిమానిస్తాను. అందుకే నేను సాహసించి ఏ ముగింపూ చెయ్యే లేక పోయాను."

మధుసూదన్ నవ్వాడు మధురంగా - మృదువుగా -

"చాల చిత్రంగా మాట్లాడుతున్నావు శారదా! నీకు కోపం కూడా వచ్చినట్టుంది. సరే కొన్నాళ్ళు నాకు టైమిస్తే - ఆలోచించి నీకు నచ్చే ముగింపు చెప్తాను. ఇంత పెద్ద బాధ్యత నామీద పెడుతున్నావంటే ఎంత శ్రద్ధగా ఆలోచించాలి నేను! అవునా?"

శారద నవ్వింది చిన్నగా.

* * *

ఆ రాత్రే మధు ఇంటికి - ఇందిరకు ఉత్తరం రాశాడు - "ఈ విషయం ఎప్పుడో నీకు రాయాలనుకున్నాను వదినా! ఎప్పటి కప్పుడు వెనకాడుతూ వచ్చాను. కారణం నేనే ఒక నిర్ణయమంటూ చేసుకోలే దింతకాలం.

"శారద గురించి అంతా చదివావు కదూ? నీ ఉద్దేశ్యం, అన్నయ్య ఉద్దేశ్యమూ తెలుసుకోకుండా నేను మాట ఇవ్వలేకపోయాను. వెంటనే ......"

ఆ ఉత్తరానికి ఇందిర పెద్ద జవాబే రాసింది. ..

"నువ్విటువంటి స్వయంవర మేదో తెచ్చిపెట్టలేదేమా అనే ఇంత కాలం ఆలోచిస్తున్నాను. నా ఆలోచన తల్లక్రిందులు గానందుకు చాలా సంతోషం.

మధూ! ప్రేమాభిమానాలతో నువ్వు మా అనుమతి కోరావేగానీ నీ భవిష్యత్తు నిర్ణయించుకొనే హక్కూ, శక్తీ నీకే ఉన్నాయి. విషయాన్ని నువ్వు స్వతంత్రంగా ఆలోచించుకో గలవు. మంచి చెడ్డలు నిర్ణయించుకో గలవు. అతి సున్నితమైన నీ మనసు నాకు తెలుసు.

"కాని మధూ? జీవిత నావకు చుక్కానివంటి సహచరిని కొనే ఈ తరుణంలో నీకు నేను తల్లిగా - సోదరిగా - గురుతర బాధ్యతతో ఈ చిన్ని సలహా యిస్తున్నాను. శారదాదేవి ఒక

రచయిత్రి అనే ఆశతో గానీ — ఆమె నీ కథ రాసిందనే అభిమానంతో గానీ ఆమెను పెళ్ళి చేసుకోవటానికి నిర్ణయించుకోవద్దు. ఆమెలో నువ్వు చూచిన రచనాశక్తి ఏనాటికైనా మరుగుపడిపోతే నీకు అసంతృప్తే మిగులుతుంది. నీ అంతరాత్మను సుష్వోశోధించి, విమర్శించి తెలుసుకో. ఆమెలో సహజమైన స్త్రీత్వం చూడగలిగితే — ఆమె నీకు అన్ని విధాల నచ్చితే వేరే మా అభ్యంతరమేమీ లేదు. నీ సంతోషమే మా సంతోషమని చెప్పమన్నారు మీ అన్నగారు. ఒక్కటి జ్ఞాపకం వుంచుకో — నీకు గానీ, ఆమెకు గానీ ఈ దశ చాలా ఆవేశ పూరితమైనది. ఈ నాటి నిర్ణయాలు ఒకనాటికి పశ్చాత్తాప కారాణాలు మాత్రం కాకూడదు సుమా! మీ ఇరువురికీ మా ఆశీస్సులు ఎప్పుడూ ఉంటాయి.

మధుసూదన్ తృప్తిగా నవ్వుకున్నాడు. వదిన తను ఆశించిన విధంగానే రాసింది. అటు తర్వాత ఉత్తరంలో ...

"మీ మేనమామల కుటుంబ పరిస్థితులు దారుణంగా మారాయంటే అతిశయోక్తి కాదు. ఈ విషయాలన్నీ నేను ఆ నోటా, ఈ నోటా, విన్నవి మాత్రం కావు. అలా అమ్మలక్కల కబుర్లు రాస్తే నువ్వు నమ్మవని నాకు తెలుసు. సుధ నాకు స్వయంగా చెప్పింది. నీకు ఆశ్చర్యంగా వుంది కదూ? మొన్న పక్కవారింటికి పేరంటానికి వస్తే సుధని నేనే మన ఇంటికి రమ్మన్నాను. పిలవగానే వచ్చింది. మనిషి చాలా మారిపోయినట్టూ, దేనికో లోలోన బాధపడుతూన్నట్టూ కన్పించింది."

"సుధ కాపురం మూన్నాళ్ళ ముచ్చటగా చేసుకొని పుట్టింటికి వచ్చేసింది. రాజశేఖరం ప్రవర్తన బొత్తిగా మంచిది కాదట. మీ పెదమామయ్యగారు అల్లుడితో ఘర్షణపడి కూతుర్ని తీసుకు వచ్చేశారు. ఇక ఇన్నాళ్లూ తమ్ముడి పిల్లలకే ఇచ్చేస్తామన్న మీ పెద మామయ్య వదిన గారి కొడుకు సత్యన్నారాయణని ఈ మధ్యనే ఇక్కడికి కాపురం తీసుకు వచ్చే న్నారాయణకి రెండు సంవత్సరాల క్రిందటే పెళ్ళయింది. కూడాను తమ ఆస్తి అక్కగారి కొడుకుకే ఇవ్వాలని మీ . మీ మామయ్యకూడా ఒప్పుకున్నారట. దానితో తోటి లతలొచ్చి వేల్లు పడి పోయాయి — ఇక కృష్ణయ్య అల్లరి

చిల్లరగా తిరుగుతూ ఇంటిపట్టే పట్టటంలేదు — ఈ మధ్య ఒక నెల్లాళ్లుగా ఊళ్ళోనే లేడు."

"ఇవన్నీ సుధవల్లే తెలుసుకున్నాను. మధ్య మధ్య అభిమాన పడుతూన్నట్టు కన్పించినా అన్నీ చెప్పింది. ఇంతకన్నా ఎక్కువేమీ నాకు తెలీదు. ఇవన్నీ వినగానే నీకు రాయాలనిపించింది --- ముఖ్యంగా సుధ కాపురం పాడయినందుకు మీ అన్నయ్య చాలా బాధపడుతున్నారు.

నమ్మలేని విషయాలు విన్నట్టు విభ్రాంతితో కొయ్యబారి పోయాడు మధు.

సుధ కాపురం పాడుచేసుకుని పుట్టింటికి వచ్చేసిందా? తెలివి తేటలు గల సుధ భర్తలో లోపాలు ఆ మాత్రం సరిదిద్దుకోలేక పోయిందా?

పెద మామయ్య — దుర్మార్గుడు? నమ్మించి ఎంత మోసం చేశాడు! ఆస్తి యిస్తానని ఇన్నాళ్లూ మభ్య పెట్టి ఇప్పుడిలా చేస్తే ... ఛీ! ఎంత సిగ్గులేకపోయింది!

'పాపం చిన్న మామయ్య ఎంత బాధ పడుతున్నాడో! ఎంత కుమిలి పోతూన్నాడో! చదువు సంధ్యలేని కొడుకు! కాపురం పాడుచేసుకున్న కూతురు? నమ్మించి ద్రోహం చేసిన అన్నగారు. పెంచి పెద్ద చెయాల్సిన పసి బిడ్డలు .... అయ్యో! ఆదుకునే వాళ్ళెవరు?

మధు చాలా సేపు కాలుగాలిన పిల్లిలా గదంతా కల తిరిగాడు పోనీ ఒక్కసారి వెళ్ళివస్తే ...? సీతాపతి మామయ్యకి కొంచెం ధైర్యమన్నా చెపితే? మరి ఆ గదిలో ఒక్క క్షణం నిలబడలేక పోయాడు. గబగబా బెడ్డింగు సర్దుకొని గదికి తాళం పెట్టి, శారదకు నాలుగు ముక్కలు గీసిన కార్డు దారిలో పోస్టు చేసి తిన్నగా రైలు స్టేషన్‌కి బయల్దేరాడు.

*  *  *

"నేను చేయగలిగిందేమీ లేదని తెలుసు వదినా! ఉత్తరం చదివి అక్కడ మరి ఉండలేక పోయాను. ఏమిటో బాధగా వుంది" అన్నాడు దిగులుగా మధుసూదన్.

"అవును ఇది రక్త సంబంధం, పైకి తెలీని అభిమానాలు అంత రంగంలో దాగి ఉంటాయి. కావలసిన వాళ్ళకు కష్టం వస్తే మనకు వచ్చి నట్టే కదా?"

"ఎందుకో నాకు సుధ అంటే చాలా యిష్టం వదినా! తాను ఎన్నడూ చేరనివ్వకపోయినా నేను మాత్రం సుధ మీద కోపం పెట్టుకో లేదు. పోనీ సుధ యిష్టమైన వ్యక్తిని పెళ్ళి చేసుకుని సంతోషంగా ఉంది. గదా అని నా ఒగులు మరి పోయాను. కాని దాని బ్రతుకిలా పాడు కావటానికి నేనూ కారణమేనేమో ననిపిస్తోంది యిప్పుడు."

"అదేమిటి! చిత్రంగా మాట్లాడుతున్నావ్."

"కాదు వదినా! సుధ పెళ్ళికిముందు చిన్న మామయ్య నన్ను వచ్చి వాళ్ళ అన్నని అడగమని బ్రతిమిలాడాడు. నేను మాత్రం అలా చెయ్యనన్నాను"

"మంచిపని చేశావు — ఇందులో నువ్వు చేసిన పొరపాటేముందని నిన్నునువ్వు విమర్శించుకుంటున్నావు? తన వ్యక్తిత్వం చంపుకుని ఇతరుల కోసం త్యాగం చెయ్యటమేనా మనిషి కర్తవ్యం? ఎప్పుడూ కాదు - సుధకి సీకూ పెళ్ళి జరగలేదుగానీ, జరిగితే ఆ పరిస్థితి ఇంకెలా మారేదో మనం తెలుసుకో గలమా? నువ్వంటే అభిమానంగానీ, లక్ష్యంగానీ లేని సుధ నిన్ను చులకన చెయ్యకూడదా? లేకపోతే ఆ కుటుంబం మీద పెంచు కున్న కసి సమయం వచ్చినప్పుడల్లా నువ్వు సుధ మీద తీర్చుకోకూడదా? —అప్పుడు మీ యిద్దరి బ్రతుకులూ సుఖశాంతులకు దూరమై, నాశనమై పోయేవి కదా! జరగని దానిలో ఏదో గొప్ప ఉంటుందనుకొని భ్రమ పడతాం మధూ! అంతే!"

మధు ఆశ్చర్యంగా ఇందిర మొహంలోకి చూడసాగాడు — అంది—"సుధ మాత్రం చాలా మారింది. పూర్వపు అతిశయం నిషిలో-" చర్విత చర్వణంగా మళ్ళా విషయాలన్నీ చెప్పింది. మాట్లాటాని కన్నట్టుగా శారద విషయం ఎత్తింది — " అయినా ఏ అభిప్రాయం చెప్పేశావా?"

"నీ ఉత్తరం చూడగానే వచ్చేశాను కదా? వాళ్ళింటికి వెళ్ళనే లేదు."

"నీఉత్తరం చూసి మొదట నేను నమ్మలేక పోయాను మధూ! శారదాదేవి కథలూ, వ్యాసాలూ నేను చాలా చదవాను. నాకు నచ్చుతాయి. కూడా. ఇంత గమ్మత్తుగా ఆవిడ నా తోటికోడలు కావటం — నమ్మ లేకపోయా ననుకో. మీ అమ్మమ్మగారు ఉంటే ఎంత సంతోషించేవారో మధూ! పాపం నీ పెళ్ళి చూడాలని కలవరించిపోయారు కదా?"

"అమ్మమ్మ ఉంటే అది అనుభవించే సంతోషం కన్నా విచారమే ఎక్కువ వదినా! లేకపోవటమే మంచిదయింది."

మధు మనస్సు బాగాలేదని ఇందిర లేచి లోపలకు వెళ్ళిపోయింది.

* * *

"చిన మామయ్యా!"

మధు చావిట్లో నిలబడి సీతాపతి గదికేసి చూస్తూ పిలిచాడు — అన్ని రోజుల తర్వాత - దాదాపు మూడు సంవత్సరాలు దాటాక మళ్ళా ఆ యింటికి వచ్చాడు. వడమటి వసారాను రెండుగా వేరుచేస్తూ వెలిసిన కొత్త తడికెలు చావిటి గుమ్మంలోంచి కన్పిస్తున్నాయి. విశ్వనాథం గదికి తాళం వేసి వుంది. ఆశ్చర్యంగా అంతా చూస్తూ మళ్ళా పిల్చాడు —

"మామయ్యా?"

"ఎవరదీ?"

గదిలోంచి బయటికి రాబోయిన సుధ, చావిడి గుమ్మంలోనే ఆగి పోయింది. హఠాత్తుగా మధుని చూస్తూ ఆశ్చర్యంతో కలవరపడిపోయింది. తెల్లని బట్టలూ — నిగనిగలాడుతూన్న బూట్లు — చేతికి వాచీ — భారీ విగ్రహం అన్నీ ఒక్క చూపులోనే కన్పించాయి.

సుమారు ఐదారు వారాల క్రిందట బీచ్‌లో కన్పించిన సు. పలకరించి ఎదురుగా నిలబడిపోయిన ఘట్టానికి మధూ కూడా లేక పోయాడు. పిలిచిన మధూ - పలికిన సుధా -మాటలుడిగి

పోయిన సమయంలో — "ఎవరే అమ్మా కుమ్ వచ్చినట్టున్నారు?" అంటూ వంటింట్లోంచి వచ్చింది సావిత్రి. వస్తూనే మధుని చూసి క్షణం పోల్చుకోలేనట్లు తడబడి మరుక్షణంలోనే అమితాశ్చర్యంగా కళ్ళు పెద్దవి చేస్తూ మరో అడుగు ముందుకు వేసి — "ఎవరూ? మధూ? — నువ్వా? అయ్యో! పోలికే పట్టలేక పోయాను. ఎప్పుడు రావటం? కులాసా? రావయ్యా! రా. కూర్చో. ఎంతసేపై నిలబడి పోయావ్?" — సావిత్రి తాను కంగారు పడుతూ, మధుని కూడా కంగారు పెట్టేసింది. సావిత్రి కూడా చాలా మారిపోయింది. చెంపలు కొంచెం తెల్ల తెల్లగా నెరిశాయి. బుగ్గలు గుంటలు పడ్డాయి. నుదురు మీద రెండు మూడు నరాలు పైకి వుబికాయి.

"ఏమయ్యా! అలా నిలబడ్డావ్? బొత్తిగా దొరబాబులా అయి పోయావే! గదిలోకి పద —" సావిత్రి గొంతు చించుకోవటంతో తేరు కున్న మధు గబుక్కేసి నెమ్మదిగా అడుగువేస్తూ అడిగాడు — "మామయ్య లేడా అత్తా."

"గదిలోనే వున్నారు. పడుకున్నారు. పద."

"ఇప్పుడు నిద్రేమిటి?"

"నిద్ర కాదులే. ఒంట్లో కొంచెం నుస్తీగా వుంది."

"ఎవరది? మధు వచ్చాడా సావిత్రీ?" సీతాపతి ఆశ్చర్యంగా దుప్పటి తీసి లేవబోతుంటే మధు గదిలోకి వచ్చాడు.

నీరసించి పోయిన సీతాపతి మొహంలో, కళ్ళల్లో పట్టలేని సంతోషం పైపైకి స్పష్టంగా కన్పించింది — "నువ్వేనట్రా? రా! కూర్చో బలానా? ఎప్పుడొచ్చావ్? కూర్చోరా మధూ!" సీతాపతి ఆనందంతో వుక్కిరి బిక్కిరి అయ్యాడు.

సావిత్రి హడావుడిగా కుర్చీ గదిలోకి లాక్కొని వస్తూ వంటింట్లోకి వినిపించేలా గావుకేక పెట్టింది.

"ఒసేవ్ సుధా! దాలి వక్కు పెట్టాను. మాడిపోతుందేమో పప్పుచారు కాచి అప్పడాలు వేయించు చాల్లే ఈ పూటకి."

"మీ ఇంట్లో భోజనానికి ఉంటానత్తా. ఉత్త పప్పుచారుతో పెడతావా ఏమిటి ?" మధు నవ్వుతూ అన్నాడు.

"అయ్యో అదృష్టం! నువ్వు మా ఇంట్లో ఎందుకు తింటావులే."

"అదేమిటత్తా అలా అంటావ్ ?"

"దానికేం గానీ కూర్చోరా మధూ? చాలా కాలానికి కన్పించావ్. ఏమిట్రా విశేషాలు?" సీతాపతి ఆప్యాయంగా చూశాడు.

"కుర్చీ ఎందుకత్తా కష్టపడి తీసుకొచ్చావు? నేనేం పరాయి వాణ్ణా?" అంటూ మధు సీతాపతి సరసన మంచం మీదే కూర్చున్నాడు.

"మాటలకేంగానీ మంచినీళ్ళు కావాలా?" — సావిత్రి.

"మంచినీళ్ళేమిటే ? కాఫీ పెట్టి తీసుకురా ! వాడికి అలవాటే," సీతాపతి అంటోంటే సావిత్రి లేవబోయింది —

"నా మతి మండినట్టేవుంది. బస్తీ వాళ్ళు మంచినీళ్ళు తాగుతారా!"

మధు నవ్వాడు — "నయం అత్తా! బస్తీవాళ్ళు అన్నం తింటారా అన్నావు కాదు — కాఫీ వద్దు .. గీఫీ వద్దు. నువ్వు కూర్చో."

"ఎంత సేపురా? పెట్టుకురానీ !"

"అయితే నేను వెళ్ళిపోతాను మామయ్యా! ఎవడికో చుట్టానికి చేసినట్టు నాకు మర్యాదలేమిటి?" మధు కొంచెం కోపంగా అనటంతో సావిత్రి తిరిగి చతికిల బడింది — "సరేలే. మధ్యాహ్నం కాస్తాను. అయితే అబ్బాయ్! మా మీద కోపాలపీ పోయ్యాయా ?"

మధు సావిత్రి మొహంలోకి చూశాడు — "అదేమిటత్తా అంత నిష్ఠూరంగా మాట్లాడుతున్నావు? కోపాలు, ద్వేషాలు పెట్టుకుని మీరేగా మమ్మల్ని వేరు చేశారు.

సావిత్రి నిట్టూర్చింది. "నిజమే బాబూ! చిన్నవాడివైనా బుద్ధి వచ్చేలా అడిగావు. శవరమైతేగాని వివరం రాదంటారు. ఇ[illegible] బొప్పికట్టి అఘోరిస్తున్నాం."

"చేతులు కాలాక ఆకులు పట్టుకుని ఏం ప్రయో[illegible] తన బాధంతా వెళ్ళ కక్కాడు.

మధు అమితంగా ఆశ్చర్యపడ్డాడు. మామయ్య మాట ఎలా వున్నా చిన్నత్త ఇంతగా మారి పోయిందా? జరిగిన దానికి నిజంగా పశ్చాత్తాప పడుతోందా? ఒకనాడు తనని లెక్క పెట్టని చిన్నత్త — తన కోసం ధైర్యం చెయ్యలేని మామయ్య — కష్టసుఖాలన్నీ తనకే చెప్పుకునేంతగా మారి పోయారా? వాళ్ళని వోదార్చి ధైర్య పుచ్చాలంటే ఇప్పుడు తన కర్తవ్యం ఏమిటి?

"ఏమిటయ్యా అలా చూస్తావు? తమ దేదో పడిపోయినట్టు వూళ్ళో వాళ్ళంతా నోళ్ళు నొక్కుకుంటూంటే నువ్వు విననే లేదూ?" — అత్త తనకు తానుగా సంగతులన్నీ ముందు పెడుతోంటే తను పట్టించుకోక పోవటం చాలా తప్పు తరచి — తరచి అడిగి నాలుగు మాటలు చెప్తే గాని ఆవిడకు తృప్తి వుండదు.

"తెలియటాని కేముందిలే అత్తా! ఏదో విన్నాను. చీమంత జరిగితే కొండంత చెప్పుకుంటారు — సంసారాలన్నాక తర్వాత ఏవో గొడవలు రాకపోవు కాస్త వోర్పు వహిస్తే అవే సర్దుకుంటాయి. జానకి పిన్ని విషయం మనకు తెలియనిది కాదుగా? పిన్ని జీవితం బాగుపళ్ళేదా? అలాగే ..?

"ఏమో బాబూ! చిన్నతనం నుంచీ అపురూపంగా పెంచి . కావలసిన వాళ్ళమీద కత్తి గట్టి మరీ పెళ్ళిచేశాం ఎవరు తవ్వుకున్న గోతిలో వాళ్ళే పడతారంటారు ఇదే కాబోలు చేసుకున్నదానికి సిగ్గుతో కుళ్ళి, కృశించి ఏడుస్తున్నాం —" సావిత్రి వంటి వ్యక్తులకు ఏ అనుభూతి కలిగినా అది హద్దులు మీరి వుంటుంది. సంతోషం దాచుకోలేరు. విచారం వోర్చుకోలేరు.

మధు మృదువుగా అన్నాడు — నువ్వలా బాధపడకూడదత్తా! అంతా మన మంచికే జరుగుతుందంటారు పెద్దలు ఇలా జరగటంలో అర్థం ...ంటుందో మనకేం తెలుసు? సుధ వచ్చేసిందని విన్నానేగానీ ...షయాలు నాకేం తెలీవు. అసలేమైంది?"

అంతా నా ఖర్మ! నీ దగ్గిర మాకు దాపరిక మెందుకు నాయనా? ...డో పేకిపంచు. గుణం లేదు. గుట్టూ లేదు! ఆ బిఏ పరీక్ష

పూర్తిగా కానేలేదు. కాస్త ఒంటబట్టి చదివితేనా? పోనీ తండ్రి చేసే వ్యాపారంలో చేదోడు వాదోడుగా ఉండకూడదూ? అదీ లేదు తనేనా ఉద్యోగం చూసుకుంటాడా అంటే-వెధవ గుమాస్తాగిరీ, మేష్టరు పనీ అక్కర్లేదట. ఆఫీసర్ ఉద్యోగం వందల కొందలు వచ్చే పదేది తప్పితే చెయ్యడట. చిల్లికాని సంపాదన లేకపోగా చీట్లాటకీ, జల్సా తిరుగుళ్ళకీ డబ్బు తగలేస్తాడట — అంత కళ్ళు మూసుకుని ప్రవర్తిస్తే ఎంత సంపద ఉంటే మాత్రం నిలుస్తుందీ?" సావిత్రి గుక్క తిప్పుకోకుండా చెప్పేసి మధు మొహంలోకి చూసింది. నీరు నిండిన కళ్ళతో - ఆ పరిస్థితి తట్టుకోలేననిపించింది మధుకి. సుధ కాపురం గురించి వూహించిన బంగారు కలలన్నీ తెల్లని ఆవిరై పైపైకి తేలిపోతోంటే మధు మరేమీ మాట్లాడలేకపోయాడు.

సావిత్రి కడుపులో గూడు కట్టిన బాధ క్రమక్రమంగా వెళ్ళగక్కుకో సాగింది — "అస్తమానూ సుధని డబ్బు అడిగితే ఉన్నప్పుడు ఇవ్వనే ఇచ్చేదట. అది అది మాత్రం ఎక్కడినుంచి తెస్తుంది? దాన్ని పట్టుకు కొట్టటం ...."

"సుధనా?" మధు ఉలిక్కి పడ్డాడు.

"చచ్చి స్వర్గాన మీ అమ్మమ్మ గారన్న మాట నా గుండెల్లో మెదులుతూనే వుంది అప్పుడప్పుడూ — 'సీ కూతురికి మొగుడెందుకు రాడు గానీ — వాడు మేనత్త కొడుకు మాత్రం కాడు.' అన్నారు—సుధ ఏడుస్తుందేమోనని నీకూ, నాకూ బాధ వుంటుంది గానీ పరాయివాళ్ళకేం నాయనా!"

"అదేమిటత్తా? పెళ్ళి చేసుకున్నాక పరాయిదెలా అవుతుంది?"

"ఎంతయినా కావలసిన వాళ్ళకి ఉండే అభిమానాలు వేరు — మాటికీ కొట్టటంతో బెదిరిపోయిందో ఏమిటో వాళ్ళ పెదనాన్నకు ఉ రాసిందట. ఆ సంగతి మాకూ తెలీదు. వెంటనే వెళ్ళి ఆయన కాస్తా వెంటబెట్టుకు చక్కా వచ్చారు. అప్పుడు నెత్తీ నోరూ బాదు

ఏముంది? అల్లుణ్ణి బెదరించబోయి, వినకపోయేసరికి ఘర్షణపడి నీ రెక్కో- పటని దాన్ని ఒక్కా తీసుకువచ్చారు. "జానకి ఉండలేదా? మేనత్త లేనివాడే దేనికీ వచ్చిందనుకుందాం" అన్నారు పైగా. పెద్దాయన అని నమ్మి ఆయనమీదే పెట్టినందుకు ఇంకా ఏం చేశారో విన్నావా?" సావిత్రి దవడలు నొక్కుకుంటూ రోషంగా అంది. మౌనంగా కూచున్నాడు. సీతాపతి అన్నాడు — "అసలు బుద్ధి తక్కువ మనది. ఎవరికైనా చెప్తే నవ్వుతారు గానీ, పూజించరు. పిల్లల్ని కన్నవాళ్ళం వాళ్ళని కష్టపడి స్వశక్తిమీద పెంచుకోవాలనే బుద్ధిలేకుండా పరాయివాళ్ళ ఆస్తికోసం ఆశ పడితే ఏమవుతుంది? వాటికీ పిల్లలుంటే అలా దేవుళ్ళాడుతూ కూర్చునే వాళ్ళమా?"

"బాగానే ఉంది. మీ సమర్థింపు. మొట్టమొదటి నుంచీ సుధని పెంచుకుంటామనీ, కృష్ణుణ్ణి పెంచుకుంటామనీ, వాళ్ళకై వాళ్ళే అంటూంటే నిజమే కాబోలని నమ్మి కూర్చున్నాం. వాళ్ళ ఇష్టప్రకారం పడి ఉండి, వాళ్ళ అడుగులకు మడుగులొత్తి వాళ్ళ పెత్తనాలన్నీ సాగనిస్తే చివరికి అంతా తీసికెళ్ళి గంగలో కలిపారు — మన బుద్ధి తక్కువేముంది? నమ్మించి మోసం చెయ్యటం కాదూ ఇది? నువ్వు చెప్పు నాయనా!" అంది సావిత్రి మధుని మధ్యవర్తిగా పెట్టుకొంటూ.

మధు క్షణం ఆగి అన్నాడు — "నా జవాబు నీకు నచ్చదుమరి అత్తా! మనిషి బొత్తిగా అభిమానం లేకుండా బ్రతకడం నేను సమర్థించ లేను. మీ ఇంటి వ్యవహారాలూ, పిల్లల సంగతులూ మీ ఇద్దరూ చూసుకో వలసినవేగానీ ఒకరిమీద పెట్టవలసినవి కావు. ఏదో స్వార్థానికి ఆలో చించి బరువయిన బాధ్యతలన్నీ వదిలేసుకున్నారు. కాదంటావా!"

"ఇంకా ఇప్పుడేమంటే ఏం ఉంది? నా బొంద?"

"ఇంతకీ పెద్దత్తావాళ్ళు ఏమయ్యారు? గదికి తాళం పెట్టి ఉంది."

"మా నెత్తిమీద చేతులు పెట్టి దేవుడి దగ్గిరికి పోయారు." కసిగా సావిత్రి.

సీతాపతి మందలించాడు - "చాల్లే వూరుకో. వాళ్ళిష్టం వాళ్ళది. ఇప్పటికయినా కళ్ళు తెరిపించినందుకు సంతోషించు" మధుకేసి చూస్తూ చెప్పాడు — "సత్యనారాయణ దంపతులతో వ్రతం చేయిస్తారట. తిరపతి వెళ్లారు మొన్న."

సావిత్రి కాస్త గొంతు తగ్గించి అంది .. "నేను చెపితే అక్కసు అనుకుంటావో ఏమో గానీ ఉన్నమాట అంటున్నాను. ఆ సత్తిన్నారాయణ పెళ్ళాం మహా గడుసుది. ఆ కోడలి ముందు అత్తామామల నోళ్లు మూతపడాల్సిందే. వచ్చి నెల్లాళ్ళు కాలేదు. అప్పుడే కీచులాడుకొంటున్నారు. ఆస్తికోసం వచ్చిందిగానీ? నిజమైన అభిమానం ఎలా వుంటుందీ? —కృష్ణుడయితే మాత్రం అంతే కాదా? అంటావేమో। స్వయానా తమ్ముడి బిడ్డ. ఇంటి పేరిటి వాడూ — బొడ్డు కోసిన్నాటినుంచీ ఆయన ఒళ్లో పెరిగినవాడూనూ — వీడికీ వాడికీ భేదంలేదూ?"

మధు కొంచెం నవ్వాడు "పోనీ ఆమంచి చెడ్డలు క్రమంగా వాళ్ళకే తెలిసి వస్తాయిలే అత్తా। ఇంతకీ కృష్ణుడు ఊళ్లో లేడట."

"అయ్యో రాత ఏ రేవు కెళ్ళినా ముళ్ళకంపే నాకు. ఆ నాటికీ ఈ నాటికీ వాడికి కుదురు రానేలేదు. వాడి తిరుగుళ్ళే వాడివి. చదువులేదు గదా। ఉద్యోగం లేదుగదా। ఇంటికి వచ్చాడని సంతోష పడుతోంటే నెమ్మదిగా ఓ పదో, పరకో చిక్కించుకుని ఎటో పోతాడు - మొన్న నెల్లాళ్ళ కిందట - నలభై రూపాయలు పట్టుకు పోయాడు. సినిమాల్లో జేరుతున్నానని, ఇంకా డబ్బు పంపమని ఉత్తరం రాశాడు. చెప్పొద్దూ? ఆ ఉత్తరం కాస్తా చించి ముక్కలు చేశాను. రౌడీ వెధవ।" కోపంతో, కన్నీళ్ళతో సతమతమైపోయింది సావిత్రి.

మధుకి చాలా బాధ కలిగింది. తనని ఎంత అప్తుడిగా భావించక పోతే చిన్నత్త అంత మనసిచ్చి మాట్లాడుతుంది? — చిన్న తమ్మునో వేదనంతా చిటికెలో తీసివేయ గలిగితే —?

"మరి వాడెలా బాగుపడతాడంటావు అత్తా?" బాధపడే... ఎమటి వాళ్ళు పంచుకుంటేనేగానీ వాళ్ళకు తృప్తి వుండదు — ఇలా తయారవుతాడని ఎన్నడూ అనుకోలేదు సుమా."

"ఏది అనుకున్నాం గనుక? బొత్తిగా ముందు చూపు లేకపో. సుధకి ఆ పెళ్ళి జరగటం కృష్ణుకిలా భయం, భక్తి లేకుండా ఆకతాయి వెధవ కావటం, అన్నీ ఆ పెద్దాయన మూలంగానే జరిగాయి. ఆయన్ని నమ్మి మేము సర్వనాశన మైపోయాం. చేసుకున్న వాళ్ళకి చేసుకున్నంత మరి మిమ్మల్ని అలో లక్ష్మణా అని ఏడిపించాము గాము?" సావిత్రి కొంగుతో కళ్ళు ఒత్తుకుంది.

"అవేం మాటలత్తా? అనాడు మా దురదృష్టం కొద్దీ అలా జరిగింది - అంతే."

దీర్ఘంగా ఆలోచిస్తూ కూర్చున్న సీతాపతి మధు మొహంలోకి చూశాడు — "చిన్న ఉద్యోగ మేదయినా సంపాదించి పెట్టగలవూ కృష్ణుడికి?"

సావిత్రీ, మధూ కూడా తెల్లబోయారు.

ఆ ఆలోచన తనకు రానందుకు విస్తుపోయి సావిత్రి సంభ్రమంగా భర్తకేసి చూచి మధుని కాళ్ళు పట్టుకున్నంత పని చేసింది. "బాబూ! నువ్వేదో పెద్ద ఉద్యోగస్థుడివట కదూ! ఏదో చిన్నపని చూసి పెడుదూ? కాస్త నీ పేరు చెప్పుకు బ్రతుకుతాడు. బాగుపడి ఇంటిపట్టుకైనా జేరతాడు."

తను చిన్నత్తకి సహాయం చేయగలననే నమ్మకం మధుకి సంతోషాన్నిచ్చింది — "తప్పకుండా చూస్తానత్తా! అసలు వా డెక్కడున్నాడో పిలిపించి నా దగ్గిరికి పంపితే ప్రయత్నం చేస్తాను."

"అదిగో అలా దాటేస్తే కాదు. వాణ్ణి నీకు అప్పగిస్తాను. ఎలాగో బ్రతుకు తెరువు చూపించు. నువ్వు 'వూ' అంటేగాని నాకు నమ్మకం

ందాకా ఏదో చిన్న పని ఇప్పించావంటే తర్వాత ప్రయివేటుగా పరీక్షకి కూర్చుంటాడు." సీతాపతి కూడా ప్రాధేయపడు మాట్లాడటంతో మధు కొంచెం కోపం వ్యక్త పర్చాడు —

...రింతగా చెప్పాలా మామయ్యా! కృష్ణుడు పాడయ్యాడంటే ...తోషమా? నా శాయశక్తులా ప్రయత్నిస్తాను. తప్పకుండా వాడి ...ఏయినా పని చూసి పెడతాను. నమ్మరేం నా మాట?"

"ఎంత మాట నాయనా! నీ చలువ వల్ల....."

"అన్నింటికీ నువ్విలా బాధ పడకు చిన్నత్తా! పెద్ద దానివి. నువ్వే ఇలా కంగారు పడితే ఇక పిల్లల మాటేమిటి చెప్పు? రోజు లెప్పుడూ ఒక్కలాగే వుండవు. సుధ కాపురం చక్కబడవచ్చు. కృష్ణుడు జ్ఞానం తెచ్చుకొని ఇంటికి చేరనూవచ్చు! నువ్వు కన్న బిడ్డలు నీకు బరువా అత్తా! ఎవరో తీసుకోలేదని బాధపడతావేం? మమ్మల్ని చూస్తున్నావు కావూ? ఏం సిరి సంపదలు పెట్టుక బ్రతుకుతున్నాం! అలాగే నీకూ మంచి రోజులు వస్తాయి."

"ఎంత చల్లని మాట చెప్పావు మధూ? ఏదో కడుపుమంట చల్లా ఎక అనుకున్నాను గానీ...." దిగులుగా చూసింది సావిత్రి.

"అమ్మా?" వాకిట్లో నిలబడి పిల్చింది సుధ.

"ఏవిటే? వంటయిందా?"

"ఆఁ, కాఫీ ఇదిగో..."

"అయితే తీసుకురా! మన మధు దగ్గిర నీకు సిగ్గెందుకూ?"

సుధ గాజు గ్లాసుతో కాఫీ తీసుకుని గదిలో అడుగు పెట్టింది

"అక్కడ పెడతావేమమ్మా! బావకియ్యి." సీతాపతి కూర్చున్న హెచ్చరించాడు. సుధ సిగ్గు పడుతూనే కాఫీ గ్లాసు మధూ కందించింది.

సుధ తన కోసం స్వయంగా తెచ్చిందన్న భావం మధుని బ్రాన్పడి పోయేలా చేసింది - సుధ తనని అభిమానిస్తున్నదనటానికి ఆ సాక్ష్యం చాలు. అయోమయంగానే కాఫీగ్లాసు అందుకున్నాడు.

ఆ కాఫీ అతి పవిత్రమైన అమృతంలా అనిపించింది మాట్లాడకుండా తాగేసి గ్లాసు తిరిగి సుధకే అందించాడు.

"అయితే అబ్బాయ్! నువ్వు భీష్ముడిలా వుండిపోత టయ్యా!" సావిత్రి నవ్వుతూ మధు పెళ్ళి సంగతి ఎత్తింది.

"నేనేం శపథాలు చెయ్యలేనుగా అత్తా! అన్నీ జరగకే అదీ అలాగే జరుగుతుంది"

మిట్ట మధ్యాహ్నం అయ్యేవరకూ కబుర్లు సాగిపోయాయి — "ఇక అన్నాలు వడ్డించు. పన్నెండు కావస్తుంది —" అన్నాడు సీతాపతి.

సావిత్రి ఆశ్చర్యంగాచూసింది. — "నిజంగా మధు మనింట్లో తింటాడా? హాస్యాని కన్నాడేమో అనుకున్నాను. నాలుగు బంగాళా దుంపలన్నా వేపమన్నాను కాను. ఎంత దయ వచ్చిందయ్యా నీకు?"

"నువ్వేం కంగారు పడకత్తా! ఏది వుంటే అదే పెట్టు. చిన్నప్పు డంతా పప్పుచారే కాచేదానివిగా?"

"పప్పుచారే మరి. చిన్నప్పుడు ప్రేమతో పెట్టకపోయినా ఇప్పుడు ప్రేమగానే వడ్డిస్తానులే, లేచిరా!" సావిత్రి వంటింట్లోకి వెళ్ళిపోయింది.

కొన్ని సంవత్సరాల తర్వాత తిరిగి ఆ ఇంట్లో అంత సామరస్యంగా భోంచేస్తోంటే మధు కళ్ళలో నీరు చెమర్చినట్లయింది — వడ్డనలో సుధ కూడా అక్కడక్కడా కలగజేసుకొంది — మౌనంగా, సుధ తనని తప్పిం చుకు దూరంగా పోవటం లేదనీ, సాధ్యమైనంత వరకూ తన పరిసరాల్లో వుండాటానికి ప్రయత్నిస్తోందనీ అర్థం చేసుకున్న మధు సాదరంగా సుధ మొహంలోకి చూడబోతే నెమ్మదిగా తల దించేసుకొంది సుధ.

* * *

"పువ్వులేం కోసుకోలేదా?"

తృళ్ళిపడి తలెత్తిన సుధ మధు చూపులతో తడబడింది. "నేను నీతో మాట్లాడుదామనే వస్తున్నాను సుధా! నువ్వు తోటలోకి వెళ్ళావని మీ ...చెప్పింది"

...సుధ మౌనంగా నిలబడిపోయింది సుధ మొహం కళావిహీనంగా ...గర్వంగా ఎదుటివారిని ధిక్కరించే ఆ చూపుల్లో ఏదో దీనత్వం

కూలిన గోడలు 282

...ంది. రేగిన జుట్టు వేళ్ళతో అణచుకుంటూ ఎటో చూస్తూ — ధైర్యం సడలి పోయిన కంఠస్వరంతో అంది —

"నాతో ఏం మాట్లాడతావు బావా ?"

"మధు క్షణం మాట్లాడలేక పోయాడు — "అలా పైకి వెళ్ళి కూర్చుందామా సుధా ?"

అన్నదే తడవుగా వెనక్కి తిరిగింది సుధ — ప్రక్కనే నడుస్తూ అన్నాడు మధు — "సుధా, నువ్వు నాతో ఎన్నడయినా ఇంత సౌమ్యంగా ప్రవర్తించావా ?"

"సుధ తల తిప్పి చూసింది — "క్షమించు బావా! ఆ గతం నాకు జ్ఞాపకం చెయ్యకు."

మధు గుచ్చి అడుగుతున్నట్టు ప్రశ్నించాడు —
"మర్చి పోవాలని ప్రయత్నిస్తున్నావా ?"
"కాక నేను చేయగలిగిం దేముంది ?"

విస్మయంతో అన్నాడు మధు — "సుధా! జరిగిందానికి నిజంగా నువ్వు బాధ పడుతున్నావా ?"

సుధ మాట్లాడలేదు. మౌనంగా మామిడి చెట్టు మొదట్లో కూర్చుంది. మధు ఒక్కసారి తోటంతా దృష్టులు సారించాడు. ఏ చెట్టునీ, మొక్కనీ పిందె గాని పువ్వుగాని కన్పించలేదు. తోటంతా చాలావరకు పాడై పోయింది. మధు కించిత్తు బాధగా అడిగాడు —

"తోట చివరిదశకు చేరి పోయినట్టుంది సుధా! ఎవరూ సంరక్షణ చేయటం లేదా ?"

"అంత మంచి మనస్సు ఎవ్వరికీ లేదు !"

"…. …. …. …"

"తోట నీ కోసమే బెంగ పెట్టుకొంది." అంది మళ్ళీ.

కూలిన గోడలు 284

"నీ అభిప్రాయాలు సరి అయినవని కావు సుధా! నీకు చెప్పించి అభివృద్ధిలోకి తీసుకు రావాలని - గతిలేని నాతో నీ కలుగ నివ్వకుండా సుఖ పెట్టాలనీ భావించారు వాళ్ళు. కానీ నీ రేఖ వక్రించింది."

"ఎంత చిత్రంగా మాట్లాడుతున్నావు బావా! ఈ నాటికీ కర్మ సిద్ధాంతాన్ని నమ్ముతున్నావా? ఆనాడే నన్ను అంతులేని గురి చెయ్యకుండా వుంటే, నేను ఆకాశంలో విహరించకుండా - భూమిమీద నడిచేదాన్ని కాదంటావా?"

మధు మాటలు మార్చటానికి ప్రయత్నించాడు.

"నాకు నీ విషయం మా వదిన రాసింది ఎందుకో నిన్ను లనిపించి బయల్దేరి వచ్చేశాను."

"నిజం?" అన్నట్టు చూసింది సుధ.

"రాజశేఖరం విషయాలు చెప్పు సుధా! నిజం చెప్పు ఇష్టపడే చేసుకున్నావు కదూ?"

"ఎంత అమాయకంగా అడుగుతున్నావు బావా! లేకుండా పెళ్ళెలా అవుతుంది? ఒట్టి ఇష్టంతో కాదు- మహా చేసుకున్నాను .. ఈనాడు అతన్ని ప్రేమించలేని పరిస్థితికి వచ్చా గురూ నవ్విన సుశీల నాకన్నా ఎన్నో రెట్లు మిన్నగా బ్రతుకం చేసుకుంది."

"అసలు మీ కిద్దరికీ సరిపడక పోవటానికి లోప మేవ

"భగవంతుడిది. మా ఇద్దర్ని కలపటమే ఒక పెద్ద తప

"కనుపించని భగవంతుణ్ని నిందిస్తావేం? స్వతం

ైన నీ వివేకమేది? ఇష్టపడి పెళ్ళి చేసుకున్నావు.

నీకు తెలుసు, కాపురంలో కష్టమైనా, సుఖమైనా

——— —

ం బాధపడి నన్ను పెళ్ళి చేసుకోగలవా? .. జీవితం మీద ...కుని చచ్చిపోగలవా? నీ భర్తమీద అయిష్టంతో ఒంటరిగా గలవా?- ఏదీ సాధ్యం కాదు. ఇక నీ ఆవేదనకు ప్రయోజనం ఏంటి?"

" .. .... .... ...."

నువ్వు ఇక్కడికి రావటంతో ఎంత పొరపాటు చేశావు సుధా! నీ భర్త ఎటువంటివాడు కానీ నువ్వు చులకనచేసి త్యజించి వస్తే దాని పర్యవసానం ఎంత ఘోరంగా ఉంటుందో ఆలోచించావా?"

"— — — — —"

అక్కడి విషయాలన్ని పుట్టింటికి వుత్తరం రాయటమే మొదటి తప్పు"

సుధ తల దించుకుని - "పెదనాన్నకు చెపితే ఏమైనా సమర్థించ గలరని ఆశపడ్డాను."

"వయస్సు పెరగగానే పెద్దతనం రాదు సుధా! తన పంతం నెగ్గించుకోవటానికి నీ జీవితాన్ని ఉపయోగించుకున్నాడు. నాతో ఘర్షణ పడి నీకు వేరే పెళ్ళిచేశాడు. నీ భర్తతో ఘర్షణపడి నిన్ను తీసుకువచ్చే శాడు. చిన్నవాళ్ళలో లోటుపాట్లు ఉంటే సర్ది బాగుపర్చలేనిదే ఎందుకా పెద్దతనం?"

ఇద్దరిమధ్యా కొంతసేపు నిశ్శబ్దం ఆవరించింది. హఠాత్తుగా అన్నాడు మధు- "నువ్వు సాధ్యమైనంత తొందరలో రాజశేఖరం దగ్గరికి వెళ్ళిపోవాలి."

ఆశ్చర్యంగా చూసింది సుధ.

"అవును సుధా! జానకిపిన్ని ఎంత హైన్యం అనుభవించి ...ది. పిన్నికన్నా ఏవిధంగానూ నువ్వు గొప్పదానివి కాదు. ...రిపట్లా ఎల్లకాలం సుఖంగా సాగిపోదు. పరిస్థితులు బాధా

మారినప్పుడుకూడా సహించగలిగే శక్తి ఉండాలి — దాని ...పాటు వుండవచ్చు. అతన్ని మార్చటానికి నువ్వేమైనా ప్రయత్నించావా?"

"నా వ్యక్తిత్వం దెబ్బతిననంతవరకూ ప్రయత్నించాను. నా శక్తికి మించిపోయేసరికి బయల్దేరి వచ్చేశాను."

"రాజశేఖరాన్ని మనిషిగా మార్చటానికి నీ వ్యక్తిత్వం తాత్కాలికంగా సడలించుకోవాలి సుధా! రాజశేఖరం దుర్వ్యసనాలకు దాసుడై మూర్ఖంలోపడి కొట్టుకుంటున్నాడు. అతని ఆ ఊబిలోనే వదిలేస్తావా? అని అర్ధాంగిగా పవిత్రమైన బాధ్యత స్వీకరించిన నువ్వే త్యజిస్తే ... ...మై పోతాడో ఆలోచించావా?"

"... ... ... ..."

"మాట్లాడవేం సుధా! మనిషిని ద్వేషించటం మరీ ... గొట్టటానికి మార్గం కాదంటావా? నీలో చాలా పెద్దలోపం ఉంది. మొట్టమొదట ...రిగిందానికి బాధపడటం మానెయ్. నన్ను ఒక సోదరుడిగా మాత్రమే ...వించు. అగ్నిసాక్షిగా పెళ్ళిచేసుకున్న నీ భర్తపట్ల మనసులోనైనా ...లకన భావం రానివ్వకు. అతన్ని ప్రేమతో, అనురాగంతో మనిషిని ...య్యటానికి శాయశక్తులా ప్రయత్నించు. బిడ్డ తప్పుచేస్తే తల్లి ప...స్తుందా? తెలివిలేని భర్త భార్య దృష్టిలో అంతాకన్నా గొప్పవాడు కాడు ...మల నిండు హృదయంతో ప్రయత్నం చేసినవాడు తప్పకుండా ఫలి...స్తుంది. సుధా!"

...న్నలు అప్రయత్నంగా అశ్రుపూరితాలయ్యాయి. దించి... కన్నీళ్ళు జలజలా రాలి పండుటాకుల మీద పడ్డాయి.

...ఏడుస్తున్నావా? ఎందుకు?"

క్షమించు బావా? నాలాంటి మనిషి వుందనుకుంటే మన జా...
...ు."

"ఎన్నడూ కాదు. మనసులో ఉన్న కుళ్ళంతా భద్రంగా దాచుకుని పైకి నీతిగా నటించటమే నిజంగా సిగ్గుచేటు — నీచమైన పని."

"మొదట నేనే మనిషినికాదు. ఇక ఆయన్ని మనిషిగా మార్చట మేమిటి?"

నీ తప్పు నీవు తెలుసుకున్నావంటే నీలో ఏ లోపమూ ఉండదు. అప్పుడు నువ్వు మనిషివే. ఒక్కటి గుర్తుంచుకో సుధా! నీ భర్తచేత ప్రేమించబడాలి అంటే—ముందు నువ్వు అతన్ని ప్రేమించాలి."

చాలాసేపు మౌనంగా ఉన్నమీదట అంది సుధ—

"నువ్వు చెప్పినట్టే నడుచుకుంటాను బావా! తప్పకుండా అక్క డికి వెళ్ళిపోతాను."

" .... .... .... ...."

"నిన్నొకటి అడగనా బావా?"

"ఏమిటి సుధా?"

"ఆరోజు నువ్వు 'నాకు బీచ్‌లో కన్పించినప్పుడు నీ ప్రక్క కూర్చుందికదూ ఒక అమ్మాయి ఆవి డెవరు?"

కుతూహలంగా చూసింది సుధ.

మధు నవ్వాడు - "స్నేహితురాలు?"

"అంతేనా?"

"ప్రియురాలుకూడా."

"తర్వాత?"

"నా జీవిత భాగస్థురాలు."

"ధన్యురాలు?"

"సుధా! నీలో మార్పెక్కడ!"



# మనసు ఫౌండేషన్

## పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA 105 B 121 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 279 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | 12, 15, 16, 69to72 ,83,84 |
| తయారు చేసినది | pratyusha |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | Hema |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | no |
| పరిస్థితి | good |